వందగ్రంథాలు సౌజన్య ప్రచురణలు – 1

# రెడ్డి రాజ్య చరిత్ర

(క్రీ.శ. 1325–1448)

(మొదటి భాగం)

## రాజకీయ, పాలనా వ్యవస్థలు

*ఆంగ్లమూలం*

మల్లంపల్లి సోమశేఖర శర్మ

*తెలుగు అనువాదం*

ఓరుగంటి రామచంద్రయ్య

2001



పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాద్

రెడ్డి రాజ్య చరిత్ర (మొదటి భాగం) - రాజకీయ, పాలనా వ్యవస్థలు

REDDY RAJYA CHARITRA - Part One

ఆంగ్లమూలం : మల్లంపల్లి సోమశేఖర శర్మ

English Original : *Mallampally Somashekhara Sarma*

తెలుగు అనువాదం : ఓరుగంటి రామచంద్రయ్య

Telugu Translation : *Oruganti Ramachandraiah*



వెల : రూ. 50/-

ఆంగ్లంలో మొదటి ముద్రణ : 1948

మొదటి తెలుగు ముద్రణ : ఏప్రిల్, 2001

ప్రచురణ సంఖ్య : 227

ప్రతులకు :

డైరెక్టర్

ప్రచురణల విభాగం

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్

హైదరాబాద్ - 500 004.

ముద్రణ :

వెంకటరమణ ముద్రణాలయం

4-4-2/ ఎ, వికాస్‌నగర్, దిల్‌సుక్‌నగర్

హైదరాబాద్.

ISBN No. 81-86073-76-0

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాద్.

ఆచార్య ఎన్. గోపి

ఉపాధ్యక్షులు


## ముందు మాట

తెలుగు భాషాసాహిత్యాలు, సంస్కృతి, చరిత్ర, లలిత కళలు, జానపద గిరిజన విజ్ఞానం వంటి బహుముఖీన అంశాల వికాసం కోసం ఏర్పడిన సమున్నత విద్యాసంస్థ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం. ఈ లక్ష్యాన్ని సాధించటానికి ప్రధానంగా బోధన, పరిశోధన, గ్రంథ ప్రచురణ, విస్తరణ సేవ వంటి చతుర్ముఖీన మార్గాలను అనుసరిస్తున్నది. విస్తరణ సేవా, అంతర్జాతీయ తెలుగు సంస్థల తరపున ప్రవాసాంధ్రులకు సాంస్కృతిక సేవ వంటి ఉదాత్త కార్యక్రమాలతో పురోగమిస్తున్నది. గ్రంథ ప్రచురణ క్రింద విశ్వవిద్యాలయం కావ్యాలు, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు, నిఘంటువులు, మాండలిక వృత్తి పదకోశాలు, భాషా సాహిత్యం, సంగీతం, నాట్యం, నాటకం, లలిత కళలు, జానపద గిరిజన విజ్ఞానం, చరిత్ర, సంస్కృతులకు సంబంధించిన ప్రచురణలు, అనువాదాలు వెలువరిస్తున్నది. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణలు అశేష పాఠకాదరణ పొందుతున్నాయి.

ఈ ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా విశ్వవిద్యాలయం ఇప్పటికే ఎన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యాస్రవంతి శీర్షికన సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య, ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించే ప్రణాళికను చేపట్టింది. ఇప్పటివరకు ఈ ప్రణాళికలో కుమారసంభవం, కాశీఖండం, శివరాత్రి మాహత్మ్యం వంటి గ్రంథాలను వ్యాఖ్యాసహితంగా ముద్రించింది.

తెలుగులో ప్రసిద్ధి పొందిన ప్రాచీన, ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది. తెలుగు కథ అనే పేరుతో ప్రతి సంవత్సరం వెలువడిన ఉత్తమ కథలను ఎంపికచేసి ముద్రించే కార్యక్రమాన్ని చేపట్టింది. తెలుగుకథ – 1995 రెండు భాషల్లో వెలువరించడం జరిగింది. అలాగే 1996, 1997, 1998, 1999 కథా సంపుటాలు అందుబాటులో ఉన్నాయి.

తెలుగు విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారుచేయించే కార్యక్రమంలో విశ్వసాహితి, భారత భారతి లను, హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ది ఆంధ్రాస్ అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది. భాషాభివృద్ధి కృషిలో భాగంగా తెలుగు భాషా చరిత్ర, ద్రావిడ భాషలు అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖ వారి సహకారంతో డా॥ బి. ఆర్. అంబేద్కర్ రచనలు – ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది. తెలుగు వారికి మంచి పరిశోధన పత్రికలేని కొరతను వాఙ్మయి తీరుస్తున్నది. అలాగే విశ్వవిద్యాలయం ఇటీవల చేపట్టిన ''వందగ్రంథాలు సౌజన్య ప్రచురణలు'' అనే పథకానికి దాతల నుండి మంచి స్పందన లభిస్తున్నది.

రెడ్డి రాజ్య చరిత్ర గ్రంథాన్ని మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు 1948లో వాల్తేరులోని ఆంధ్ర విశ్వకళాపరిషత్ ద్వారా ఆంగ్లంలో ప్రచురించారు. అది తెలుగులోకి రావడానికి ఇంతకాలం పట్టింది. కీ.శే. ఓరుగంటి రామచంద్రయ్య గారు మొదటి భాగాన్ని మాత్రమే తెలుగులోకి అనువదించారు. ఆయన ఆంధ్ర విశ్వ కళాపరిషత్‌లో చరిత్రశాఖాధిపతిగా పనిచేశారు. ఈ మొదటి భాగంలో కొండవీటి రాజుల కాలక్రమం, వారి పూర్వచరిత్ర, ప్రోలయ వేమారెడ్డి, అనవోత, అనవేమ, కుమారగిరి, పెద్దకోమటి వేమారెడ్డి, రాచవేమారెడ్డి ఇత్యాది రాజన్యులను గురించి సవివరంగా రాశారు. రాజమహేంద్రవర రాజ్యం, కందుకూరు రాజ్యాల గురించి ఎన్నో చారిత్రికాంశాలను తెలియజేశారు. రెడ్డిరాజుల కాలంలోని రాచరిక పాలనా వ్యవస్థను గురించి, పాలనా యంత్రాంగం గురించి, శిక్షాస్మృతి, సైన్య సంవిధానం – సమరం తదితర విషయాలను గురించి వివరించారు.

ఓరుగంటి వారి ఈ మొదటి భాగాన్ని అనువదింపజేసి మాకందేట్టు చేసినవారు కీ.శే. శ్రీ వై.బి.రెడ్డిగారు, వారి అల్లుడు శ్రీ పోలంరెడ్డి నారాయణరెడ్డి గారు (నెల్లూరు వాస్తవ్యులు). సాపు ప్రతిని తయారుచేసిన శ్రీ వై.బి.రెడ్డిగారి దౌహిత్రి ఆచార్య పి. సుమతి గారికి మా కృతజ్ఞతలు.

ఒక భాగాన్నే అనువదించడం వల్ల పూర్తి గ్రంథాన్ని అచ్చువేయలేకపోతున్నాం. రెండో భాగం రెడ్డిరాజుల కాలం నాటి ''సంఘం-సంస్కృతి''ని త్వరలో ప్రచురించడానికి చర్యలు చేపట్టడం జరిగింది. అటు చరిత్ర, అనువాదాలలో నిష్ణాతులైన వారికి ఈ పనిని అప్పగించడం జరిగింది. త్వరలో రెండో భాగం మీ చేతుల్లో ఉంటుంది.

ఈ గ్రంథాన్ని వందగ్రంథాలు సౌజన్య ప్రచురణలు పథకం ద్వారా తీసుకురావడానికి కారణభూతులైన రెడ్డి ల్యాబ్స్ అధినేత డా॥ కె.అంజిరెడ్డి గారికి నమోవాకాలు సమర్పిస్తున్నాను. వారి వల్ల తెలుగుదేశ చరిత్రలో ఒక ఉజ్జ్వల ఘట్టాన్ని తెలుగు పాఠకులకి, చరిత్ర అభిమానులకి అందుబాటులోకి వస్తున్నది. వారికి పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం పక్షాన కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

ఈ గ్రంథం పాఠకుల ఆదరాభిమానాలను చూరగొంటుందని ఆశిస్తున్నాను.

హైదరాబాద్

తేది : 12.1.2000

(ఎన్. గోపి)

# సౌజన్యమూర్తి



డా॥ కె. అంజిరెడ్డి

ఈ గ్రంథానికి ఆర్థిక సహకారం అందజేసినవారు డా॥ రెడ్డీస్ లేబరేటరీస్ ఛైర్మన్ డా॥ కె. అంజిరెడ్డి గారు. డాక్టర్ అంజిరెడ్డి గారు కళా హృదయులు. ఫార్మాస్యూటికల్ పరిశోధనారంగంలో ఆయన గొప్ప క్రాంతదర్శి. ఈ రంగంలో అనతికాలంలోనే ఆంధ్రదేశాన్ని ప్రపంచ పటానికి అద్దిన కృషీవలుడు. అత్యంత నిరాడంబరుడు. మానవతావాది. అనాథ బాలల కోసం CAPను స్థాపించి వారికి విద్యాబుద్ధులు చెప్పించి, వారిని సమాజంలో అందరి సరసన నిలబెట్టడానికి ఉద్యమిస్తున్న మంచి మనిషి. డా॥ అంజిరెడ్డి గారికి విశ్వవిద్యాలయం పక్షాన కృతజ్ఞతలు.

# విషయ సూచిక

# ప్రస్తావన

నే నాంధ్ర విశ్వకళా పరిషత్తులో నున్నపుడు సాగించిన పరిశోధన ఫలమీ "రెడ్డి రాజ్య చరిత్ర". ఇంతకు మునుపు ఇది ఆంధ్ర చరిత్రలో "ఒక విస్మృత ప్రకరణము" అన్న గ్రంథమును రచించియుంటిని. దాని పరిణామమీ రెడ్డి రాజ్య చరిత్ర. నూటయిరువది ఏండ్లు (క్రీ॥శ॥ 1325-1448) విశాఖ జిల్లాలోని సింహాచలము మొదలు నెల్లూరు నందలి కందుకూరు వరకు గల తీరాంధ్రదేశపు ప్రజల భాగధేయమును మలచినవి కొండవీడు, రాజమహేంద్రవర, కందుకూరు రెడ్డి రాజ్యములు. వాని చరిత్ర నిందు వివరించితిని. ఆ మూడింటను ప్రధానము, ప్రథమము కొండవీటి రెడ్డి రాజ్యము. ఈ కొండవీటి రాజులు మొదట రేకపల్లి, వరంగల్ పాలకులగు ముసునూరి నాయకుల కనుయాయులు. కాని త్వరలో వారు స్వతంత్రులై కాకతీయ పతనానంతరము హిందువుల ఆధిపత్య పునరుద్ధరణమున నత్యంత ప్రముఖ పాత్రను నిర్వహించినారు

కొండవీటి చరిత్ర ఎంతగనో నలిగిన బాట. వివిధ దృక్కోణములనుండి ఎందరో పండితులు ఆ విషయమును చర్చించినారు. తొట్టతొలి ఆంధ్రదేశ చరిత్ర రచయిత శ్రీమాన్ బుక్కపట్టణం రాఘవాచార్యులు. ఆయనది గుంటూరు మండలము. సంస్కృతాంధ్రములందు నిష్ణాతులు. గుంటూరు తాలూకాలో ప్రథమశ్రేణి రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌గా నుండి, ఆపై డిప్యూటీ తహసిల్‌దారయినారు. అప్పటి మద్రాసు ప్రెసిడెన్సి కౌన్సిల్ సభ్యుడయిన స్వర్గీయ గౌ॥ డి.యస్. కార్మైకేల్ ఆనతి మేరకు 19వ శతాబ్ది చతుర్థ పాదములో ఆయన ఆంధ్రదేశ చరిత్రను "తెలుగుదేశ చరిత్ర"యను పేర రచించినారు. ఆయనకు తామ్ర శిలాశాసనములు, తెలుగు సాహిత్యము ఆధారములైనవి. విజయనగర రాజ్యాంతము వరకునైన ఆ గ్రంథమిప్పటికిని అముద్రితమే. ఆ ప్రతి మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో భద్రపరచబడియున్నది. ఆ గ్రంథంలో కొండవీటి రాజ చరిత్ర అల్ప ప్రకరణము మాత్రమే. ఇతర అలతి రచనలలో మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ గారి "కొండవీటి సామ్రాజ్యము" వారికి ముఖ్యాధారములైనవి. తెలుగు సాహిత్యము గాక కొండవీటి దండకవిలె, కొండవీటి కైఫియత్‌లు, రెడ్డిరాజ చరిత్రను చెప్పుకోదగ్గ రీతి మొట్టమొదట వ్రాసినవారు సర్వశ్రీ చిలుకూరు వీరభద్రరావుగారు. 3 సంపుటముల వారి ఆంధ్రుల చరిత్రలో 3వ సంపుటమున నధిక భాగము ఆ విషయము నధికరించినదే. అదిగాక

అందు విజయనగర సంగమ రాజ్య చరిత్ర, రాచకొండ, దేవరకొండల పద్మనాయక ప్రభువుల, కోరుకొండ నాయకుల చరిత్రలును ఉన్నవి. శ్రీ వీరభద్రరావుగారు నిబంధించిన ఆ రేఖాకృతిని విశేష పుష్టము జేయవలసియే యున్నది. పత్రికలలో నటనట యీ విషయమును చర్చించినవారిలో ముఖ్యులు డాక్టరు నేలటూరు వేంకట రమణయ్యగారు. మద్రాసు విశ్వకళా పరిషత్తులో చరిత్ర-పురావస్తు చరిత్ర విభాగమున రీడర్‌గా నుండినవారు. వీరభద్రరావుగారి పిదప రెడ్డిరాజ చరిత్ర నింత గాఢముగా మరెవ్వరును శోధింపలేదు. విజయనగర చరిత్ర తెలుగు పద్యకృతి "వెలుగోటివారి వంశావళి" ఎపిగ్రాఫియా ఇండికాలో అన్నదేవచోడుని రాజమండ్రి మ్యూజియం శాసనముల శోధనా ప్రకాశన సందర్భముల వీరు విధిగల రెడ్డిరాజుల చరిత్రమును సమగ్రముగ పరీక్షింపవలసి వచ్చెను. అపుడు వెలువరించినవే వారి వ్యాసములు "రెడ్లు - విజయనగర రాజులు", "వెలుగోటివారి వంశావళి పీఠిక, అన్నదేవచోడుని పైని లేఖనములు". ఆ యవసరముల వీరు రెడ్డిరాజ విషయమున క్లిష్ట సమస్యలనెన్నిటినో గుర్తించి పరిష్కరింప అతి శ్రద్ధయై యత్నించినారు. అందుకు అన్నదేవుని రాజమండ్రి మ్యూజియం శాసనము పైని వీరి విచారము గణనీయము. అయినను యీ వీరి రచనలన్నియు రెడ్డిరాజ చరిత్ర దృష్ట్యా కాదు. అన్యకోణములనుండి యన్నది మరువరాదు. ఆ కారణముగనే యీ వంశముపై పేరు ప్రత్యగ్ర పరీక్షకవకాశము కలిగినది.

కొండవీటి రెడ్డి రాజకీయముల విశదీకరింప యత్నించినవారు శ్రీ కె.వి. లక్ష్మణరావు, శ్రీ వడ్డాది అప్పరాయ ప్రభృతులు మరికొందరు గలరు. రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారు రెడ్డి సంచికను ప్రకటించునప్పటికి నా యీ యత్నము ముద్రణమున నున్నందున నాకా సంచిక వలన లాభము చేకూరదయ్యెను.

రెడ్డి రాజ కాలమునాటి సంస్కృతాంధ్ర సాహిత్యముల నధికరించి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఎంతయో శ్రమించినారు. వారు రచించిన "శృంగార శ్రీనాథము" ప్రాచీన కవి జీవిత చరిత్ర వాఙ్మయమునకెల్ల నొజ్జయు చిరస్మరణీయమును. సుప్రసిద్ధ పండితులగు ప్రభాకరశాస్త్రిగారును, మానవల్లి రామకృష్ణ కవిగారును, మద్రాసు గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీకై వ్రాతప్రతుల సేకరింతలో నెఱపిన ఉత్సాహ పరిశ్రమలు అవిరళములు, ప్రశంసనీయములు. వారివలన ఎన్నియో విస్మృత రచనలు క్రొత్తగ వెలుగు చూచినవి. వానిపై వారి వ్యాసములు వివిధ విషయ బహుళములు. తత్ఫలితముగ

సంస్కృతాంధ్ర సాహిత్య చరిత్ర పరిపుష్టము కాగలిగినది. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ శృంగార శ్రీనాధమున కేవలము కొండవీటి రాజాస్థానమున వర్ధిల్లిన (ముఖ్యముగ శ్రీనాథ, పెదకోమటి వేముల) సాహిత్యమునేగాక రాచకొండ రేచర్ల నాయకుల (ప్రధానముగ సింగభూపాలుని) సాహిత్య పరిశ్రమనుగూడ కొంత కొంత కొనియాడినారు. శ్రీనాథునిపై శ్రీ బండారు తమ్మయ్య, కుందూరు ఈశ్వరదత్తులు తెలుగు పత్రికలందు విలువగల వ్యాసములను ప్రకటించినారు. చిలుకూరు వీరభద్రరావుల శ్రీనాథ జీవిత చరిత్రము, మహామహోపాధ్యాయ వేదం వేంకటరాయశాస్త్రివర్యుల శృంగారనైషధ పీఠిక, పెదకోమటి వేముని అమర శతకముపై వ్యాఖ్యలు నాటి సాహిత్యోద్యమ ప్రాబల్యమునెత్తి చూపునవి. వీనికి తోడు డాక్టరు వి. రాఘవన్‌గారు సంస్కృత సాహిత్యమునగల ఎన్నియో క్లిష్ట సమస్యలను పరిష్కరించుచూ రేచెర్ల ఆస్థానములోని సుప్రసిద్ధ పండితులు విశ్వేశ్వరులు, బొమ్మకంటి అప్పయ్యలగూర్చియు, కోలాచల మల్లినాథుని వైశ్యవంశ సుధాకరమునుగూర్చి అమూల్యము లగు వ్యాసములు వెలువరించిరి. తిరువాన్కూరు రాచనగరునందలి సంస్కృత లేఖనా ప్రతుల వివరణ పట్టికలు వెలువడక పూర్వమే అందుండిన పెదకోమటి వేముని "సంస్కృత సంగీత చింతామణి" విషయము నాకు తెల్పినది శ్రీ రాఘవన్ గారే.

పైన పేర్కొన్న విద్వజ్జనులందరును కొండవీటి రెడ్డిరాజ్య చరిత్రమున నేదోనొక అంశమున (రాజకీయములో, సాహిత్యమో) వివరింప యత్నించినవారే. వారి శ్రమ రెడ్లనాటి పరిస్థితుల అవగాహనకు నాకెంతయో తోడ్పడినది. వారి యత్నములు లేక రెడ్డిరాజ చరిత్ర యీనాడున్నంత విశదముగా తీరెడిదిగాదు. సాహిత్య రాజకీయ చరిత్ర పునర్నిబంధన కతి ముఖ్యములగు శాసనాధారములు ఆ యుగమువి చాలా కొద్దియే. ఆ సమస్యా పరిష్కరణమందు భిన్నాభిప్రాయముల కెంతయో అవకాశమున్నది. ఉన్న సామగ్రితో నాటి సమస్యలనెల్ల పరిశీలించి, నేను సత్యమనుకొన్నదానిని నిర్ణయింప యత్నించినాను. పైన పేర్కొన్న రచయితలందరికినీ వారి పరిశ్రమ లాభాన్ని పంచుకొన్న నేను కృతజ్ఞుడను.

ఈ గ్రంథము రెండవ భాగమున ఆనాటి సంఘ సంస్కృతుల చర్చించితిని. నా దృష్టికవి అత్యంత ముఖ్యములు. ఆ యుగ లక్ష్య లక్షణములను యదార్థముగ రూపించుటకును నాటి జీవన విధానమునగల విభిన్నావస్థానముల పరిస్ఫుట చిత్రణమున కును శ్రద్ధమై యత్నించితిని. రెడ్డియుగమువలె గత కాలమున వర్తిల్లిన గూఢశక్తుల నిర్ణయింప

తగు సాధనమును కనుగొని నాటి ప్రజల వర్తనము నట్లుగా ప్రేరేచిన హేతువుల నిరూపించుట దుస్సాధ్యము. కాలికముగా వారికిని మనకును శతాబ్దముల అంతరము. మన దృగ్భావ శీలములు పాశ్చాత్య సంస్కృతీ భావనా ప్రభావితములును గనుక పరిశోధనకై యీ విషయము నవలంబించునాటికి దీని ప్రసరమెంతని సరిగా నేనూహింపలేదు. తలచినకొలది దీనియం దభిరుచి హెచ్చినది. అంతట దీని విస్తృతి ప్రాముఖ్యతలు నాకు తెలియవచ్చినవి. ఆంధ్రదేశ చరిత్రాఖ్యానము నీ కాలము ప్రభావ మహితమైనది. రెడ్డియుగము మాధ్యమిక యుగాదికిని తదంతమునకును అనగా ఆధునిక యుగ లక్షణములు పొటమరించు వఱకునైన పరివర్తనమును తెల్పు సంధిబంధము. ముస్లిముల నెదిరి హైందవాధిక్యమును పునః ప్రతిష్ఠించిన జాతీయ ప్రతిఘటన పిదప ఆంధ్రదేశము ఒక కుదుటబడి నూత్న పరిస్థితుల కనురూపముగ ఉద్గమించిన నూత్న శక్తులు సక్రమముగ తీరి దేశ జీవితము సుసంపన్న మైనది. ఈ రెడ్డిరాజుల పాలనా కాలముననే అతి భారమగు రెడ్డియుగ చరిత్ర రచనకు చాలు సాధనములు లేకయే పూనుకొనుట సంఘటిల్లినది. దీని నిర్వహణమున దొరలిన నెరసులు నేను గుర్తించినవి కొన్ని, గుర్తింపనివెన్నియో, వాని నెట్టులో సైరింపుడని పాఠకులను వేడుకొనుచున్నాను.

అక్టోబరు, 1948

22, దివాన్ రామయ్యంగార్ రోడ్డు
వేపేరి, మద్రాసు - 7

మల్లంపల్లి సోమశేఖరశర్మ

# సంకేతములు

అభి.చిం. - అభిలషితార్థ చింతామణి : భువనైకమల్ల సోమేశ్వరశర్మ
అగ్ని - అగ్నిపురాణము
ఆం.క.చ. - ఆంధ్ర కవుల చరిత్ర : కందుకూరి వీరేశలింగము
ఆం.సం. - ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక
ఆం.భాగ. - ఆంధ్ర భాగవతము : పోతనామాత్య
ఆం.భాషా. - ఆంధ్ర భాషా భూషణము : కేతన
ఆం.అర్ణవ - ఆంధ్ర భాషార్ణవము : కోటి వెంకనార్య
ఆం.చ. - ఆంధ్రుల చరిత్ర (3 సంపుటములు) : చిలుకూరి వీరభద్రరావు
అప్పకవి - అప్పకవీయము : కాకునూరి అప్పకవి
ఆం.ప.మ. - ఆంధ్ర పరిశోధక మండలి
ఆం.సా.ప.గ్రం. - ఆంధ్ర సాహిత్య పరిషత్ గ్రంథాలయము
ఆం.వి.స. - ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము : సంపా. కె.వి. లక్ష్మణరావు
ఆం.సా.ప.ప. - ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక
భీమ.పురా. - భీమేశ్వర పురాణము : శ్రీనాథ
భో.రా. - భోజ రాజీయము : అనంతామాత్య
బసవ (పా) - బసవ పురాణము : పాల్కురికి సోమనాథ
బసవ (పి) - బసవ పురాణము : పిడపర్తి సోమనాథ
చ.చం. - చమత్కార చంద్రిక : విశ్వేశ్వర
తా.శా. - తామ్ర శాసనము
చాటు.మం. - చాటు పద్యమణిమంజరి (2 సంపుటములు)
సంకలనం-వేటూరి ప్రభాకరశాస్త్రి
దశ.నం.చ. - దశరథ రాజనందన చరిత్ర : ధరణీదేవుల రామమంత్రి
దే.పురా. - దేవాంగ పురాణము : భద్రకవి లింగకవి

| | | |
|---|---|---|
| హర.వి. | - | హర విలాసము : శ్రీనాథ |
| హరి.వం. | - | హరివంశము : ఎఱ్ఱాప్రెగడ |
| కేయూర | - | కేయూరబాహు చరిత్ర - మంచన |
| క్రీ.రా. | - | క్రీడాభిరామము : వల్లభామాత్య |
| కై.కొ. | - | కొండవీటి కైఫియత్ |
| కై.కి. | - | కిమ్మూరి కైఫియత్ : వి.ఆర్. జగపతివర్మచే ప్రకటితము |
| కై.కో. | - | కోరుకొండ కైఫియత్ : వి.ఆర్. జగపతివర్మచే ప్రకటితము |
| కా.ఖం. | - | కాశీఖండము : శ్రీనాథ |
| కావ్య.చూ | - | కావ్యాలంకార చూడామణి : విన్నకోట పెద్దన |
| నవ.చ. | - | నవనాథ చరిత్ర : గౌరన |
| నృ.పురా. | - | నృసింహ పురాణము : ఎఱ్ఱాప్రెగడ |
| పద్మ | - | పద్మ పురాణము : మదికి సింగన |
| పం.భా. | - | పంప భారతము |
| పండి.చ. | - | పండితారాధ్య చరిత్ర : పాల్కురికి సోమనాథ |
| పాం.మా. | - | పాండురంగ మాహాత్మ్యము : తెనాలి రామకృష్ణ |
| పాం.ప. | - | పాంచాలీ పరిణయము : మూర్తికవి |
| ప.వీ.చ. | - | పల్నాటి వీర చరిత్రము : శ్రీనాథ |
| రుక్మ.చ. | - | రుక్మాంగద చరిత్ర : ప్రౌఢకవి మల్లన |
| రామ.వి. | - | రామవిలాసము : ఏనుగు లక్ష్మణకవి |
| షో.రాకు.చ. | - | షోడశ రాజకుమార చరిత్రము : వెన్నెలకంటి అన్నయ |
| శుక్ర | - | శుక్రనీతి |
| స.నీ.స. | - | సకల నీతి సమ్మతము : మడికి సింగన |
| శివ.లీల. | - | శివ లీలా విలాసము : కొమ్మన |
| సిం.ద్వా. | - | సింహాసన ద్వాత్రింశిక : కొఱవి గోపరాజు |
| సునంద | - | సునందా పరిణయము : చింతగుంట కోదండరామామాత్య |

| | | |
|---|---|---|
| శృం.భూ. | - | శృంగారభూషణ భాణ : వామన భట్ట బాణ |
| శ్రీరంగ. | - | శ్రీరంగ మాహాత్మ్యము : భైరవకవి |
| శృం.నై. | - | శృంగార నైషధము : శ్రీనాథ |
| శృం.శ్రీ. | - | శృంగార శ్రీనాథము : వేటూరి ప్రభాకరశాస్త్రి |
| శివధర్మ | - | శివధర్మోత్తరము : మల్లారెడ్డి |
| శివ.మా. | - | శివరాత్రి మాహాత్మ్యము : శ్రీనాథ |
| ని.ఉ.రా. | - | నిర్వచనోత్తర రామాయణము : తిక్కన |
| వీ.విజ. | - | వీరభద్ర విజయము : పోతనామాత్య |
| విక్ర.చ. | - | విక్రమార్క చరిత్ర : జక్కన |
| వేమ.చ. | - | వేమభూపాల చరితము : వామన భట్ట బాణ |
| విష్ణు | - | విష్ణు పురాణము : వెన్నెలకంటి సూరన |
| వరాహ | - | వరాహ పురాణము : నంది మల్లయ్య, ఘంట సింగయ్యలు |
| వాసిష్ఠ | | వాసిష్ఠ రామాయణము : పడికి సింగన |
| వెలుగోటి | - | వెలుగోటివారి వంశ చరిత్ర : వెల్లాల సదాశివశాస్త్రి, అవధానం శేషశాస్త్రి |
| వె.వం. | - | వెలుగోటివారి వంశావళి : సం. నేలటూరు వేంకట రమణయ్య |

## అధ్యాయము 1

# ఆధారములు

క్రీ.శ. 14,15 శతాబ్దములలో తెలుగుదేశము నేలిన రెడ్డిరాజుల చరిత్ర స్వరూపనిర్ణయమున కుపకరించునవి ప్రధానముగ (1) శాసనములు (2) సాహిత్యము (3) లోక కథలు లేక పురావృత్తములు.

## 1. శాసనములు

చరిత్ర రచనా సామగ్రిలో అతిప్రధానములు శాసనములు. కాని ఆయుల్లేఖనముల ముఖ్యోద్దేశ్యము చారిత్రకాంశముల ప్రఖ్యాపన గాదు. అవి కేవలము దానపత్రములు, రాజులు, తదా స్థానియులు. ఇతర వ్యక్తులు దేవాలయముల కొసగు ధనభూదానములను, బ్రాహ్మణుల కగ్రహారములను ప్రకటించు అలేఖ్య మాత్రములు వీనిలో కొన్ని దేవాలయములనో అందలి మంటపాది భాగములను నిర్మించుటను విగ్రహప్రతిష్ఠలను తెల్పు పట్టములు. అందుచేత శాసనము లెంత ముఖ్యములైనను అవి యానాటి వృత్త విశేషముల నెక్కువ విశదీకరింపవు. శాసన మాత్ర సహాయమున దేశ చరిత్రను సంగ్రథించుట కానిపని. అయినను చరిత్ర పునర్నిర్మాణమున ప్రామాణికమగు సాక్ష్యమునకై వాని విధానముల యుపయోగము తప్పనిసరి. ఈశాసనములు రెండు తెగలవి (1) తామ్రపట్టికలవి (2) శిలలపై నున్నవి.

### 1. తామ్ర శాసనములు :

ఇవి ప్రధానముగ వేదశాస్త్ర నిష్ణాతులగు బ్రహ్మణులకు భూమ్యగ్రహార దానముల పట్టములు. ఒక్కొక పట్టమునందు అవసరము కొలది మూడు మొదలు ఆరువరకు రాగిరేకులందును, వానిని గుదిగ్రుచ్చుచూ ఒక రాగి యుంగరము; ఉంగరపు కొసల నదుకునొక ముద్ర, గుండ్రముగనో అండాకారముగనో పై దానకర్త యొక్క లాంఛనమో సంకేతమో ముద్రించబడి యందును రెడ్డి రాజ దాన శాసనములవి బహుళముగ శయుననంది ముద్రలు, రాజులు శైవానుయాయులగుటను సూచించునవి.

ఈశాసనములలో సామాన్యముగ దాతల ప్రతిగ్రాహుల తత్పూర్వుల పేర్లు, అట్టివేమేని ఉన్నచో దాతల విక్రమ కర్మలు, ఉత్ప్రేక్షలనిండిన కావ్యశైలిలో వర్ణింపబడి యుండును. దానమునాటి శకవత్సర మాసతిథినక్షత్రాదుల వలన వాని యథార్థ్యము నిశ్చయింప వీలుండును. దానము గొన్నవారు తఱచు వేదవిజ్ఞాన శాస్త్రముల పరిణతులు. ముఖ్యముగ నెన్నదగినది ఈతామ్ర శాసనములు పేర్కొన్న ప్రతి గ్రహీతలందరును సంస్కృత విద్వాంసులే, దేశభాషయందు ప్రఖ్యాతులెవ్వరును లేరు.

## 2. శిలా శాసననములు :

తామ్ర శాసనముల వలెనే శిలాశాసనములును రాజుల సామంత నాయకుల, వ్యక్తుల పసు(ధన) వస్తుదానముల ప్రస్తావించునవి. దాతలు అనధికార వ్యక్తులయినపుడు వారి యీశాసనములందు దానకాల విశేషములనే గాక ఆప్రాంతముల పాలక ప్రభువుల పేర్లను గూడ ఉదాహరించుట పరిపాటి. ఆయా మండలములలోని యిట్టి శిలాశాసనములలో పాలక నామము చిరము కానరానిచో ఆయా మండలముల రాజునధికారము చెల్లక అవ్యవస్థ ప్రబలి యున్నదని యూహింపదగును. శిలాశాసనముల వ్యాప్తి మూలమున ఆయా ప్రభువుల రాజ్యపరిధుల నిర్ణయింపవచ్చును. వారివారి రాష్ట్రములకు వెలిగా తీర్థక్షేత్రములందు సైతము ఏరాజును తన శిలా శాసనములను వెలయించి యుండడు. అట్టివే ప్రాంతములనైన కననైనచో ఆరాజు ఆప్రాంతమును జయించెననియో, ఆప్రాంత ప్రభువు ఆరాజమిత్రుడనియో చెప్పవచ్చును. ఈవరకు తెలిసి నంతలో రెడ్డిరాజలవి శిలాశాలనములకన్నా తామ్ర శాసనములే అధికాధికముగ లభించినవి.

## 2. సాహిత్యము

నాటి సాహిత్యమును దేశీయ, పరదేశీయములనుగ విభజించ వచ్చును. సంస్కృతాంధ్ర రచనములును అరబిక్ పర్షియన్ భాషలలో ముసల్మానుల అలేఖ్యములును దేశీయములు. ముస్లిం, పాశ్చాత్య యాత్రికుల వక్కాణములు రెండవ తెగకు చెందినవి. మఱియొక వర్గమునది అనూచానము పరంపరా గతమునగు

దేశ్యవాఙ్మయము సాంప్రదాయకము ఇతిహాస పరిశోధనముల దీని విలువ అనల్పము.

## భారతీయ సాహిత్యము :

ఈ కాలమునాటి రెడ్ల తదితర ప్రభువుల పోషణమున వర్ధిల్లిన సంస్కృతాంధ్రముల విద్వాంసులు పెక్కురు పాలకులందే కొందరు స్వయము ప్రసిద్ధ కవిపండితులున్నారు.

సంస్కృత వాఙ్మయము చరిత్ర రచనకుపకరించు నాటి సంస్కృత గ్రంధములలో ముఖ్యముగ ఎన్నదగిన కుమారగిరి రాజీయము. అది కాళిదాసుల నాటకత్రయము, అభిజ్ఞానశాకుంతలము, విక్రమోర్వశీయము, మాళవికాగ్ని మిత్రములు - పై వ్యాఖ్య; అమరుశతకముపై పెదకోమటి వేముని వ్యాఖ్య శృంగార దీపిక వామన భట్టబాణుని వేమ భూపాల చరిత్రము; కందుకూరు కులము వాడగు శివలింగారెడ్డి రచితము. హరిదత్తా చార్యుని చతుర్వేద తాత్పర్యసంగ్రహముపై వ్యాఖ్య. రేచర్ల వంశీయుడు సింగభూపాలుని అలంకారికి రస్నార్ణవ సుధాకరము. ఆవిషయము గూర్చినదే విశ్వేశ్వరుని చమత్కార చంద్రిక - యివి రేచర్ల నాయక రాజుల చరిత్ర కత్యంతముపకారకములు. ఇవిగాక ఆయుగము సాధించిన ఘనకార్యములను సంఘజీవనమును ప్రస్తుతించు యితర కావ్యనాటకములును చాలగనున్నవి.

గణుతింపదగిన మఱియొక సంస్కృత గ్రంధము అలంకార సంగ్రహము[1] ;ఇది ఛందోలంకారముల గూర్చిన శాస్త్ర గ్రంధము. ఇందు అయిదు పరిచ్ఛేదములు (i) వర్ణాగమ విచార (ii) శబ్ద నిర్ణయ (iii) రసనిర్ణయ (iv) నేతృభేదవిచార (v) అలంకార నిర్ణయములు. ఈ గ్రంధము భక్తి భూపతి కుమారుడు మన్వభూపతి ప్రార్థింపగా అమృతానందయోగి వ్రాసినది. ఈమన్వ భూపతి సోమ సూర్య కులోత్తంసుడు అరెంటిలో తండ్రియొక్క కులమునకును తల్లి యారెండవ కులమునకును చెందియుందురు. దాక్షిణాత్య శాసనము లెఱిగిన భక్తి భూపతి యొక్కడే. తెలుగుచోడ వంశీయుడును ఏరువ (Euruva) నాయకుడును అగు భక్తిరాజు[2] అతడు క్రీ.శ. 14వ శతాబ్దము మలిసగమువాడు. గొప్ప శివభక్తుడు. అతని కిర్వురు కొడుకులు. ఒకడు భీమలింగ (భీమదేవ) చోడుడు.[3] ఇతనికి చోడభీముడనియు పేరు. రెండవవాడు

అన్నదేవ చోడుడు[4] లేక అన్న భూపతి. ఈగ్రంధము నందంతటను రాజు మన్యభూపతి యనియేగాని అన్న భూపుడని యొక్క వూరైనా పేర్కొనబడలేదు. దీనిని పొరబడుటయనలేము. చాలాచోట్ల "మన్య" స్థానమున అన్న కుదురుకొనదు. అది వ్యాకరణ సమ్మతమును గాదు. ఈగ్రంధము పేర్కొన్న మన్యభూపతి "కొమరాంకభీమ" బిరుదును యితర తెలుగు చోడ బిరుదములను తాల్చినవాడు. ఇవియేవియును భక్తిరాజుగాని అతని కుమారుడు అన్నదేవుడుగాని వహించి యుండలేదు. అమృతానంద యోగి పోషకుడగు మన్యభూపుడు చోడ భూపుని మఱియొక కుమారుడేమో భావిపరిశోధన విశదీకరింపవలసి యున్నది.

## తెలుగు వాఙ్మయము :

ఆకాలపు తెలుగు గ్రంధములు రెడ్డిరాజ చరితను తెలియుట కెంతయో తోడ్పడినవి. అందు ప్రముఖములు శ్రీనాధుని భీమేశ్వర పురాణ కాశీఖండములును కొమ్మనకృతి శివలీలా విలాసమును వారిర్వురును రెడ్డిరాజుల యాస్థానకవులు, ఆరాజ పోషణమున నున్నవారు, మరెందును లభింపని చరిత్రాంశములు ఎన్నియో పైగ్రంధముల దెలియనగును. రాజకీయముల దృష్ట్యాగానిచో, ముఖ్యోదంతము లెన్నింటినో ఆనాటి హరవిలాస క్రీడాభీరామ సింహాసనద్వా త్రింశికలు ఇతర కావ్యములును సమకూర్చు చున్నవి. మనకు ప్రస్తుతులగు కవుల కావ్యవస్తువు ఏదైనను వారికవితా ప్రజ్ఞా ప్రతిభ ప్రస్తుతులే మిన్నుల విహరించినను వారి రచనలు పరిసర జీవన భావనల ప్రభావితములు కాక తప్పదు. వారి కావ్యవస్తువు పౌరాణికమో, వేరో కావ్యనాయకుడు మర్త్యభూపుడో, అమరుడో కావచ్చును. కాని ఆగ్రంధముల వర్ణితములగు ఆచారమర్యాదలు, శిల్పవాస్తు విశేషములు సమరముల శస్త్ర సందోహములు వ్యూహరచనములు పరిపరి విధముల విశేషములు మరెన్నియో సమకాలీనములగుట సహజము. ఉదాహరణకు శ్రీనాధుని కాశీఖండమందేడవ యాశ్వాసమున శివుడచ్యుతునకు కాశియందలి ముక్తిమంటప వత్తాంతము వినిచినకథ. ఆనందకాననమున మహానంద బ్రాహ్మణుడు ధనార్థియై భిక్షాటనకు పెక్కు భద్మవేషములు తాల్చినాడట గోరగునివలె, బవినీని పోలిక, బౌద్ధునిరీతి, కాపాలికుని విధమున, జైనుని సరణిని[5] గోరగులు మైలారదేవుని శైవభక్తులు. బవినీడులు ఏకవీరాదేవిని గొల్చువారు. భిక్షావృత్తిచే జీవించును. కాకతీయులు

రెడ్లపాలనా కాలమున మైలారదేవ ఏకవీరా దేవి పూజ లాంధ్రదేశమున విశేషముగ జరిగెడివి. ఆరెండు విధానముల వారిని వారి యాచరణములను క్రీడాభిరామము[6] చక్కగ వర్ణించినది. సంస్కృతమూలము దేవతాకమగు పురావృతము. ప్రకృతిని పరిసర జీవితమును పరికించుటలో నిశితదృష్టిగల శ్రీనాథుడు తనచేసినది యనువాద మాత్రమైనను తత్కథా చిత్రణమునకు పదనుపెట్టి దానియందు మినుమడింప జేయుటకై మూలమునందలి పదములనే వాడకతప్పదయ్యెను. ఇట్టిదే మఱియొక ఉదాహరణము. శ్రీనాథుడు పెదకోమటి వేమని యాస్థానమున విద్యాధికారి వేమని తామ్రశాసనములనన్నిటిని శ్రీనాథుని విరచించిన దాతదే. తన ఆయనుభవమును వృథవోనీయలేదని శ్రీనాథుని భీమేశ్వర పురాణము తెల్పుచున్నది. అందుస్వర్లోకపతి ఇంద్రుడు శివునికి బ్రహ్మాఖండమును దానమిచ్చుచు తానై ధర్మశాసనము వెలయించెనని ఆప్రక్రియమంతటిని భూమి పతులు తమ దానశాసనముల వెలయించుటలోవలె లోకుల ఎదుట ఆభూదాన విషయ ప్రకటనము. యెల్లన్నిర్ణయము యిత్యాది - సవిశేషముగ శ్రీనాథుడు వర్ణించెను. ఇంద్రుని ఆదాన కాలము మార్గశిరచతుర్దశీసిద్ధ యోగము చంద్రుడు రోహిణీ యుక్తుడై యుండగా దానకాలమునాటి ఇతర లోకపతులు తరువాత రానున్నవారు ఆధర్మమును పాలింపవలెనని దాని నిషేధముగను భంగింపరాదను ఆశంసనముతో ఇంద్రుని ఆదానశాసన ఘట్టము ముగియును.[7] అప్పటి తెలుగు కావ్యములలో నాటి సాంఘిక జీవనమును వ్యక్తపఱుచునిట్టి ప్రస్తావములు నెన్నిటినో చూపవచ్చును. కావున మనకు ప్రస్తుతమగు రెడ్డి యుగమున సాంఘిక చరిత్రకై అవిశ్రద్ధగ సునిశితముగ నాటి కావ్యముల పరిశీలించుటవసరము. కాని అట్లు లబ్ధమైన విషయము వేరు ఆధారములు లేనిచో అసంపూర్ణమే గాక ఆయథార్థము గూడ కావచ్చును.

## ముస్లిము చరిత్రలు :

ముస్లిముల చరిత్ర గ్రంధములు రెడ్డియుగ చారిత్రకాధారములలో ముఖ్యములు. అందు ఢిల్లీ సుల్తానుల దక్షిణదేశ దండయాత్రలు విజయములు వర్ణింపబడినవి. దక్షిణమువైపు మొదట దృష్టి సారించినవాడు అల్లాయుద్దీన్‌ఖిల్జీ. అతడు తెలంగాణా మహారాష్ట్రముల జయించుటకై పలుమారులు సైన్యములంపెను. శక 1239 (క్రీ.శ. 1317) లో దేవగిరి రాజు హరపాల దేవుడు చనిపోవుటతో మహారాష్ట్రము ఢిల్లీ

రాజ్యాధీన మయ్యెను. శక 1245 / క్రీ.శ. 1323లో వరంగల్‌ను చివరిసారిగ జయించుటతో అది ఢిల్లీ రాజ్యాంతర్భాగమైనది. హిందూదేశమున ముస్లిం పాలనా చరిత్రమున దక్కనులో మొదటి స్వతంత్ర ముస్లిం రాజ్యము శక. 1269 / క్రీ.శ. 1347లో గుల్బర్గా రాజధానిగా అల్లాయుద్దీన్ హసన్ గంగూ బహమన్‌షా స్థాపించినాడు. ఈబహ్మన్ రాజ్యము కొండవీడు - రాజమహేంద్రవర రెడ్ల రాజ్యములకును విజయనగర రాయల సామ్రాజ్యమునకును సమకాలీన వైరిరాజ్యము. దక్షిణ రాజ్యముల కబళింపు నుద్యమించిన యీ బహ్మన్ సుల్తానుల చేతులనుండి హిందూ ధర్మ సంస్కృతులను తమతమ రాజ్యములను పరిరక్షించుకొనుట ఆరెడ్డిరాయలకు జీవన్మరణ సమస్యగా పరిణమించెను. దక్కన్ చరిత్రకు, అందును ముఖ్యముగ బహ్మన్ రాజవంశ చరిత్రకు ఆధారములగు ముస్లిం ప్రామాణిక రచనల నిందు పొందు పొరచు చున్నాను.

## 1. ఖజాయిన్ - ఉల్ - ఫుతుహ్ లేక తారీఖ్-యి-అలాయి :

అమీర్‌ఖుస్రూ, అలాయుద్దీన్ ఖిల్జీ చరిత్రకు ముఖ్యముగ హిజ్రీ 695-711 / క్రీ.శ. 1269 - 1312 కాలావధికి, మిక్కిలి ఉపకరించును. అందుండి కొన్ని యాధారములును ఆంగ్లానువాదములను ఇలియట్ తన సంకలించిన హిందూదేశ చరిత్ర (History of India)లో నిబంధించినాడు. ఖుస్రూ గ్రంధమును అలీఘర్ ముస్లిం యూనివర్సిటి ప్రొఫెసర్ మహమ్మద్ హబీబ్ ఆంగ్లమున లిఖించిన దానిని బాంబే డి.బి.తారాపోరి వాలాసన్స్ యండ్ కంపెనీ వారు ప్రచురించిరి. వరంగల్ రాజగు కాకతీయ ప్రతాపరుద్రుని కాలమున జరిగిన ముస్లిం దండయాత్రలిందు వర్ణించుటచే నీగ్రంధమునాటి తెలంగాణా చరిత్ర కెంతయో ముఖ్యమైనది.

## 2. ఫతుహ్-ఉస్-సలాతన్ :

ఈసామీ ఇది ఘజ్నీ రాజగు సబక్తజిన్ నుండి మహమ్మద్ బిన్-తుఘలక్ వరకు నైన ముస్లిం చరిత్రము. ఇటీవలనే దీని మూలగ్రంథమును ఆగ్రావాసి డాక్టరు ఎ. మహ్దీహుసేన్ ప్రకటించినాడు. క్రీ.శ.సు1310 ప్రాంతమున ఈసామీ ఢిల్లీలో జన్మించెను. క్రీ.శ. 1327లో మహమ్మద్ బిన్ తుగ్లక్ దేవగిరికి మార్చినపుడు

అతనికి 16 యేండ్లు. రాజశాసనము మేరకు యితర ఢిల్లీ పేరులవలె అతడును దేవగిరికి పోవలసి వచ్చెను. తరువాతి 25 ఏండ్లు అతడు దేవగిరి యందే గడిపెను. గుల్బర్గాలో బహ్మన్ రాజ్య స్థాపనము పిదప క్రీ.శ. 1349 - 50లో అతడు తన చరిత్ర గ్రంధమును వ్రాసి దానిని తన ప్రభువున కంకితమిచ్చెను. ఇట్లు ఈసామీ మహమ్మద్ బిన్ తుగ్లక్‌నకు సమకాలీనుడగుటేగాక, అతని పాలనలో జరిగిన అనేక సంభవములను, అందును ముఖ్యముగ దక్కన్ చరిత్రకు సంబంధించిన వారిని స్వయము కాంచినవాడు(8).

## 3. తారీఖ్-ఇ-ఫిరోజ్‌షాహి : జయాయుద్దీన్ బరని.

ఇది హిజ్రీ 662 / క్రీ.శ. 1266 మొదలు హిజ్రీ 758 / క్రీ.శ. 1357 అనగా ఫిరోజ్‌షా రాజ్య సం. 6 వరకు. బరనీ మహమ్మద్ తుగ్లక్ పాలనా కాలమున ప్రారంభించి దానిని హిజ్రీ 758 / క్రీ.శ. 1359లో ముగించెను. దీనిలో చాల భాగము ఆంగ్లమున ఇలియట్ సంకలనము "హిందూదేశ చరిత్రలో కాననగును".

## 4. తీరీఖ్-ఇ-ఫిరోజషాహి : షామ్స్-సిరాజ్ అఫీఫ్

ఇది ముఖ్యనుగ మహమ్మద్ తుగ్లక్ తరువాతి సుల్తాన్ ఫిరోజ్‌షా పాలనము గూర్చినది. తన పోషకుడగు ఫిరోజ్‌షా(1357-1388) ప్రేరణమున దీని నఫీఫ్ రచించెను. దీనిలో అధికభాగము ఇలియట్ చరిత్రలో అనువదింపబడినది.

పై పేర్కొన్న ఇతిహాసికులందరును మహమ్మద్‌బిన్ తుగ్లక్‌కు సమకాలమువారు. వారందరిలో అఫీఫ్‌పిన్న. వారి రచనలన్నియు 14వ శతాబ్ది పూర్వార్ధ చరిత్రకు ప్రధాన ఆధారములు ప్రాముఖ్యమున వాని సదృశ రచనములు తరువాతి వారివియు కొన్ని గలవు.

## 5. తారీఖ్-యి-ముబారక్‌షాహి : యాహ్యాబిన్ అహమ్మద్ బిన్ అబ్దుల్లా సర్‌హిందీ

ఇది ఘోరీ రాజవంశ స్థాపకుడగు ముయిజుద్దీన్ బిక్‌శామ్ రోజుల నుండి హిజ్రీ 838 / క్రీ.శ. 1434 వరకు గల ఢిల్లీ సుల్తానుల చరిత్ర. అతడు క్రీ.శ. 1427 నుండి 1435 వరకు ఢిల్లీని పాలించిన సయ్యద్ రాజవంశీయుడగు ముబారక్‌షా పోషణమున యీ చరిత్రను వ్రాసెను. కె.కె.బాసు దీని యాంగ్లాను వాదమున గైక్వాడ్ ఓరియంటల్ సీరిస్‌లో ప్రకటించినాడు.

## 6. బుర్‌హాన్-ఇ-మఆసిర్ : ఆలీబిన్ అజీజుల్లా తబాతబా

ఇది అహమ్మద్ నగర నైజామ్ షాహీ వంశచరిత్ర - రెండవ బుర్హాన్ నిజాంషా క్రీ.శ. 1590 ప్రోత్సాహపోషణముల నతని పేరిటనే రచించినది. రచనారంభము క్రీ.శ. 1591 మేజర్ జె.యస్. కింగ్ లెఫ్టినెంట్ కల్నల్ సర్ వూల్సే హైగ్‌లు దీని నాంగ్లమున ఇండియన్ "ఆంటి క్వెరీ"లో ప్రకటించినారు. అందు బహ్మాన్ రాజసంబంధి భాగము వేరుగా పుస్తకరూపమున ఆతర్వాత ముద్రితమైనది.

## 7. తబ్‌ఖాత్-యి-అక్బరి : ఖ్వాజా నిజాముద్దీన్ అహ్మాద్

షహాబుద్దీన్ మహమ్మద్ ఘోరీ కాలమునుండి హిజ్రీ 1002 క్రీ.శ. 1593 అక్బర్ రాజ్యవర్షము 38 వరకు ముస్లిం పాలనము వర్ణించునది. ఇది ఢిల్లీ సుల్తానుల చరితనే గాక యిండియాలో పలుతావులగల యితర ముస్లిం ప్రభువుల చరిత్రను గూడ తెలియజేయును. అగ్బర్ తన 29వ రాజ్యవర్షమున నీగ్రంధ కర్తను గుజరాత్‌లో బక్షీ గనియమించెను. ఆపదవీ నిర్వహణముననే హిజ్రీ 1003 క్రీ.శ. 1594-5లో అతడు మృతి చెందెను. దీని ఆంగ్లానువాదము బెంగాల్ ఏషియాటిక్ సొసైటీవారు ప్రకటించినారు.

## 8. మంతఖబ్-ఉల్-తవారిఖ్ లేక తారీఖ్-ఇ-బదౌనీ : ముల్లా అబ్దుల్ కాదర్ బదౌనీ

గజనీసుల్తానుల కాలమునుండి అగ్బర్ రాజ్యవర్షము 40 వరకునైన హిందూదేశచరిత్రః గ్రంధకర్త అగ్బర్ ఆస్థానీయుడు సంస్కృత, అరబిక్ గ్రంధములను పర్షియన్‌లోని కనువదించుటకై అగ్బర్ వానిని తఱచు వినియోగించువాడు. తన గ్రంధము "తబకాత్-యి-అక్బరీ"కి సంగ్రహరూప మాత్రమని గ్రంధకర్తయే వాక్రుచ్చినాడు. లాఫ్టినెంట్ కల్నల్ జి.యస్.ఎ. రాంకింగ్ దీనినాంగ్లమునను వదించెను.

## 9. తారీఖ్-యి-ఫెరిస్తా : మొహమ్మద్ ఖాసింహిందూషా ఫెరిస్తా

ఇది హిందూ దేశమున ముస్లిం రాజ్యముల వ్యాప్తిని గూర్చిన సమగ్ర చరిత్ర. క్రీ.శ. సు 1570లో కాస్పియస్ సముద్ర తీరము పొలిమేరలో అస్త్రాబాద్‌ల ఫెరిస్తా జన్మము. పిన్నవయసుననే తండ్రితో గూడ ఇండియాకు వచ్చెను. అపుడు అహ్మద్ నగరంలో ముర్తజా నిజాంషా పాలించు చుండెను. నిజాంషాహీ సుల్తానుల కడ కొన్నేండ్లు పనిజేసి, అతడు బిజాపురమున కేగెను. (క్రీ.శ. 1589) అట సుల్తాన్ ఇబ్రహీం ఆదిల్‌షా II కడ ఉద్యోగిగా ఫెరిస్తా తన జీవితాంతము గడపెను. ఆసుల్తాన్ కోరికపై ఫెరిస్తా వ్రాయబూనిన చరిత్ర గ్రంధము హిజ్రీ 1015 (1606 A.D.) నకు పూర్తి అయ్యెను. తన రచనకై ఫెరిస్తా "తక్కువ పక్షము 35 గ్రంధములను పరిశీలించినాడట. ప్రాయికముగా ఆయధార్థమున విశ్వసనీయమగుటచే అతని గ్రంధము విలువ కొఅతవడినది. అయినను దక్కన్ రాజ్యముల గూర్చి అతడుటంకించినన్ని విశేషములు మరెచ్చటను లేనందున చరిత్రకారులు దాని నవలింబించవలసి వచ్చినది. ఈగ్రంధమును కల్నల్‌స్కాట్ జాన్ బ్రిగ్స్‌లు ఆంగ్లమునను వదించిరి. స్కాట్ అనువాదము కన్న బ్రిగ్స్ అనువాదము బహుళ విషయికమును విశ్వసింపదగినదియు నాయీపుస్తకమున బ్రిగ్స్ అనువాదము నుండియే ఉదాహరించనాను.

రెడ్డిరాజ చరితకు సంబంధించినంతకు ఫెరిస్తా రచనలోని మహమ్మద్ బిన్ తుఘ్లక్ బహ్మాన్ సుల్తానుల వృత్తాంతము బహుళముగ నుపయోగించును. తుఘ్లక్

విషయికముగ సరిపోల్చుటకు దిద్దుటకు పరిపూరించుటకు, నాటి పిదపటి గ్రంథములు చాలగనే ఉన్నవి. కాని అందును ఏక వాక్యతలేదు. మహమ్మద్ తుఘ్లక్ పాలనములోని అవే సంభవముల క్రమము కాలములందు భిన్నభిన్నముగ నున్నవి. అనుపదము వానిని పరిశోధించి వాని విశ్వాస్యతను యధార్థ్యమును నిర్ణయింపవలసియున్నది. ఈప్రతిపాదన బలము ఈశ్వరీ ప్రసాద్ మహదీహుస్సేన్, హైగ్, నేలటూరు వేంకట రమణయ్యాదుల మహమ్మద్ బిన్ తుఘ్లక్ పాలన గూర్చిన వ్యాసములు, పుస్తకములు చూచిన స్పష్టమగును. ప్రధానాంశముల గూర్చియే భిన్నభిన్న వాదములు ఉపపాదనలు ఉదాహరణకు ఆంధ్రచరిత్రలో అత్యంత ముఖ్యమైన ఘట్టము. తుఘ్లక్‌నకు విరుద్ధముగ తిలాంగ్‌లోని పోరాట జరిగిన సమయము. సమకాలపు రచనలలోనే యింత వైరుధ్యమున్నపుడు అర్వాచీనుల రచనల తర్కించి సిద్ధాంతీకరించుట దుష్కరమో ఊహింపవచ్చును.

గుల్బర్గాలోని బహ్మన్ సుల్తానులపై కన్న మహమ్మద్ తుఘ్లక్ నధికరించిన రచనలే అధికాధికములు. ఆంగ్లానువాదమున లభ్యములు తబకాత్-యి-అక్బరీ, తారీఖ్-యి-ఫెరిస్తా, బుర్హాన్-యిమ-ఆసీర్, తస్కరాత్-ఉల్-ములక్ నుండి కింగ్ ప్రచురించిన ఉద్ధరణలు. గుల్బర్గా సుల్తానుల చరిత్రకు అతి మాత్రముఖ్యములు కేవలము బుర్హాక్-యి-మఆసీర్, తారీఖ్-యి-ఫెరిస్తాలు రెండే.

అందు మొదటిది ఎక్కువ నమ్మదగినది. హిందువుల గూర్చిన ఫెరిస్తా వ్రాతలను గ్రహించు పూర్వము వానిని జాగ్రత్తగ తూచి నిష్కర్షించ వలసి యుండును. సహధర్ములపై వక్కణలు అతిశయోక్తి భూయిష్ఠములు. నేను ఆగ్రంథముల ఆంగ్ల పాదములనే అవలంభించితిని.

## <u>విదేశీయుల రచనలు :</u>

## ముస్లింపాంథలేఖనములు : ఇబ్న్ బతూతా యాత్రలు

అతని పూర్తిపేరు మొరాక్కోవాసిషైక్ అబూ అబ్దుల్లా మహమ్మద్ ఇబ్న్ బతూతా క్రీ.శ. 1325లో 21ఏండ్ల ప్రాయముననే యాత్రలకు వెడలి క్రీ.శ. 1353లో తిరిగి తన దేశమును చేరుకొనెను. అతని మరణము క్రీ.శ. 1368లోనో

1369లోనో తన యాత్రావృత్తాంత లేఖనము హిజ్రీ 756 / క్రీ.శ. 1355లో ముగిసినది. అతని పేరువలెనే అతని గ్రంధనామము గూడ చాలదీర్ఘమైనది - తుహ్ఫతుహ్- అల్-నుజ్జార్-ఫి- ఘరాయిబ్- అల్- అయ్యార్వజైబ్- అల్-సఫర్నామా. అతడు ఇండియాకు వచ్చినది. క్రీ.శ. 1333లో మహమ్మద్ బిన్ తుఘ్లక్ అతనిని సాదరముగా ఆహ్వానించి తన రాజధాని కాజీగనియమించెను. ఎనిమిదేండ్లతడా పదవిని నిర్వహించి క్రీ.శ. 1342లో అటనుండి వెడలి క్రీ.శ. 1344లో సిలోన్ అక్కడి నుండి మాబార్నకు పయనించెను. సముద్రయాన కాలమున తన లేఖ్యములెల్ల నశింపగా అతడు తన యాత్రావృత్తాంతమునెల్ల స్మృతులనుండియే ఉద్ధరించెను. ఆ ఆఖ్యానము ఇలియట్ సంపుటమునను ప్రొఫెసర్ కె.ఎ.నీలకంఠశాస్త్రి గారి అపరిహార్య రచన "ఫారిక్నోటీసెస్ ఆఫ్ సౌత్ ఇండియా" యందును లభ్యమగుచున్నది.

అట్టిదే మరియొక గ్రంధము "అబ్దుల్ రజాక్ యాత్రలు" (Travels of Abdul Rajak) అతని జన్మము మీరట్లో క్రీ.శ. 1413 వర్షమున క్రీ.శ. 1437లో అతడు షారూఖ్ చే హీరట్ కాజీగ నియమితుడై 1441లో రాజప్రణిధిక విజయనగరమునకు వెడలి 1443లో అచట చేరెను. అక్కడ ఒక్కవత్సరముండి 1444లో ఇండియానుండి తిరిగి వెళ్ళెను. అతని యాత్రాకాలమును బట్టి రాజమహేంద్రవర రాజ్యము విజయ నగర వశమగు సమయమున రజాక్ విజయనగరమున నున్నట్లు స్పష్టము. అప్పటి రాజకీయ పరిస్థితులను కాదుగాని అతని గ్రంధమున ఆనాటి ప్రజల జీవన విశేషము లెన్నియో తెలియవచ్చును. దీని యాంగ్లానువాదము ఇలియట్ సంపుటము నందును మేజర్ ప్రకటించిన "ఇండియా యిక్ ది ఫిఫ్టీస్ సెంచరి" యందును కలదు.

## యూరపియన్ యాత్రికుల లేఖనములు:

విదేశీయ వాఙ్మయమున నెక్కుడు భాగము ఆయాత్రికుల లేఖనములే. రెడ్డిరాజ్యావతరణమునకు కొంచెను ముందు క్రీ.శ. 13వ శతాబ్ది చతుర్థ పాదమున వెనీస్ నుండి యొక యాత్రికుడు మార్కోపోలో ఇండియా సందర్శించెను. క్రీ.శ. 1271లో వెనీస్ నుండి బయలుదేరి ఆసియా ఖండము పడమర తూర్పులుగ

మూడున్నర యేండ్లు పయనించి చైనాలో కుబ్లై ఆస్థానము చేరెను. అచట 17 యేండ్లువసించి, ఒక యోడనెక్కి 1 1/2 సంవత్సరముల (హిందూదేశ) సముద్రయానానంతర ముఖొరాసాక్ దర్శించి అచటినుండి కాన్స్టాంటినో పిల్‌వెళ్ళి చివరకు క్రీ.శ. 1295లో వెనీస్ చేరబారెను. ఈతిరుగు ప్రయాణమున మార్కోపోలో ఎన్నియో ప్రదేశముల చూచుచు మాబార్‌ను దర్శించి క్రీ:శ. సు 1292-93 ప్రాంతములో గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని మోటుపల్లి రేవు పట్టణము చేరెను. మన దేశమందలి ముస్లిములపై అతని నిరూపణలు ఎల్లరెఱిగినవే.

ఈకాలముననే యిండియాను దర్శించిన ఇంకొక యాత్రికుడు నికోలోడికోంటి అతడును వెనీస్ వాడే. అతడు డెమాస్కస్‌లో చిన్నతనముననే వర్తకుడుగ కుదురుకొనెను. కొంతకాలమున కతనికి యాత్రలపై బుద్ధి మళ్లినది. బయలు దేరిన కాలము సరిగ చెప్పలేముగాని, అతడు చైనా వరకు వెళ్లి తిరిగి వెనీస్ చేరుకొన్నది 25ఏండ్ల తర్వాత, క్రీ.శ. 1444లో ఈప్రయాణములలో అతడు యిండియా వచ్చి విజయనగరమును దర్శించెను. అతడొక నగరమును ఒకరేవు పట్టణముల గడచినాడట దానిపేరు "పేదిఫెతనియ" (Peudifetamia) దారిలో అతడు మరిరెండు పట్టణములు గడచినాడు - "ఒద్దెశ్చిరియ" (Odeschiria) నెల్లూరు జిల్లాలోని ఉదయగిరి కావలె - "చందర్ ఘిరియా" (చిత్తూరు జిల్లాలోని చంద్రగిరి). అచట నుండి నికోలో మైనలాపూరు (మద్రాసు) ఆది స్థానముల చూచుచు ప్రయాణము చేసినాడు.

అధనేషియస్ నికిటిన్ : రష్యన్ యాత్రికుడు 15వ శతాబ్ది ఉత్తరార్థమున యాత్ర వెడలి 1474లో తిరిగి రష్యా చేరినాడు. దారిలో నతడు యిండియా దక్కన్ వచ్చి, బహమన్ సుల్తాన్ రెండవ మహమ్మద్‌షా రాజధానియగు బీదరులో కొంతకాలముండెను. బీదరు బహ్మనుల నూతన రాజధానీ నగరము. దానిని సుల్తాన్‌ఫిరోజ్‌షా తరువాతి వాడగు సుల్తాన్ అహ్మద్‌షా క్రీ.శ. 1423లో స్థాపించెను.

ఈయాత్రికుల లేఖనములను ఆంగ్లమున ఆర్.హెచ్.మేజర్ తన గ్రంధము "ఇండియా యిన్ ది ఫిఫ్టీన్త్ సెంచరీ"లో నిబంధించినాడు(10).

పైపొంధుల తరువాత వారు పోర్చుగీసు ఉద్యోగులు, టోమ్‌పీరె, డూయర్టీ బార్బోసాలు. వీరు 16వ శతాబ్ది ప్రథమ పాదమున దక్షిణ హిందూ దేశమునకు వచ్చిరి. వారి వ్రాతలు ఆంగ్లమున ప్రచురించినది హుక్లుయట్ సొసైటీ. మనకు వలసిన పాలనా చరిత్ర కుపకరించినవి వీరి వ్రాతలలో అల్పాల్పము. కాని ఉన్నంతలో అవి రెడ్డిరాజయుగ జీవనమును సరిగ నెఱుగ తోడ్పడును. వాని సాయమున దేశీయ వాఙ్మయము, అందును నాటి తెలుగు కావ్యముల వలన దెలియనైన సంఘ ధర్మ విశేషముల పెక్కింటిని సమర్థించి స్థిరీకరించుటకు వీలైనది. ఇట్లే పాంథవృత్తాంతములు చాల విలువగలవి. ఇతరాధారముల వలన తెలిసిన విషయముల పూరించుటకును వానియందు లభించని నూత్న విషయములను కృత్తుగ తెలియుటకును ఇవి చాలగ ఉపకరించినవి.

## లోక కథలు (పురావృత్తములు)

గద్యగనో పద్యముననో ఏదేనొక స్థలము వ్యక్తి కుటుంబముల గూర్చి అనూచానముగ తెలియనగు గాథలు ఈవర్గమున చేరును. అట్టివి వెలుగోటి వారి వంశ చరిత్ర. చాటుకృతులు, మెకంజీవ్రాత ప్రతులు, స్థానిక వృత్తాంతములు (Local Records) పురాతన ప్రభువంశముల బిరుదావళులు మొదలగునవి.

## వెలుగోటి వంశ చరిత్ర

ప్రాచీన రేచెర్ల నాయక సంతతి వారు వెలుగోటి వారు. వీరి వంశ చరిత్ర నిటీవల రచించిన వారిర్వురు పండిత కవులు - వెల్లాల సదాశివశాస్త్రి, అవధానం శేషశాస్త్రి గారలు, ఆవంశీయుడగు యిప్పటి వేంకటగిరి ప్రభుపోషణ నున్నవారు. రేచెర్ల నాయక వంశీయులలో పలుశాఖల వారి యధీనమున లభించు ఆస్థాన లేఖనములు (Slabe Records) ఆ వంశము వారి పూర్వ శాసనములు, వెలుగోటి వారి వంశావళియను పద్యసంకలనము - యివి వెలుగోటి వారి వంశ చరిత్రకు గల యాధారములు. రేచెర్ల వారి ప్రాచీన శాసనములు కొన్ని యీగ్రంథమున ప్రకటితములు. ఇవియూ శాసనముల చూచి వ్రాతలేగాని ఆ శిలాశాసనముల అనుబంధముగ

ముద్రాంకనముల శోధిత ప్రతులు గావు. ఆ పని మిగిలియే యున్నది[11]. ఉన్నయీ ప్రతులనున్న చారిత్రకాంశములు కొద్దియే.

వంశానుగతులు వందిమాగదులు భట్రాజులు తమతమ ప్రభువుల దానశౌర్యములను ఔచిత్యమెఱుగని అతిశయోక్తుల నింపిపాడి స్తోత్రపాఠముల గూర్చిన పద సంకలనము "వెలుగోటి వారి వంశావళి" మనకాధార గ్రంధము కాకతప్పదు[12]. వారిని పొగడునిట్టి లోక కథలు తరము తరమునకు పేరు కొన్నవి. అతి శ్రద్ధగ భద్రపఱచి యున్నవి. వానిలో స్తుత్యుడు ఎందునకును కొఱగాని చిన్ని దుర్గపాలకుడా, ప్రబల మండలాధిపతి యాయన్న మాటేలేదు. ఇర్వురును ఒకే త్రాసున సరితూగ వలసినదే. ఈపద్యములలో రేచెర్ల నాయకులచే హతులు రపాజితులన్న నాయకులనధికాధికులు గుర్తింపరారు. వేరు సమర్ధనము లేనందున నీ వంశావళిలోని విషయములను యధామూలముగ గ్రహించవలెను. దీనికి తోడు యీ పద్యములలోని విషయసందిగ్దత ఇంతింతనలేము.

ఒక నాయకుని విక్రయము లింకొకనివిగ వర్ణించినవి, అవే విక్రయముల వేర్వేరు తరముల వారికి నిరూపించునవి యీ పద్యములలో ఎన్నియో. అయ్యును ఆ వెలుగోటి వారి వంశచరిత్రము అందలి అనుబంధముల పేర్కొన్న శాసనములును గాక ప్రాక్తన రేచెర్ల నాయక చరిత్రకు మూలము వేరేదియులేదు.

## చాటుకృతులు లేక చాటు పద్యములు:

చాటువులన ప్రియ వచనములు, పొగడితలు, తమతమ పోషక ప్రభువులను తగు వేళలనుతుల తనువుటకై ఆయాకవులు చెప్పిన కవితలు. ఒక వ్యక్తి యున్నచో, వాని కుటుంబము నెడలనో హృద్గతముగు మెప్పును తెలుపుటకో, కాక ఒకరులనుబ్బవేయుటకో, నిరసించటకో, కవులు చాటువుల చెప్పెడి వారని ఆ పద్యముల పరిశీలన తెలుపును. చాటువుల విషయమేదైనా నుండవచ్చును వెలుగోటి వారి వంశావళి యందలి పద్యములన్నియు నిట్టివే. సామాన్యముగ వీనిని వ్రాయువారు; తరతరములగనవి వాచా సంక్రమించును. నేడును శ్రీనాధుని చాటువు లెన్నియో జనాదృతములు ప్రచలితములున్నవి. ఆ కాలమున చాటువులకై శ్రీనాధునంతగా ప్రజాదరణ పొందిన

కవి మఱియెవ్వరును లేరు. చాటు కవితా విషయముల నతనికి లొచ్చుహెచ్చులు లేవు. విషయమెంత అశ్లీష్టమయినను సరే శ్రీనాధుని చేతులనది సువర్ణమేయగును. దేశమున బహుప్రదేశముల బహురాజ్యమునతడు పర్యటించినాడు. ఆయాచోట్ల నతడు చెప్పిన చాటువులు ఆనాటి భిన్నభిన్న జీవనదృశ్యముల ప్రతిబింబములు. తన పరిభ్రమణల నతడు పరికించిన వన్నిటికిని ప్రకృతి లక్షణములు జనుల అలవాట్లు ఆచారములు ఆహోర్యములు ఆది ఆసక్తికర అంతవములకు అతని చాటువుల నక్షరూపమిచ్చినాడు.

ఆంధ్రదేశమున నెన్నియో గ్రామముల పురాతన కాలపు రాజవంశముల చరితలు, మెకంజీ వ్రాతప్రతులు, స్థానిక విశేషముల సంపుటములలో మద్రాసు గవర్నమెంటు ఓరియెంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో భద్రపఱుపబడియున్నవి. వానిని సంకలించిన అపూర్వ వ్యక్తి మెకంజీకి దాక్షిణాత్యులు ప్రధానముగ ఆంధ్రులు, ఎంతయో ఋణపడి యున్నారు. కల్నల్ కాలిన్ మెకంజీ ఆంగ్లేయుడు. 1782లో అతడు ఇండియాకు వచ్చి ఈస్టిండియా కంపెనీ మద్రాసు ఇంజనీర్స్ చేరెను. ఆయుద్యోగమున నుండగనే అతడు దక్షిణదేశమంతయు పర్యటించినాడు. తానంతకు పూర్వమెందును చూచియుండని వశిష్టవాస్తు శిల్పకళా విన్యాసములతోడి దేవాలయములు యితర కట్టడములతనికి కనుపించినవి. ఎన్నియో శిలలు, ఏవేవో లేఖనములతో డివి స్థానిక లిపులకు భిన్నములైనవి అతని కంటబడినవి. అతడు తిరిగిన భూములనెల్లెడల అతని యుత్సుకత రేకెత్తించు నిట్టి దృశ్యములే. ఈ రహస్యములలో తన్ను కృతప్రేశుని జేయగల వ్యక్తికై అతడు వెదకసాగెను.

ఆ శ్రమ ఫలముగా మేధావియగు నొక బ్రాహ్మణ యువకుడు పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు వాసి కావలివేంకట బొఱ్ఱయ్య అర్వాచీనములనే గాక సంస్కృత హళెకన్నడములనున్న ప్రాచీన శాసనముల చదువు నైపుణ్యము పెంచెను. ఆ శాసనములను "అర్థంబద్ధం" గాని పురాణపు పిచ్చి గీతలుగ బ్రహ్మవ్రాతలుగ ఎల్లరును నిరాకరించు ఆరోజులలో బొఱ్ఱయ్య చూపిన కౌశలము అతి ప్రతిభాన్వితమును, అద్భుత ప్రజ్ఞయును, ప్రాచీన శాసనముల శోధించి వాని రహస్యముల వెల్లడించిన ప్రప్రథమ భారతీయ శిలాలేఖన పఠిత నిస్సంశయముగ కావలివేంకట బొఱ్ఱయ్యయే. మెకంజీ

వ్రాయుచున్నాడు. "భారతీయ విజ్ఞాన ద్వారమున నేనిడిన మొదటి యడుగు కావలి వేంకట బొఱ్ఱయ్య తోడి సంయోగము. అతడు యీ దేశీయుడు. బ్రాహ్మణ యువకుడు. (పాపమాతడు పిన్న వయసుననే గతించినాడు) అతని సద్యోగ్రహణ ధీశక్తులు అసామాన్యములు. తన సౌశీల్య సేమనస్యములచే అతడు వివిధ శాఖల వారిని తెగల వారిని తన పూనిన పరిశోధనా పద్ధతులకు సుముఖుల జేయగల్గను. భారతీయ భాషల లేశమేని ఎఱుగని నేను నాచిరకాలాభిలాషను సఫలము జేసుకొనగల్గుట ఆ ధీశాలి ప్రోత్సాహోపదేశముల మూలముగనే. శ్రీరంగ పట్టణము పట్టుకొన్న పిదప మాలో నెవ్వరును అచటి శాసన మండలి కన్నడమునే చదువలేక పోయిరి. కన్నడ, తమిళ శాసనములందరి పురాతన అప్రచలితాక్షరముల సైతము చదువుటలు అనువదించుటలు నేడు బహుళములు. ఇక సంస్కృత శాసనముల తడవ బనియేలేదు. నేనిండియాకు వచ్చిన క్రొత్తలో సంస్కృత జ్ఞానము లేశమైన నాకు లభించలేదు. స్వర్గీయ బొఱ్ఱయ్య మణి విభవ ప్రసారముతో భారతీయ విజ్ఞానము నార్జించుటకు నాకొక క్రొత్త మార్గము తెలిచినట్లాయెను. త్వరలోనే నేనతని కోల్పోయినను అతని ప్రమాణ (Examples) ప్రయోగములు అతని సహచరులకు శిష్యులకు అగమ్యములైనవి. ఈపద్ధతిని నూత్నశాఖయొకట అచింతితముగ నారంభమై క్రమముగ వృద్ధినందినది[13].
క్రీ.శ. 1810లో మెకంజీ మద్రాసు రాష్ట్ర ప్రధాన మాపికుడు (Surrey or General) అయ్యెను. కాని మరువత్సరమే అతడు జావాలో ఇంజనీర్స్ అధినాయకుడుగ (1811-15) నియమితుడై వెడలిపోయెను. 1816లో మెకంజీ హిందూదేశ ప్రధాన మాపిక పదవి నధిష్ఠించెను. తరువాత అయిదేండ్లకు 1821లో అతడు కలకత్తాలోమరణించెను. పురావృత్తముల శాసనముల సంకలించు క్షేత్రమున మెకంజీ యొక్క క్రియాకారితను అతడు సాధించిన ఫలితములను లార్డ్ వెలింగ్టన్ కన్న చక్కగ కొనియాడగాదు. ఇండియన్ హిస్టారికల్ రికార్డు కమీషన్ ఆరవ సదస్సు 1924లో మద్రాసులో కూడినది. అప్పటి మద్రాసు రాష్ట్ర గవర్నరుగ ఆ సదస్సును ప్రారంభించుచు అతడిట్లు ప్రసంగించెను - కల్నల్ కాలిక్ మెకంజి ప్రధాన భూమాపికుడు తన జీవయాత్ర ముగించు పూర్వము తన 38 ఏండ్ల పదవీకాలమున ఉద్యోగ విధులకు పోగా మిగిలిన సమయము నంతటిని యిండియాలో ముఖ్యముగ కృష్ణానదికి దక్షిణమున గల భూములందలి లోకకథల వ్రాతప్రతులను, ఇతిహాసము, నృపవంశచరిత

(Ethmology) సాహిత్యము పరంపరాగత వృత్తములకు సంబంధించిన వానిని, సంకలించుటకు వినియోగించెను. అతడు సంతరించినవి.. 1568 వ్రాతప్రతులు, సంస్కృత, తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ, యురియా, మహారాష్ట్ర, హిందీ, పర్షియన్, అరబిక్, హిందూస్థానీ (ఉర్దూ) జాపనీస్ బర్మన్ భాషలవి. ఇదిగాక ఇతిహాస నృవంశ చరిత సంబంధించి 2070 స్థానిక లఘు లేఖనములు, 8076 శాసనములు, 70 నిర్మాణ పటములు, 2630 చిత్రలేఖనములు, 6-18 నాణెములు. 106 విగ్రహములు, 40 పురావస్తువులు నూరేండ్లకు మునుపు అప్పటి ఇండియా గవర్నర్ జనరల్, మార్కిస్ ఆఫ్ హేస్టింగ్స్, పై సంచయము నంతటిని 10,000 ఫౌండ్లకుకొని, దానిలో చాలాభాగమును - సంస్కృత, అరబిక్, పర్షియన్, జపనీస్, బర్మన్ గ్రంథములను నిర్మాణపటములుగా నాణెములు విగ్రహములు శిల్పఖండములను ఇంగ్లండు కంపివేసెను. కాని దక్షిణయిండియా భాషలలోని పుస్తక, స్థానిక లేఖనముల 5,31,255 టిని 8000 శాసనములను మద్రాసు ప్రభుత్వపరము జేసెను. వీనిని మొదట కాలేజి లైబ్రరీలోనుంచి ఆ తరువాత 1830లో మద్రాసు లిటరరి సొసైటీకి, పిదప 1836లో వానిలో ప్రచురణ యోగ్యము నిర్ణయించుటకై రెవరెండ్ విల్లియమ్ టేలర్‌కు అప్పగించిరి. టేలర్ 5 నివేదికలను మద్రాసు జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్‌లో ప్రకటించి అప్పటికే ఉపయోగించిన సిరాచెఱిగి, వ్రాసిన పత్రములు జీర్ణములయి పోవుచున్నందున వానిని ఉద్ధరించుట నారంభించెను.

ఆపై మఱేమియు జరుగలేదు. 1846లో అవియన్నియు తిరిగి కాలేజి లైబ్రరి జేరినవి. 40 సంవత్సరముల తర్వాత ఆ సంచయమును గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీకి మార్చిరి[14]. ఈ సంచయాన్నిపుడు మెకంజీ మాన్యుస్క్రిప్ట్స్ అని వ్యవహరించు చున్నారు. పిదప కొంతకాలమునకు తెలుగు భాషా సాహిత్యముల కెనలేని సేవజేసిన సి.పి. బ్రౌను ఈ వ్రాతప్రతులలో కొన్నింటిని శుద్ధప్రతివ్రాయించి సంపుటములుగా నిబంధించినాడు. వానినిపుడు లోకల్ రికార్డ్స్ లేక కైఫియత్‌లనుచున్నారు. గుడికట్టులెక్క, దాని సవిశేషప్రతి, దండకవిలె యివిరెండును గ్రామ, సీమ (తాలూకా)ల సంబంధించిన లెక్కల పుస్తకములు, అవియు రాజ, రాజవంశ, నాయక బిరుదావళులును చారిత్రక సామాగ్రిగా న్యూనములుగావు.

తరములబడి సంచితములీ లెక్కపుస్తకములు గ్రామసీమల పాలనా విశేషము లెన్నిటినో తెలియజేయును. ఉదా : గ్రామకర్మ చారులు, గుడులు గోపురములు, వ్యవసాయము, నీటివనరులు, చేతిపనులు యిత్యాది సీమలెక్కలకు మంచి నిదర్శనము. కొండవీటి దండకవిలె. కవిలె, (నీలపటపు వర్గు) లెక్క పుస్తకము. "దండ" పదము "దండు" నకపభ్రంశమని తోచును. పేరును బట్టి చూడగా నివి, ఒరిస్సా గజపతుల కాలమున పొడసూపి యుండును. వారు దేశమును సైనిక పాలనా విషయములుగ - "దండపాదులు"గవిభజించినారు. అట్టివానిలో నొకటి కొండవీటి దండపాడు. దండకవిలెలు గజపతుల కాలముననే వ్యవహారములోనికి వచ్చినను, వానిలో తత్పూర్వపు నాటి పుస్తకములలో భద్రపఱచియున్న విశేషములన్నింటిని ఉటంకించి యుండును. కావుననే అందు గజపతి పాలనా త్పూర్వపు సీమ లెన్నియో పేర్కొనబడినవి.

బిరుదావళికి అందుగల వెంకన్న వ్రాసిన "రామరాజీయము" ఒక చక్కని యుదాహరణము. 15వ శతాబ్ది వాడగు విన్నకోట పెద్దన తన "కావ్యాలంకార చూడామణి"లో బిరుదావళిని "బిరుద ప్రబంధమన్నాడు. ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో కాకతీప్రతాపరుద్రుని సేవించిన డెబ్బది యిద్దరు నాయకుల బిరుదావళులతోడి యొక తెలుగు లేఖనమును చూడవచ్చును. ఇది మధ్యయుగమున తీరాంధ్రదేశమున కాకతీయుల తర్వాత హిందూధర్మ సంస్కృతులకు ప్రధాన రక్షకులగు రెడ్డిరాజుల చరిత్ర పునర్నిర్మాణమునకు ఆధార సామాగ్రి వివరణము.

1. D.C.S. M (Madras) No. 12794, PP 8604-05 (F)

2. J.O.R. Vol V, PP 128 FF

3. శివలీల (పీఠిక) - ఈ4 గంధము III భాగమున VIIవ ప్రకరణ అనుబంధము.

(5) కాశీఖండము ఆ vii, పద్యం 2 8 0

(6)

(7) భీమ.పురా. V అ పద్యములు 7 5 - 8 5

(8) I.C. Vol V P. 261

(10) విదేశీ యాత్రికుల వ్రాతలను చక్కగ

(11) రేచర్ల నాయకుల అధ్యమండలం తెలంగాణాలో చాల విస్తృత భాగము. అందలి శాసన సంపదను సక్రమంగా వెదకి వెల్లడింత లింకనుగాలేదు. మన చారిత్రక విషయ సంపత్తిని దెల్పు శాసనము లెన్నియో హైదరాబాదు మండల భూగర్భముననే ఉన్నవి. అవృత్తాంతములు తెలియకనే ఘటించిన చరిత్ర పూర్ణముగా సాకల్యముగ నుండనేరదు. తెలంగాణాలోని ఆసామాగ్రి నంతటిని వెలిదెచ్చి సక్రమము నిబంధించు వరకు అనుబంధముల నిచ్చిన విశేషములే మన కాధారములు.

(12) నిజానికి యీవందిమాగధ సంస్థయే మధ్యమముగ చరిత్రనంత వైభవోజ్జ్వలము చేసినది. పేరు మోసిన ప్రతి సేనాధీశుడును ముఖ్యసామంతులును తమతమ వందిమాగధుల పోషించుచుండిరి. శుభావసరములందు తమతమ పూర్వుల కీర్తినుగ్గడించుటయు, వారి విక్రయముల బాడుటయు, కొలువుదీరుటకు లోక సమక్షములకు తమరాకను ఘోషించుటయు వందిమాగధుల విధులు. పూర్వము నుండియు తెలుగు రాజసభలలో యీమర్యాద పాటింపబడినదని యూహింపనగును.

(13) J.R.A.S. (Old Series) Vol IPP 141 ff

(14) Processing

# అధ్యాయము - II

# తెనుగునాట రాజకీయములు

రెడ్డిరాజ చరిత్ర క్రమమును పొరుగు రాజ్యములతో వారి సంబంధములను చక్కనెరుగుటకు కొండవీటి రాజ్యారంభ కాలమున తెలుగనాట రాజకీయముల తీరుతెన్నుల నరయుటవసరము.

క్రీ.శ. 1323 లో వరంగల్ పతనానంతరము ఆంధ్రదేశము ఢిల్లీలోని తుఘ్లక్ సుల్తానుల యధీనమైనది. తమకు జిక్కిన యీనూతన రాష్ట్ర పాలనకై వారు అమీరుల, మాలికుల, తదితరోద్యోగుల నియోగించినారు. దేశము లోనికీలక స్థానములందంతటను వారి సైన్యములు నెలకొన్నవి. సహజముగనే పరిపాలన సైనికమైనది. రైతులపై తగని పన్నులు విధించి వానిని అతి కఠినముగా దండుకొనుటారంభమైనది. ధనికుల నుండి ఆవిమర్శముగా సంపదల గుంజుకొన్నారు. గో బ్రాహ్మణ హత్యలు తరచయ్యెను. పూర్వపు రాజులు బ్రాహ్మణ విద్వాంసుల కిచ్చిన అగ్రహారముల హరించిరి. వారి క్రతు క్రియాదికములు నిరోధింప బడినవి. దేవాలయములమైల పరచుట, విగ్రహముల విరచుట, మద్యపానము, గో మాంస భక్షణము, అవిరతకామనిరతి, బ్రాహ్మణ హింసనములు, ముసల్మానుల నిత్యవిధులైనవి(1). ముస్లింపాలన మఱి దూష్యము భీషణమునైనది. ముస్లిం ఉద్యోగులు హిందువులపై, వారి ధర్మముపై సర్వధాయుద్ధమునే ప్రకటించి రాయనిపించినది. విలస తామ్ర శాసనము(2). అది ఒంటిదే అయినను ముస్లిం ఆధిపత్యమున నాటి తెలుగు దేశమందలి భీభత్సమును కన్నుల గట్టినట్లు వర్ణించినది. వారి క్రూర అమానుష చర్యలు బాధితులగు హిందువులందు ప్రాణముల నొడ్డియైన, తమ ధర్మమును ప్రధానముగా దాని భౌతిక, ఆధ్యాత్మిక సంపదలకు వ్యక్తప్రతీకలగు గో బ్రాహ్మణుల, పరిరక్షించుకొను నుత్కంఠను పెంపొందించు హిందూ సంఘక్షేమము వ్యవసాయ మూలము, దానికి గోవును, నాటి వారు నమ్మినట్లు వైదిక యజ్ఞయాగాదిక్రతువుల సక్రమ నిర్వాహణమున నొదవు సకాల వర్షమును ఆధారములు. ముస్లిం పాలకుల దుష్టనీతి హిందువులను క్రోధోద్రిక్తులజేసెను. దేశమందంతటి తీవ్రమగునశాంతి ప్రబలెను. అతిపీడాకరమగునారాజకీయ దాస్యవిముక్తికై హిందువులందైక్యము సమకూడెను.

సంక్షుబ్ధులగు హిందువులు ముస్లింపాదాక్రాంతులుగా చిరకాలముండలేదు. వారివిమోచనోద్యమము తీరాంధ్రమున తల యెత్తెను. అందలి నాయకులెల్ల రొక్కుమ్మడిని విజాతి పాలనను పోద్రోసి హైందవాధిక్యమును పునరుద్ధరింప పూనుకొనిరి. కాకతీయులలో చివరి రాజగు ప్రతాపరుద్రుని కదసేనా పతిత్వము నెఱపి శేషించిన వృద్ధ నాయకులు కొలని ప్రతాప రుద్రదేవుడు అన్న మంత్రి యీస్వాతంత్ర్యోద్యమమునను దాని భాగధేయము చక్కబెట్టమునుకొనిరి. ఈసంయోజనమునకధిపతిగ వారు ముసునూరి వంశ్యుడగు ప్రోలానాయకునెన్నుకొనిరి. తీరాంధ్రమున శక. 1247 (క్రీ.శ. 1325) నుండి హిందువుల శాసనములు(3) మరలతలసూపుచున్నందున అప్పటికి ఆనాయకుల తిరుగుబాటు సఫలమై ఆంధ్రమండలము విజాతీయులనుండి విడివడినదనుట సమంజసము.

ప్రోలా నాయకుని నాయకత్వమున తీరాంధ్రమగీకరించెను. బహుశః అందలి ప్రభువులందరును అతని యాజ్ఞలను సభక్తికముగా పాలించియుందురనవచ్చును. తూర్పు గోదావరి జిల్లా భద్రాచల పరిసరములలో నదికి సమీప స్థలమగు రేకపల్లి అతని రాజధాని. వేదశాస్త్రాధ్యయన పోషణమును, వైదికయజ్ఞ ప్రోత్సాహనమును, ముస్లిం పాలనమున తమ అగ్రహారముల గోల్పోయిన బ్రాహ్మణులకు వాని ప్రత్యర్పణమ్మును ప్రోలయ నిర్వర్తించెను. ముస్లింలు అన్యాయముగ విధించిన పన్నులు నివర్తింపబడినవి. ప్రాచీన ఋషులు తమ తపఃఫలమున షష్ఠాంశమును రాజులకర్పించి నరీతిగనే రైతులు ప్రోలానాయకునికి తమ ఆలయమునుండి శాస్త్ర విధిత భాగమును కరముగ (పన్నుగ) నిచ్చుకొనిరి. ముస్లిం పాలకులు పేర్చిన అవ్యవస్థ నెల్ల తొలగించి ప్రోలానాయకుడు రాజ్యమున నీతినయమము మరలనెలకొల్పెను.

తీరాంధ్రనాయక విజయములచే నుత్సాహితులై పశ్చిమాంధ్ర (రాయలసీమ) ముమహమ్మద్ తుఘ్లక్ ప్రతినిధిగ కంపిలినుండి తమ్ము పాలించుచున్న మాలిక్ నెబి(4) కెదురు తిరిగెను. సోమవంశ క్షత్రియుడు ఆరవీటి చోళుక్య సోమదేవరాజు నాయకుడుగా ప్రజలు నెబీపాలనమును స్తంభింపజేసిరి. నెబీపలాయి తుడుకాగా మొసలి మడుగు, సాతానికోట, కందనవోలు (కర్నూలు), కల్వకొలను, రాచూరు (రాయచూరు), ఎతగిరి, గంగినేనికొండలను హిందువులు చేజిక్కించుకొనిరి. ముస్లిములను

తిరిగికొట్టుటలో ఎన్నియో యుద్ధములు ఆనెగొంది, ముదుగల్లు,(5) తక్కితర ప్రదేశములెన్నియో జరిగినవి. పైపేర్కొన్న తావులు సోమదేవసమరవిహార భూమివిస్తృతి తెలియనగును. అతడుకొన్ని దుర్గములు, గెవిచిన యుద్ధములు పరికించినచో ఇప్పటి హైదరాబాద్ సంస్థానమును దక్షిణభాగ మధికారమతని యధీనమైనదనవచ్చును. తన బందుగులు సామంతనాయకులు దుర్గాధి పతులై ఆయాదుర్గములను తమ తమ వశమున చిర కాలము నిల్పుకొనిరి. పశ్చిమాంధ్రమిట్లు క్రీ.శ. 1328 - 29 ప్రాంతములలో ఢిల్లీ సుల్తానుల చెయిజారి పోయినది.

ప్రోలయనాయకుడును వాని పినతండ్రి కొడుకు కాపానీడు లేక కాపయ నాయకుడును తీరాంధ్ర విజయములతో తృప్తిపడలేదు. వారి ఏకైకాభిలాష, లక్ష్యము ఆంధ్రదేశమంతటినీ ముసల్మానుల యధికారన్మూలించుట. కాని యిందాతడు సఫలమైనట్లులేదు. అతడట్లు ధ్యమించెననుటయు నిస్సంశయము కాదు. వరంగల్ ప్రతిఘటనా ఘట్టముల ముస్లిం చరిత్రకారులెవ్వరును, ప్రోలయను పేర్కొన్నదిలేదు. కావున నతడు నచిరకాలమునకే మరణించెననవచ్చును.

తీరాంధ్రనాయకుల ఆధిపత్యము కాపయనాయకునికి సంక్రమించినది. అతడిపుడు వరంగలు ప్రాదేశికులగు హిందువుల తోను, ద్వారసముద్రాధిపతి మూడవ బళ్ళాలుని తోను రహస్యమంతనములు సాగించెను. తత్ఫలిముగా శక. 1258 - 59 లో (క్రీ.శ. 1336-7) కాపనీన నాయకత్వమున వరంగల్ హిందువులు తూర్పుకనుమలకెగువ తెలంగాణాలోని ముస్లిం పాలకులనెదుర్కొనిరి. ముస్లిములు కాందిశీకులై, వరంగల్ హిందువుల వశమాయెను. తెలంగాణాలో హిందూ స్వాతంత్ర్యము పునరుజ్జీవించినది. ఈసామీ పేర్కొన్న కాపనీడు బరని వర్ణించిన కన్యానాయకుడు, అజీజుల్లా తబా తబా యొక్క కాబా నాయందు , ఫెరిస్తా ప్రస్తుతించినకంబా నాయక లేక కృష్ణనాయకుడు- ఆయొక్క వరంగల్ విప్లవనాయకుడుగా వారు చిత్రించిన కాపయనాయకుడు ముసునూరి వంశ్యప్రోలయనాయకుని తమ్ముడు ఈవిజయములతో వరంగల్ కాపయనాయకు రాజధాని యైనది.

కాపయయిపుడు "ఆంధ్రదేశాధీశ్వర" "ఆంధ్రసురత్రాణ బిరుదముల దాల్చెను.

కాకతీయ ప్రభువు నానువంశికముగ కొలుచు డెబ్బది అయిదుగురు నాయకుల సంతతులు కాపయయనులాయుర్రైరని అనితల్లి కలువచేరు శాసనము తెలుపుచున్నది[6]. ఆనాయకులందరును కాపయ అధినాయతను మన్నించుచునే యెప్పటిరీతిని తమ తమ యధీనములను స్వతంత్ర్యముగ పాలింప సాగిరి.

విదేశీయుల బారినుండి ఆంధ్రదేశ విమోచనముతో అందలి వివిధ విభాగాధిపతుల యపేక్షా, భావ సంస్థితులందు మార్పు తలసూపినది. వారినింతకొకటిగా గుదిగ్రుచ్చినది పారతంత్ర్య విమోచనాకాంక్ష. అది సిద్ధించుటతో వారితో నొకటి సంధానించు ఆశయశక్తులు సన్నగిల్లినవి. ఢిల్లీ చక్రవర్తికి ప్రతిగా వారియద్భుత జయము వారికాత్మ విశ్వాసము, ఆత్మనిర్భరత, స్వతంత్ర్య ప్రవృత్తులను పెంపొందించుట ఆశ్చర్యము కాదు. కానీ ఇవి త్వరలోనే దుర్మానాభి నివేశములుగా మారి పరస్పర భేదములు, ఛిద్రములు తలెత్తినవి. ప్రతియొకడను తన శక్తిని చాటి పొరుగునాయకుల మండలములపై దురాక్రమణ కొడిగట్టెడివాడే. ఫలితముగా చిన్ని చిన్ని మండలములు స్వతంత్ర్య రాజ్యములై, వానివాని స్వేచ్ఛ విశృంఖలతమై, మరేమి సాధించకున్నను వారలలో ఐకమత్యమును దుసాధ్యము చేసినది. కాపయ ఆంధ్రమున తన అధినాయకత్వమును కోలుపోయినాడు. అతని రాజ్యము, తోడి మండలములలో తానునొకటి యయ్యెను. కాకతీయుల యనంతరము కొలది కాలమునకే ఆంధ్రమీ గతిగ తీరినది.

ఆంధ్రమున రాజ్యములెన్ని అయినను వానిలో కొన్ని ప్రముఖములు లేకపోలేదు. ముసునూరునాయకుల వరంగల్లు, పద్మ వెలమల రాచకొండ, యాదవక్షత్రియుల విజయనగరము, పంటుకుల రెడ్లకొండవీడు అట్టివి. అవికాక కొంత ఎన్నతగిన చిన్ని రాజ్యములు మంచికొండనాయకుల కోరుకొండ, కొప్పుల వారి పిఠాపురమున వీనికీశాన్యముగ నున్నది చిరాగతమగు తూర్పుగాంగుల కళింగరాజ్యము.

## వరంగల్ రాజ్యము :

మనుసూరి వంశ్యులు ప్రోలయకాపయ నాయకులు వరుసగా తీరాంధ్ర తెలంగాణముల విమోచనమును, దక్కన్ స్వాతంత్ర్య సమరమున వారు నిర్వహించిన

గురుతర పాత్రమును నా A for gotten chapter in Andhra History (ఆంధ్రచరిత్రలో నొకవి స్మృతప్రకరణము) లో వివరించి యున్నాను. ఆ లఘుకృతి నిజముగ యీ రెడ్డిరాజ్య చరిత్రకు ఆ ముఖము. కావున కాపయచే జయింపబడిన యీపై వరంగల్ చరిత్ర నిందు స్థూలముగ ప్రస్తావింతును.

కాకతీయుల రాజ్యము పశ్చిమమున కౌలాస్ బీదరుల నుండి తూర్పున బంగాళాఖాతము వరకు విస్తరించి యుండినది. అందు అధిక భాగము కాపయకు 1336-37 దక్కెను. కానీ ఆ పదము గాని సింహాసముకానీ తనకు స్థిరములని యాతడూహించజాలడయ్యెను. మహమ్మద్ తుఘ్లక్ తెలంగాణమును మరల జయింపనే క్షణమైన తలపెట్టవచ్చును. అప్పటికి దక్కనులోని సెంచూరియన్స్ (శత + అనీకులు) తుఘ్లక్‌న కెదురు తిరిగి యుండిరి. కాపయ వారలతో చేతులు కలిపి వారిలో ముఖ్యదళవాయి జాఫర్‌ఖాన్‌కు తోడ్పడుటకై పెద్ద సైనికదళమును పంపెను. అట్లు పేర్చిన బలముతో సెంచూరియనులు చక్రవర్తి సైనికుల నోడించి తఱిమివైచి, జాఫర్ రాజుగా నొక స్వతంత్ర ముస్లిం రాజ్యమును వరంగల్ పొరుగున స్థాపించుకొనిరి. క్రీ.శ. 1347 లో జాఫర్‌ఖాన్ అలాయుద్దీన్ హసన్ గంగూ బహమన్‌షా యన్న బిరుదముతో గుల్బరాలో సింహాసన మధిరోహించెను. అట్లు స్థాపించబడిన బ్రహ్మాన్ రాజ్యము దక్షిణదేశ చరిత్రలో నూట యిరవదేండ్లుపైగా ప్రధానమగు పాత్రను నిర్వహించినది.

జాఫర్‌ఖాన్ (అల్లాయుద్దీన్ హసన్‌షా) నందుంచిన నమ్మకము అపాత్రన్యస్తమని వాని కొసంగిన సైన్య సహాయము విపథము ద్రొక్కినదని కాపయ త్వరగానే గ్రహించెను. బహ్మనీ ప్రారంభము నుండియు అలాయుద్దీన్ పొరుగు హిందూ రాజుల తలపడి వారిని తన యధీనుల జేయుటకును వారి రాష్ట్రముల నాక్రమించుటకు సమకట్టెను. అతని యుద్ధతికి కాపయరాజ్యము గూడ నగ్గముకాక తప్పలేదు. హిందూ రాజ్యవికాసముకై వ్రతము పట్టిన ముస్లింనేత పొరుగున వర్థిల్లగా కాపయతానై తీరాంధ్ర వ్యవహారములపై తగు శ్రద్ధ జూపజాలనందున అందు జ్ఞాతి లూగుతోయ్యేటి అనవోతా నాయకుని తన వ్యవహర్తగ నియమించెను. తీరాంధ్రమున కాపయ చివరి శాసనము శక. 1268 (క్రీ.శ. 1346) నందగుటయు తొయ్యేటి అనవోతానాయకుని

ప్రధమము శక 1269 (క్రీ.శ. 1347) కి చెందుటయు అనపోతానేని రాజ ప్రతినిధిత్వ ప్రారంభమును సూచించును.

సింహాసన మధిష్ఠించిన కొలది కాలమునకే అలాయుద్దీన్ తెలంగాణాపై దండెత్తెను. యుద్ధమున పరాజితుడైన కాపయ అతని కేలాసదుర్గమును దాని యధీన ప్రదేశముల నతని కర్పించి సంధి గావించు కొనెను. ఈ ఓటమి కాపయ శక్తి ప్రతిష్ఠల క్రుంగదీయగా తీరాంధ్రముపై అతని యధికారము ముట్టగించినది.

ఢిల్లీలో మహమ్మద్ బిన్‌తుఘ్లక్ మరణించెను. ఆవలన నిర్భయుడై అలాయుద్దీన్ దక్షిణాయన ఢిల్లీ సుల్తానుల పాలనయందు పూర్వమున్న రాష్ట్రములనన్నిటిని తిరిగి జయింప సోత్సాహుడాయెను. శక. 1278 (క్రీ.శ. 1356-57) ప్రాంతమున కాపయకతని తాకిడి రెండవ మారు. కాపయ తన రాజ్యభాగమీ వరకే అలాయుద్దీన్ కప్పగించి యుండినను, అతనికి సామంతుడై ఏటేట కప్పమీదయ్యేనన్నది కారణము. ముస్లిం చారిత్రికుల వ్రాతలబడి యీమారును అల్లాయుద్దీన్ దే విజయము. కాపయనతిఘోరముగ నోడినాడు. ఏటేట అతడు ఢిల్లీ సుల్తానుల కిచ్చుచు మానిన కప్పమునతడిపుడు అల్లాయుద్దీన్ కీయ నంగీకరించుటే గాక భోనగిరి (త్రిభువనగిరి) దుర్గమును కూడ ఇచ్చుకోవలసి వచ్చెను. నాటి నుండి భోనగిరి బహ్మ రాజ్యమునకు తూర్పు టెల్ల అయినది. క్రీ.శ. 1359 లో అల్లాయుద్దీన్ బహ్మన్‌షా గతించెను. కాపయ విజయనగర రాజ సహాయ్యమున తనగోల్పోయిన భూముల పునఃప్రాప్తికై ప్రయత్నించెను. అతని కొడుకును, వెలంపట్టణాధిపతి యునగు వినాయకదేవుడు[7] కాపయ పంపున భోనగిరి పట్టుకొని, కౌలాసను గూడ పునఃగ్రహింప సన్నహించుచుండెను. ఇది తెలిసి అలాయుద్దీన కుమారుడు సుల్తాను మహమ్మద్‌షా వెలాం పట్టణమునకు హుటాహుటిన వెడలి ఆ కోటను ముట్టడించెను. వినాయకదేవుడు అంతర్దుర్గమున తలదాచుకొనగా చివరకు దానిని విడయగొట్టి మహమ్మదుషా వినాయక దేవుని పట్టి వానిని సజీవముగా దహించెను.

తనయుని యెడనీయమానుషఘాతుక చర్యకు క్రోధావేశ వివశుడై కాపయ ఢిల్లీ సుల్తాన్ ఫిరోజ్ షాను బహ్మన్ రాజ్యమును పాతివేయ నభ్యర్థించెను. బదులుగ తాను దక్కన్ నంతను మళ్ళీ ఢిల్లీ సుల్తానుల వశము చేయదృఢముగ యత్నింతుననెను.

ఈ వేడికోలు ఫలవంతము కాలేదు. కాపయ పన్నిన వ్యూహము తెలిసిన మహమ్మద్‌షా తెలంగాణా పై దండెత్తి ఆ భూమినంతనటిని ఉధ్వసింపగా (శక. 1288/క్రీ.శ. 1366) నిలువదొక్కుకొనలేక కాపయసుల్తాను శరణువేడెను. తత్ఫలితముగా సుల్తాన్ కతడు గిరిదుర్గము గోల్కొండను శాశ్వతముగ నిచ్చి, యాపై పరిహారముగ 300 గజములను, 2000 ఆజానేయములను, 3 లక్షల రూప్యములను సమర్పించుకొనెను.

బహ్మన్ వరంగల్ రాజ్యములకు గోలుకొండ మధ్యమ అవధియయ్యెను. వరంగల్ తన యీ మర్యాద పాటించునంత కాలము ఆ రాజ్యమునకాయాసము కల్గించరాదని మహ్మద్‌షా 1 తన వారసులకు కట్టడి చేసెనట. ఈ సందర్భమున కాపయ ఒక పచ్చల పొదిగిన రమ్య సంహాసనమును తఖ్త్-యి-ఫిరూజాను బహూకరించెను.

కాపయ బహ్మనుల తోడి తగులాటల జిక్కియుండగా అతని ఆంధ్ర నాయక సంయోజనాధిపత్యమును త్రోసి రాజని రేచర్ల సింగమ నాయకుడు తన రాష్ట్ర విస్తరణకై సన్నాహించెను. శక. 1283/క్రీ.శ. 1361 లో సింగమ మరణింపగా అతని కొడుకు అనపోతానాయకుడు తన తమ్ముడు మాదానాయకుడును అతని కొడుకు వేదగిరి నాయకుడును వెంటరా ఉత్తరము దేస దండెత్తి పోయి తెలంగాణాపై ఆధిపత్యనకై కాపయుతో తలపడెను. ఇప్పటి వరంగల్ జిల్లాలో భీమవరమున జరిగిన ఆ ఘోరయుద్ధమున కాపయపరాజితుడను హతుడయ్యెను. (శక. 1289-90/క్రీ.శ. 1367-68). తెలంగాణాలో మునుసూరు పాలన మీగతి అకాండముగ నస్తమించెను.

## రాజుకొండ - దేవరకొండ రాజ్యము

రాజుకొండ దేవరకొండ రేచర్ల నాయకులు పద్మవెలమలు. వారు గణపతి దేవుని నాటనుండి వరంగల్ కాకతీయ ప్రభువుల సేనాపతులుగ నుండి శక్తి ప్రఖ్యాతులనార్జించిరి. వారి చరిత్ర విశిష్టముగ కాకతీయానంతరము వర్ధిల్లినది. రాజుకొండ (రాజాచల) దక్షిణ భూములలో గన్న విజయములతో సింగమ నాయకుడు వైచిన పునాదులపై వారి ప్రభుత నిర్మించినతడు సింగమ కొడుకు అనపోతనాయకుడు 1 రేచర్ల వారి భూములలోని రాజుకొండను రాజధానిగా నిలిపి అనపోత నాయకుడు దానిని పరిఖలతో ప్రాకారములతో కూపతటాకాదులతో

బలిష్టములగు కోటగోడలతో దుర్భేద్యమొనర్చెను.[8] అతడు రాజ్యముకు వచ్చినది క్రీ.శ. 1361లో అతని అయినవోలు శాసనమానాటిదే. అప్పటి నుండి వరంగల్ తన ప్రాధాన్యమును గోలుపోయెను.

అనవోతడు దేవరకొండలో తన తమ్ముడగు మాదానాయకుని నిలిపెను. అతడా పట్టణమును దాని పరిసరాధీనములను పాలించుకొనసాగెను. నాటి నుండి దేవర కొండ మాదా నాయకుని అతని సంతతి వారికి రాజధాని రాజుకొండ అతని సోదరుడగు అనంతా నాయకుని అతని సంతతి వారికి రాజధాని దేవరకొండ రాజ్యము, రాజుకొండ రాజ్యము అంతర్భాగమే. ఆ రెండూ శాఖల వారూ రెండు రాష్ట్రములను స్వతంత్రములుగనే పాలించు చుండినను, వైరి ఆ రాజుల తోడి వ్యవహారములందును తమ రాజ్యముల పరి రక్షించు కొనుట యందును పరస్పరము పూర్ణముగ సహకరించి ఏక రాజ్యముగనేమెలగిరి. రేచర్ల నాయక చరిత్రలందు ఆ రాజ్యము అనవోత మాదానాయకు లిర్వురికిని విభక్తమనియున్నను, ఆ విభజన దేశపాలనా సౌష్టవమునకగు సమాధాన వ్యవస్థయేగాని, ఏమాత్రమును రేచర్ల రాజ్యప్రాభవ శక్తులను కుంచించునది గాదు.

తెలంగాణా రేచర్ల రాజుల వశమైన తర్వాత గుల్బర్గా సుల్తానులలోనే యొకరును దానిపై దండెత్త లేదనుట గుర్తింపదగినది. బహుశః రాజుకొండ వారికిని బహ్మన్ సుల్తానులకును కాపయ్య విరుద్ధముగానేదైన సమాధానము కుదిరియుండెనేమో. భీమవర యుద్ధమున కాపయ్య చనిపోయిన తరువాత సుల్తాన్ కాపయ్యతో పూర్వము చేసియుండిన ఒడంబడికను రేచర్ల వారు పాలింప నంగీకరించిరేమో. గుల్బర్గా రాజుకొండలమైత్రి కారణ మదియై యుండును. అనవోతా నాయకుడును అతని సంతతి వారును బహ్మన్ సుల్తానుల పక్షమున తోడి హిందువులపై కత్తిగట్టిన ఘట్టములు పెక్కులు. అట్లే పొరుగు హిందూ రాజుల తాకిడిని తప్పు కొనుటకు రాజు కొండ నాయకులకు బహ్మన్ సుల్తానులు గూడా తోడ్పడుచుండిరి. ఈ మైత్రి అనవోతని తరువాత ఒక అర్థ శతాబ్ది అట్లే నిలిచి యుండినది.

రాజుకొండ రాజ్యము పుట్టువాదిగ ఆ రేచర్ల వెలమలు కృష్ణానది కిటు

దక్షిణాగ్నేయములగు విజయనగర, కొండవీటి హిందూ రాజ్యముల తో పోరు సాగించుచునేయుండిరి.

అనవేమ మాదానాయకుల తరువాత వారి కొడుకులు సింగమ నాయక II పెదవేదగిరి నేడులు రాజకొండ దేవరకొండలలో రాజులైనారు. సింగమ II (అతనికి కుమార సింగుడనియు వ్యవహారము) ప్రఖ్యాతుడగు సంస్కృత పండితుడు, పండిత పోషకుడును. అతడించుమించుగ 15 యేండ్లు (క్రీ.శ. 1384-99) పాలించెను. ఆ సమయమున కొండవీటి రెడ్లు తీరాంధ్రమున తన రాష్ట్రము చికొనగా పలాయితుడైన అన్న దేవ చోడునికి వేదగిరి ఆశ్రయమిచ్చెను. రెడ్ల వెలమలవైరము మరింత తీవ్రసంక్లిష్టమనైమును అనువంశకమునుపై కొండవీటి రాజ్యాంతము వరకు సాగినది.

సింగమ II తర్వాతి రాజు అతని కొడుకు రెండవ అనవోత నాయకుడు. అతనిని కుమారాన్నవోత యనియు పేర్కొనుచుండిరి. (సు. క్రీ.శ 1399-1425). వేదగిరి కొడుకు కుమార మాదా నాయకుడు దేవరకొండలో అతని సమకాలీన ప్రభువు పొరుగుల తోడి వారి వైరసంబంధములు వారి తండ్రుల యడుగుజాడలలోనే సాగినవి. కాని క్రీ.శ. 1417 లో నల్గొండ సమీప స్థాపానుగతను ఫిరోజ్ షా ముట్టడించుటతో గుల్బర్గా - రాజు కొండల పారంపర్యమైత్రి భగ్నమై రెండవ అనవోత నాయకుడు విజయనగరముతో మైత్రి నెఱపెను. కానీ హిందూ రాజ్యము వారి తోడి యీ రేచర్ల పొత్తు చిరము నిలువలేదు. ఫిరోజ్ షా తర్వాత తమ్ముడు అహ్మద్ షా సుల్తాను అయి అతడు నిర్మించిన నూతన రాజధాని బీదర్ నుండి ఎతడెగక సాగించిన దాడులకు తాళలేక రేచెర్ల వారు విజయనగర సఖ్యమును వదులుకొననయ్యెను. వారి తండ్రులు గతింపగా రాజకొండలో కుమార అనవోతని కొడుకు సర్వజ్ఞ సింగ నాయకుడు III (క్రీ.శ. 1425-1475)ను దేవరకొండలో కుమార మాదానాయకు పుత్రుడు లింగమనేడును తరచు తమ బీదర్ విధేయతనొప్పరికించుచు విజయనగర రాజులతోడను, క్రొత్త శక. 1358-క్రీ.శ. 1435-36లో కళింగలో తూర్పు గాంగ పతనానంతరము కటక్‌లో గజపతిరాజు వంశ స్థాపకుడు కపిలేశ్వర గజపతి తోడను చేతులు కలుపసాగిరి.

దేవరకొండ రాజులలో చివరి వాడు లింగమనేడు తన పండ్రెండవ యేట

నుండియు రెడ్ల పట్ల తన తాత తండ్రుల వైరమును సాధించుచు కొండవీటి రెడ్డిరాజులయు, ఆ పై యిర్వదేండ్లు మిగిలిన రెడ్డిరాజులయు అంతమును జూచెను.

అహ్మద్‌షా బహ్మనీ పాలనము చివరి వత్సరములలో రేచర్ల నాయకులు వరంగల్ రాజకొండల గోల్పోయిరి. వానిని తిరిగి సాధింప లింగమనేడు శాయశక్తుల పోరుచు దోరుచు భీషణ సంగరముల తన బలము క్షీణింపగా క్రమక్రముగా యడగారిపోయెను.

## విజయనగర రాజ్యము

విజయనగర రాజ్యము యదార్థముగా పునఃనర్నిర్మితమూ విస్తృతమూ నైన కంపిలి రాష్ట్రమే. వరంగల్‌ను ముస్లిముల నుండి మరల గైకొను హిందూ విజృంభణ దినములలో దాని పునర్జన్మము.

మహమ్మద్ బీన్ తుగ్లక్ కంపిలిని జయించి అందున్న హరిహరుని, అతని సోదరులను బందీలుగా ఢిల్లీకి కొనిపోయెను. అచట తాను నియమించిన మాలికుల తఱిమివైచిన హిందూ విప్లవమునణచుటకును, వారుగైకొన్న కంపిలి భూముల మరల నాక్రమించి తన యధికారమును పునః ప్రతిష్ఠించుటకును తుగ్లక్ తన బందీయైన హరిహర దేవరాయల కిస్లాం మత దీక్షనిచ్చి సోదరులతో పాటు చెర విడిపించి అతనిని కంపిలిలో తన ప్రతినిధిగ నియమించెను. అందతడు కొంతకు కొంత సఫలుడయ్యెను గాని పొరుగు రాజుల ప్రతిఘటన, తన రాష్ట్రములోని హిందూ ప్రజల అవిశ్వాసములు ప్రబలములైనవి. ప్రజల ప్రీతిసమ్మతులకై శ్రమించి, శ్రమించి తుదకాతడు కాపయ నాయకుని మార్గము నవలంభించెను. ఇస్లాంమతము విసర్జించి పంపా విరూపాక్ష తీర్థుడగు విద్యారణ్య మహర్షి ప్రాపున అతడు ఢిల్లీ చక్రవర్తి ఆధిపత్యమును త్రోసిపుచ్చి, తన స్వాతంత్ర్యము ప్రకటించెను.

విద్యారణ్యులు మంత్రసహాయ్యమున తన సోదరులగు హరిహరుడు పొరుగు రాజ్యములనాక్రమించి తన యధిరాకమును విస్తరింపబూనెను. అనతి కాలమునకే కంపిలి విద్యారణ్యుల మంత్రబలమున బలిష్ట విజయనగర సామ్రాజ్యముగ రూపొందెను. విద్యారణ్యులు మొదటి ముప్వురు రాజులగు హరిహర బుక్క (I) హరిహర (II) లకు

మిత్రుడు, మార్గదర్శి, నీతిబోధకుడును అతని యాశీస్సుల గడించిన విజయనగర రాజ్యము హిందూ ధర్మమునకు పెట్టని కోట అయ్యెను.

హరిహరుల మొదటి ముఖ్యపట్టణము ఆనెగొంది. ఆ తరువాత తుంగభద్రా నదీ తీరమున తన విజయములకును గురువర్యులగు విద్యారణ్యుల కీర్తికిని ప్రతీకగా నిర్మించిన విజయనగర పట్టణము అతని రాజధానియైనది. అతని బావుటా నీడల హిందువులధికాధికముగ కూడి విజయనగర రాజ్యము మిక్కిలి శక్తివంతమైనది. దాని ఏకైక లక్ష్యము హిందువుల యోగక్షేమ ప్రవర్ధనము, ఇస్లాం వ్యాప్త నిరోధము.

పుట్టువందిన కొలది యేండ్లకే శక. 1258/క్రీ.శ. 1336-37 కే హరిహర సోదరులు రాజ్యమును పూర్వ పశ్చిమ సముద్రములవధిగా విస్తరింపజేసిరి. స్వధర్మ పరిరక్షణోత్సుకులై హిందువులెల్లరును తమతమ శాఖావైమనస్యముల మఱచి, చెదరియుండిన తమ శక్తుల కూడగట్టుకొని, హరిహరుల యండనొకటియై విలసిల్లిరి. విజయనగరము హిందూ ధర్మ సంస్కృతుల కెత్తిన ధ్వజమై హింసారంభమగు ఇస్లాం దక్షిణదేశాభిముఖ వ్యాప్తి ఎల్ల విధముల రుద్ధమైనది.

రాజ్యస్థాపన జరిగిన పదేండ్లకే ఇప్పటి నెల్లూరు జిల్లా కావలి తాలూకాలోని ఉదయగిరి తూర్పున ప్రధాన దుర్గమాయెను. ఉదయగిరియు దాని పరిసరములలో వారు గొన్న భూములను ఒక ప్రత్యేక రాష్ట్రము ఉదయగిరి రాజ్యముగ నేర్పరిచిరి. అట్లుప్రాయః కొండగిరి రాజ్యారంభము నుండియు విజయనగర రాజుల ఉదయగిరి బలిష్ఠ సైన్యస్థావరమై వైరిమందల భేదన కనువుగ గల్పించెను. కొండవీటికట్లుది ఎడలేని చేటైనది. బుక్కరాయలు అతని కొడుకు రెండవ హరిహర రాయలు (క్రీ.శ. 1377-1404) మనుమడు మొదటి దేవరాయలు (క్రీ.శ.1406-22) వారిపాలనముల విజయనగర రాజ్యము అతి త్వరితగతినలుదెసల విస్తరించెను. దేవరాయల విదేశనీతిచే కొండవీటి ప్రాభవము కుంఠితమైనది.

విజయనగరమును చెరచి దానిని తమ సామంత రాజ్యమొనరించు కొనుటకై బహ్మనీ సుల్తానులు పలుమారులు వివిధ గతుల యత్నించి విఫలురైరి. కాని మొదటి హరిహరుల కాలముననే కృష్ణాతుంగభద్రాంతర సీమలనధిక భాగము వారి వశమయ్యెను.

అనష్ట పూర్తికో అన్నట్లు విజయనగర రాజ్యము సింహళము నందును వ్యాపించినను, వారు కృష్ణా తుంగభద్రల యంతర్వేది భూములను యత్నించుట మానలేదు. అట్లు ఆ అంతర్వేది మొదటినుండియు బహ్మన్-విజయనగర వివాద సంఘర్షణలకాస్పదమాయెను. ఇన్నూటయిర్వదేనేండ్లు పలుమారులు ఈ రెండూ రాజ్యముల ఘోర సమరములు, పట్టువదలక, వారి వారి భావైక్యత, వ్యవస్థాద్రఢిమ, నీతినైపుణి, ధర్మోత్సాహము, ఆశయప్రకర్షల పట్టిచూచునవి ప్రవర్తిల్లినవి.

## కొప్పుల నాయకులు

ఈ వీరసామంత నాయకుల ఉనికి మనకు మొట్టమొదట తెలియవచ్చినది శక. 1259 నాటి నాయమనాయకుని దోసెపూండి శాసనము[8] వలన వారు తమ పాలనమును గోదావరి తటమునుండి ఉత్తరమున కళింగము వరకు స్థాపించి, ఆ "ఆంధ్ర ఖండమండలము"ను పిఠాపురము రాజధానిగా ఏలిరి. దోసేపూడి శాసనముగాక సింహాచలమునందిలి కొన్ని శిలాశాసనములకు వీరిని పేర్కొన్నవి కలవు.

దోసేపూడి శాసనము చెప్పుటలో కొప్పుల కుటుంబమునకు ఆది పురుషుడు కాపయ నాయకుడు. అతని కొడుకు ప్రోలయ నాయకుడు చోడమాంబ వలన నామయనాయకుడు జన్మించెను. నామయ "పగమెచ్చుగండ" బిరుదాంకితుడు. అతడు "ఏవానదీ మాతృక" భూమిని పాలించెను. ఏలలేక పీలేరు, యెల్లవరం, పిఠాపురం, పెద్దాపురముల మీదుగ ప్రవహించునట్టి నది నామయ దోసేపూడిని తన తండ్రి పేరిట ప్రోలారం (ప్రోలవరం) గా మార్చి ఆ గ్రామమును వేదశాస్త్రములందు ప్రశ్నాష్టకమున నిష్ణాతుడును భారద్వాజ గోత్రుడను అగు గణపతి యును బ్రాహ్మణునికి అగ్రహారముగనిచ్చెను. కొప్పుల కుటుంబము విషయమున ఆ శాసనము తెల్పునదింతియే[9]. ఇక సింహాచలమందలి శాసనముల పరికింతుము. అందొకటి[10] కొంత చెడిపోయినది. శాసన కాలము సూచితము కాదు. కాని అది నాల్గు తరముల కొప్పుల నాయకుల పేర్కొనియున్నది. కాపయనాయక, అతని కొడుకు ప్రోలయ 1, అతని పుత్రుడు కొప్పుల నాయకుడు కాక కొప్పులయ్య, అతనికి రెండవ ప్రోలయ జనించెను. మరియొకరు స్త్రీ ఎవరి భార్యయో తెలియదు. బహుశః రెండవ ప్రోలయ

పత్నియోమో. ఆమె మధువిట్ (విష్ణు) మహేశ్వర సతుల సరిపోలునట. (అక్కడ శాసనము శిథిలమైనది. శాసనము మలిభాగము పూర్తిగ నశించినది.) ఆమె నిజనామము తెలియదు. ఆ శాసనమందలి కాపయ, అదే పేరటి నామయ తాత కావచ్చును.

ఇంక శాసనము[11] - అదుల పల్లి (అందులపల్లి)ని కొప్పులయ్య భార్య ముప్పేమ దేవి మెచ్చు గండ భోగమునకై దానమిచ్చెను. దాని కాలము శక. 1310 (క్రీ.శ. 1388)[12] కొప్పుల కుటుంబములో కాకతీయులకడనాయక "తనము మొట్టమొదట పొందిన వాడు కాపయ నాయకుడగుటలో[13] విప్రతిపత్తి యేదియులేదు. అతని కొడుకు ప్రోలయ 1 బహుశః ముసునూరు ప్రోలయ I సమాకాలీనుడై, తీరాంధ్ర విమోచనయందతనికి తోడ్పడి యుండును. ప్రోలయ కొడుకు నామయనాయకుడా వంశమున ప్రథమ స్వతంత్ర ప్రభువు. అతడు ఆంధ్రఖండ మండలమును పరిపాలించెను. అతని యధికారము గుడ్డివాడికిని ప్రాకియుండినచో, తూర్పు గోదావరి జిల్లా యెల్లవరప్రాంతము వరకు గల తీరాంధ్ర దేశమంతయు అతని యధీనమున నుండెననవచ్చును.

నామయ నాయకుని పిదప కొప్పుల వారే పాలైరో తెలియదు. ముప్పమదేవి సింహాద్రి నాథునికిచ్చిన అందులపల్లి గ్రామము విశాఖ జిల్లా సర్వసిద్ధి తాలూకాలో నున్నది. వారికి దక్షిణమునగల ప్రభువుల యొత్తిడికి తాళక కొప్పుల నాయకులలో పిదపటివారు ఉత్తరపు దెసకేగవలసి వచ్చియుండును. తూర్పుగోదావరి జిల్లాలో తుని తాలూకాలోని కొర్ఠము వారి క్రొత్త ముఖ్యపట్టణమై యుండును. ఆ పురమును 17వ శతాబ్ది ఆరంభముననను కొప్పులవారి కొర్ఠ[14] మనుచుండిరి. కొప్పులయ్య లేక కొప్పభూపతి శాసనము లేవియు యింకను బయలుపడలేదు. అతను 14 శతాబ్ది చివరిసగము వరకు (శక.12.80) జీవించెననవచ్చును. దోనేపూడి శాసనము నామయ రాజ్యారంభము నాటిదనుచో అతని పాలన శక. 1259 నుండి యిర్వదైదేండ్లు శక. 1284కు ముగిసి యుండును. నామయ తరువాత రాజెవరన్నది ఇంకను ప్రశ్నయే.

విశాఖ జిల్లా సర్వసిద్ధి తాలూకాలోని పంచధారల సంగ్రామములో తన తండ్రి

చోడ భక్తిరాజు గజపతి నోడించి కొప్పులపతి[15] కి పట్టము గట్టెనని, అన్నదేవచోడ చెప్పికొన్నాడు. ఈ కొప్పులపతి బహుశ, కొప్పభూపతి లేక కొప్పులయ్య గావచ్చును. గజపతి కొప్పుల పతితో యుద్ధమేల చేసెనో, భక్తిరాజు కొప్పులపతి పక్షము వహించెనో శోధింపవలసిన విషయములు. కొప్పుల కుటుంబముల దాయాదిపోరిలో గజపతి చోడ భక్తిరాజులు? రాజకీయ లాభముల్కై భిన్న పక్షముల జేరి పోరాడిరేమో కాని యిదియెల్ల ఊహామాత్రమే.

శక. 1310 / క్రీ.శ. 1300 తర్వాత లందెచ్చుటను కొప్పుల వారి పొడకానరాదు. దుర్బలులై స్వాతంత్ర్యము గోల్పోయి కొండవీటి రెడ్ల సామంతులయి యుందురు.

ఆ పిదప నెపుడో ఒక కొప్పుల కుటుంబమువాడు, కొర్త్తాపురపు (కొర్త్తం) వల్ల భూపతి, అంగర నరసింహకవి[16] రచించిన రాజరాజాభిషేకమునగానవచ్చుచున్నాడు. పూర్వీక కొప్పుల కుటుంబముల[17] తో వల్లయ్య బాంధవ్యము తెలియదు.

## కోరుకొండ రాష్ట్రము

ఈ రాష్ట్ర స్థాపకులు అప్రసిద్ధులగు సామంతులుగ నుండి క్రమమున మనకు ప్రస్తుతమగు రెడ్డియుగమున బలమును పుంజుకొనిరి. ముమ్మడి నాయకుని శక. 1280 నాటి శ్రీరంగం తామ్ర శాసనము[18] శక. 1290 నాటి సింగన నాయకుని అక్కలపూడిశాసనము[19] ఈ కుటుంబము వారివి ఒకటి రెండు శిలాశాసనములును - ఇవియే వారి చరిత్రకాధారములు.

పై శాసనములు తెల్పు గాథ యిట్లు. పూర్వ కాలమున పల్లవ చక్రవర్తి ముక్కంటి గంగా తీరమందుండి "మంచి" - "కొంథ"యను. యిర్వురిని తనతోకొనివచ్చెను. వారాంధ్ర దేశమున "మంచి కొండ" యను నగరమును నిర్మించిరి. అదేవారి సంతతికి గోత్ర[20] నామమయ్యెను. కేశామి లేక కేశవ నాయకుడా కుటుంబమున జనించి తెలింగదేశ (మంచికొండ ప్రాంతము కాబోలు) ప్రభువాయెను. గణపతి నాయకుడతని కొడుకు. వానికి కూన లేక కూనయ జనియించెను. వానికి ముగ్గురు పుత్రులు. ముమ్మడి,

సింగయ, గన్నయ నాయకులు. వారిలో ముమ్మడి నాయకుడు అగ్రజుడును, బలవంతుడైన అతడి గోదావరి శాఖలగు వృద్ధ గౌతమి - వాసిష్ఠల నడిమి దేశమునంతను పనార, కోన, కురవాట, చెంగరలను జయించెను. (గోదవరీం-ఉభయ-తోయం - ఉపాంత దేశమ్ లేక ప్రధి తోభయ గోదావర మధ్యప్రాయేషు) ముమ్మడి నాయకుడు తన తండ్రి మాటమన్నించి రాజ్య భారము వహించెను. అతని భార్య "ఆంధ్రసుర త్రాణు"డని పేర్లన్న (అక్కలపూడి శాసనము) కాపయ నాయకుని కోడలు రాజమహేంద్ర నగరము దాపులనున్న కోరుకొండ రాజధానిగా ముమ్మడి నాయకుడు పాలింపసాగెను.

○

సోదరులగు సింగయ గన్నయలను క్రమక్రమముగా కోటిపురి[21] తడిపాక (తాటిపాక, రాజోలు తాలూకా, తూర్పుగోదావరిజిల్లా) లందు నాయకులుగా నియమించెను. "గండగోపాల" బిరుదు సింగమనాయకుడు పంపానదీ తీరమున ముమ్మడి వీడును ముఖ్యపట్టణముగ జేసుకొనెను.

ముమ్మడి నాయకుడు భట్టపరాశరునికి[22] కొత్తాల్పపల్లు గ్రామమునిచ్చియుండెను. భట్టపరాశరుని తల్లి ఆ గ్రామమును శ్రీరంగమునందలి శ్రీరంగనాథునికి పునర్దత్తమొనరించెనని ముమ్మడి నాయకుని శ్రీరంగ శాసనము సింగమనాయకు నుండి లక్కలపూడి గ్రామమును దానముగొన్న (అక్కలపూడి శాసనము) పరిహితపండితుడు ఆయుర్వేదమున ప్రజ్ఞగలవాడట.

కోరుకొండ కొండపై లక్ష్మీనరసింహస్వామి ఆలయ ప్రాంగణములో నొక స్థంభముపై ముమ్మడినాయకుని శక. 1275 నాటి శాసనము[23] న్నది. అది భట్ట పరాశరుని అవతారమగు నరసింహస్వామి ఆలయ శంకుస్థాపనమును ప్రస్తావించుచు దేవాలయమునకు ముమ్మడి నాయకుడు భూములను దానమిచ్చుటను పేర్కొన్నది. ఈ శిలా తామ్రశాసనముల వలన కోరుకొండ నాయక ప్రాబల్యము కాకతీయుల యనంతమని తెలియనగుచున్నది.

కాకతీయుల చివరి రోజులలో కేశమి నాయకుడును అతని పుత్రుడు గతణపతి నాయకుడును పాండ్యులపై జయము గొన్నాడన్నది[24} ఇది కాకతీయులలో కడపటిరాజు ప్రతాపరుద్రుని దక్షిణదేశ దండయాత్రలలో గావచ్చును. గణపతి నాయకుని కొడుకు

కూనయనాయకుడు మునుసూరు కాపయ ప్రోలయ నాయకుల సమకాలము వాడు. కూనయ తన కొడుకు ముమ్మడినాయకునికి ఆంధ్రసురత్రాణ కాపయ మేనకోడలితో పెండ్లి గావించెను. కాపయ మునుసూరు వాడగుట నిస్సందేహము. ఈ సంబంధము కూనయ నాయకుని కుటుంబ గౌరవము. సమకాలపు వీరసామంతులలో కూనయ ప్రతిష్టను హెచ్చించెను. తూర్పుగోదావరి జిల్లా భద్రాచలం తాలూకాలో శబరీ - గోదావనీ నదుల కూడలి కడనున్న కూనవరం, తన పేరట యీ కూనయ నాయకుడు వెలయించినదేమో. అగుచో, కూనయ రాజ్యవిస్తృతి ఎంతయో మనమూహించవచ్చును.

మునునూరి వంశ్యుడగు అనవోత నాయకుడు (తొయ్యేటి) క్రీ.శ. 1353/ శక. 1275 కు కొంత పూర్వము మరణించియుండును. అతని తర్వాత రాజమంధ్రి సింహాసనమధిష్ఠిను వారసులులేరు. అందుచేతనే కావలయు, తనకిచ్చ లేకున్నను ముమ్మడి నాయకుడు తండ్రి కోరికను మన్నించి శక. 1275 అచట అధికారము చేపట్టెను. అట్లు మొదలైనది కోరుకొండ రాజ్యము. అట్లు మొదలైనది కోరుకొండ రాజ్యము. ఉత్తరమున నున్న కొండ జాతులు ఆ క్రింది సస్యప్రదేశములగు సమభూముల చూరలాడనీక అపుటకు ఏర్పడిన తానా కోరుకొండ యిపుడు గిరిదుర్గమును రాజధానియైనది.

కోరుకొండ శ్రీరంగ శాసనములు చూడగా రాజమంధ్రి నుండి తూర్పు సముద్రము వరకు గోదావరికిరువైపుల గల దేశము తొయ్యేటి అనవోత చనిపోవుటతో మనుసూరువారి చేజారినదనవచ్చును. వారితో తన బాంధవ్యమును పురస్కరించుకొని ముమ్మడి నాయకుడు పానార, కోనకురవట, చెంగర ఆదిమండలముల తిరిగి జయించెను. అతని రాజ్యమిట్లు ఉత్తరమున కొప్పుల రాజ్యమునకు ప్రత్యంత భూమి అయ్యెను.

ముమ్మడి నాయకుడు జయించిన స్థావరముల నిరూపించవచ్చును.

## పానార :

ఇది పావున వార, పాగునవార లేక పాగుణారల యపభ్రంశ రూపము. అది

గోదావరి శాఖలగు వాసిష్ఠా, గోస్తని (గుళంతని) నదుల మధ్యదేశము. గోస్తని పశ్చిమ గోదావరి జిల్లా భీమవరం తణుకు తాలూకాల మీదుగ ప్రవహించును. ఈ ప్రదేశమును పాపునవార అనియు పాగునవార యనియు వేంగీచాళుక్య శాసనములు నిర్దేశించుచున్నవి. అది యిప్పటి నరసాపురము, భీమవరము తాలూకాలను తణుకు తాలాకాలో కొంతభాగమును[25].

## కోన :

ఇది గోదావరి పాయలగు వాసిష్ఠ వృద్ధగౌతముల నుండుటచే "రెండేరుల నడిమి విషయ" మనియు అందురు. ఇది కార్తవీర్యార్జునుని సంతతి వారగు హైహయుల అనువంశిక రాజ్యము. ఈ హైహోయ రాజుల చాలులో తనకు తెలిసినంతలో మొదటి వాడగు ముమ్మడి భీముడు 11వ శతాబ్ది మధ్యమున రాజేంద్ర చోడలేక కులోత్తుంగ చోడ I ని నుండి రాజలాంఛనముల పొందెను. నాటినుండి ఆసస్యప్రదమగు కోనదేశమును II శతాబ్దములు పైగా హైవాయులు పాలించిరి. కాని అంతకాలమును వారు సామంతులే, వేంగీ చాళుక్యులకో, వరంగల్ కాకతీయులకో, మరేయొకరికో ముస్లింల బారినుండి తీరాంధ్ర విమోచనము తర్వాత వారు ముసునూరి నాయకుల కధీనులై యుందురు. విలస తామ్రశాసనము కోనదేశమును ప్రోలయనాయకుని రాజ్యాంతర్భాగముగ నిరూపించుచున్నది.

శక. 1222 తర్వాత హైహయలు శాసనములు చాల అరుదు. కేవలము నాల్గే శాసనములు, కోనవల్ల భీమునివి వల్లభునివిరెండు, శక 1240, 1286లవి,[26] కోన చోడునివి రెండు[27] యిప్పటికి తెలిసినవవియే. ఛోడుని శాసనము కళింగమునను, భీమవల్లభుడి పానారమునను లభించినవి. ఇతడు ముమ్మడి నాయకుల సమకాలికుడు. ముమ్మడి విజయ ప్రస్తావనలు ప్రగల్భములు కావేని అతడీ భీమవల్లభుని జయించి యుండును. కాని భీమవల్లభుని మూలహైహయుతోడి యనుబంధమెట్టిదియో తెలియదు.

## కూరావటము :

ఇది తూర్పు గోదావరి జిల్లా కాకినాడ తాలూకాలోని కూరాడకావచ్చును.

## చెంగర :

భీమవరము (తూర్పుగోదావరి జిల్లా) ప్రాంతపు యొక శాసనమున[28] చెంగనాడు ప్రస్తావన ఉన్నది. దానిని నామము చెంగురు నాండు. శాసనములోని మఱ్ఱిపూడి ఆ చెంగర లోనిది. చెంగర లేక చెంగూరునాండు గోదావరీ తీరస్థ మన్య ప్రాంతములలో నుండును.

ముమ్మడి నాయకుని పాలనాంతమును నిర్ణయించుట కష్టము. సింహాచలమున శక. 1286, 1304, 1310 వర్షములవి మంగిపూండి మమ్మడి నాయకుని శాసనములు[29] కలవు. అతడు కోరుకొండ కూనయ నాయకుని కొడుకు ముమ్మడి నాయకుడే కావచ్చును. శక. 1304 శాసనమున సింగమ నాయకుడతని తమ్ముడనియు, బార్య శ్రీరంగ లక్ష్మియనియు చెప్పి యున్నది.

ఈ సమీకరణ కు పోద్బలకము సాక్ష్యము కాటయవేముని తామ్ర శాసనము[30]. అతడు కొమర గిరిరెడ్డి ముఖ్య ప్రధాని శక. 1317 నాటి ఆ శాసనము రాజమహేంద్రవర సమీపస్థలమగు గోపవరమును దైవమగు గోపీనాధుని కిచ్చిని దాన శాసనము. ఆ యూరి నిజనామము తడుకలేరు. పూర్వము దానిని మంగిపూడి ముమ్మడి నాయకుడు బ్రాహ్మణులకగ్రహారము నిచ్చియుండెను. అట్లని ఈ శాసనముననే కలదు. కాటయ వేముడు దానిని కొని, గోపీనాధ దేవునికిచ్చువేళ దానికి గోపవరమని పేరిడెను. కొమరగిరి రెడ్డికి పూర్వమా గ్రామ ప్రాంత దేశమును పాలించిన దొకేయొకడు. కోరుకొండ ప్రభువు ముమ్మడి నాయకుడు. కావున కాటయ వేముని మంగిపూండి ముమ్మడి నాయకుడు. సింగమ నాయక సోదరుడగు ముమ్మడి నాయకుడే. అట్లగుట నతడు శక. 1310/క్రీ.శ. 1388 వరకు జీవించి యుండెననవచ్చును.

శక. 1286 నాటి సింహాచల శాసనము ముమ్మడి నాయకుడు వైష్ణవుడనియు, కందాడ అయ్యంగార్ల శిష్యుడనియు తెల్పుచున్నది. ఈ కందాడ అయ్యంగారు ప్రఖ్యాత కందాడై కుటుంబము వాడై యుండును. భట్ట పరాశరుని మృతికి పిదప ముమ్మడి నాయకుడు కందాడై వారిచేత వైష్ణవము పుచ్చుకొని యుండును.

తరువాత తరువాత యీ కోరుకొండ నాయకులు కొండవీటి రెడ్ల యనుయాయులైనారు.

కోరుకొండ కైఫియత్ ప్రకారము ముమ్మడి నాయకునికి ముగ్గురు కొడుకులు కూన II, అన్న, కాటయవారి రాజ్య కాలము 40 ఏండ్లు.[31] ఈ సంతాన భాగమును ముమ్మడి నాయకుని కోరుకొండ శాసనము సమర్థించుచున్నది. అతని కొడుకులలో నొకడు అన్న వేముడు. - కైఫియత్ లోని అన్న ఈ ముప్వుర శాసనములేవియు అగపడలేదు. కాని తణుకు తాలూకా పెనుగొండలో కాలము సూచించని యొక శిధిల శాసనము కూన భూపాలు నొకని పేర్కొన్నది. అతడు ముమ్మడి నాయకుడని కొడుకేమో.

## కళింగ గాంగులు :

6వ శతాబ్దారంభము నుండి ఉత్తరమున మహానది మొదలు దక్షిణమున తూర్పు గోదావరి జిల్లాలోని పిఠాపురము వరకు గల భూభాగము నంతటిని కళింగ గాంగులు పాలించుచుండిరి. వీరిని తూర్పు గాంగులనియు అందురు. వీరు తమ పేర గాంగశకమును ఉపక్రమించిరి. 6వ శతాబ్ద ప్రథమ దశకమున గాంగ పాలనారంభమును అది సూచించును. ఆరువందలేండ్లు వారి తామ్ర శాసనములందు ఈ శకమునే వాడినారు. గాంగ శకము వాడిన చిట్టచివరి శాసనము వజ్ర హస్త II పుత్రుడు మధుకామార్ణవునికి చెందినది - గాంగశకము 528 వత్సరమునాటిది. అతని తారువాత రాజు మూడవ వజ్రహస్తుడు. తన శాసనములందు, గాంగ వర్షముల వదలి, శకవర్షములనే సూచించెను. అతని రాజ్యారంభము శక. 960 / క్రీ.శ. 1038లో గాంగుల రాజధాని వంశధారానదిపై గల కళింగనగరము నేటి ముఖలింగము. మూడవ వజ్రస్తునికి పూర్వపు రాజులను పూర్వగాంగులనియు, అతడు మొదలగు తరువాత వారిని అర్వాచీన గాంగులనియు వ్యవహింతురు.

మూడవ వజ్రహస్తుని తరువాతి రాజులలో అత్యంత శక్తిశాలి అనంత వర్మ చోడ గాంగుడు. అతడు ఉత్కలమును ఒరిస్సాను జయించి తన యధికారమును

వంగదేశ పర్యంతము వ్యాపింపజేసెను. అంతలో అచటి గౌరులేక లఖినేతి ముస్లిం సుల్తానులతో సంఘర్షణ తప్పదాయెను. అనంగ భీముని కొడుకు, మూడవ రాజరాజు (క్రీ.శ. 1197-1213) పాలనమున వంగ దేశ సుల్తానులతో పోరు మొదలు నాటినుండియు రాజరాజు తరువాతి రాజులకు వంగ సుల్తానుల బెడద ఆపులేక సాగినది. పదమూడవ శతాబ్ది మధ్యమునుండి గాంగ రాజులు పర్యాయ క్రమముగా నరసింహదేవ, భాను దేవ నామముల దాల్చుచుండిరి. భానుదేవ II తర్వాత క్రీ.శ. 1326-27లో సింహాసన మధిష్ఠించిన నరసింహదేవు III ను ఆతరువాతి భానుదేవు III (క్రీ.శ. 1351-2 నుండి 1377-85 వరకు) నరసింహదేవు IV (క్రీ.శ. 1377-8 నుండి 1409 వరకు) భనుదేవు IV) క్రీ.శ. 1409-1434-5 వారందరును కొండవీడు రాజమహేంద్రవర రెడ్డి రాజుల సమకాలమువారు. ఈ గాంగ నృపతులు తమను గజపతులగ వ్యవహరించుకొనుచు రెడ్డి రాజ్య భూములను పలుమారులు, ముఖ్యముగ వారిలో అతఃకలహములు రేగుచున్న సమయములలో దాడులతో వేధించుచుండిరి. కళింగమును సామాన్యముగ తూర్పునాడని అనుచుండిరి.

15వ శతాబ్ది రెండవ పాదము తొలి వర్షములలో 900 ఏండ్లు అవిచ్ఛిన్నముగ సాగిన గాంగ పాలనము అంతరించెను. కళింగగాంగులు గజపతి బిరుదము కల సోమ వంశము వారు. వారిని తొలగించి ఆస్థానే కళింగమున కుదురుకున్న క్రొత్త వంశమువారు సూర్యవంశ క్షత్రియులు. వీరు ఒరిస్సా గజపతులు. ఈ రాజవంశ స్థాపకుడు కపిలేంద్రుడు. శక. 1357-58/క్రీ.శ. 1435-36లో సింహాసనమధిరోహించెను. ఒరిస్సాపూరీ జిల్లాలోని కటక్ అతని రాజధాని.

(1) For chap. p 20; App.I, p-103

(2) భారతి, సం. XIX (1942) March
For. Chap...APP.I, PP.100-110

(3) N.D.O. Vol.III, 0 73, PP1022-29
అకాల నిర్ణయ పర్శ్నై చూ. For chap.p.39 f.n.7 and Ep.Ind Vol.XXV. p 139, f.N.5

4. For Exam. Vol.

5.

(6) ఆం.సా.ప.ప. సంపుటము IV, పుటలు 93-112 : చూ.VV 23-33 భారతి సం. XXI సంచికలు జూన్, జులై (1944) ఈశాసనమునుసే. వెంకట రమణయ్య పునఃపరిష్కరించి ప్రకటించెను. నాయకుల సంఖ్యను శాసనములు, సాహిత్యములు వేర్వేరుగనిచ్చినవి. -వెలుగోటి వారి వంశావలి తోను చాటు పద్య మణిమంజరి రెండవ భాగము పుటలు 62-63 లోని చాటువు లందును వారు 77 గురుః శివయోగసారము (సుభాషి 1937, అక్టోబరు సంచిక) అవతారిక పద్యములలో 72 రూ. కలువచేరు శాసనమున (ఆం.సా.ప.ప. IV ప్ర. 30) 75 గురు.

7. అథోజ్ఞాపిక : వినాయక దేవుడు రేచర్ల నాయకుడు మొదటి అనవోత నాయకుని జ్ఞాతి యనియు అతని శిక్షించుటకే మొదటి మహమ్మదుషా బహ్మనీ వేలాం పట్టణముపై దాడి సలిపెనని నేలటూరు వేంకట రమణయ్య గారి యభిప్రాయము. (వె.వా.వం.పీఠిక XII). కాపయమృతి క్రీ.శ. 1369లోనో అంతకు కొద్దిగా ముందో, వెలమల చేతులలో ననియు వారి భావన. కాని వినాయక దేవుడు హిజ్రీ 764కే మరణించి యుండెను (For Chap. App. IVP 127) ఆసంవత్సరారంభము క్రీ.శ. 1362 అక్టోబరున ఫెరిస్తాలక్నో ప్రతిలో వినాయక దేవుని విరుద్ధముగ వేలాం పట్టణముపై మహమ్మద్‌షా దాడి హిజ్రీ 763న అనియున్నది. ఈసంవత్సరము 31 అక్టోబరు 1361 మొదలై 21 అక్టోబరు 1362 (శక 1284)న ముగియును. వెలుగోటి వారి వంశావళి ప్రకారము అనవోత I తన తండ్రి సింగము నాయకుని మృతికి ప్రతీకార మొనర్చుట శక 1283 (శిఖి-కరి-భాను); వెలుగోటి వంశ చరిత (అనుబంధములు 6-7-8) శక. 1287లో అనవోత I రాజుకొండకు దుర్గప్రకారాదులు పటిష్ఠము చేయుచుండెనన్నది. అనవోతని వరగల్ విజయమును ప్రశంసించునతని తొట్టతొలి శాసనము అయినచోట శాసన కాలము 1291 / క్రీ.శ. 1369. అందు చెప్పిన దానము అనవోత ఒక దండయాత్రనుండి విజయమై తిరిగివచ్చు చుండగా (For Chap. P. 98) పైన తెల్పిన అంశముల వలన వినాయక దేవుడు అనవోత I జ్ఞాతియగు నాగా నాయకుడేనని నేనంగీకరింపజాలకున్నాను.

8. ఈదుర్గ నిర్మాణాదుల ప్రశంసించు శాసనములకై చూ. వెలుగోటి వారి వంశ చరిత (పు. 27-29) అనుబంధములు 6, 7, 8.

8. Ep. I nd Vol IV, PP 356 ff

9. J.A.H.C. Vol. I, PP 42-47
10. I.I. VI, No. 822
11. I bd. Vol. 823
12. Contd. Next page.

పై శాసనాధారమున కొప్పుల వంశవృక్షమిట్లు

కాపయ నాయక




శాసనము (S.I.I. VL, No. 822, 3) నందలి కొప్పుల నామ భూపతి వ్యక్తి పేరను కొన్న ఆవంశ వృక్షమీ క్రింది తీరును

కాపయ నాయక

ప్రోలయ నాయక

నామయ నాయక

4 పోలయ నాయక II

అయినచో ముప్పమదేవి భర్త కొప్పులయ్యకు ఆవంశవృక్షమున స్థానము నిర్ణయింపగాదు, ఆవంశమందలి యెరులతో నతని సంబంధమెట్టిదో తెలియదు గనుక. ఆరీతిగనే సింహాచల మందలి మరిరెండు శాసనములు శక. 1282, శక. 1291 (S.I.I. Vol. Nos. 821, 924) వత్సరముల విక్రమముగ పేర్కొన్న కాపి నాయకుని, నామభూపాలుని స్థానములను సంశయాస్పదములే.

13. No. 822లో మొదటి పంక్తి (కొంత చెఱిగి యున్నను) కాపియ గౌతమీ కృష్ణానదులు పరివేష్టించిన గుద్రవాటి ప్రభువని సుచించుచున్నది. గుద్రవాటి పురాతనపు గుద్రాహార లేక గుద్రవార విషయమని తోచును. తూర్పు చాళుక్య శాసనములలోని గుద్దవాటి లేక గుద్దవాడి కది సరిపోలును. గుద్రవార విషయము కృష్ణాజిల్లాలోని బందరు గుడివాడ తాలూకాలు; గుద్దవాడి తూర్పుగోదావరి జిల్లాలోని రాజోలు కాకినాడ, రామచంద్రాపురము తాలూకాలు (పూర్తిగనో, భాగముగనో) గుద్రవాటి గుద్రవారలు మొదట వేర్వేరు జిల్లాలుగ నుండినను, వ్యవహారమున నొకటిగ గుద్రవాద యనుపేర బరగియుండును. ఈయూహకు ఉపోద్బలము వెలనాటి పృధ్వీశ్వరుని పిఠాపుర స్తంభ శాసనము అది గుద్రవాద పేరటి గుద్రవాద ద్వయమును పలుకుచున్నది. (Ep. Ind Vol. IV, P 41, V 18_) (J.A.H. C. Vol I, PP 45 -46).

14. S.I.I. Vol. VI. No. 1184.
15. Ep. Ind Vol. XXVI, PP 141 H J.A.H.R.S. Vol I, P 188
16. వసుమతీ పాద పద్మ సంవళిత రత్న

నూపురంబగు నట్టి కొత్తాపురంబు
(బి) అతడు పట్టు తలాట కేళాది రాయ
రాజ దేవేంద్ర రాజాధిరాజ చంద్ర
గాయగోవాళ జగనొబ్బ గండబిరుద
శాలి కొప్పు వల్ల భూపాల మౌళి

ఆంధ్రకవుల చరిత్ర, సం. II, పుటలు 49 - 50. ఈవల్లభూపుని బిరుదములు - పట్టుతలాట, కేళాదిరాయ, గాయగోవాళ జగనొబ్బగండ - వెలమలును రెడ్లును తాల్చుచుండిరి. శ్రీనాధుని తరువాతి కవుల నెవ్వరిని పేర్కొననందున నృసింహకవియు అతని పోషకుడును రెడ్డి రాజుల చివరి కాలము వారనుట స్పష్టము.

తన ప్రబంధమణి భూషణము పీఠికలో మానవల్లి రామకృష్ణ కవి, ఎం.ఎ. నరసింహకవి క్రీ.శ. 1500 వాడని, అతని పోషకుడగు వల్లభూపతి దోసపూడి దాన శాసనపు నాయకుకు పిదప ఐదవ తరము వాడని నిర్ణయించెను.

17. విశాఖ జిల్లాలో కొప్పుల వెలమలని యొక శూద్రశాఖ ఉన్నది. కొప్పుల నాయకులీశాఖ వారేమో తెలియదు. కొందరు వారిని రెడ్లనిరిగాని అదిసరిగాదు.

అనువాదకుడు : అచటి వారిని రెడ్డీ లందురు. వీరు దక్షిణ జిల్లాలోని గాండ్ల వారికి సరివత్తురు. వృత్తికల్లుగీత.

18. Ep. Ind. Vol. XIV, PP 83 ff

19. I did, Vol XIII fp 259 ff, ఈ శాసన కాలమునకై చూ. for Chap p 97 fn 46.

20. మంచి కొండ తూర్పు తెలంగాణాలో నెందోయుండును. రాజుకొండ రాజులది రేచర్ల గోత్రము.

21. చిలుకూరు వీరభద్రరావు మొదలగు చారిత్రకులు శాసనములోని కొట్యాంపురి తూర్పుగోదావరి జిల్లా తుని తాలూకాలోని కొత్తా ముగ పరిగణించిరి. (ఆం.చరిత్ర III పు. 123) ఈసామ్యము సరికాదు. కాత్తాకొప్పుల వారి రాజధాని, వారు ముమ్మడి సింగయ నాయకుల సమకాలీనులు. కోటిపురి తూర్పుగోదావరి రామచంద్రాపుర తాలూకాలోని కోటిపల్లి కావచ్చును. ముమ్మడివీడు (బహుళ తూర్పుగోదావరి జిల్లా, అమలాపురం తాలూకాలోని యిప్పటి ముమ్మిడివరం) ఇదే జిల్లాలోని కోటిపురి (కోటిపల్లి)కి అనతి దూరముననే ఉన్నది.

22. భట్టపరాశరుని గూర్చి ఈగ్రంధము రెండవ భాగమున ధర్మ (జల్తీల్జిహ్) విభాగమున చూచునది.

23. క్షి. చీబీ. ఎచీ. చీఖ 1912 నరసింహస్వామి ఆలయ విమానపు నల్లరాతి కుడ్యములపై కోరుకొండకై ఫియత్ కథనము దేవదాసి లక్ష్మి విష్ణుని దశావతారముల అష్టదిక్పాలుర శిల్పములను రామాయణ మహాభారత యుద్ధ చిత్రములను చెక్కించెను. పరాశర శైలోపరి ఆనృసింహ దేవాలయముపైన చక్రమును ముమ్మడి నాయకుడు ప్రతిష్టింపచేసెను.

24. కేశమినాయకుని వర్ణించు భాగము మొదలిడుటయిట్లు - విజిత్య

25. భారతి, సం. XXIII (1946, మే సంచిక) PP 471-489

26. S.I.I. Vol V, Nos 128, 156

27. S.I.I. Vol VI, Nos 657, 672

28. S.I.I VI లోనే Nos 43, చెంగనాంటి స్థలములోస(ని) మల్లిపూడి...

29. S.I.I VI. No. 841 శక. 1286 ఎపి. 1084 చీఖనీ 1301, ఎపి 1090 చీక 1310 ఎపి. 841 లోని "మంగి పరికి" ముమ్మడి నాయకుని యింటి పేరనుట శాసనమును చదువుటలో పొరబాటు. దానిని "మంగిపూడి" గా మార్చుటొప్పును. "ముమ్మడి నాయకుడు" "శ్రీరంగవర్ధన" బిరుదము దాల్చెను. (శ్రీరంగ వర్ధనాత్ ప్రాప్తం ముమ్మడి నాయక నామెల్నియమ్) E.P. Ind. XIV, p.94, B 52) ఇది అతడు పరాశర భట్ల శిష్యుడైన వెనుక.

30. J.A.H.R.S, XI PP211 gopavaram grant of katayavema, V. 28 "మంగిపూడి ముమ్మలేంద్ర దత్తమ్ తదుకలేరి ఆఖ్యాతమ్......"

31. కైఫియత్ ప్రకారము రెండవ కూనయకొడుకు, ముమ్మడి II పిన్నవాడుగాన రాజప్రతినిధులు సింహాద్రిశెట్టి, వోబిలి శెట్టి గారలు, శక 1317 లో దేవాలయమునకు కొన్ని దానములొసంగిరి (PP.5-10) పిదప కైఫియత్‌లో కాటయ వేముని ప్రశంసయే. కావున కొమనగిరికి పూర్వమే కోరుకొండ రెడ్డిరాజ వశమయ్యెననవచ్చును.

## అధ్యాయము - III

# కొండవీటి రెడ్డిరాజుల కాలక్రమము

కొండవీటి రెడ్డిరాజుల కాలక్రమమింకను అసంశయముగ నిర్ణియింపబడలేదు. రాజ్యస్థాపకుడగు ప్రోలయ వేముడను కోమటి వేముని రాజ్యారంభము గాని చివరివాడగు రాచవేముని పాలనాంతముగాని ఈ వత్సరములని నిర్ణయింప సులభము గాదు.

స్థానిక వృత్తాంతములనుండి మెకంజీ వ్రాతప్రతుల నుండి కొండవీటి రెడ్డి రాజులార్గురని తెలియుచున్నది. కొండవీటి కైఫియత్ దండకవిలెలు స్థల చరిత్రనే కాక విడివిడిగా రాజుల రాజ్యకాలమును సమిష్టిగా పరిపాలనా స్థాయిత్వాన్ని ఎరుగజేయును. ప్రోలయవేముని రాజ్యారంభము శక. 1242/క్రీ.శ. 1320లో మెకంజీ వ్రాతప్రతులలో ఆ సంవత్సరము కాకతీయ పతనాంతమును, రెడ్డి రాజ్యాధిని నిర్దేశించు కైఫియతులు అనేకములున్నవి. క్రీ.శ. 1320 ని రాజ్యాదిగా పులువురు ముఖ్యముగా పోయిన తరము చారిత్రకులు[1] అంగీకరించిరేగాని, వారి కాలన్నిర్ణయ సమస్యను నిర్దుష్టముగ శోధింపరైరి. స్థానిక వృత్తాంతములు మెకంజీ వ్రాతప్రతులు ఆయారెడ్డి రాజులకుపయోగించిన కాల పరిమాణములను తరతరములుగా వ్యవహారముననున్న యొక చాటుపద్యము[2] సమర్థించుచున్నది. ఆ చాటువునందలి రెడ్డి రాజ్యక్రమమిట్లు

| | | |
|---|---|---|
| 1. | ప్రోలయవేమ III | 12 ఏండ్లు |
| 2. | అనవోతువేమ | 30 ఏండ్లు |
| 3. | అనవేమ | 15 ఏండ్లు |
| 4. | కొమరగిరి | 14 ఏండ్లు |
| 5. | పెదకోమటివేమ | 20 ఏండ్లు |
| 6. | రాచవేమ | 4 ఏండ్లు |
| | | 95 ఏండ్లు |

పై జెప్పిన చాటుపద్యమునకు పాఠభేదములు చాలప్రభాముగనున్నవి. అన్నిట అన్ని యంశములు సరిపోలినవిగాని, మూడవ, ఐదవ రాజులు అనవేమ కోమటి వేములు పాలనా పరిమాణ విషయముననే వైవిధ్యము తలసూపినది. వారిరువురికి క్రమముగా 15, 17 ఏండ్లును 20, 25, 27 వసంవత్సరములును నిరూపింపబడినవి. చాటువులో రెడ్డిరాజులను చూపిన కాలావధులను వారి శాసనములు సరిగ సమర్థింపవు. కావున ఆ చాటువును విచారార్హము కాదని త్రోసిపుచ్చనగును.

రెడ్డిపాలను ఆద్యంతావధుల నిశ్చయించి ఆ మధ్యకాలమున వ్యష్టిగా ఆయారాజుల పాలనలను సరిపెట్టవలసియున్నది. రెడ్డి రాజ్యారంభమునకు మెకంజీ వ్రాతప్రతులు సూచించిన శక. 1242 / క్రీ.శ. 1320 ను అతర్క్యదముగ అంగీకరింపరాదని దొరికిన మేర ప్రమాణములు విశదీకరించుచున్నవి. ముప్పిడి నాయకుని కొడుకగు పెద్ద రుద్రుని దక్షరామ శాసనము[5] శిధిలమైనట్టిది. తెలిసినంతలో కాకతి ప్రతాపరుద్రుని చివరివత్సరము శక. 1243 దుర్మతియని తెలియజేయుచున్నది. మెకంజీ దినములలో నుండిన యీ వ్రాతప్రతి మూలము యిపుడు నష్టమై పోయినది.

కాకతీయుల పాలనము నిశ్శేషముగ అంతరించి అచట ముస్లింల అధికారము నెలకొన్నదాక, తీరాంధ్రమున సరిక్రొత్త స్వతంత్రరాజ్యముద్భవించునకాశమే లేదు. క్రీ.శ. 1323 లో రాజమండ్రి పెద్దమసీదులోని ఉలుఘ్‌ఖాన్ శాసనము[6] క్రీ.శ. 1324 నాటిది. అప్పటికి తీరాంధ్ర దేశమంతయు ముస్లిముల యధీనమయ్యెనని స్పష్టము కావున వేముని స్వతంత్ర ప్రతిపత్తి, క్రీ.శ. 1324 కు పూర్వముండదు. క్రీ.శ. 1324 నే కొండవీటి రాజ్యాదిగ గ్రహింపచ్చును. దానికి చిరకాలపు నానుడ 100 యేండ్ల పాలనము జోడించిన శక 1346 / క్రీ.శ. 1424 న కొండవీటి రాజ్యవిచ్ఛిత్తియని తేలును. అదే సంవత్సరపు విజయనగర దేవరాయల III శాసనము[7] రెడ్డిమండలమగు గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకా పైడిపాడున కానవచ్చినది. దేవరాయ II ల అధీనుడు పంటమైలారరెడ్డి రోజుల నుండిన సంప్రదాయము ప్రకారము మరల చెల్లించటునను క్రొత్త సమాధాన ముమ్మడి వేమయరెడ్డి లేక పెదకోమటి వేముని రోజుల చెల్లుచుండిన దేవర బ్రాహ్మణ వృత్తులను తాము పాలించుటగా

వ్యవస్థాపించిరి.

వారి భూములనుండి కొండవీటిరాజులు పూర్తి యున్మూలనాన్నిగాకున్నను, శక 1344 నకే అందు విజయ నగరాక్రమణను తెలుపు దేవరాయ (I) శాసనమొకటి గుంటూరు జిల్లా పొత్తూరు[8] కడ లభించినది. అందలి శార్వరి నామ సంవత్సరము రెడ్డి రాజ్యాదిని శక 1242/క్రీ.శ. 1320కే సూచించును గాని, క్రీ.శ. 1324 వరకు ఆ భూములు ఢిల్లీ సుల్తానుల యధీనము లేయని తెలిపి యున్నాను. కావున పొత్తూరు శాసనము విజయనగరము రెడ్డిరాజ్యమున నధిక భాగము నాక్రమించుటను సూచించును గాని ఆ రాజ్యసర్వమునుగాదు. అది జరిగినది పైన పేర్కొన్న పైడిపాడు శాసన కాలమగు శక. 1346న కావున రెడ్డి రాజ్యాంరంభము మెకంజీవ్రాత ప్రతులున్న తరములు. పేర్కొన్న పరంపరాగత కాలము శక 1242/క్రీ.శ. 1320న కాదనుట సిద్ధము.

ముస్లిములు తీరాంధ్రమును జయించిన తరువాత తొట్టతొలిగా కానవైన హిందూ శాసనములు మల్లవరం[8a] సంతమాగులూరు[9] శాసనములు. అవి క్రమముగా శక. 1247/క్రీ.శ. 1325, శక. 1248/క్రీ.శ. 1326 నాటివి. ఆ మొదటి శాసనము కోమటి వేమారెడ్డి (వేమ1) ని అద్దంకి తత్పరిసరముల పరమాధీశ్వరుడనగా, రెండవది చివరి కాకతీయ నృపతి కడ సచివుడగు కొలని రుద్రదేవుని, అతడు తన ప్రభుని పుణ్యావాప్తికై ఇచ్చిన దానము కొని యాడుచున్నది. ఆ రెండు శాసనములను 1325-6 నాటికి హిందువులు తీరాంధ్రమును మరల జయించి అందు హైందవాధిపత్యము ప్రతిష్టించుటకు నిరూపించుచున్నది. క్రీ.శ. 1325 మొదలు క్రీ.శ. 1332 వరకు, అనగా అతని మల్లవరం శాసనము తర్వాత నకరికల్లు (గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకా)[10] శాసనము వరకు, ఆ ఎనిమిదేండ్లును ప్రోలయ వేముని శాసనములు లభింపవు. ఆ మధ్యకాలమున అవిధేయులగు ప్రత్యంత సామంతులనణచి ప్రోలయ రెడ్డి రాజ్య ప్రతిష్ఠకై శ్రమించుచుండెనేమో).

రెడ్డి రాజ్యాంతములు క్రీ.శ. 1325-1424 అగుట ఆనడుమవ్యష్టిగా ఆ రాజుల కాలముల నిర్ణయింపవలసియున్నది.

అందుకై వారి వారి తొలి, మలి శాసన దెలియుటవసము. ప్రోలయవేముని మొదటి శాసనము మల్లవరము నందలి శక. 1247 అతని చివరి శాసనము వేల్పూరులోనిది శక. 1272కు చెందినది[11]. ఆ పిమ్మట మణికేశ్వరి (గుంటూరు జిల్లా, ఒంగోలు తాలూకా) శక. 1275 నాటిది. అదిరామరాజు కొడుకు మంచిరాజొనర్చిన దానములు, ఆలయ నిర్మాణములు విగ్రహ ప్రతిష్ఠలు తెల్పును. అవి అతని యగ్రజుడగు మల్లినాధునికి పుణ్యావ్యాప్తికట. మల్లినాధుడు వేమనృపతి నుండి మహతీం-మహారాజ్య-శ్రియుడగుటే గాక అనవోతచే సైతము సన్మానితుడు. శాసనమప్పటి యేలికను స్పష్టముగ చెప్పకున్నను, అందు పేర్కొన్న వారు ప్రోలయవేమ, అనవోతలగుట తెల్లమే. శక. 1275 తరువాతి శాసనములు అనవోతవే కావున ప్రోలయవేముని రాజ్యాంతము శక. 1272[13] ననో 1275లోనో, ప్రాయశః 1275 లోనే అయియుండును. ఈ నిర్ణయమునకు అనవోతని త్రిపురాంతక శాసనమడ్డురాదు[14]. త్రిపురాంతకము కర్నూలు జిల్లాలోనిది. శాసన కాలము శక1268. అప్పటి అనవోతని ఎఱ్ఱా ప్రగడ తన హరివంశ కావ్యమున యువరాజుగ వర్ణించినాడు అతడు రెడ్డి సైన్యాధిపతిగ నుండి రాష్ట్రపాలనమున తన తండ్రికి సాయపడుచుండెను. అనవోత ప్రోలయతో కలసి ఉమ్మడిగ పాలనము సాగించెననుట స్పష్టము. కావున శక. 1275 (క్రీ.శ. 1353) ప్రోలయ చివరి అనవోతని ప్రథమ రాజ్యవర్షముగ నంగీకరింపదగును.

అనవోతని చివరి శాసనము కొల్లూరి తామ్రశాసనము[16] మూలము తోడి రేకులు నష్టములైనవి. కాని మూలము లోకల్‌రికార్డ్సులోను భద్రపరుచబడియున్నవి. శక. 1286 శోభ కృత్ మాఘమాసమున అర్ధోదయ[17] పుణ్యకాలమున బ్రాహ్మణ విద్వాంసుడగు రామేశ్వర యజ్వకు కృష్ణానదీ తీరస్థ కొల్లూరు గ్రామమును దానమిచ్చిరని పాఠము. అనవోతని సోదరుడు 50 కేసరిపాటిపుట్ల భూమిని దానమిచ్చి దానిని కొల్లూరుకు జోడించెనని అదే శాసనము చివర చెప్పబడినది.

అనవోతని కొల్లూరు శాసనము వలెనే, అతని తరువాతి రాజు అనవేముని ఆద్యంత శాసనములుగూడ మెకంజీ వ్రాతప్రతులలోను ఇలియట్ తెలుగు

శాసనములోననే లభ్యములు. అనవేముని తొట్టతొలి శాసనము[18] కోరుతాడిపల్లి లేక తాడిపల్లు నందలిది శక. 1286 క్రోధివత్సరవమున అతడా గ్రామమును వేదపండితుడగు పురుషోత్తమ సోమయాజికి దానమొసగెను. కాని రాక్షసతంగడీ యుద్ధానంతరము గోల్కొండ కుతుబ్షా తీరాంధ్రము జయించు సందర్భమున నా సోమయాజి సంతతి వారాతామ్ర పత్రముల పోగొట్టుకొనిరి. కాని శక 1286 క్రోధి వత్సరముదే అనవేముని కొల్లిపాడు శాసనము గలదు. అతడా గ్రామమును సోమశేఖర మహాపాత్రుని కుమారులు సోమరాజయ్య, వీరభద్ర దేవులకు అగ్రహారముగ కార్తీక శుద్ధ పంచమిన నొసగెను. ఈ విషయమున గూడ మూల శాసనము నష్టమై దాని పాఠము మెకంజీ వ్రాతప్రతు[19] లందుననే లభ్యమగుచున్నది. అనవేముని మన్యమాపుర[20] శాసనము, శక 1304 దుందుభి-క్రీ.శ. 1382 అతని చిట్టచివరి శాసనము ఇతరుల వలెగాక, దీని పూర్తి పాఠము ఇలియెట్ సంకలనమున లభించుచున్నది. శక 1304 తర్వాత అనవేముని శాసనములు లేవియు యింతవరకు దొరకలేదు.

మాన్యమాపుర శాసనము తరువాత మూడేండ్ల వరకు కొండవీటి రాజు శాసనమేదియు లేదు. శక 1312లోనే అనవేముని ఐదవ రాజగు కొమరగిరి యొక్క అనవర్తి దానశాసనము[21] లభించుట శక. 1304-1312 ల అంతరమున కొమరగిరి బావయు, ముఖ్య ప్రధానియునగు కాపయవేమునివి మూడు శాసనములున్నవి. వానిలో మొదటిది పాలకొల్లు శాసనము.[22] శక. 1307 క్రోధన శ్రావణ బహుళ పాడ్యమి సోమవారం (క్రీ.శ. 21-8-1385) నాడు కాటయ క్షీర రామేశ్వర స్వామికి భూమిని దానమొసంగెను.

ఇందు కొండవీటి రెడ్డిరాజ ప్రసక్తి లేదు. కాని కాటయ గొన్న బిరుదులు పెక్కులు. జగనొబ్బగండ, కేళాదిరాయ, అనేయముమందలి కరగండి అప్పయ-గొప్పయదిశాపట్ట, చెంచుమల చూడాకార, రాయచేకోలుగండ, జగద గోపాల, పాండ్యరాయ గజసింహ, సంగ్రామ ధనంజయ, పల్లవత్రినయన, పల్లవాధిత్య జగరక్షపాల- ఈ బిరుదములు రెడ్డి సామంతులు సామాన్యముగ వహించునవే. ఆ శాసన కాలమప్పటికి కొమరగిరిరెడ్డి సింహాసనాసీనుడన్న సూచనయే అందలేదు. అందుకే

కాటయ పాలకొల్లు శాసనము వ్యక్తిగతమని గ్రహింపవెలను. బిరుదములా, అవి రెడ్డి సామంత సామాన్యములు. అట్టి సామంతులలో కాటయమేటి, అందును అనవోతారెడ్డి అల్లుడుగా రాజకుటుంబమువాడు. కాటయ రెండవ శాసనము సింహచలమందలిది[23]. శక. 1308 కార్తీక శుద్ధ సప్తమి ఆదివారమున కొమరగిరి రెడ్డి ప్రధాని కాటయవేముడు సింహాద్రి నాధుని కిచ్చిన ఉపాయనముల పేర్కొనబడ్డవి. అదే సంవత్సరమున కాటయును ప్రస్తావించు శాసనమొకటి అమరావతి[24] (గుంటూరుజిల్లా) లోనిది. అప్పన కొడుకును, కాటయవేమారెడ్డి మంత్రియునగు పెద్ది లేక జతనము పెద్ది శక. 1308 అధిక ఆషాఢ శుద్ధ విదయ బుధవారమునాడు (క్రీ.శ. 1386 మే 30వ తేది) అమరేశ్వర స్వామికి పూదోటను దానమిచ్చినాడు. అమరావతి శాసనము బట్టి చూడగా క్రీ.శ. 1386 అక్టోబరు 1387 కొండవీడు కొమరెడ్డి ప్రధానిగా కాటయ యధీనములో నుండె ననుట విశదమే కావున కొమరగిరి శక. 1304-1308 లలో నెపుడో ప్రాయః1308 చివరిలో సింహాసనమధిష్టించి యుండును. కొమరగిరి శాసనములు అల్పసంఖ్యలే. రాజుగ నతడు కాటయవేముని తదితర సామంతుల శాసనములందే తఱచుగ కనబడును.

కొమరగిరి అంతిమ వత్సరము గూడ సరిగ తెలియదు. శక. 1324 క్రీ.శ. 1402లో నతడున్నట్లు తాళ్ళూరు[25] శాసనము సాక్షి. దానిలో కొమరగిరి రెడ్డికి అతని పత్నికి పుణ్యావ్యాప్తికై ఆ చిత్రబాను పుష్యమున ఉత్తరాయణ సంక్రాంతి పుణ్యకాలమున నిచ్చిన దానము చెప్పబడినది.

శక. 1316/క్రీ.శ. 1394 తర్వాత కొమరగిరి శాసనములు గోదావరికి దక్షిణమున కానరావు. కాని, కృష్ణాజిల్లా బెజవాడ తాలూకా కొత్తూరు నందలి శాసనమొకటి[26] ఒకరాజు భూదానము చేసినట్లున్నది. ఆ రాజు పేరు చెప్పబడలేదు. దాన కాలము వృషపుష్య[27] మకరసంక్రమణ దినము. వృష వర్తమాన మైనచో నది శక. 1322నకు, గతమైనచో శక. 1323కు చెందునేగాని శాసనమున చెప్పిన శక. 1312 ఎట్లునుగాదు. దాత ఎవరో, కొమరగిరియో, అతని తురువాత పెదకోమటి వేముడో నిశ్చయింపరాదు. శక. 1322/క్రీ.శ. 1400 వరకు వేముని

శాసనములేవియు కానబడవు. కావున నీ కొత్తూరు శాసనమున కొమరగిరి కావచ్చును. కొమరగిరి తర్వాత రాజైన యతని మొదటియేడు తెలియుటకు అనవేముని తంగేడ[28] శాసనమును పరిశీలింపవలసియున్నది. దీనిలోనిచ్చిన శకవత్సర భాగము శిథిలమైనది. విశదముగనున్నది - అధిక భాద్రపద, శుద్ధ తృతీయ బుధవారమున మద్రాసు ఎపిగ్రఫీ సూపరింటెండెంటు చూడనిచ్చిన ముద్రిత ప్రతిలో అశిథిలభావమిట్లున్నది. ........ ను సంవత్సర అధిక భాద్రపద, శు. 3 బుధవారమునాడు ....... సంవత్సర భాగమమున గల చివరి యక్షరము"ను" బట్టి అది స్వభాను చిత్ర భానులలో నొకటి కావలెను. ఈ రెండు సంఘటిల్లునవి ప్రోలయ వేముని, పెదకోమటి వేముని కాలపు చిత్ర భాను స్వభానులందు అధిక భాద్ర పదము రాలేదు. కావున నీ తంగేడు శాసనము సహజముగనే పెదకోమటి వేమునికే చెందవలెను. శక. 1324, 1325లు చిత్ర భాను స్వభానుల క్రీ.శ. 1402, 1403 లో చిత్రభాను నందే అధిక భాద్రపదమున్నది. తిథి వారాదులన్నియు చక్కగ నదికి యున్నది.

దానికి సరిపోలు ఆంగ్లకాలము ఆగష్టు 2, 1402, బుధవారము కావున పై తంగేడ శాసనము (శక. 1324) పెదవేముని తొట్టి తొను శాసనముని నిశ్చయింపవచ్చును. అతని చిట్టచివరి రుద్రవర శాసనము శక. 1341/క్రీ.శ. 1419. ఆ తరువాతి శాసనము లేవియునింతవరకు తెలియరాలేదు.

కొండవీటి రెడ్డిరాజులలో చివరి రాజులలో చివరివాడు పెదకోమటి వేముని కొడుకు రాచవేముడు అతని పాలనము నన్న శాసనము నొక్కటి కనపడదు. ఒక్క అమీనాబాదు[29] శాసనమున అతని పేరు స్మరింపబడినది. శక 1337లో తండ్రి పాలించు చుండగా తన తల్లి నిర్మించిన సంతానవృద్ధి తటాకమున కాతఢు నీరుపట్టు కాల్వను త్రవ్వించినాడట.

పై పరామర్శించిన విషయముల సంగ్రహము ఇట్లు

| రాజుపేరు | తెలిసిన వర్షములు | | పాలనా పరిమాణము | |
|---|---|---|---|---|
| | మొదటిది | చివరిది | శాసనానుమానికము నిర్దేశితము | చాటు |
| 1. ప్రోలయవేమ | 1247 శక | 1275 శక | 28 ఏండ్లు | 1 2 ఏండ్లు |
| 2. అనవోత | 1275 శక | 1286 శక | 11 ఏండ్లు | 3 0 ఏండ్లు |
| 3. అనవేమ | 1286 శక | 1304 శక | 18 ఏండ్లు | 1 5 -1 7 ఏండ్లు |
| 4. కొమరగిరి | 1308 శక | 1324 శక | 16 ఏండ్లు | 1 4 ఏండ్లు |
| 5. పెదకోమటివేమ | 1324 శక | 1341 శక | 17 ఏండ్లు | 20,25,27 |
| 6. రాచవేమ | - | - | - | 4 |

కొండవీటి రాజుల వ్యష్టి పాలనా పరిమాణముల విషయమున శాసనములకు చాటువునకు గల భేదములు స్పష్టము. చాటుకాల నిర్దేశితముల కాదనుటలో ఎట్టి సంశయము అక్కఱ లేదు. సమిష్టి పాలనము నూరేండ్లనుట మాత్రము సరియే. శక 1247 (మల్లవరం శాసనము) న మొదలైన ప్రోలయ వేముని స్వతంత్ర పాలనము శక. 1275 (ఆ పిదప అతని శాసనములు లేనందున) తో ముగియగా ఆ వత్సరమున అతని కొడుకు అనవోతరాజాయెను. మెకంజీ వ్రాత ప్రతుల యనుసారము శక. 1286-87 క్రోధియందు అనవోత తమ్ముడు అనవేముడు రాజైనట్లు

తెలియుచున్నది. అతని కొడుకు అనవోత రాజాయెను. మెకంజీ వ్రాతప్రతుల యనుసారము శక. 1286-87 క్రోధియందు అనవోత తమ్ముడు అనవేముడు రాజైనట్లు తెలియుచున్నది. అతని పాలనము శక. 1308 వరకు కొనసాగెననవచ్చును. కొమరగిరి శక. 1324 వరకు జీవించి యుండెను. ఆ యేటిదే పెదకోమటి వేముని తొలి శాసనము. అతడు శక. 1342 వరకు రాజ్యమేలెను. అతని కొడుకు రాచవేమ కొండవీటి రెడ్డి రాజులలో చివరివాడు. అతని పేరిట శాసనములేవియు లేవు. చాటుపద్యమును, స్థానిక వృత్తాంతము అతడు నాలుగేండ్లు పాలించెనన్నవి. కావున అతని పాలనాంతము శక. 1846/క్రీ.శ. 1424లో అతడు రాజుగనుండగనే విజయనగరముచే రెడ్డి రాజ్యాక్రమణ మొదలై కొండవీటి నగరమునే చెరబొరినది. క్రీ.శ. 1424న కది సమగ్రమై కొండవీడు రాజ్యమునందంతటను విజయనగరాధిపత్యము నెలకొన్నది.

రెడ్డి రాజ కాల న్నిర్ణయ మీక్రిందు పొందు పరచితిని, కానీ అదియును తాత్కాలోపయుక్తముగనే గ్రహింపదగును.

1. ప్రోలయవేమ శక. 1247 (1325A.D.) శక. 1275 (1353A.D.)

2. అనవోత శక. 1275 (1353 A.D.) శక. 1286 (1364 A.D.)

3. అనవేమ శక. 1286(1364 A.D.) శక.1308 (1386 A.D.)

4. కొమరగిరి శక. 1308(1386 A.D.) శక. 1324(1402 A.D.)

5. పెదకోమటివేమ శక. 1324 (1402 A.D.) శక. 1342 (1420 A.D.)

6. రాచవేమ శక. 1342(1420A.D.) శక. 1346 (1424 A.D.)

1. వేమ భూపాల చరితమున పేర్కొనబడెను.

2. హరివంశమున గాని, N.D.I.II Kr35,P.54లో గాని యితని పేరులేదు.

3. Kr. 15 (N.D.I 1, PP490 ff) ప్రకారము అల్ల కొడుకు వేమ. అతనికేడ్గురు కుమారులు. వారిలో మల్లయొకరు. ఆ శాసనము రాక్షాక్షి వత్సరమున వేసినది. ఈ అల్ల, వేమ, మల్లిలెవరో తెలియరాకున్నది. శాసనమున దోషములు పెల్లు. రక్తాక్షి శక. 1246న కో కాక శక 1306కో యీరెడ్ల కాలమున వర్తిల్లును.

4. అతని దృజ్జవర శాసనము వానిని ప్రోలవమాంబ సుతుడన్నది (సంప్రోలమ్- అంబాతనయః కృ-తార్థో)

5. అనవోతారెడ్డి కూతురును, కాటయవేముని భార్యయునగు నామె పేరు విషయమున అభిప్రాయభేదములున్నవి. ఆమె నామధేయము దొడ్డాంబిక యన్న పండిత వేటూరు ప్రభాకరశాస్త్రిగారితో నేనేకీభవింతును.

6. అతని తల్లి మను మాంబిక

7. అతని వంశానుక్రమమునకై చూ. అధ్యాయము XII

(ఎ) దొడ్డ(1) గుండాంబిక పోత, చిత్తవాసాంబిక నాగ అన్నెమాంబ(2) = కోమటి ప్రోల నూరిక+నారాంబిక నల్లనూరక+ వేమాంబ (ప్రోలయవేముని సోదరుడగు అన్నయ్య కూతురు)

(ఎ) కాట I మార కాట II రామ (2) + దొడ్డాంబిక (ప్రోలయ వేముని కూతురు) వేమ(3) లేక కాటయవేమన+ దొడ్డాంబిక (అనవోతనిసుత)

# అధ్యాయము - IV

# కొండవీటి రెడ్ల పూర్వ చరిత్ర

"రెడ్డి " పదము యొక్క వ్యుత్పత్తి వృద్ధులు చారిత్రముగానే గాక, భాషా పరముగా కూడ చిత్రమైనది. దాని విపుల వివరణమీయధ్యాయానుబంధమున చూడవచ్చును. రెడ్లు నేడును తెలుగు దేశమున కర్షక జాతులలో పేరుగన్నవారు. సేద్యమున వారికిగల ఆశక్తి, సదాప్రవృత్తి పరిశ్రమలు ప్రసిద్ధములు. రెడ్లందరును కాపులే కాని కాపులందరును రెడ్లు కాకపోవచ్చును.

## పంట రెడ్లలో భిన్న శాఖలు

తెలుగు కాపులలో వివిధ శాఖలలో పంటకాపులు లేక పంటరెడ్లు ఒకరు. తన భీమేశ్వర పురాణమున[1] శ్రీనాధుడు వారిని "పంట మహాన్వాయ" అన్నాడు. పంట వంశ ప్రస్తావము శాసనములందును[2] కలదు. ఈ పంటవారిలో గూడ శాఖలు పదునాల్గున్నవి[3] 15వ శతాబ్ది నాటి చాటు పద్య మొకటి[4] వల్లించినది. అది వ్రాసిన భట్టరాజు ఆరవీటి పిన్నమ కొడుకు బుక్క భూపాలుని కాలమువాడట.

1. పాకనాటి 2. వెలనాటి 3. మోటాటి 4. మొరస 5. పొంగలి నాటి 6. మున్నూరు 7. పంట 8. నేరేటి 9. భూమంచి 10. దేసటి 11. అయోధ్య 12. ఓరుగంటి 13. కురిసేటి 14. గండికోట కాపులు. ఎడార్ థర్స్టన్ తన "దక్షిణ యిండియా కులముల తెగల" (Castes and Trifes of southern India)లో వేరొక కాపుల పట్టిక ఇచ్చినాడు. ఈరెండు పట్టికలలో భేదములు కలవు.

దేశములో ఇట్టి పట్టికలు మరికొన్ని కలవు. అవి అన్నియు రెండు మూడు అంతశ్శాఖల విషయమున తప్పఏకవాక్కులు అయోధ్య, బలిజ, భూమంచి, దేసూరు, గండికోట, గాజుల, కమ్మపురి, మొరస, నేరాటి, (లేక నేరడు లేక నేరావలి), ఓరుగంటి, పాకనాటి, పల్లె, పెడకంటి, పంట

కాపులలో శాఖాంతర బాంధవ్యముల ఉపశాఖలు కొన్ని : ఆవుల, అల్ల, బండి, బట్టెలు, దండు, గొట్టె, గుడిశె, గుంటక, కోళ్ళ, మేకల, కానుగుల, ముంగారు, నాగలి, తంగేడు, ఉడుమల, వరిగె, ఎద్దులు, ఏనుగు.....

" కంజీవనంలోని పట్టరెడ్లలో కొన్ని వృక్ష, పశు ప్రతీకలతోడి వర్గములు కనబడును. ఉదా. మొగిలి పడుచులు అన్యశాఖల పడుచుల వలె, అలంకరణానికి మొగలి పూలను ముడువరు. మొగలి నారతో కట్టకట్టియున్నవని ఒకతడు వెదురుచాపల కొన నిరాకరించుటు తెలియనైనది.

ఇప్పి - ఈ చెట్టు కొయ్యగాని, ఆ చెట్టు వలన జనియించే వేనిని గాని ఉపయోగింపరు. ఆ కొయ్యతో చేసిన మంచముపై శయనించరు.

అరిగల - వారీ ధాన్యాన్ని భుజించరు.
చింతగింజల - ఆ గింజలను తాకరు, ఉపయోగించరు
పుచ్చ - పుచ్చ పండును తినరు

పై పట్టికల పరికించినచో కాపుశాఖలలో హెచ్చు వారి వారి వాసభూముల నగరముల పేర్లను గైకొన్నట్లు స్పష్టము. పట్టికలోని మొదటి ఎనిమిది పేర్లు పాకనాడు, వెలనాడు, మాటాటి, (మొట్టవాడికి అపభ్రంశము.) మొరస, పొంగలినాడు, మున్నూరు, పంట, నేరేడి (నళవాడి కి లేక నెరవాడికి అపభ్రంశము). విషయములందుండుట[6] చేతను అట్లే చివరి నాల్గు అయోధ్య, ఓనుగల్లు, కురచేడు, (నెల్లూరు జిల్లా) గండికోట (కడప జిల్లా) నగరవాసుల గుటచేతను, ఏర్పడినది. మిగిలిన రెంటిలో భూమంచి యెట్లో తెలియదు. అదియొక గ్రామనామమేమో. పంట, దేసటి - వీనిని వేరొక సందర్భమున వివరింతును.

కాలము గడువను వారిలో కొందరు నాగలి విడనాడి, కైదువు చేపట్టి వారి వారి ప్రభువుల సైన్య దళములలో చేరిరి. అందునిపుణులై, దళవాయులుగ, సేనా నాయకులుగ రాణకెక్కి, వారి ధైర్య సాహసములను, విశ్వాస పాత్రతలను మెచ్చిన రాజుల కడ క్రమముగా అదికార పద నిర్వహణ దక్షులై, ప్రసిద్ధులైరి.

కాకతీయుల కాలమున వారు కొన్ని నియోగముల నాయకులై, పరిపాలనా దక్షత చేత ప్రభువుల మన్ననవడసి చాలా బలీయులైరి. రాజ్యమున వారి యుత్కర్షమెండైనది. చెరకు జగదాళు బొల్లయ్య రెడ్డి ప్రభృతులు[7] మహా సామంతులై, తెలుగు దేశమున కొన్ని మండలముల పాలంచుచుండిరి. చిత్రమేమన, కాకతి ప్రతాప రుద్రునినాటి శాసనముల నెందును కొండవీటి రాజ్య ప్రతిష్ఠాపకుడగు వేమారెడ్డికి పూర్వుడగుపడడు. అయ్యును ఓరుగంటి కాకతీయుల పాలనా కాలముననే వారి రాజకీయ జీవితమారంభమయ్యెననుటకు వలయు సాక్ష్యము కలదు.

## దొంతి వారు, దేసటి వారు

గుంటూరుజిల్లా, ఒంగోలు తాలూకా చదలవాడ గ్రామమున, అచటి రాఘవ స్వామిని కులదైవముగా గొలుచు కొన్ని రెడ్డి కుటుంబములు చిరకాలముగనుండినవని కొండవీటి దండకవిలెయు కొండవీటి కైఫియత్‌ను తెలుపుచున్నవి. వారిని గూర్చి ఐతిహ్యమిట్లు : దొంతి వారి ఇంటి పేరు భూమి దున్నుచుండగా ఆ కుటుంబములోని కొందరకు నిధి కనబడెను. ఇతర గ్రామస్తులకు తెలియనీయక సడిచప్పుడు చేయక వారు నిధిని భుక్తము చేసుకొనిరి. కాని ఆ రహస్యము కొన్నాళ్ళకు బయటకు పొక్కి, గ్రామస్తులానిధిని వారి స్వాధీన మొనర్ప నిర్బంధింప సాగిరి. ఆ పరిస్థితిలో వారి కులదైవము రాఘువుడు వారికి స్వప్నమున కనబడిన వారిని వేరొకచోటికి వలస పొమ్మనియు, వారెచటనున్నను బంగారు విగ్రహరూపమున విడువక తన్ను సేవించు చున్నచో క్రమేణ వారైశ్వర్యవంతులౌదురనియు తెలియబఱచెను. వారట్లే యూరువీడి వరంగల్ సమీపస్థమగు అనుమ కొండకేగి అచట స్థిరపడిరి. ఎన్నోయేండ్లు గడచిన పిదప దొంతి కుటుంబమునకే చెందిన అల్లాడరెడ్డి తన మిత్ర బంధువులతో కొండవీడునకు వచ్చి చేరెను. కొండవీటి రాజ్యస్థాపకులు వీరే. వీరచట చేరినది శకవత్సరము ఋషి[8] వార్ధి (4) రుద్ర (11)లో శక 1147 వారణలోనట ఏ రెడ్డి శాసనములు గాని సాహిత్యముగాని పైకథను సమర్థించునవి లేవు. కాని శకవర్ష చక్రతారణను నిర్దేశించుటచే అది పూర్తిగ కల్పన కాదేమో చూతము.

రెడ్డి రాజుల శాసనము లెవ్వియు దొంతి శాఖను పేర్కొనవు. రెడ్డి రాజ పోషణమున శ్రీనాథ రచితములగు కాశీఖండ భీమేశ్వర పురాణములు ఈ పాలకులను "చతుర్థకుల మండనంబై కీర్తి విహార ఘంటాపథంబైన పంటదేసటి మహాన్వయంబు[9]" వారని వర్ణించెను. వేమారెడ్డి ఆస్థానకవి ఎఱ్ఱాప్రెగడ తన హరివంశమున తన పోషకుని "దేసటివేమ" యని సంబోధించును. శ్రీనాధుడు రాజమండ్రి పరిపాలకుడైన అల్లయ్య వీరభద్రారెడ్డి దేసటి వంశగ్రామణి[11] యనెను. వీరభద్రారెడ్డి సమకాలీనుడు కొమ్మనకవి రాజమహేంద్రి రెడ్డి రాజులను దేసటి వంశ్యులనియే వ్యవహరించెను[12]. ఈ సాహిత్యాధారములు రెడ్డి రాజులు పంటాన్వయ దేసటి వంశ్యులని నిశ్చయించుచున్నవి. కాని యా రాజుల శాసనములు వారిని దేసటి వారని సూచించవు. అందువారు బహుశాఖల కులజులలో పంటవంశీయులనియే వర్ణింపబడిరి. అనితల్లి కాలువ చేరుశాసనము[13] వేమారెడ్డిని "పంటవంశోద్భవు" డన్నది. కాని అనవేముని కుమారగిరి శిలాశాసనములు[14] వారిని "మనుమకులవార్ధి చంద్ర" ములుగా వర్ణించినవి. మఱికొందరు నాయకులును,సంస్థలను గూడ మనుమకుల సంసర్గమును వాకొన్నవి. శక 1275 నాటి యొక శాసనమున[15] మర్దులి మారయ నాయకుడు మనుమకుల మంధాత. ఒక వణిక్ శ్రేణిసభ్యులు. వీరబంలజులు, తమ్ము మనుమ కుల[16] స్థులుగ చెప్పుకొన్నారు. శక. 1082 శాసనమొకటి మల్లనాయకుని "మనుమకుల వార్ధి వర్ధన సుధాకర" యని స్తుతించినది[17] శక. 1085 నాటి కోటిరెడ్డి మనముకుడట కాకతి గణపతి దేవుని అధికృతుడగు కాలప నాయకుడు "మనమ కులాభరణు" డుగ కీర్తింపబడినాడు.[19] తమ మనముకుల ప్రసక్తిని చాటికొనిరో భావిపరిశోధనము తేల్చవలసి యున్నది. ఇప్పటికి తేలనిది రెడ్డిరాజులు మనముకుల సంభవులే గాక పంటాన్వవాయ దేసటి శాఖీయులును కావున దొంతి[19]ఎ కులులన్న స్థానిక వృత్తాంత సాక్ష్యమును విసర్జింపదనుగు.

## దేసటి వంశము

దేసటి యననేమి? 10-13 శతాబ్దముల తెలుగు శాసనములలో ముఖ్యముగ కృష్ణా గుంటూరు మండలముల వానిలో, నామవాచకముల కనుబంధముగ (Suffin) "దేసటి" పదము వాడుకలున్నది. కోన-కంద్రవాడి కుటుంబ మూలపురుషుడు

కొండదేసటి[20] శాసన కాలము తెలియదుకాని, 10-11 శతాబ్ద సంధి వత్సరములలో కావచ్చును. గుంటూరు జిల్లాలో వినుకొండ తాలూకా ఇనుమెళ్ళ[21] గ్రామ శాసనము కాట్య (కాటయ) దేసటి ప్రతిష్ఠనోకటిని ప్రస్తావించినది. గుంటూరు జిల్లాలో ఓగేరు ప్రవహించు ప్రాంతము - " ఓంగేరు మార్గ " దేశమున ప్రభావులుగ, మాండలికులుగ పూర్వము " దేసటి మహాసామంతులు " పాలించుచుండిరట. క్రీ.శ. 1043 నాటి గుంటూరు తెనాలి తాలూకా వలివేరు శాసనము[22] ఓంగేరు మార్గమునకు చెందిన దేసటి మహాసామంత నంబయసుతుడు గుండయ మాండలికుడగుపించును. క్రీ.శ. 12వ శతాబ్దిని వెలనాటి మాండలికులలో చివరివాడగు కులోత్తుంగ పృధీశ్వరుని సేనాధీశుడగు (ఏరప నాయకుని ఘద్యాను (ఘడియా)ని కొడుకు, ఎపర దేసటి[23] మనుమనిగ పేర్కొన్నది. క్రీ.శ. 1227 నాటి బెజవాడ శాసనమొకటి[24] చతుర్థీ కులజుడగ ప్రోది దేసటి కొడుకగు మల్లిదేసటి మొసగిన దాన శాసనము. పై ముద్దారములలోని దేసటి ఆగమ మరితంగా వచ్చుటయు, కొండవీటి రెడ్ల యడల రామియు వివరింప సాధ్యమగుట లేదు)

దేసటి పదము " దేశరట్టోడి " పరిణామ రూపమేమో, శక. 877 (క్రీ.శ. 955) సరియగు అమ్మరాజ విజయాదిత్య 10వ రాజ్యావర్షంబున ఆతూర్పు చాళుక్య రాజొసగిన దానము ప్రస్తావించు తామ్రశాసనమున " దేశరట్టోడి " రూపమగుపించును. మాది యదేశ పుట్టోడి పౌత్రుడును, కల్లికియ దేశరట్టోడి పుత్రుడును తనకు విధేయుడునగు మాదియ దేశరట్టోడికి అతని సేవల మెచ్చి అమ్మ రాజాతనికి అత్తిలినాండు విషయములోని పాండువ గ్రామమును, మహా సామంత బిరుదమును ప్రసాదించెను[25]. ఆంధ్రదేశమున " దేశరట్టోడిని " ఉగ్గడించు శాసనములలో కాలనిర్దేశము తోడి ప్రథమ శాసనమిదియే " రట్టోడి " పదము క్రమముగా రట్టడి, రట్టి, రద్ది అయిన విధముగానే దేశరట్టోడి గూడ దేశరట్టడి, దేశరట్టి, దేశట్టిగా మారియుండును. కాలక్రమేణ యీ దేసటి - దేసటి యగుటలో ఆశ్చర్యము లేదు. ఆ మొదటి రూపమగు దేశరట్టోడి క్రీ.శ. 13వ శతాబ్దము వరకు వ్యవహారమున నుండినది. శక 1153 (క్రీ.శ. 1230) శాసన మొకదానియందు[26] దేశరోట్టోడి ప్రయోగమున్నది. దేసట్టియను రూపము పలు శాసనములందు కలదు. దేసటి యన్నది దేశ రట్టోడికి పరరూపము గనుక, అది స్థానిక రెడ్డి జాతిని సూచింపవచ్చును. వీరు

తరువాత తరువాత బాహ్య ప్రాంతముల నుండి అచటికి వచ్చి చేరిన రెడ్డి కులజులకు విశిష్టులనుకొనవలెను.

ఇతర నాయకుల క్షత్రియ సామంతులతో పాటు దేశట్లను గూడా తెలుపు నొక శాసనము శక. 1069 నాటిది గుంటూరు జిల్లా కొణిదెన[27]లో కలదు. గుంటూరు జిల్లాలోని బాపట్ల వలె దేశట్ల గూడ (దేసటి రూపాంతరము) ఒక నగరమనుకోవచ్చును. ఓరుగల్లు ప్రతాపరుద్రుని ఆస్థానమునన్ను డెబ్బది యిద్దరు నాయకులలో కొందరు ప్రశస్తి లేక బిరుదావళులలో దేసట్ల నగర నామముగానే చెప్పబడినది. అందొకడు దేసట్ల పురపరాధీశ్వారుడు[28]. ఇంకొక శాసనమున[29] దేసటి యొక గిరిదుర్గమున చెప్పబడియున్నది. క్రీ.శ. 1005లో పశ్చిమ చాళుక్య నృపతి, ఇఱివిబెడంగ సత్యాశ్రయ యధీనుడు, మహాసామంత శోభణరస, దేసటి కొండకోటను జయించినపుడు దేసటి గిరి దుర్గముల్ల యను బిరుదముతో సత్కరింపబడెను.

కావున నీ రెడ్ల మొదటి వాసము దేసటి లేక దేసట్లగా నుండును. రట్టులు లేక రాష్ట్ర కూటుల రట్టలూరు పురవరాధీశ్వర బిరుదము వారి మూలశాసనముల ట్టలూరు లేక రట్టలూరు అని నర్దేశించి నట్లు పై చర్య సారాంశము. రెడ్డి రాజులు దేసటి లేక దేసట్ల కులులు. కొండవీటి కైఫియత్ స్థానిక లేఖ్యములలో వారికిచ్చిన ఉపనామములు సరికావని త్రోసిపుచ్చనగును.

రెడ్డిరాజ్య స్థాపనకు పూర్వము రెడ్డి ప్రభువులు నెల్లూరు జిల్లాలో వసించుచుండిరి. పంటవశ్యుల లేక పంటశాఖ వారాదినుండి సింహవిక్రమపురము (నెల్లూరు) దువ్వూరు, గండవరం మొదలగు నెల్లూరు కోవూరు తాలూకాలలోని పట్టణముల నివసించిరని[30] ఆనాటి సాహిత్యము తెలుపుచున్నది. పంటకావు, పంటరెడ్డియన్నవానిలోని పంటయన్న పదమే దానిని సమర్థించును.

## పంట శాఖ

బ్రాహ్మణులలో వెలనాటి, వేగినాటి, పాకనాటి, ఆరువేల శాఖలలో వలే పెక్కు కుల శాఖలు తెనుగుదేశములలోని వెలనాడు, వేగినాడు, పాకనాడు, ఆరువేలనాడు, లేక షట్సహస్రదేశమున్నగు, వారి వారి వాస దేశముల పేర్ల నేర్పడినది ప్రసిద్ధమే. ఆ

విధముగానే చతుర్థ కులమున సైతము భిన్న శాఖలు రూపొందెనని శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారి అభిప్రాయము.(31) తెలంగాలోని బ్రాహ్మణులును, శూద్రులును క్రమముగా తెలంగాణ్యా, తెలగశాఖలుగ, అట్లే వెలనాడులోని బ్రాహ్మణ శూద్రులు వెలనాటి బ్రాహ్మణ వెలమ శాఖలుగ, కమ్మనాడులోని బ్రాహ్మణులను, శూద్రులను, కమ్మ లేక కరణ కమ్మ బ్రాహ్మణ కమ్మలుగ తెలియనైరి. అట్లే పాకనాటి బ్రాహ్మణులను, పాకనాటి కాపులను ఇట్లు కులశాఖలు, దేశ విభాగముల పేర్ల బరుగుట చూడగా, పంటకాపులు రెడ్లు గూడ అట్టులేకారాదా? అగుచో పంటనాడు లేక పంటరాష్ట్రమను పేర పూర్వమేదైన దేశవిభాగముండెనా?

నెల్లూరు తెలుగుచోడ ప్రభువులలో ఎఱ్ఱసిద్ధి కొడుకు తమ్ముసిద్ధి యొక్క కంచి అరుళాల పెరుమాళ్ గుడిశాసనమున(32) " పంటరాష్ట్ర " మొకటి కనిపించును. తమ్ముసిద్ధి శక. 1127లో పంట రాష్ట్ర ప్రధాన గ్రామమగు ముట్టియంపాక్కమును హస్తిశైల స్వామికి సమర్పించెనట. ఈ ముట్టియంపాక్కమేదో, పంట రాష్ట్రమెటనో ఇంతకు తెలియరాలేదు. నెల్లూరు జిల్లా గూడూరు తాలూకాలోని ముట్టెంబాక మే ఆ ముట్టియంబాక్కమేమో. అది పంట రాష్ట్రపు ముఖ్య కటక (Head qrts.) మగుట, పంటరాష్ట్రమును గూడూరు తాలూకా తత్పరిసరములుగ్గాకై కొనదగును. కమ్మనాడు, వెలమనాడుల కమ్మ వెలమల పోలిక, పంటరాష్ట్రపు శూద్ర జాతులు పంటకాపులకు పంటరెడ్లనుకోవచ్చును.

కావున పంటరెడ్లు మూలస్థానము పంటరాష్ట్రమేగాని కైఫియత్తుల స్థానిక లేఖ్యములు చెప్పినట్లు అనుమకొండదేశముగాదు. ఆ రెడ్లు క్రమముగ తూర్పు పడమరలు వ్యాపించి, సముద్ర తీరము బడి ఉత్తరాభిముఖులైనారు. కాకతీయ ప్రభ అంతరించు దినములప్పటికి కొండవీడు రాజమద్రి రాజ్య కారకులగు రెడ్డి కుటుంబముల నెల్లూరు కోవూరు తాలూకాలలో స్థిరపడి యుండిరి.

ఇందు అందరూ సామాన్యముగా గుర్తించని విషయమొకటి యున్నది. శ్రీనాథుని రచనలు, రెడ్డి రాజుల తామ్రశిలా శాసనములన్నియును రెడ్డిరాజులు చతుర్థ కులజులనియే ఘోషించినవి. కాని కొమ్మనామాత్య కృతి శివలీలా విలాసమ్ముపై విశేషమును సమర్థించుచునే రాజమహేంద్ర ప్రభువు అల్లాడ సుతుడగు వీరభద్రుని

సూర్యవంశోద్భవుడని వర్ణించినది(33). దేసటి కుటుంబులను విష్ణుపాదమున దేవగంగతోడి పుట్టువులనుచునే కొమ్మన అల్లయ వీరభద్రుడు ఇక్ష్వాకుడగు దశరథుని సుతుడగు రామచంద్రుని సరియనియు ఇవ్వురు సూర్యవంశజులనియు, నిపుణధనుర్ధరులు శివభక్తులనియు ప్రస్తుతించెను. అట్లగుచో వీరభద్రారెడ్డియు సూర్యవంశజుడే. కాని పై ఉపపాదనము స్వవచో విరుద్ధము. ఎవరైన ఏక కాలమున చతుర్థ కులజులును, సూర్య వంశ్యులును కాజాలరు. కాని దానికి కూడ సమర్థనము లేకపోలేదు. వీరభద్రుడు మాత్రు పక్షమున ఇనకులుడు. ఆమె సూర్యవంశ్యుడును, ఏఱువ నాయకుడునగు భక్తేశుని కూతురు.

## రెడ్లు పల్లవులా?

రెడ్డిరాజులు "పల్లవాధిత్య", పల్లవత్రినేత్ర యను బిరుదములు దాల్చిరి. ప్రోలయవేమ, అనవేముల నామాంకము (Sign Manual) "పల్లవ త్రినేత్ర" (34) యని ఆపైవారు పల్లవులా(35) యన్న ప్రశ్నము తప్పదు. ఎనెల్లూరును పాలించిన పూర్వ పల్లవులు కొండవీడు రాజ్యస్థాపనకు కొన్ని శతాబ్దములకు ముందే అంతరించి పల్లవ పతనము రెడ్డిరాజ్య ప్రతిష్టలకు అంతరమున, కొందరు నాయకులు 12, 13 శతాబ్దములలో నెల్లూరు మండలమందధిక భాగమును చోళ సామంతులుగను, స్వతంత్రులుగను పాలించిన వారు. తాము ముక్కంటి కాడునెట్టి లేక త్రిలోచన పల్లవ లేక త్రినయన పల్లవ సంతతి వారమని ప్రకటించుకొన్నారు. వారి యధికారముల స్తమైన తరువాత వారు హిందూ వర్ణముల క్రింది తరముల వారిలో కలసి వారి వర్ణ వైశిష్ట్యన్ని గోలుపోయిరి. కావున 14వ శతాబ్దములేని రాజవంశములను తత్పూర్వ రాజవంశములుగాని నిరూపింపలేము.

కావున రెడ్లు పల్లవులనుట అనిశ్చితమే. వారిలో కొందరు 12, 13 శతాబ్దములలో నెల్లూరి పల్లవ కుటుంబములలో వియ్యమంది యుందురు. పంట రాష్ట్రము పల్లవ రాజ్యమున ప్రాచీన తొండై మండల విషయము. కావున రెడ్లు పల్లవ బిరుదములు దాల్చుటలో వింత లేదు. అదియును గాక హిందూ ప్రాభవ పునర్నిర్మాణ సందర్భమునందు ప్రాచీనమన్న వ్యామోహము తప్పనిసరి.

# రెడ్డి బిరుదావళి

రెడ్డి రాజ్య స్థాపనకు పూర్వము యీ కొండవీటి వంశమును గూర్చి తెలిసినది అల్పాల్పమే. కాని వారి బిరుదుములు వారి ప్రాధాన్యమును అది సూచించు రాజకీయ ప్రాబల్యమును ఊహింపవచ్చును. హరివంశ, భీమేశ్వర పురాణ, కాశీఖండాది కావ్యములలో వారి శిలా తామ్ర శాసనాదులలో కనిపించు వారి సుదీర్ఘ బిరుదావళి చరిత్ర దృష్ట్యా చాలగ - ఉపకరించును. వానిని జాగ్రత్తగా పరిశీలించిన ఆ వంశమున పూర్వులు సాధించిన ఘన కార్యములు తెలియగలవు. అట్టి చరిత్ర ప్రధాన బిరుదములించు పొందుపరచు చున్నాను.

అప్పయ్య - గొప్పయ దిశాపట్ట
జగనొబ్బ గండ
దండెన గోవ (గోప)
అళిగియ వరద శరః ఖండన
పాండ్యరాయ గజకేసరి (సింహ)
చెంచుమల చూరకార
గజ్జరి తట్టు విభాళ
రాచూరి దుర్గనిభాళ
ఆనెయముండలి కరగండ

రెడ్డిరాజ కథనములలోని ఈబిరుదములు వారి ప్రశస్తిని తెలుపును. అవి చెప్పిన ఘన కార్యములన్నియు శక. 1252 క్రీ.శ. 1330 తరువాతి శాసనములందే అగుపడుటచే అవి తత్పూర్వమే జరిగి యుండవలెను. కొండవీటి పూర్వుల లేఖ్యము లెవ్వియు లేని లోటును ఆ బిరుదములు కొంతకుకొంత దీర్చినవి. ఆ బిరుదములాధారముగనే కొండవీడు రాజ్యస్థాపనకు పూర్వపు రెడ్ల చరితము పూనినిర్మించవలిసి యున్నది. కావున ఆ బిరుదముల పరిశీలింతుము.

## (1) అప్పయ - గొప్పయ దిశాపట్టి

ఆ విజితులగు అప్పయ్య గొప్పయ లిర్వురోగాక గోపయ్య సుతుడగు నప్పయ ఒకడేనో తెలియదు. ఈ అప్పయ గోపయ్య వెవరు?

ద్వార సముద్రహోయసల రాజు వీరనరసింహదేవ II (క్రీ.శ. 1220-35) వద్ద అప్పయ గోపయ్యలని ఇర్వురు సమర్థులగు దండనాయకులుండిరి. వారిది తండ్రి కొడుకుల సంబంధము. కాడవ నాయకుడగు కొప్పెరుంజింగదు, చోళ చక్రవర్తి రాజు III (1216-1257) దక్షిణార్కాటు శెండమంగలం వద్ద చెరగొనగా చోళునికై పూని వీరనరసింహదేవ (II) కాదవనిశిక్షించి రాజరాజును విడిపించి యతని రాజ్యమున పునఃప్రతిష్టింపజేయుటకై, తన సేనానాయకుల అప్పనను, సముద్ర గొప్పవ్యా లేక గోపయలను పంపెను. వారి విక్రాంతులు రాజరాజు (II) నియొక్క 15వ రాజ్య వర్షమునకు సరియగు శక. 1153/క్రీ.శ. 1231 నాటి తిరువేండి పుర శాసనము[36]న నుతింపబడినది. మైసూరు తుముకూరు జిల్లా గుబ్బి తాలూకాలో శక. 1155/ క్రీ.శ. 1223 నాటి శిలాశాసన[37] మదే విషయమును పొందుపరచినది. వీరనరసింహదేవ (II) అప్పయ గోపయ దండనాయకుల కొక గ్రామమును దానమొసగెనని ఆ శాసన కథనము. హోయసాల సేనాపతి గొప్పయ దండనాయకుని కంజీవర శాసనము[38] రాజరాజు(3) యొక్క 15వ రాజ్యవర్షమునకు సరియగు శకము 1153/క్రీ.శ. 1231 నాటిది అతనిని దండినగోప, జనగొప్ప గండ (జగతికెల్ల ఏకైక వీరుడు) యని కొనియాడిరి.

ఆ యుద్ధములలో పాల్గొన్నతడు దుర్బలుడు చోళచక్రవర్తి రాజరాజు(3) యొక్క ప్రభల సామంతుడు తెలుగుచోడ తిక్కయ. అతనికి మధురాంతక పొత్తపిచోడ, తిరుక్కాళత్తి దేవుడనియు, గండ గోపాలుడనియు పేర్లు. అతడు హోయసల వీర నరసింహునికి అతని కొడుకు కరాట సోమేశయను సోమేశ్వరునికిని సమకాలమువాడు. చోడతిక్క కర్నాటక సోమేశ్వరునణచి, చోళచక్రవర్తిని మరల గద్దెనెక్కించి, చోళస్థాపనాచార్య[39] బిరుదమునాచికొనెనని కవి తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమున ప్రశంసించినాడు. రాజరాజు (3) పదిహేనవ రాజ్యవర్షమున (క్రీ.శ.

1231) అతడు కాంచీపురమున నుండినపుడు ఆ ఏడు వరద రాజపెరుమాళ్ గుడిలో గండ గోపాల సంధి యను పేరిట నొక క్రొత్త సేవ ను నెలకొల్పెను[40]. ఈ తెలుగు చోడ, కర్ణాటక యుద్ధములు కొన్ని వత్సరములు సాగినవి. శక. 1162/ క్రీ.శ. 1240లో ఒక మైసూరు శాసనము[41] హోయసల ప్రభువు వీర సోమేశ్వరుడు గండగోపాలునిపై దాడి వెడలుచుండినట్లు చూపుచున్నది.

వీరసోమేశ్వర సేనలను తరిమి కొట్టిన నెల్లూరు చోడ తిక్కనృపతి దళములలో కొండవీటి రెడ్డిరాజ పూర్వీకుల పటాలములుండి యే యుండును. శక. 1162కు సరియగు క్రీ.శ. 1240 లో చోళ రాజరాజు(3) ఇరువది నాల్గవ రాజ్యవర్షమున దండనాయకుడు కంచిలో అరుళాల పెరుమాళ్ గుడిలో అంఖండ దీపమును వేలిగించెను[42]. రెడ్డి నాయకులు అప్పయ-గోపయ దండనాయకు నోడించినది యీ యవసరముననే యుండనోపును.

ఈ యోటమి ఫలితముగ హోయసాల దండనాయకులు తమతమ బిరుదముల నడియాలంబుల తోడ విజయులగు రెడ్ల పాదములకడ పైచి నిలువగా నా బిరుదములను నాటి సాంప్రదాయానుసారముగ విజేతలు తమ స్వత్వములు గ గైకొనిరి. విజితుని పూర్తి యధీనమునకు గుర్తుగ వాని బిరుదములను విజేతలు దాల్చుట అప్పటి ఆచరాము. ఓడినతడు తన యా శత్రుని నిర్జించిన వరకాబిరుదముల తాల్పరాదు. ఇట్లా కీర్తిప్రతీకలు చిరకాలముగ దేశదేశమునకు, కుటుంబ కుటుంబమునకు వ్యాపించుచుండినది. "దండినగోవ", జగనొబ్బగండ, అప్పయ గొప్పయదిశాపట్ట బిరుదములను రెడ్లు ఈ విధముగ సోమేశ్వర దండనాయకుల నోడించిన తమ పూర్వుల నుండి పారంపర్యముగ తాల్చుచుండిరి.

## అళగియ వరద శిరఃఖండన

రెడ్లచే శిరము కోల్పోయిన ఆ అళగియ వరదుడెవరో తెలియదు. కొప్పెరుంజింగడును, అతని తండ్రి యును క్రమముగ "అళగియసీయన్" "అళగియ పల్లవ" బిరుదులు. ఈ అళగియ లేక అలగియ పదము అళగియ వరదుడు కూడ కొప్పెరుంజింగని బంధువొ పల్లవ సామంతుడేమో. ఈ యూహసరియైనచో, ఈ

విజయముగూడ 13వ శతాబ్ది మధ్యమమునకే చెందవలయును.

## "పాండ్యరాయ గజకేసరి"

రెడ్డిరాజులు ఏ పాండ్యునిపై విజయము సాధించిరి? ఎప్పుడు? పాండ్యరాజధాని మధుర ముస్లిముల చేజిక్కినది వరంగల్ పతన సమయముననే అనగా క్రీ.శ. 1323 ప్రాంతమున[43] పాండ్యుల బలము అంతఃకలహముల వల్లను, క్రీ.శ. 1319 ఖుస్రూఖానుని మాబారు దండయాత్రా ఫలితముగను మూలమట్టముగ సడలిపోయినది. పాండ్యులపై రెడ్ల విజయము క్రీ.శ. 1319కి పూర్వమే జరిగియుండవలె. అది కాకతీయ ప్రతాపరుద్రుని దక్షిణ దేశవిజయ యాత్రా సందర్భముననై యుండును. కాంచి నుండి పాండ్యుల పాలద్రోలి, దానిని దక్షిణ దేశమునుండి వచ్చు శత్రువుల దాడి నరికట్టుటకై యొక స్కంధావారముగ తీర్చి ఆ దక్షిణపు టెల్లపై తన యధికారము తిరిగి నెలకొల్పుటకై ప్రతాప రుద్రుడు తన సమర్థుడగు యధికృతుడగు ముప్పడినాయకునాదేశించెను. ఆ కాకతీయ సేనాని దేవరి నాయకుడు బాలనాయకుడు, తన కొడుకు పెద్దరుద్రుడు ఆది దళ వాయులును రేచర్ల, తదితర కులముల నాయకుల తోడురా, యొక మహాసైన్యముతో దక్షిణమునకు తరలెను. అప్పుడు కంచిని పంచ పాండ్యులు పాలించుచుండిరి. సుందర, వీర, విక్రమ, పరాక్రమ, కులశేఖరులను నా పాండ్యులు ప్రతాపరుద్రుని సైన్యములను - తీవ్రముగ ప్రతిఘటించిరి. జరిగన ఘోర హవమున తుదకు ముప్పడి నాయకుడే నెగ్గెను, శక. 1238/క్రి.శ. 1316 కంచని చేజిక్కించుకొని పాండ్యుల[44] నందుండి తఱిమివైచెను. ఆ యుద్ధమున శౌర్య సాహసములవెలార్చిన రేచర్ల తదితర నాయకులు పాండ్య గజకేసరి బిరుదముచే సత్కృతులైరి. రెడ్లకు నీ బిరుదవున్నందున వారును ఈ యుద్ధమున పాల్గొనిరనవచ్చును. ప్రోలయయు యోధగా కీర్తి నార్జింపనుత్సహించు అతని కొడుకు అనవేముడును కాకతీయ సైన్యాధిపతి వెంట కంచికేగి యున్న నాశ్చర్యముగాదు.

## చెంచు నుల చూరకార

సాహిత్యమునను, శాసనములందును "చెంచుమల" "చెంజిమల" యనియు చెప్పబడినది. చెంజిమల యే సరియనిపించును. "చెంజిమల" చూఱలాడిన వాడను

బిరుదమున "జింజిదుర్గము" స్ఫురించును. వేమారెడ్డియో అతని పూర్వజులో జింజీకడ విజయముగొని యుందురు.

వేముని రాష్ట్రముల దక్షిణార్కాటు జిల్లా జింజీ వరకు విస్తరింపలేదు. కాని ఈ బిరుదము ప్రోలయవేముని తొట్టతొలి శాసనమునన్నైనందున, అది సూచించు విక్రమ కర్మ రెడ్డి రాజ్య స్థాపనకు ముందే జరిగియుండవలెను. చాలావరకది ముప్పడి నాయకుని కంచి దండయాత్రా సందర్భమునన్నై యుండును. శక. 1243/క్రీ.శ. 1321 నాటి ముప్పడి నాయకుని సుతుడు పెదరుద్రుని దక్షారామశాసనమున(45) నీ దండయాత్రా విశేషములెన్నియో యున్నవి. చిత్తూరు జిల్లాలోని నారాయణ వనము, పరిసర ప్రదేశములు వశపడినవి, సాంబువ రాయలు కంచిని గొన్న పిదప ముప్పిడి నాయకుడు పంచపాండ్యులను తిరుచునాపల్లి జిల్లాలో జంబుకేశ్వరము దనుకవెన్నాడెను(46) త్రిభువన చక్రవర్తి కోనేరిన్మెకొండన్ సుందర పాండ్య దేవుని వృద్ధాచల (జింజీ కి దక్షిణమున)(47) శాసనము ఉటంకించిన కాల విశేషములకు సరియగు క్రీ.శ. 1315 న కాకతీయామాత్యుడగు ముప్పిడి నాయకుని తన పేర నతడు ప్రతిష్ఠించిన యొకసేవకై, మిక్కిలి కొనియాడినది. అతని యీ దక్షిణ యాత్రాకాలమున అతని సేనలలో రెడ్లు అగ్ర నాయకులైయుందురు.

## గుజ్జరి తట్టు - విభాళ

"తట్టు" అన్న గుజ్జము ఘూర్జరాశ్వ దళములయన్మూలనము అవి దక్షిణ దేశమునకు వచ్చినపుడే సాధ్యము. అట్లు జరిగినది మహమ్మద్ బీన్ తుగ్లక్ సేనలు అతనికెదురు తిరిగిన మేనల్లుడు బహద్దీర్ గుస్తాస్ కాశ్రయమిచ్చిన కంపిలి రాయని రాజధాని నగరమును ముట్టడించినపుడే. ఆ ఘట్టమును ఫెరిస్తా యిట్లు వ్రాయుచున్నాడు. "సుల్తాన్ (మహమ్మద్ బీన్ తుగ్లక్) తిరుగుబాటు వార్త విని, ఖాజా జహాన్ ను పలువురు సర్దారులతో ఘూర్జర ఆశ్వికదళముల నన్నింటిని గొని ఆ రాజ ప్రతిరోధిని నిగ్రహింపనియోగించెను(48). బహోల్దీన్‌యోడి సాగర్ నగరమునకు పారిపోయెను. చక్రవర్తి సేనలు అతని వెంట నంటినవి. అతడు తన కుటుంబమును, సామాగ్రి సర్వమును వెంట గొని పరులిడి

కంపిలి రాజాశ్రయము బడసెను. అతనిని తరుము చక్రవర్తి సైన్యములు కంపిలి రాజ్యపురమగు కుమ్మటమమును చుట్టుముట్టినవి. హిందూ దళములు వారిని రెండు

మూరులు ఓడించినవి[49]. బహుశః రెడ్డి నాయకులీ యదనును కంపిలి సేనలతో గలసి గుజరాత్ పటాలములగు ధ్వంసమొనర్చియుందురు. ఆ కారణముగనే వారి " గుజ్జరి తట్టు విభాళ" బిరుదము. వేముడు స్వయముగ తన సోదురలతో బందుగులతో కంపిలి రాజుకు తోడ్పడి యుండును. ఇది హిజ్రీ 727/క్రీ.శ. 1326-27 జరిగినది.

## " రాచూరు దుర్గ విభాళ - ఆనెయ మండలి కరగండ "

ఇందు రాచూరు లేక రాయచూరు దుర్గవిధ్వంసనము ఆనెయ మండలి లేక ఆనె గొంది సామంత ప్రభువుల యోటమియు సూచితములు. రాయచూరు దుర్గనిర్మాణము శక. 1216 క్రీ.శ. 1294లో[50] విజయనగర రాజ్యస్థాపన శక. 1258/క్రీ.శ. 1336-37 విజయనగరమునకు మొదటి రాజధాని ఆనెగొందిపై బిరుదముల కథ క్రీ.శ. 1294-1336-7 అంతరమున జరిగియుండును.

తీరాంధ్ర సామంతుల విజయములు ప్రోత్సహింపగా, ఆరవీటి సోమదేవరాజు స్థానిక ముస్లింసర్దారుల ధిక్కరించి శక. 1251/క్రీ.శ. 1329లో తుంగభద్రకీవలి యావలి దేశభాగమును జయించెను. ఈ తరుణమున నతడానెగొంది, రాయచూరు మొదలగు దుర్గముల చేజిక్కించుకొనెను. వేముడు నతని యనుచరులును సోమదేవరాజునకు హృదయపూర్వకముగ తోడ్పడిరి. ఆ సందర్భములు రెడ్లు నిర్వహించిన పాత్రను పై రెండు బిరుదములు వాడుకొన్నవి.

పై చర్చవలన 13వ శతాబ్ది ప్రథమ పాదమున కొండవీటి రెడ్ల పూర్వులు సైనిక వృత్తిని చేపట్టిరని స్పష్టపరచుచున్నది. మొదటి నెల్లూరును విక్రమసింహపుర తెలుగుచోడుల యొద్ద, ఆపై వరంగల్ కాకతీయుల కడ, పదవుల చేపట్టి అధికారుల మన్నన వడసి, ప్రముఖులై కాకతీయ పాలనమున రాష్ట్ర పాలకులుగా ప్రసిద్ధి కెక్కిరి.

## ఘోడెరాయ గంగయ దేవ

రెడ్డిరాజుల రాజకీయ జీవితాదినుండియు, వారికుపదేశకులును ఆధ్యాత్మ గురువులుగ నుండిన వారు ఘోడెరాయ సంతతివారు. హరివంశమున నెఱ్ఱాప్రగడ తన పోషకుడగు వేముని ఘోడెయరాయ గంగ-గురు-కృపాస్థాపిత-సామ్రాజ్య-సముద్దీపిత

వేమనరేంద్ర" యని వర్ణించినాడు[51] మద్రాసు మ్యూజియం తామ్ర పత్రములలో[52] వేముడు ఘోడెరాయ గంగయ గురుపాదపద్మ మధుపుడు. రెడ్డి రాజగురువులుగ ఘోడెరాయ సంతతి రాజులపై వారి ప్రభావము నెరపుచునే వచ్చిరి.

వేముని గురువగు ఘెడెరాయ గంగయ దేవుడెవరో తెలియదు. కాకతీయ రుద్రమదేవి కాయస్థసామంతులలో అత్యంత ప్రభలుడగు అంబదేవుని సచివుడొక ఘోడెరాయ గంగ దేవ లేగ గంగి దేవ కలదు. క్రీ.శ. 1272 మొదలు 1304 వరకు అంబయ గండికోట, ములికినాడు, రేనాడు, బెదకల్లు, సకిలి, ఏరువ, పొత్తాపి, ఆదివిషయముల పాలించుచుండెను. అతని శాసనములు శక. 1194, 1212, 1213, లేక 1272, 1290, 1291 వత్సరములవి కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకా త్రిపురాంతకమున దొరికినవి. అతని మంత్రి ఘోడెరాయ గంగయ దేవుడు[53] చాలబుజు స్వభావుడును, సమర్థుడును. అతడెన్నియో ధర్మ కార్యములు నిర్వహించెను. తాను గొప్ప శివ భక్తుడగుటచే శివదేవాలయము కెన్నియో దానములనిచ్చెను. వాపీకూప తటాకముల త్రవ్వించెను. శైవభక్తులు మహేశ్వరులకు అన్న సత్రముల గట్టించెను. ప్రమాణికమగు కొలబద్దతో భూములు గొలిపించి పన్నులు విధించెను. వేముని గురువగు గంగయ దేవుడీయనయే కావచ్చును. అగుచో నీతడే వేముని పూర్వులను అంబదేవుని కడ కొలువిప్పించి త్రిపురాంతకమున వారిని బాధ్యతాయుతములగు నున్నత పదవుల నిల్పి యుండును.

## వేముని కుటుంబము

వేముని పూర్వీకులు తమ విక్రమ కార్యముల స్ఫురించు బిరుదములనే గాని శాసనాది లేఖ్యములను వదిలి వెళ్ళలేదు. కారణము తెలియదు. కొండవీటి వారి శాసనములు వేముని తండ్రి తాతలగు ప్రోలయ వేములకు మాత్రమే ప్రస్తావించినది. వారిలో తాత వేముడు "వంశకర్త" యుట[54] ప్రోలయవేముని ముట్లూరు తామ్రశాసనము[55] వంశకర్త వేముడు శక్తిశాలియగు సైన్య నాయకుడు నట, అంబయదేవ కాయస్థుని కడనే యై యుండును. ఘోడెయరాయ గంగయదేవ ప్రసాదముగనే ఆ వేముడు ఉన్నత పదవుల నధిష్ఠించెననుట అతిశయోక్తి కాదు. అదే శాసనను ప్రోలయను "క్ష్మానాధు"డన్నది. తండ్రికిని హెచ్చు ప్రాధాన్యము వహించెనన్ననాట. నెల్లూరు జిల్లా

కందుకూరులో దొరికిన శాసనం[56] అతన్నిరాజన్య మకుటమణియని, గజసాహిణియని మరెన్నో ఉత్ప్రేక్షలతో పొగిడింది. వేముని (1) మల్లవరం[57] శాసనమతన్ని కోమటి ప్రోలయ యంటూ అతడు శత్రు నృపతీ సరీసృపగరుడు డన్నది. ఇవి అతిశయోక్తులు అతడు సామంత నాయకులలో ప్రముఖుడనుట మాత్రమవి సూచించెను. డెబ్బది ఇద్దరు నాయకుల బిరుదావళి ప్రయోజనము నంతియే. పైన చెప్పినట్లు ఆ డెబ్బది ఇద్దరిలో దేసట్లు లేక దేసటి వారు కాకతి ప్రతాప రుద్రుని కొలువున త్రిపురాంతక ప్రాంతముల 14వ శతాబ్దమును రెండవ దశాబ్దిలో అదికారము నిర్వహించిరి. త్రిపురాంతక పరిసరములగుటచే వేమాదులకు కుమరగిరి లేక కుమారశైల స్వామి కులదైవమాయెను[58].

కొండవీటి రాజమండ్రి రెడ్డి రాజులు పంటవశ్యులే యైనను వారికుల గోత్రములు వేరు. కొండవీటి వారికి వంశకర్త వేముడు వెల్లచేరి గోత్రము, రాజమండ్రి వారి మూల పురుషుడు దూవూరి పేరు మాండి రెడ్డి, పోల్వోల గోత్రము.

కొండవీటి వారి ఆది పురుషుడు వేమయ, అతని కొడుకు ప్రోలయ లేక కోమటి ప్రోలయ అతడు ప్రసిద్ధి సేనానాయుకుడగు దొడ్డారెడ్డి కూతురన్న మాంబను వివాహమాడెను. వారికైదగురు పుత్రులు : వరుసగా మాచ, వేమ గొడ్డ, అన్నయ, మల్లయలు. ఎఱ్ఱాప్రగ్గడ తన హరివంశమున దొడ్డయను పేర్కొనలేదు. అని రచించు నాటి కతడు మరణించెనేమో.

తండ్రి ప్రోలనికి వలనే మాచవేములకు కూడా పేర్లు పూర్వము కోమటి ఉపసర్గ యున్నది. వేమకు నానాభి ధానములు - కోమటేంద్ర, కోమటి వేమ, అనవేమ, ప్రోలయ వేమ (ప్రోలయవేమ కొడుకు) యని ఈరెడ్ల పేర్లకు వైశ్యసంజ్ఞికమగు కోమటి పదమును ఉపసర్గముగ, నామరూపముగ కూడ ఎందుకు జోడించిరో తెలియదు. నిక్క మెంతయో తెలియదు కాని తరతరములుగ వచ్చు నైతిహ్యమొకటి కొంటవీటి కైఫియత్ దండ కవిలెలోనిది యీ జటిల సమస్యా పూరణకును, అంత త్వరగా రెడ్లు రాజ నిర్మాతలెట్లు కాగల్గిరో తెలియుటకును సాయపడుచున్నది.

ఆ కథ సంగ్రహముగనిట్లు. - దొంతి వంశ్యుడొక అల్లాడు రెడ్డి కలడు. అతని ఇంటికి యొకనాడు వేమన యను యొక యతిధి వచ్చెను. అతడు వైశ్య

(కోమటి) కులజుడు. ఏండ్ల తరబడి అతడు సిద్ధులతో, యోగులతో అరణ్యముల వెంట తిరిగి, లోహమును బంగారముగ మార్చు పరుసవేదిని సంపాదించెను. దానినతడు అతి గుప్తముగ దాచి రక్షించు కొనుచుండెను. అల్లాడ ఆ రహస్యమునెటులో పసిగట్టి, ఆ పరుసవేది కాజేయ సమయమునకై వేచియుండెను. అతడొక చతుర వ్యూహమును పన్ని, ఒకనాడు అతిథి వెలినెటకో పోయియుండగా పరుసవేదిని దక్కించుకొని, తన దోషము కప్పుకొనుటకై యింటికి నిప్పంటించెను. తిరిగివచ్చిన కోమటి అది చూచి విభ్రాంతుడై, అల్లాడరెడ్డిని తన పరుసవేది గతినడిగెను. అల్లాడ అట్టిదొకటి కలదనయే తానెరుగనని, అట్టిదొకటున్నచో, తన ఇంటి గతియే దానికి సై యుండునని బూకరించెను. నిరాశాహతుడై, తన జీవితము నధికభాగము వెచ్చించి గడించిన నిధి గోల్పడితి నన్న దుఃఖముతో యగ్ని యందు దుమికి ఆత్మహత్య యొనర్చుకొనెను.

అంత కొంత కాలమునకు అల్లాడరెడ్డికి కలలో వేమన అగుపడి ఆ వ్యవహారమంతయూ తనకెరుకవడెనని, ఆ పరుసవేది మూలమున గడించిన సర్వమును ధర్మ కార్యములకై వెచ్చించడేని, అల్లాడరెడ్డిని అతని వంశమును నాశము జేతునని బెదిరించెను..... అల్లాడిరెడ్డి సంతతి వారెల్లరికిని తన పేరిడవలెనని ఆదేశించెను. అల్లాడియు అతని పుత్రులును ఆ పరుసవేది కురిసిన ధనముతో పెద్ద సైన్యమును సమకూర్చుకొని స్థానిక సామంతులనోడించి, అధినాయకులైరి.

ఈ కథ లోని అల్లాడగాని, ఆ దొంతి కుటుంబము గాని చారిత్రకముగ తెలియరాదు. కాని గుర్తింపవలసినది. ఇతర యేరెడ్ల లోనూ లేని "కోమటి" "వేమ" పదములు ఒక్క కొండవీటి రెడ్ల నామములందే వర్థిల్లుచున్నవి. స్థానిక వృత్తాంతములు "ప్రోల", "దేసటి" స్థానముల పొరబాటున "అల్లాడ" "దొంతి" పదముల నిల్పినవేమో. మంచాళ్ళ తామ్రశాసనము(59) ప్రోలయ వేమునిది అతనిని "స్వర్ణకార ప్రసిద్ధింలబ్ధవా"నని వర్ణించినది. ఈ ప్రశస్తిపై కథాంశమును గూఢముగ స్ఫురింపజేయును.

అదెటులైనను వరంగల్ పతనానంతరము అరాచకము, అస్వామికము, ప్రభలిన ఆ రోజులలో, నెందరో యితర అధిపతుల వలనే ప్రోలయ రాజ్యలబ్ధికై యత్నించి యుండును. అది సిద్ధించక పూర్వమే అతడు గతించెను. కాని అందుకైన అతని కలలును, సర్వాభిలాషలును ఆరంభణలును, అతని రెండవ కుమారుడగు వేముని కాలమున ఫలించి వేముడు కొండవీటి రాజ్య ప్రతిష్టాపకుడయ్యెను.

# ఆధారములు

1. కీర్తి విహార ఘంటా పథంబైన పంట మహాన్వయంబు
2. JAHRS XI PP 208-09, p-212 Ep. Ind IV, p 322

   తత్ర పంట కులంనామ ప్రసూతం బహుశాఖీని - ప 6Ep. Ind. V, p 57 పదపద్మజానాం వంశేష్వభూజ్జగత పంటకులం ప్రతీతం. ప- 4 భీమేశ్వర పురాణమున శ్రీనాధుడు చతుర్ధ వర్ణులుగా పేర్కొన్నవారు పద్మనాయకులు, వెలమలు, కమ్మలు సారిసరుల (?) ఒంటర్లు. మొ.. ఈపట్టిలో రెడ్లు లేకుండట గమనించునది. ఆరోజులలో రెడ్ల వెలమల నొకటిగ పాటించి రనుట కాధారమున్నది. "భోజ రాజీయము"న కవి అనంతుడు (చూ. రెండవభాగము - తెలుగు సాహిత్య భాగము) రెడ్డి వెలమ పదములను సమానార్థకములుగనే వాడినాడు.

   అనయము వేశ్యయీ తరుణి యాతడు క్షత్రియుడేను విప్రుడన్.

   వినువణిజుండు వాడతడు వెల్మయు నల్వురు దొల్లి దీనిది

   క్కన జరియించు చుండుదుము... VII ప 6 6

   ఆవెలమనే అతడు రెడ్డి కొడుకుని వర్ణించినాడు.

   ఇట్టి దయగు కార్యంబని, గట్టిగ నింతిగొని పోయికతిపయతధి బట్టణము సారగ గోమటి, సెట్టియు నీరెడ్డి కొడుకు జెటియొక VII ప.
3. కృషిక కార్మిక కులములతోనే దేనొక సంఖ్య జోడించి పల్కుట పరిపాటి. ఆసంఖ్యకు గల విశిష్టార్థమింతకు తెలియదు. ప్రాతశాననములలో నూనెనాడు వారిని తెలికి వర్ణించుటలున్నది. అలాగే "వెలమవేయి" విశ్వకర్మలు ఎనుబదినాల్గు కులాలవారు నగరలు నూటరెండు కులముల వారు, దేవాంగులు "పదివేలకులము".

   "పరగిన కశ్యబ్రహ్మ గోత్రజులు

   స్థిరలీల బడవీటి దేవాంగ ఘనులు

   పరమ సమ్మదముతో బదివేల కులము"

   - దేవాంగపురాణము D.C.T.M (Madras)

   Vol. IV, P 1251

   దొమ్మరలు గూడ "ఇరువది నాల్గు శాఖ"

   "ఇరువైనాలుగు కులాల దొమ్మర్లకు"

   N.D.I. Vol. II Kr. 41, P 566
4. పంటాన్వయమునను పదునాల్గు శాఖలు

   జక్కగా వివరింతు సత్యమరసి

   మోటాటి వెల్నాటి మొరస నేరెడయోధ్య

   పంటపొంగలి నాటి పాకనాటి

   భూమంచి కురిచేటి మున్నూటి దేసటి

యొనర గండియ కోటి యోరుగంటి
యనబరగుచునుండు నంధ్రావనీస్థలి
గౌరవాధిష్ఠత కాపుకలము
పంటపదునాల్గు కులము లంచంట జగతి
దర తరంబుల నుండియు వరలెడునుడి
వీనికుపజాతులున్నవి వివిధములుగ
చు జబలా టోప! పిన్నమ బుక్కభూప!

5. మద్రాసు ప్రెసిడెన్సీలో నెల్ల కాపులేక రెడ్డికులము అత్యంత విస్తృమైనది. తెలుగు దేశములోనే సేద్యగాంద్రు రైతులు పెద్దరెడ్లు (Cultivation Farmers of Squircens) కలిసి 20 లక్షలకుపైగా నున్నారు. వర్ణవంగడాలన్నా సులువుగా లెక్కించవచ్చుగాని రెడ్ల శాఖలన్నీ లెక్కించడ మసాధ్యమని చిరకాలంగా వస్తున్న నానుడి. మరికొందరు "పదునాల్గు కులాలనడమే సరియంటారు.

ఈక్రింది శాఖలు అత్యంత ప్రముఖములని స్టూఅర్ట్ నమ్మకము
అయోధ్య, బలిజ, భూమంచి, దేసూరు, గండికోట, గాజుల, కమ్మపురి, మొరస, నేరాటి (లేక నేరడు లేక నేరావలి), ఓరుగంటి, పాకనాటి పల్లె, పెడకంటి, పంట".

కాపులలో శాఖాంతర బాంధవ్యముల ఉపశాఖలు కొన్ని : ఆవుల, అల్ల, బండి, బట్టెలు, దండు, గొట్టె, గుడిశె, గుంటక, కోళ్ల, మేకల, కానుగుల, ముంగారు నాగల, తంగేడు, ఉడుమల, వరగె, ఎద్దులు, ఏనుగు...

కంజీవరంలోని పంటరెడ్లలో కొన్ని వృక్షపశు ప్రతీకతోడి వర్గముల కనబడును. ఉదా. మొగిలి పడుచులు అన్యశాఖల పడుచుల వలె, అలంకరణానికి మొగిలి పూలను ముదువ రు మొగలి నారతో కట్ట కట్టి యున్నవని ఒకతడు వెదురు చాపల కొన నిరాకరించుట తైలియనైనది.

ఇప్ప : ఈచెట్లు కొయ్యగాని, ఆచెట్టు వలన జనించే వేనిని ఉపయోగింపరు. ఆకొయ్యతో చేసిన మంచముపై శయనించురు.

అరిగల : వారీధాన్యాన్ని భుజించరు.

చింతగింజల : ఆగింజలను తాకరు, ఉపయోగించరు

పుచ్చ : పుచ్చపండును తినరుచూ

Vol. III S.V. Kapu, E.R.E. XII, P. 402, S.V. Totemisum - India.

6. పెన్నానది మొదలు గుండ్లకమ్మ వరకు గల భూమి పూర్వమున పాకనాడు గుంటూరు జిల్లాలో ఉత్తర భాగము వెలనాడు మొట్టవాడి నేరేడులు ఇంచుమించు నేటి మార్కాపురమును దాని పరిసరములలో కృష్ణాతుంగభద్రల దక్షిణ తీరపు తాలూకాలును; పొంగలినాడు ఏదో తెలియదు. మున్నూరు ముల్కిమున్నూరు దేశము; మొరస మైసూరులోని కోలారు భాగము. పంట

విషయము తర్వాత తర్కింతము.

7. Ep. Coll. Nos. 321, 322 of 1937 - 38 Ins. Ccd. Nos. 105 P. 450 రేచర్ల రెడ్లు, పిల్లలమత్తివారు. వరంగల్ కాకతీయుల కడ ఉన్నత పదవుల్లో వ్యవహరించారు.

8. Mack. Mss. 15-4-40; LCC Rec. Vol. LXVII, pp 7 ff
న్యూయజ్ యిట్లు వ్రాయుచున్నాడు. కొండపల్లిపరంపరగా వచ్చు స్థానిక లేఖ్యములు ప్రోలయ వేమారెడ్డికి, దొంతి అల్లాడరెడ్డి కెట్టి సంబంధము లేదనియు అతని యింత యతిథి మాత్రమేననియు తెల్పును. అల్లాడరెడ్డి ధరణికోట సమీపమున గల అమరావతి వాసి. అతడిచ్చట ప్రవేశించినది క్రీ.శ. 1225 లో - చూ. Antiquities Vol. II, P. 18.

9. భీమ. పు. వచన భాగము 31, పుట 6

10. హరివంశము I, IX పద్యము

11. కాశీఖండము III ప. 1

12. శివలీలా విలాసము - చూ. రెండవభాగము, VII అనుబంధము

13. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక Vol. II, PP 93 ff

14. Ep. Call Nos. 330, 368 లో 367 of 1926 భారతి XXI

15. Ep. Call 181 of 1905

16. Ep. Call 180 of 1905

17. S.I.I. Vol. VI, No. 649

18. S.I.I. VI. No. 598

19. S.I.I. Nos. 602, 603 మనుమకుల, దుర్జయకుల, దినకరకుల, సోమకుల ఈనాల్గును ఆంధ్రదేశమున ప్రాచీన రాజవంశములు. ప్రాక్తన రాజలో చాలమంది ఆరాజ్యమును పాలించినవారే.

19ఎ. ఒకరెడ్డి కుటుంబము, దొంతిపర్తి (దొంతికాదు) వారుండిరి. కొండవీటి రెడ్డిరాజులకు గాని రాజమహేంద్రవర రాజులకుగాని ఆ కుటుంబముతో ఎట్టి సంబంధమున్నట్లు లేదు.

20. S.I.I. Vol. IV No. 1153

21. Ep. Coll No. 218 of 1936

22. Ep. Coll 673 of 1920

23. S.I.I. Vol. V, No. 1338

24. Ep. Coll No. 321 of 1919

25. C.P. No. 7 of 1937 - 38

26. S.I.I. Vol. V, No. 1290 "భోగాపురమున దేశరట్వోడియును..."

27. S.I.I. Vol. VI 639 "మొట్టవాడి, గుండికర్త రాచకొడుకులు, దేసట్లు..."

28. Mac. MSS 15-5-32, "దేసట్లు వారి బిరుదు దేసట్ల పురాధీశ్వర్ దన్నాల కోట రాయవేశ్యాభుజంగ..."

29. S.I.I. Vol. XI, (BK I, Vol hpt 1) No. 50 శ్రీమద్దేసటి గిరిదుర్గ మల్లం.

30. భీమేశ్వర పురాణము I వచన 31
31. ఆంధ్ర పరిశోధన మహామండలి 5 వ సదస్సు - అధ్యక్ష ప్రసంగము, పితాపురము P. 45
32. Ep. and Vol. VII, pp 15 ff
33. చూ. అనుబంధము రెండవ భాగము అధ్యాయము VII
34. Ep. Ind VIII, pp 9 ff ప్రోలయ వేముని చేబ్రోలు పల్లవత్రి నేళ్ళయ్య.
35. Ep. Report 1900, PRO Part 57
36. Ep. Ind. Vol VII PP 160 ff
37. Ep. Carn Vol. XII 96.45
38. Ep. Coll No. 404 of 1919. హోయసాల వీర నరసింహదేవుని అమాత్యులగు కుటుంబ సభ్యులకు దండినగోప, జగదొబ్బ గండయును బిరుదములుండినవి. (Ep. Coll 617 of 1919) కంజీరం శాసనములు Ep. Coll Nos. 404, 611, 612, 615, 617) యీక్రింది వంశవృక్షము నిచ్చినవి.

    మహాప్రధాని దండనగోప అప్పయ దండనాయక

    మాడప్పదండ నాయక

    మల్లదండనాయక కేశవదండనాయక గోపయదండనాయక
39. నిర్వచనోత్తర రామాయణము I ప. 34
40. Ep. Coll No. 446 of 1919
41. Ep. Coll Vol. VI, kd. 100
42. Ep. Coll No. 61 of 1919
43. J.O.R. Vol (?) XII, P 212
44. J.O.R. Vol IXII, P. 199
45. J.O.R. Vol. IXII PP 213 - 216 P. 204 అదోజ్ఞాపిక
46. S.I.I. Vol. IV, No. 430
47. Ep. Coll No. 72 of 1918
48. Ferishta Vol I pp. 418 - 19
49. History of aru Turks in India P 65
50 ఆం.సా.ప.పత్రిక Vol.VI PP. 33 ff
51. "శ్రీపర్వతేశ భక్తి ఖ్యాపిత గుణ ఘెడెరాయ గంగగురుకృపా స్థాపిత సామ్రాజ్య సముద్దీపిత వేమక్షితీంద్ర దీప్తిదినేంద్రా" కొన్ని వ్రాత ప్రతులలో నున్నపై పద్యాన్ని వావిళ్ళవారి పాఠాంతరము హరివంశము II, IV, V, I
52. Ep. Ind Vol. VIII, P 15
53. Loc Rec. Vols XV, XLV, గండికోట, అందలూరు కైఫియత్‌లు, Ep. Coll 406 of 1911 అనవేముని దృజ్జవ పర శాసనము (రెడ్డిరాణి, Vol, III PP 137 ff) గూడ, గురువర్యులు ఘోడెరాయల యనుగ్రహముననే తన తండ్రి వేముడు పాలించెనని తెలుపును.

తేషాం ప్రశస్త మహిమాపర పారిజాతః
శ్రీవేమ భూమ రమణో జగనొబ్బగండః
శ్రీఘెడెరాయ గురువర్య దయావిశేషాత్
పృథీవీం ప్రశస్తి సకలా మకలంక వృత్తిః

54. వామన భట్ట బాణుని వేమ భూపాల చరితము ప్రథమాశ్వాసమున కొండవీటి రెడ్ల మూలపురుషుడు కామభూపతి యనియు, వేముని తండ్రియగు ప్రోలయ అతని సంతతి వాడనయు కలదు.

కాకతీ ప్రోల II ని సేనాపతి, పిల్లల మఱ్ఱి రేచర్లరెడ్డి కుటుంభమున బ్రహ్మయ యొకడు. అతని సంతతిలో "కామయ" ఉన్నాడు. అతడే యీ కామభూపతియా?

55. తామ్ర శాసనము నష్టమైనది. మెకంజి ప్రతులలోని దానిని వేటూరు ప్రభాకర శాస్త్రిగారు రెడ్డి రాణి పత్రిక (Vol. III - Sept. 1926, No. 12)లో ప్రకటించినారు.

56. N.D.I. II, Kr. 34, PP 546 ff.

57. N.D. III, 3.73, PP 1022 ff.

58. రెడ్లు వారి రాజ్యమును త్రిపురాంతక దేవదత్తముగ భావించిరి గూడ.

59. Mac. MSS. Nos. 15-16-17 and 15-3-64 Loc. Rec. XLVIII, PP 130 ff, XII, PP 16 ff.

# అధ్యాయము IV

# అనుబంధము

తెలుగుదేశము కాపులలో పేర్లు "రెడ్డి" పదముతో ముగియుచుండు చిరకాలముగనున్నదే. ఈ శాఖ పుట్టు పూర్వములనది కొంతకు కొంత స్ఫురింపజేయును. తెలుగుభాషతో దాని పరిణామములో కల్గినన్ని మార్పులు మరే పదమునకు లేవు. శతాబ్దములనైన మార్పులలోరెడ్డి యన్నది చివరి రూపము. దానికి సన్నిహిత పూర్వము "రడ్డి" 14వ శతాబ్దముననే కననైన "రెడ్డి" రూపముతోపాటు "రడ్డి" యన్నది 17వ శతాబ్ది వరకు వాడుకలో నుండెను. 16వ శతాబ్దిలో తెనాలి రామకృష్ణాది కవులును[1] 17 వ శతాబ్దిలో మల్లారెడ్డి[2] యు తమ గ్రంథములలో నీ "రెడ్డి" పదమును ప్రయోగించిరి. 14వ శతాబ్ది శాసనములు[3] అప్పటికే "రెడ్డి" రూపమును గూడ నిరూపించినవి. "రట్టడి" నుండి సిద్ధించినది. "రడ్డి" ప్రాచీన తెల్గు కావ్యములు తమ నాట వ్యవహారమున నున్న "రట్టడి" పదమునుపయోగించినవి. రట్టడికి బహువచన రూపము రట్టళ్ళు. 12వ శతాబ్దిని పండితారాధ్య మల్లికార్జునుని "శివతత్వ సారము" న నున్నది.[4] "రట్టోడి చేను" (పొలము) "రట్టోడి తోంట" దీనిని రట్టోడి కాంపులు కాచువారు. ఇట్టి పాదములు 10, 11 శతాబ్దముల తూర్పు చాళుక్య శాసనముల నగపడును.[5] "రట్టోడి" రూపము 7వ శతాబ్ది చివరి నుండి 11వ శతాబ్ది వరకు ప్రచారమున వున్నదని తెలియును.

"రట్టడి" గూడ ఆద్యారూపము గాదు. 6వ శతాబ్ద్యంతరమున 7వ శతాబ్దాదిని గల శాసనములలోని "రట్టకూడి" కది యపభ్రంశమమో, పరిణతమో, గుంటూరు, కడప, కర్నూలు, జిల్లాలోని శాసనాలలో "రట్టగుడి" (రట్టకుడికి అన్యరూపము) వాడియున్నారు.

1. రట్టోడి (బహు) రట్టోడ్లు
2. రట్టగుడి (బహు) రట్టగుడ్లు
3. రట్టగుడి
4. మారమ్మ చల్కి రట్టగుడి

5. కళ్ళమ్మపల్లవ రట్టుగుడ్లు
6. ఉత్తమాదిత్య రట్టగుడ్లు
7. చోళియ రట్టగుడ్లు
8. గంగ రట్టగుడ్లు
9. రట్టకుడి

పై రూపములు కడప జిల్లాలోని ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, కమలాపురం తాలూకాలోను, గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలోను గల తెలుగు శాసనములలోనివి[6]. కావున "రెడ్డి" రూపము 7వ శతాబ్దమున, అంతకు పూర్వముననో తెలుగు శాసనముల నుండిన "రట్టకుడి" క్రమ పరిణామమున చివరిది యనుట స్పష్టమగుచున్నది.

కులోత్తుంగ చోళుని (1) ముప్పది నాల్గవ రాజ్యవర్షము ద్రాక్షారామ శాసనమున[7] "రట్టడము" (రట్టడి యుద్యోగపదవి), "రాష్ట్రకూటమ్" అను పదములు వరుసగా అందలి తెలుగు, సంస్కృత భాగములలో ప్రయోగింపబడినవి. రట్టడికి సమానార్థమున "రాష్ట్రకూట"ముపయుక్తమనియు, రట్టడికి జన్యరూపము "రాష్ట్రకూట"మనియు తెల్లమగుచున్నది. (రట్ట- రాష్ట్ర, కూడి- కూట) దేశి "రట్టకుడి" యు సంస్కృత "రాష్ట్రకూట" యును సమానార్థములు, భాషామర్యాదలనొకటియే.

నిజానికి 7వ శతాబ్ది నుండి దక్కన్‌లో అధికాధిక భాగమును రాష్ట్ర కూట కుటుంబముల వారు పాలించుచుడిరి. వారి శాసనములు అన్నియు సంస్కృతముననే యగుటచే యందు "రాష్ట్రకూట" పదమే వాడనయ్యెను. మాల్ ఖేడ్ రాష్ట్రకూట రాజులు కొందరు వారి కన్నడ తామ్ర శాసనములలో రట్ట విద్యాధరులు, రట్ట కందర్పులు, రట్ట కుల భూషణులు, రట్ట వంశోద్భవులు, "రట్టకుల భూషణ", "రట్టవంశోద్భవ" వారు పుట్టువుచే రట్టలనియే కదా తెల్పును? రాష్ట్ర కూటులు రట్టలే, రాష్ట్రకుటులను రట్ట కులులని రట్టవంశము వారనియే గణించినది.

క్రీ.శ. తొలి శతాబ్దముల శాసనములు దక్షిణ భారత భాషలలో లేనందున "రట్టకూడి" పూర్వ పూర్వ వ్యుత్పత్తుల శోధించుట కష్టము. "రాష్ట్రకూట"పదము

గూడా అప్పటి శాసనముల గన్పింపదు. 7వ శతాబ్దికి పూర్వము తత్సదృశములు. "మహారాష్ట్ర లేక రాష్ట్రక"ములే తెలియవచ్చును. శక. 556/క్రీ.శ. 634-5 నాటి పులకేశి (2) ఐహోళెశాసనము[8] "మహారాష్ట్ర శాతవాహనుల నాణేఘాట్ కార్లికాన్హేరి శాసనముల[9] "మహారధి", కళింగ ఖారవేలుని హాథిగంఫ శాసనమున [10] రథ్థిక, అశోకుని శాసనములలో[11] "రాష్ట్రిక" పదములు దొరిలినవి. ఈ "రాష్ట్రిక"కు నానా పదములు షహబజ్‌గధి "రాస్టిక" మన్సేరాలోని "రాట్రక", గిర్నార్‌లోని "రస్టిక"ములు. అశోకుని లేఖనములలోని "రాష్ట్రకూట" "రాష్ట్రిక" ములకు శబ్ద సంబంధము విశదమే. రట్ట, రాట్టిక, లేక రస్టిక, రాట్రక, లేక రాష్ట్రకములు సంయుక్త పదమగు "రట్టకూడి"కి సన్నిహిత బంధములు.

ఆరట్టు, సురట్టు, మరట్ట, రట్టపాడి, లేక రట్టవాడి పేరిట దేశములు ఎల్లరెరిగినవే. ఏయే ప్రజకెయ్యేది చిరకాలమాది వాస భూమియో ఆ భూమి, ఆ ప్రజల పేరిట తెలియబడుట నిరూఢమగు సూత్రము. ఆ సిద్ధాంత మాధారముగా ఆరట్ట, సురట్ట, మరట్టలు ఒకే జాతికి చెందిన భిన్న శాఖల వారని నిర్ణయింపనాస పొడముచున్నది.

రట్టకు సంస్కృత రూపమగు "రాష్ట్రము" ఒక మండలము, దాని యధిపతి రాష్ట్రిక, రాష్ట్రీయ, లేక రాష్ట్రపాలకుడు. శాతవాహనుల నాటికే "రట్ట" లేక రాష్ట్రమునకు మండలమన్న యర్థము ప్రచారముననున్నది. ఉదా:శాతవాహన రట్ట, "రట్ట" పదము ఆదినొక ఒక జాతి నామమని, దాని చిరకాలానంతరము మండలమన్న యర్థమారోపిత మయ్యోనని నానిశ్చయము.

భారత జాతి సంస్కృతులు యీ ద్వీప కల్పమునకు నానాట వచ్చి చేరిన నానా జాతుల, నానా సంస్కృతులను మిశ్రణమని అందరంగీకరించినదే. ప్రతిజాతి భాషాపదములు దానిదాని సంస్కృతిని సంస్థలను నిర్దేశించును. అట్లే భారతీయ భాషయు నానామాండలిక పదముల సంక్లిష్టము. ఈ రోజులలో మండలమునకు మనుమ వాడు "రాష్ట్ర"పదమున కాయర్థము "రట్ట"ల రాజకీయ విధానము నుండి సంక్రమించి యుండును.

దేశియగు "రట్టకుడి" సంస్కృత "రాష్ట్ర కూట" సమమైనపుడు "కూటకుడికి" అను రూపము కావలెను. రట్టకుడి, రట్టగుడి యీ రెంటిలో రట్టకుడి యే సాధువును పూర్వమును అగు రూపము, తెనుగున దేశియందు పదాదిని గల "క"యను కంత్యము. "గగా"బహుళముగా మారును. అట్లులైనచో "కూట" లేక కుడి యన్న యర్థమేమి?

పుణ్యకుమారుని మాలెపాడు శాసనమున ఆజ్ఞప్తిపేరు "మార్పిడుగు రట్టగుడి". ఆ శాసనముశోధించి ప్రకటించుచూ, హెచ్.కృష్ణశాస్త్రి, కడపజిల్లా తెలుగు శాసనములలో కనుపించు చల్కి రట్టగుడి (సల్కిరట్టగుడి) చోళీయరట్టగుడి, వల్లవ(పల్లవ"రట్టగుడి" ఇత్యాది పదముల వివరించెను. ప్రయోగించిన సందర్భమును బట్టి, దానిని (రట్టగుడ్లను) గ్రామపెద్ద (Head man) సూచించు తర్వాతి సంస్కృత రూపము "రాష్ట్రకూట" తో ముడిపెట్టుట సమర్థనీయమని తోచును..... కొన్ని శాసనములలో రట్టగుడి రాజవంశ నామముతో సంశ్లేషించి యగుపుడును. ఉదా : సల్కిరట్టగుడి, గగ్గ (గంగ వల్లవ పల్లవ, వల్లభ లేక రాష్ట్ర కూట) చోళియ లేక చోళమున్నను రాజవంశముల సూచించును. ఆ రాజుల యాశ్రమముననే ఆ పేరిట వ్యక్తియే వ్యక్తులో "రట్టగుడి" పట్టమును పొందియుందురు. తామ్రశాసనములలోనతి ప్రచురమగు "రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః" అన్న వ్యాఖ్య భాగము రాష్ట్ర కూటులు కుటుంబినులని కృషికులని (తమిళ మున కుడి) వారి జాతిలో నితరులుకన్న సాంఘికముగ ఉన్నతులని తెల్పుచున్నవి[12].

పై వివరణమున శ్రీ కృష్ణశాస్త్రి ఆ సంయుక్తపదములోని ఉత్తర భాగమగు "కుడి లేక గుడి"ని వ్యాఖ్యానించలేదు. దానిని స్పృశించినదే గాని దాని వ్యుత్పత్తిని చర్చించలేదు. తరువాత తరువాత రాష్ట్ర కూట శాసనముల పరిశోధించుచు డాక్టరు ప్లేట్ రాష్ట్రకూటలోని కూట పది వివరణమున సందిగ్ధమున బడినాడు.

కూట యన్న పదమునకు అత్యున్నతము, అతిశ్రేష్టము, ప్రధమము అన్న అర్థములు పర్వత శిఖరోన్నతుల వలన స్ఫురించి యుండును. ఆ యర్థములు సాహిత్యమున నది అగపడును. బాగవత పురాణము (2,9,19) ఒక బ్రాహ్మణుని కూటయోగినామ్ (యోగివరిష్టుడా) అని సంబోధించినది. శాసనములలో

గ్రామాధికారిని లేక గ్రామపెద్దను "గ్రామకూట"యని వర్ణించి యున్నది. అట్లే ఒక దేశవిభాగము (సాంకేతికముగ రాష్ట్రము) యొక్క నాయకుని "రాష్ట్ర కూట" పదము తెలియజేయును. అప్పటికే అధికార లాంఛనముగ "రాష్ట్రకూట" పదమున్నందుననో యోమో ఆ ప్రయోగము గురుతును సౌష్టవమును సంతరించుననని, అది పూర్తిగ కుటుంబమునకను వర్తింపబడినది. కాని రూపమాత్రము ఒక అధికార బిరుదముగ రాష్ట్ర పతిత్వ సూచకముగ మనమెన్నరాదు. అది కేవలము రట్టలలో అత్యున్నత, అతిశ్రేష్ఠ నాయకుని నిర్దేశించునదిగ గ్రహింపవలను[13].

ఫ్లీట్ అన్నట్లు "రాష్ట్రకూట"లోని "కూట"యన్న నాయకుడైనచో తూర్పు చాళుక్య తామ్ర శాసనముల రాష్ట్ర కూట ప్రముఖాన్ లోని ప్రముఖ పదసార్థక్యమేమి? ప్రముఖుడన్ననాయకుడే. మరి "కూట - ప్రముఖయని పునరుక్తి - ఆమ్రేడితము - ఎందుకు? "కూట"కు ప్రముఖి యున్నజోడింపే "కూట" యన్న అర్థము. యన్న ఫ్లీట్ ఊహకు భిన్నమని నిరూపించును. రాష్ట్ర కూట యన్న అర్థము ఫ్లీట్ ఊహకు భిన్నమని నిరూపించును. రాష్ట్ర కూట శాసన పరిశీలనమపుడు ఫ్లీట్ కడపయందలి తెలుగు శాసనముల పరికించినట్లుగ పడదు. అప్పటికా శాసనములు వెలువడలేదో, వెలువడియున్నను వ్యవధి అత్యల్ప మగుటచే అవి యతని దృష్టికి రాలేదో, రట్టగుడి రూపమతనికి తెలిసియేయున్నచో "రాష్ట్రకూట"పై యతని వ్యాఖ్య బహుశః వేరుగనుండి యుండును.

"రట్టకుడి"లో ఉత్తరార్థము "కుడి"దేశిపదము. అది "కుడియాన్" అన్న దానికి సంగ్రహరూపము. కుడియాన్ రైతు, కర్షకుడు కాపు ఆ యర్థమున నదియిప్పటికిని ప్రచారముననున్నది. రాజభాగమగు "మేల్‌వారం"కు విశిష్టముగ కర్షకుని భాగమును "కుడివారం" అందురు. "కుడి"యన్న పాలము. "రట్టకుడి"లోని "కుడి" రట్టలు ప్రధానముగ కుడియనులు, రైతులు, కాపులు అని నిరూపించును. తెలుగుదేశమున "రెడ్డికాపు"లను ప్రయోగము నేటికిని వ్యవహారమున నున్నది.

6, 7 శతాబ్దపు తెలుగు శాసనములలోని రట్టకుడులు రట్టలలో నొకశాఖ. అతి ప్రాచీన కాలమున వారు మధ్యదక్కన్ నందంతటను వ్యాపించి తెలుగు కన్నడ

భూభాగముల నెన్నియో స్థావరముల (Settlements) తీరియుండిరి. తీరాంధ్రమున 7వ శతాబ్ది ప్రాంత తామ్రశాసనములలో "రాష్ట్ర కూట ప్రముఖ" యన్నది తఱచు కన్పించును. తత్పూర్వము పల్లవ, బృహత్పలాయన సాలంయకాయన, విష్ణుకుండిన రాజవంశముల శాసనములలో నా రూపము కన్పింపదు. తూర్పు చాళుక్యుడు, మొదటి విష్ణువర్ధనుని కొడుకు జయసంహ వల్లభ I బ్రాహ్మణులకు గ్రామ, భూదానములిచ్చు తఱిని తొట్టతొలిగ "రాష్ట్రకూట ప్రముఖుల ప్రసంగము వచ్చినది. దీనిచే తీరాంధ్రమున ఉత్తరమున కళింగము వరకు రట్టగడులు వ్యాపించిరనియు, జయసింహ వల్లభుని నాటికి గ్రామ సంఘములలో వారు నేతృత్వము వహించుచుండిరనియు తెలియును. నాటినుండి తెలుగు దేశమున కృషిక వర్గ నాయకులుగ వారుపేరు నిల్పుకొన్నారు. అందువలననే దేవబ్రాహ్మణులకు భూములను అగ్రహార గ్రామములను దానములిచ్చునపుడు రాజులు సామంతులు ఆయా ప్రదేశవాసులగు రాష్ట్రకూట ప్రముఖుల కది తెలియజేయుటావశ్యకమయ్యెను.

7వ శతాబ్ది నుండి రట్టగుడి కుటుంబముల వారు కొందరు రాష్ట్రపాలనా యంత్రాంగమున ముఖ్యపదవులలో నియమితులైరి. రేనాటి చోళులొనర్చిన దాన నిర్వాహణాధికారులు, "ఆజ్ఞప్తు"లలో వారు ఎక్కువగ కనుపింతురు.

కర్షకుల నుండి సేద్యపు పన్నును, పంట ధాన్యముల రూపమునో, ధనముగనో వసూలు చేసి రాజులకు చెల్లింపు భారము రట్టగుడి ముఖ్యులు వహించి యుండిరి. కాలము జరుగను ఈ కరగ్రహణ (పన్నులు వసూలుచేయు) మొనర్చు రట్టగుడులలో ప్రధానుడు గ్రామాధికారియై, పాలక పాలితులకు మధ్యవ్యవహర్తయుసంధాత యునయ్యెను. రట్టకుడి రూపము క్రమముగ మారి "రట్టడి" యైనపుడు ఈ గ్రామాధికార పదమును "రట్టడి" యనిరి. తరువాత తరువాత నది "రడ్డికమై" "రెడ్డి" రూపాగమము పిదప రెడ్డికమై నిలిచియున్నది. ఆ ఉద్యోగి రెడ్డి జాతి కాకున్న యిపుడా పదవిని రెడ్డికమనియే వ్యవహరించుచున్నారు.

# ఆధారములు

1. "ఎద్దైతనపు గైసేతల, రడ్డులు నడచిరి పురస్సర ద్బార్యముగా "పాండురంగ మూహాత్యము III, ప. 75.

2. "రెడ్డి పేట్రలు తిప్పాపురంబు సిరుల బొదలు లింగాపురంబున బోతసాని" - శివధర్మోత్తరము I ప. 60.

3. N.D.I. No. II 0.58, P 994, Ep. Coll. No. 310 of 1926 "రెడ్డి" రూపమునకు N.D.I. Vol. III, 0.79 II, Kr 229 Ep. Ind. Vol III, P 314, N.D.I.IA 24 etc.

4. మీ! రోజసెడిన దనకుండుడు

   రాజులు రట్టళ్ళు నగుట రావెల్లిటికన్ - ప. 200

5. N.D.I. Vol. III, P 38, P 1203, P22, P 1180, Ep Coll. Nos. 363, 364 of 1905 ఆం.సా.ప.ప. Vol. II P 399, N.D.I.Kr. Vol. II, 67, P 607 Ep. Ind Vol. V,P 139.

   రట్టోడి చేను (Ep. Ind Vol. V, P 139 ff. Masulipatnam Plates);

   రట్టోడితోంట (C.P. No. 6 of 1913-4 Ep. Coll. 675 of 1917);

   రట్టోడి కాంపులు... (N.D.I. Vol. II, Kr. 67, P 607)

6. Ep. Coll. Nos. 384, 400, 400B, 403, 408, 408 (a) of 1904; 798 of 1917; 337 of 1905; Ep Ind. Vol XI, PP 342-43.

7. S.I.I. Vol IV, No. 1281

   ... Krundorgvame Rastrakutam Sd. Bhogam.. గుద్దవాది నాంటిక్రుందుటం రట్టడము...

8. Ep. Ind. Vol. VI, P 6 the Country of the Maharastrakas

9. ASWI, Vol IV, P 107; Ep. Ind. Vol. VII P 61

10. Ep. Ind. Vol XX, P 79, 1.6

11. A.S.S.I. Vol. I.P. 125, Ep. Ind. Vol. II, P 453.

12. Ep. Ind. Vol. XI, PP 342 - 43.

13. Ep. Ind. Vol. VII, P 222.

### అధ్యాయము V

# ప్రోలయ వేమారెడ్డి

కొండవీటి రెడ్డి రాజ్యము ఎట్లు ఏ పరిస్థితిలో పుట్టుపొందెనో సమగ్రముగ తెలియలేదు. ఉన్నంతలో సామగ్రిస్వల్పము. అదియు సరిగ విశిష్టముగాను ఆంధ్రదేశమునుండి ముస్లిముల తొలగద్రోలిన క్రొత్తలలో అచట ప్రబలిన అస్వామిక, అరాచకముల మాన్పి శాంతిభద్రతల నెలకొల్పుటకు సామంతులు రాజనీతిజ్ఞులొనర్చిన యత్నఫలితములలో నిదియొకటి. విజాతీయుల వలన అణగారినవైదిక సంప్రదాయముల ఆచారముల పునరుద్ధరించి హిందూ ధర్మ సంస్కృతి రక్షణము ప్రాపకమునగుట కొండవీటి రాజ్యధ్యేయము. ఆంధ్రచరిత్రలో విశేషించి రెడ్డి రాజ చరిత్రలో శా.శ. 1 2 4 7 నాటి వేముని మల్లవల శాసనము[1] అతి ముఖ్యమైనది. తెలుగుదేశ చరిత్రలో ఒక నవ్యయుగమునకది నాంది. ఆశాసనమప్పటికి తీరాంధ్రము విజాతీయులనుండి విముక్తమయినది.

పాకనాడు లేక పూంగి విషయమున ప్రముఖుడగు ప్రోలయరెడ్డి సుతుడు వేమారెడ్డి నిక్కమగు రెడ్డి రాజ్యస్థాపకుడు. మల్లవర శాసనమతనిని మ్లేచ్ఛాబ్ధికులలోద్భవయని కీర్తించినది. ముస్లిముల భంగపాటునకు అతని పాత్ర ప్రాముఖ్యమునది సూచించును. ప్రోలయ నాయకుని వలన ఒడసిన సర్వసంపదలను తన శక్తియుక్తులనన్నింటిని వినియోగించి సోదర బంధువుల సాయముతో వేమారెడ్డి తెలుగుదేశమునకు

పరదస్యామోచనము సాధించెను. ఆకార్యమున్నకై హిందువుల ఐకమత్య బలావశ్యకతల తెలిసి వేమారెడ్డి, ఆ కార్యముననే మగ్నులగు తోడి ప్రభువులతో సహకరించి యాప్రయోజనము సాధించెను. తీరాంధ్రము స్వతంత్రమయ్యెను.

వేముని కార్యరంగపు టెల్లలనొక విధముగ మల్లవరం శాసనము సూచించినది : అది బ్రహ్మకుండి లేక కుండి ప్రభ (గుండ్లకమ్మ), కృష్ణ, గౌతమీనదుల మధ్యభూమి. ఆ శాసనమున జెప్పిన వేముని దానములన్నియు పైనదీతీరమున నున్న గ్రామము నగ్రహారములే. ఆ అగ్రహారములలో అధికాధికము పూర్వదత్తములై ముస్లిముల పాలనమున ప్రతిగ్రహీతలగు బ్రాహ్మణులు కోలుపోయినవే. అందు పూర్వ దత్తములుగలవనుటకు సాక్ష్యము రెండు శిలాశాసనములు, ఒకటి శా.క. 1237/ క్రీ.శ. 1315 నాటిది[2]. రెండవది కాలము సూచింపనిది[3] పశ్చిమగోదావరి భీమవరం తాలూకాలోని మోగల్లున దొరికినది. అవి రెండును శైవకవి ప్రమధకవి శిరిగిరి (శ్రీగిరి) దేవయ్యనిగారు దానము గొన్న భూముల జెప్పినవి. కాలముదెల్పని శాసనమున దానకర్త అనవేముడు. ఆ శైవకవి శాసనము దెల్పునట్లు శా.శ. 1245 - (క్రీ.శ. 1323) వరకేలిన కాకతి ప్రతాపరుద్రుని సమకాలీనుడు. కాలము చేరువను బట్టి ఆ అనవేముడు కోమటి ప్రోలారెడ్డి కొడుకగు అనవేముడే అనవలెను. ఆ రెండవ శాసనము అందలి దానము పూర్వదత్తమని, అనవేముని విక్రయములు ఉత్తరమున గోదావరి పర్యంతరము ప్రసరించినవని విశదమొనర్చును.

ముస్లింల పరాజయానంతరము ముసునూరు ప్రోలయతోడి వేముని సంబంధము

తీరుతెన్నులు తెలియవు. కాని ప్రోలయ కతడు విధేయుడే యనవలయును. పిదపకాలపురెడ్ల కలువచేరు[4] శాసనసరణిని ముసునూరు కాపయ్యను కొల్చిన డెబ్బదైదుగురు నాయకులలో వేమారెడ్డి యొకడు.

ఈసమరములలో వేమునకత్యంతము సాహాయ్యపడిన వారు వీరులగునతని మేనమామలు పోతయ, నామ, చిట్టయలు, రెడ్డిసేనల కధిపతి యనవేముని కనిష్ఠ సోదరుడు మల్లారెడ్డిని మల్లవర శాసనమును హరివంశకావ్యమును పేర్కొన్నవి.

అతడు అల్లావదీనుని తదితర తురుష్కతల్లుల తాకిళ్ళను త్రిప్పికొట్టి నవయుగ మొలకెత్తుచున్న తన రాష్ట్రమును రక్షించుకొనెను[5]. ఈ అల్లావదీన్ క్రీ.శ. 1269(1347 ఎ.డి.)లో గుల్బర్గాలో గద్దెనెక్కిన బహ్మనీ సుల్తాన్ ముస్లిములు కాపయ రాజ్యాభాగమనగు తెలంగాణాపై దండెత్తుటతో నాగక కృష్ణానదిని దాచిరెడ్డి రాజ్యమును గూడ ఆక్రమింప యత్నించిరి. అది క్రీ.శ. 1347 తర్వాత[6] సరిగా నెపుడో తెలియదు. కాని మల్లారెడ్డి ప్రతాపముచే విఱిగిపారిరి. అతని విజయ యాత్రలలో వేమునికి అతని సోదరులందరును కొడుకు అనవోతయు చాలగతోడ్పడిరి. అందును ప్రధానుడు మల్లారెడ్డి. అతడు శత్రునృపతి వర్గములను తన బాహుబలమున నిర్జించి ప్రసిద్ధమగు రేవుపట్టణము మోటుపల్లిని (కాకతీయు చైత్రపుర - వేసవిని విశ్రామపురమును) గైకొనెనని హరివంశము కీర్తించినది[7]. మోటుపల్లిని పట్టిన మాత్రమున తీరాంధ్రదేశము సర్వమూ వేమారెడ్డి హస్తగతము కాలేదు. చాలభాగమింకను అతని

ఆధిపత్యమునకు వెలిగనే యుండినది. అయినను సాధించిన విజయములచే తీరాంధ్రములన రెడ్డిరాజ ప్రాభవ బలము అధికములైనవి[8].

కాకతీయుల వారసులుగా రెడ్లు ఆగ్నేయాంధ్రము శ్రీశైలము నుండి తూర్పు సముద్ర తీరము వరకు తమ స్వత్వముగా భావించిరి. కాకతీయుల రోజులలో వలెనే ప్రభలేక గుండ్లకమ్మపై అద్దంకి రాజధానిగా పాలనము సాగించిరి. పరిసర ప్రాంతము లందలి ప్రతికూల నాయకుల నణిచి స్వాతంత్ర్యము ప్రకటించిరి.

ప్రోలయ నాయకుని కొడుకులైదుగురిలో వేమనిస్సంశయముగ శ్రేష్ఠుడును ప్రతిభాశాలియు, సంగ్రామవిద్యాకుశలతలో, రాజనీతిజ్ఞత దూరదర్శితలలో ఆ సోదరులలో నతనకి సరిలేరు. హిందూ ధర్మ పునరుజ్జీవ నోద్యమమునకు వేమునే ప్రాణమును జేసినవి. దేశ సంరక్షణకై యతడు ముసునూరు ప్రోలయతో గలిపి సైన్యముల సుసన్నద్ధములుగ నుంచి, దేశమందలి కీలక స్థానముల దుర్గముల నిర్మించి వాని కాపుదలకై తగు సైన్యముల నుంచెను. అతడెనుబదినాల్గు దుర్గముల నిర్మించెనట. అందు ముఖ్యములు ధాన్యవాటిలేక ధరణికోట (అమరావతి), ధనదప్రోలు (చందవోలు), వినుకొండ, కొండవీడు, కొండపల్లి, బెల్లంకొండ యిత్యాదులు[9]. అతని సోదరులు బందుగులు నత్యంత విధేయులై యతని యానతిమేర మెలగుచు కృష్ణానదికి దక్షిణమున శాంతిభద్రలత వెలయింపరెడ్డి రాజ్యమును సమర్థము జేసిరి.

అద్దంకి రాజధానిగా పంటరెడ్డి కులుడగు వేముడు స్థాపించిన రాజ్యమొక నూరేండ్లు వైభవోజ్వలముగ వెలిగి ఆంధ్ర దేశ చరిత్రమున ప్రముఖపాత్ర నిర్వహించెను. మాచారెడ్డి వేముని కగ్రజుడైనను అందరును వేమునే ప్రధానునిగ మన్నించి అతనికే పట్టము గట్టిరి. కారణము తెలియదు. మాచారెడ్డి మాత్రము తమ్మునతిశ్రద్ధమై గొలిచి రెడ్డి స్వాతంత్ర్యమును పరిపోషించెను. కృష్ణానదికి దక్షిణదేశమును వేముడన్న యధీనము చేసెను. అతడు చందవోలు (గుంటూరు జిల్లా రేపల్లె తాలూకా) లేక ధనదప్రోలు ముఖ్య పట్టణముగా నాబాభాగమును పాలించెను. వామనభట్ట బాణుడు సంస్కృతమున రచించిన వేమభూపాల చరితమును గద్యకావ్యము ధనదపురమును శాఖానగరములలో నొకటిగ పేర్కొన్నది[10].

తన రాజ్యమును స్వతంత్రముగనే పాలించుచున్నను వేముడు నామమాత్రముగ ముసునూరు ప్రోలయ, ఆ తరువాత కాపయల ఆధిపత్యమును మన్నించెను. ఆయధీనత చిరము నిలువలేదు. అలాయుద్దీన్ దాది కాపయ్య దౌర్బల్యమును తెలంగాణమున చాటుటకై తీరాంధ్రదేశమున నతనికి గల క్రొద్ది పలుకుబడిని సైతము సమయించెను. అతావుల శా.శ. 1268/క్రీ.శ. 1346 నాటి యతని గణపేశ్వర శాసనము చిట్టచివరిది[11] తీరాంధ్రమువన కాపయ ప్రతినిధి తొయ్యేటి అనవోత నాయకుని దక్షారామ శాసనము[12] శా.శ. 1269 (క్రీ.శ. 1347) కాపయ శాసన కాలమున కొకేమొక వత్సరము పిదప.

ఈ అనవోత దుర్బలుడు. ముస్లిములయు ఇతరులయు ఆక్రమణలనుండి రక్షణకై ఎదురుచూడవలసినవాడు కాడు. అది తెలిసి వేమ 1 తన యధికారము విస్తరింపజేసి పూర్ణముగ స్వతంత్రుడై తన పేరటనే రాజ్యమేల మొదలిడెను. రాజకీయముగ వేమారెడ్డికిని ముసునూరు వారికి నుండిన సంబంధము దెల్పునొకే యొక శాసనము శా.శ. 1345 (క్రీ.శ. 1423) నాటి అనితల్లి కలువచేరు శాసనము[13] కాపయ నాయకుని ఉపనాయకులు (Subordinate) డెబ్బదైదుగురులో నొకడగు వేముడు కాపయనంతరము స్వతంత్రుడై రాజ్యమేలెనని ఆశాసన మునుడువు చున్నది. అది యాధారముగా ముసునూరు వారికి వేముధీనతడు ఆపై యతని స్వతంత్రను జెప్పియుంటిని. కాని యిందొక విప్రతిపత్తి కలదు. కాపయ అలాయుద్దీన్ కొడుకగు మహమ్మద్‌కు సమకాలికుడు. మహమ్మద్‌షా గద్దెనెక్కినది క్రీ.శ. 1359లో, వాదమున కనివేముని తొలుతటి మల్లవరం నెకరికల్లు[14] శాసనముల నొప్పరికించినను, అతని స్వతంత్ర ప్రతిపత్తిని అతని వలచేరు[15] కుంకలగుంట[16] శాసనముల కాలము శా.శ. 1254/క్రీ.శ. 1332 నుండి అతని చిట్టచివరి మణికేశరపు శాసనము[17] శా.శ. 1275/క్రీ.శ. 1353 వరకు కనిపించు అతని శాసనములు వేనిలోను శాసనలేఖ్య సహజమగు అధిపతి ప్రశంసయు కాపయ నట్టివానిగ వాకొనటయు లేదు. కావున కాపయ జీవించు రోజులనే వేముడు స్వతంత్రుడగుటే కాపయ వేముని తర్వాతగూడ బ్రదికి యుండుట యదార్థము. కావున కాపయ యనంతరము[18] వేముడు రాజయ్యేననుట అసంగతము. కలువచేరు శాసనమున నీవ్యత్యయమేల, యెట్లు

దొరలెవో, వ్యాఖ్యానింప మిగిలియేయున్నది.

వేముని శాసనములలో అతని పాలనమును గూర్చి కాని బహుదిక్కుల నతని జైత్రయాత్రల గూర్చికాని ముఖ్య చారిత్రకాంశములేవియు లేవు. ఉన్నవి సాధారణముగ నతిశయోక్తులు, నికటనృపతి తరుకోటికి వేగవత్ సరితయని, మిత్రోత్పల విసిన పూర్ణచంద్రుడని, మదమత్తమన్నె సామంతుల ప్రభంజనుడని, యిత్యాది ఈ ఉత్ప్రేక్షలు వేముని విక్రయములను రాజ్యవిస్తృతులను సూచింపవు. ఈ మన్నెదొరలు ప్రాయశః కాకతీయ సైనికులుగా పేరందిన జాగీర్దారులో వారి సంతతులో అయియుందురు. కొందరు బోయవిహారదేశనాయకులును కావచ్చును. తెలుగుచోడుల ఆత్మకూరు కనిగిరి ఉదయగిరి తాలూకాల (నెల్లూరి జిల్లా)లోని శాసనములలో[19] బోయవిహారదేశ ప్రస్తావన అగుపించును. కల్యాణి చాణుక్యుల నాటినుండి యీ తెలుగు చోడులు ఆంధ్రమున దుర్జయులగు సామంత్ర ప్రభువులై తమ ఆధిపత్యమును కమ్మనాడు[20] నందధికాధిక భాగమున నెలకొల్పిరి. కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాలోని త్రిపురాంతకము తత్పరిసరములను గూడ ఒకప్పుడ వారి యధికారము చెల్లెను[21]. త్రిపురాంతకము నల్లమలలకీశాన్యమున కీలక స్థానము : దానికి పశ్చిమమునను దక్షిణమునకున్న భూముల శాసించుటకును ఉత్తర పీఠ భూముల తోడి వాణిజ్య మార్గముల నియమ నిరోధములకును అనువగు తావు అది గుర్తించి వేమారెడ్డి తన పాలనా రంభములనే యీ భూముల జయించెను.

ఈ త్రిపురాంతక మండల మనాదిగ ఏఱువ (దేశ) చోడుల ఆవాసభూమి. వారు తెలుగు చోడులలో నొకశాఖ. వారిలో నొకముఖ్యుడు కామరాజు, భక్తి రాజను పేర ప్రసిద్దుడు.

రెడ్డి యుగమునకు చెందిన అతని మద్రాసు మ్యూజియం తామ్రశాసనము[22] ప్రకారము అతడు విజయ యాత్రా సందర్భముగ (శాజిగీషుర్విచరన్) శ్రీశైలము (శ్రీపర్వతము)ను నుండి, అచటి శైవాచార్యుడు, బ్రహ్మచారి, కౌశిక గోత్రుడునగు శ్రీ విశ్వనాధునకు[23] కణ్ణనకొల్లునను గ్రామమును శా.శ. 1277లో దానమిచ్చెను[24]. బహుశః ఆ కాలమందనే కావలయు శ్రీ పర్వతస్థ శైవాచార్య శాంతి భిక్షావృతి యతీశ్వర

పాదసేవక పోలిదేవయ్య సూచింపగా అతడు (భక్తిరాజు) శ్రీశైల పర్వతేశ్వర శ్రీమల్లికార్జున దేవునకు ఆతుకూరు గ్రామమున నర్పించుకొనెను. బహుశః ఆసమయములనే, ఆపోలిదేవయ్య సూచకముననే, అతడు త్రిపురాంతక దేవునకు ఆముదాలపల్లిని(25) నివేదించెను. శ్రీ పర్వత, త్రిపురాంతకములు రెండూనూ రెడ్డి రాజ్యములోనివే, భక్తిరాజచట నుండినది రెడ్ల మిత్రుడగనో, శత్రువుడుగనో, అతడచటి దైవములకను, విశ్వనాథాచార్యునికికిని యిచ్చిన గ్రామములే ప్రాంతములవో తెలియగలమేగాని, ఆ పేరిట పెక్కు తెలుగు జిల్లాలో నున్నందున, అవియేవియో నిశ్చయింపలేము. భక్తిరాజు వెలువ నాయకుడేగాని ఆ ప్రాంతముల పాలకుడనలేము. అతని తండ్రి తాతలగు గంగాధర సోమరాజులు ఏలువనాటి ప్రభువులట్లుగాని, వారిని రెడ్డిరాజులు రాజ్యభ్రష్టుల జేసిరని గాని కానరావు. కాని రెడ్డి రాజ్యాదిలో భక్తిరాజు వారలమిత్రుడని, అనవేమునకో(26) ప్రోలయ వేమునకో సమకాలీనుడని నమ్మవీలున్నది. అనవేముని కుమారో, ప్రోలయ వేముని కుమారో, భక్తిరాజ పుత్రుడగు భీమలింగ లేక భీమచోడుని బార్యయని కాశీఖండ(27) శివలీలా విలాసములు నుడువుచున్నవి. కావున భక్తిరాజు వేమునికి సుహృన్మాత్రుడే గాక బంధువును. త్రిపురాంతక శ్రీశైల ప్రాంతముల జయించుటలో వేమున కతడెంతయో తోడ్పడెనని విశ్వసింపవచ్చును.

శ్రీశైల పరిసర ప్రాంతములలో రెడ్డిరాజుల శాసనములు క్రీ.శ. 1268 నుండి కాననగుచున్నవి. ఆవత్సరమున వేమారెడ్డి తొట్టతొలి శాసనము(28) త్రిపురాంతకముననున్నది. ఎవరో రామానాయకుడట, అతని యధీనుడు అలకుంతల ప్రభువు, చాలు వరకీమండలములోని నాయకుడేయగు మనమ మల్లిదేవుని(29) శిరమును ఖండించి కదికాలచోళుని దుర్గమును వశపరచుకొనెను. ఈ జయములు వేముని రాజ్యకాలముననో కాదోకాని అనవేమ పాలనము నాటి కా ప్రాంతముల చోడనాయకులుండిదనుట నిస్సంశయము. వేమున సోదరుడగు అన్నమరెడ్డియు(30) కొడుకగు అనవోతయును ఏతత్ప్రాంత విజయపరిరక్షణలకెంతగనో శ్రమించిరి. ఇచటి యొకశాసనము(31) అనవేముడు అనవోతని పేర్కొనెను. క్రీ.శ. 1269/క్రీ.శ. 1347 పదగు త్రిపురాంతక శాసనము(32) అనవోతని పత్ర్వుడన్నమరెడ్డి త్రిపురాంతక స్వామి కొసగిన దానముల ప్రస్తుతించినది. రెడ్డి సైన్యమున దండ నాయక ప్రముఖులలో

నాగడగు యువరాజు అనవోత త్రిపురాంతక రాష్ట్రపాలుడై యుండును.

## వేముని రాజ్యవిస్తారము

వేముని రాజ్యము త్రిపురాంతకమున కతిగశైవ క్షేత్రమగు శ్రీశైలమునకును, వైష్ణవ క్షేత్రమగు అహోబలమునకును పర్వియుండెను. మల్లికార్జున, నరసింహభక్త జనులకు చిరకృతజ్ఞతాపాత్రమై శ్రీశైల అహోబిలగిరుల యారోహణమునకు, కృష్ణానదిలోని పాతాళగంగ కవరోహణమునకును వేముడు సోపానములు కట్టించెను. ఆయా ప్రదేశములు అతని రాజ్యములోనివని చెప్పక చెప్పినట్లే. ఈ సోపాన రచన ప్రస్తావన అతని మల్లవరం, మద్రాసు మ్యూజియమ్ తామ్ర శాసనములలో లేదు, తొలిసారిగ ముట్లూరు శాసనమున కలదు(34). ఆ శాసన కాలము శా.శ. 1265 ఆ తరువాతి శాసనములన్నియు, నిరవాదముగా, అపుణ్యకార్యమును కొనియాడినవే. ఆసోపాన నిర్మాణము మార్చి 1346ననో అంతకు క్రొద్దిముందుగనో పూర్తియై యుండును.

నెల్లూరు జిల్లా కందుకూరు తాలూకాకు దక్షిణమున వేముని శాసనము లెవ్వియును లేవు. వేముని రాజ్యమటువైపెంత వరకో నిర్ణయించుట కష్టము. పాకనాటిలో అధికభాగము అనాదిగ రెడ్లయావాసభూమి. తనరాజ్యాదినే వేముడు దానిని మ్లేచ్ఛుల నుండి విడిపించి యుండును. ముస్లిముల భంగపాటు పూర్ణలాభము గొన్నవారిలో వేముడు ప్రథముడు. అది యదనుగా నతడు తన రాజ్యమును పెన్నానది వరుక విస్తరించెను. అతని మాతామహుని జనన భూమి విక్రమసింహపురము. వేముభూపాల చరితములు తెలిసినట్లు అతని తండ్రి ప్రోల లేక కోమటి వేముడు పెండ్లాడిన అనంతాంబలేక అన్నెమాంబ, విక్రమ సింహపుర దొడ్డారెడ్డి కూతురు(35). అతని కొడుకు అనవేముని సచివుడు పెద్దన. ఆ పెద్దన మనుమడు చిట్టిపెద్దన. విక్రమ సింహపురః అధ్యాసి (అధిపతి)(36) అట్లుగావున వేమారెడ్డి రాజ్యమున దక్షిణపు పొలిమేర నెల్లూరనవలయును. కాని కొండవీటి రెడ్ల శాసనములు మాత్రము కందుకూరుకు దక్షిణమున కానరాకుండుట సువిదము.

తాను రాజ్యము నిర్మించు నవసరముననే పొరుగున మఱొక ప్రబల హిందూ

రాజ్యమును సంగమవంశ్యులగు హరిహరసోదరులు స్థాపించి వర్ధిల్లజేసిరి. దానితో వ్యవహరింప వలయుట తప్పనిసరియని వేముడు గుర్తించుట కెంతయో కాలము పట్టలేదు. శా.శ. 1261/క్రీ.శ. 1339 నాటి అటకలగుండు శాసనమును[37] అమరువత్సరపు (క్రీ.శ. 1340) ఆకుమళ్ళ తామ్రసశాసనమును[38] హరిహరుని(1) పూర్వపశ్చిమ సముద్రాధీశ్వర యన్నవి. కావన క్రీ.శ. 1339 కే హరిహరుని రాజ్యము పూర్వ పశ్చిమ సముద్రము పర్యంతము వ్యాపించినదనవలెను. ఈ విషయమును క్రీ.శ. 1346 కు పూర్వము నెల్లూరు జిల్లా కోవూరు, కావలి, ఉదయగిరి తాలూకాలలో లభించిన విజయనగర రాజుల, వారి సామంతుల శాసనములు సమర్థించుచున్నవి. నెల్లూరు జిల్లాలో మొట్టమొదటి విజయనగర శాసనము[39] హరిహరుని సోదరుడగు బుక్కనకొడుకు విరూపన్న ఒడెయరునిది. దానికాలము శా.శ. 1265 యు/క్రి.శ. 1343. హరిహరుని కంపణొడెయరుని కొడవలూరు (నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా) శాసనపు[40] తేది. శా.శ. 1268/క్రీ.శ. 1346-47. అందు

కంపన పెన్న నదికి ఉత్తర భూముల యధిపతి విజయనగర రాజ్యము పెన్న లోయల బడి వ్యాపించి కనిగిరి కందుకూరులకు నైఋతి భాగముల బర్వియుండెను. ఈ భూములను క్రీ.శ. 343 కు పూర్వమో దాదాపులనో విజయనగరము వారు రెడ్ల నుండి సంగ్రహించినవి. వానిపై తమ యధికారము సదృఢమగుటకు వారు ఉదయగిరి కోటను[41] నిర్మించికొనిరి. అదిరెడ్డి రాజ్యమునకు నైఋతిని ఆపత్కరమయ్యెను. ఇట్లా రెండు హిందూ రాజ్యములును పుట్టవాదిగ పరస్పర ప్రాతికూల్యముల నొక నూరేండ్లు గడిపినవి.

కృష్ణానదికి ఉత్తర భూములు మునుసూరి వారికి సామంత ప్రభువుల కధీనములై యుండివి. వారికందరికి వధీశుడై తొయ్యేటి అనవోత భూపాలుడు[42] రాజమహేంద్రవరము రాజ ధానిగ వేంగీ రాజ్యమునేలుచుండెను. కృష్ణానదికి దక్షిణమున తెలంగాణలో రాజకొండ రాజధానిగ రేచర్ల నాయకులు రెడ్డి రాజ్యమునకు వాయవ్యమున పాలించుచుండిరి.

వేముడు తన నూతన రాజ్యమును న్యాయముగ, సమర్థముగనేలెను. అల్లరుల నుండి, పరాక్రమములనుండి దేశమును భద్రపరచి, బ్రాహ్మణుల కరషకుల దైన్యమును బాపి వారి వారి వృత్తుల సక్రమముగ సుకరముగ వర్తిల్లు జేయుటకై అతడెంతయో శ్రమించెను. ధర్మ ప్రతిష్ఠా గురు ప్రథితయనుడయ్యెను. అతడాశించిన స్వతంత్ర రాష్ట్ర ప్రతిష్ఠాప్రయోజనమే అది. దేవ బ్రాహ్మణులు గోల్పోయిన అగ్రహారములు వారి వారికి తిరిగి నిచ్చుటనే గాక నూతనముగ మరెన్నియో అగ్రహారములను బ్రాహ్మణులకొసగి నిస్సమ భూదాన పరశురాముడును, అపరిమిత భూదాన పరశురాముడునయ్యెను. వేము భూపాలుడు బ్రాహ్మణులకు చతుశ్చత్వారింశద్గ్రామములను, క్రకముగా వేగి నాటి వారికి మూడును, వెలనాటి వారికి ముప్పదియారును, ఆంధ్ర ద్రావిడులకైదును దానమిచ్చెనని యొకటాటువు గలదు[43]. ఉపవనములనేకములనెక్కొల్పి యతడు అనేక నగరోపకంఠ ప్రతిస్థాపిత బహువిధారామ కీర్తియయ్యెను[44]. ఉపవనముల నెలకొల్పుట యశఃకారణమును సంప్రదాయానుగతమగు సప్తసంతాన ప్రతిష్ఠలలో నొకటి యగు పుణ్యకార్యము. వేముడు బ్రాహ్మణుల పోషించి, ప్రోత్సహించి యజ్ఞయాగాది క్రతువుల పునరుద్ధరించి అనవరత పురోహిత కృతసోమపాన[45] బిరుదమును బడసెను. పురోహితుల సోమపానము నిరంతరము సాగెడిదట, అన్ని యజ్ఞములు జరిగెడివి. హేమాద్రికృతి చతుర్వర్గ చింతామణిలో దానఖండమున పేర్కొన్నవానిలో పెక్కు వేమునిచేనీయబడినవి. అతడు నిస్సీమ పరశురాముడుగదా[46].

వేముని అవసానమునాటికి అతని రాష్ట్రము కృష్ణానది కిరుతీరములను, దక్షిణమున కందుకూరు కవ్వలను, పడమట శ్రీశైలమువరకు విస్తరించెను. అప్పటికాంధ్రదేశముననున్న అనేక సామంత మండలములు వేముని రాష్ట్రమంతటివో, అంతకన్న చిన్నవో. అటయ్యును కాతీయాదుల వలె వార తరువాతి పలువురు సామంతుల వలె వేముడు మహా మండలేస్వర బిరుదును తాల్పలేదు. అతడు కేవలం శ్రీమతుతో తృప్తిజెందెను. అతడి తరువాతి వారును కొండవీటి రాజమంద్రి రెడ్డి ప్రబువులును రాజ్యమెంతగ విస్తిరల్లినను అదే క్రమమును పాటించిరి. చిరప్రచారమగు మహామండలేశ్వర మాండలిక యన్నది సమమో, క్రిందో తెలియదు కాని, కొండవీటి

రాజులలో ఐదవవాడగు పెదకోమటి వేముడు మాత్రము మహామండలేశ్వరుడు[47] అదియును అతని శాసనములలో గాక అతని యధీన నాయకుని శాసనమునందే కన్పించును. మనుసూరు ప్రలోలయ కాపయలనును ఈ బిరుదును గైకొనలేదు. కాని కాపయ శాసనములు కొన్ని అతనిని ఆంధ్ర దేశాధీశ్వర , ఆంధ్ర సురత్రాణాయని వర్ణించినవి. విజయనగరము స్వతంత్ర రాజ్యమైన దాదిగ, హరిహర(1) మొదలగు వారెల్లరును మహామండలేశ్వరు[48] మునుసూరు నాయకులను రెడ్డి రాజులను మహామండలేశ్వర బిరుదము తాల్పకుండుటలో విశేర్థమున్నది. ఆ బిరుదము దాల్చుట దక్షిణ భారత రాజవంశ్యుల కనుగతమును, సాంప్రదాయకమగు నాచారము. తెలుగు చోడ వెలనాటి చోడులు, చాళుక్య చోడ నృపతి కులోత్తుంగ (1) వలన పడసినట్లు, ముసునూరు వారు రెడ్డి వంశ్యులెవ్వరు వారి యధిరాజుల కడనెట్టి రాజ చిహ్నములను బడయనైరి. కళింగాంగులు మహేంద్ర గారి పైగల గోకర్ణేశ్వరునుండి, వేంగీ చాళుక్యులు చాళుక్య గిరిని గల నందా భగవతి నుండి అఖిల రాజ చిహ్నములనందినట్లు ప్రాచీన ఐతిహ్యములు పురాణ గాధలేవియూ ముసునూరు కొండవీటి ప్రభువుల యెడ వర్తింపవు. వారు సూర్యచంధ్ర వంశ క్షత్రియులు గారు. ఇన్ని కారణములులు గనే వారు రతమ్ము మహామండలేశ్వరులుగ ప్రకటించుకోలేదు. కోరిక లేకగానీ, అవకాశము లేకగానీ కాదు, హిందూ సాంప్రదాయమది కాదు కావుననే శాస్త్ర విదిత ధర్మములను, సనాతనాచారములను పునరుద్ధరించుట వ్రతముగా గలవారు - ఈ నియమములనుల్లంఘింప నోపుదురా...? విజయ నగర రాజులు తమ్ము చంద్రవంశ క్షత్రియులు గనెన్నుదురు. కావున వారికా బిరుదమున కర్హత గలదు.

మహా మండలేశ్వరు బిరుదముజ్జగించిన మాత్రమున వారి యధికార బల ప్రాముఖ్యములకే కొదువయు కాలేదు. వారి యాజ్ఞలు శిరసావహించుటయు, శ్రద్ధగ నిర్వర్తించుటయు అడ్డులేక సాగుచునే యుండెను. శక. 1275 (1353)లో ప్రోలయ చనిపోవునాటికి అతడు స్థాపించిన రాజ్యము సుస్థిరము ప్రభవము పరిగణనీయమునయ్యెను.

వేముని ముగ్గురు కొడుకులు - అనవోత, అనమాచ, అనవేములు. కూతుంద్రు

ఇరువురు. అందొకర్తె పేరు తెలియదు. ఆమె భక్తి రాజపుత్రుడు చోడభీముని వివాహమాడెను. రెండవదియగు దొడ్డాంక, కాటయరెడ్డిపుత్రుడును, మారయ పుత్రుడునైన కాటారెడ్డి(2)[49] ను పెండ్లాడెను. అనమాచ పిన్న వయసుననే మరణించినట్లున్నది. వేముని సోదరుడు అన్న అతని కూతురు వేమాంబ[50] చిట్టపౌత్రుడును, నూకపుత్రుడును అగు నల్లనూకని పత్ని. తను జీవించియుండగనే వేముడు తన పుత్రులలో జ్యేష్ఠుడు అనవోతకు యువరాజ పట్టమొగసి రాజ్యము పాలించు మెలకువలు నేర్పెను. మెకంజి వ్రాత ప్రతులలో వేముడు శ్వాసవ్యాధి ప్రకోపింపగా దుర్బలుడై, విశ్రాంతిని గోరి, రాజ్య భారమును పుత్రునిపై మోపి తాను పాలనను విరమించెను.

వేముని ఆస్థాన కవి ఎఱ్ఱాప్రెగడ హరివంశము ఆశ్వాసాది పద్యములలో ఆయన పోషకుని వ్యక్తిగ, రాజుగ ఎంతో నుతించెను. వేమన అరిది విలుకాడు, యోధాను యోధుడు, వినయి, సజ్జనుడు, దైవభీతి గలవాడు, ఘడేరాయ గంగయ దేవుని సచ్ఛిష్యుడు. వేదశాస్త్ర నిష్ణాతులగు బ్రాహ్మణుల యెడల మిక్కిలి యౌదార్యశీలి. సంస్కృతాంధ్ర కవి పండిత పరివేష్టితుడు. సప్తసంతాన ప్రతిష్ఠలచే సంపాదిత సుస్థిర పుణ్యుడు. తపోధనులకు విధ్వత్ప్రకాండులకు ఎన్నియో అగ్రహారములనిచ్చి, యజ్ఞాదుల నిర్వర్తింపజేసినాడు. చదివేందరల, అన్న సత్రముల, తటాకముల, పుష్పఫలోప వనముల, గుడిగోపురముల నెలకొల్పినాడు. వేముడిట్టివాడని, ఎఱ్ఱాప్రగ్గడ యంతటివాడు అతనిని ప్రశంసించినాడు. ఎఱ్ఱన ఇట్టి సందర్భముల నతిశయోక్తులకు తావీయడు. కావున ఈ వేమ ప్రశస్తి సత్యదూరము కానేరదు.

# ఆధారములు


1. ND I, Vol. III, 0 - 73, P-1022, For Chapt, pp 39, 40 footnote 7 :
2. Ep. Coll. 753 of 1920
3. Ibid 754 of 1920
4. ఆం.సా.ప.ప. Vol. II, pp 93-112 భారతి Vol. XXI (1944) June, July Numbers, for Chap Appandix II, pp 110-IV.
5. Mack Mass, No. 15-4-42. the pedapudi grant of komatireddi వేమాధిస్వా వరజోపి మల్లభూవల్లభు సౌజగ దేకమల్లః అల్లావదీనా తురుష్మ మల్లాది సముల్ల సద్భంగ గణాన్ విజత్స ఇదేస్లోకము కందుకూరు రెడ్డి రాజు శివలింగ భూపుని గిరీశశ్రుతి మాలాలో నున్నది.
6. For gotham Chapt. P. 80.
7. Harivamsam I, i, ప. V 23.
8. చెఱుకు జదాళ బొల్లయ్య, అతని కొడుకు రుద్రదేవుడు కాకతీయుల కడమహా సామంతులయిన రెడ్లు. వారి శాసనములు కర్నూలు జిల్లానంది కొట్కూరు తాలూకాలో నున్నవి. (V. Rangachari, Inscription in the Madras Presidency Vol. II 948 No. 409 Loc Rec.) అందువలననే కావలయు వేమారెడ్డి శ్రీశైలము వరకు గల భూమి రెడ్లకు చెందినదని వేముడూ దానిని స్వాధీనము జేసికొన్నాడు.
9. కొండవీటి దండకవిపె.
10. ... ధనదపుర ప్రభృతీని శాఖానగరరాణి, బంకహ్యాణాని(?) ద్వీపాంతరాణి... భూపైన భూషణమివ భువన భారము ద్వహన్ వంద్యోలు భూవ మాచ భూపాలః... వేమ చరితయ్ 101.
11. S.I.I. Vol. IV, No. 950
12. S.I.I. IV. No. 1294
13. ఆ.సా.ప. రు. II pp 93 ff భారతి 1944
14. Ex. Coll. No. 340 of 1915
15. Loc. Rec. Vol. LVII, p 131
16. S.I.I. Vol. I, No. 589
17. N.I.I. III, 0 - 78 P 1037
18. సుస్ఫుటమగు నిట్టి దోషమునకేదియో బలవత్తర కారణముండవలెను. కాపయ రాజైన దాదిగనో లేక యతని పాలనా పదార్థముననో వేమ కాపయలలో నైమనస్యము ప్రబలెనేమో. తీరభూములలో 3 కాపయుని ప్రతినిధిగ తొయ్యేటి అనవోతని నియామకము వారి సఖ్యమును భంజించి యుండును.
19. NDIIA, 37P, 251; P 251, A 39, P255.
NDII II Kn4 P 638; km 10, P 650; NDII III 46, P 1392
20. గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకా అప్పాపుర శాసనము (Ex. Coll No. 402 of 1915) శా.శ. 1327 నాటిది. సముద్రము చాయల ఓంకార నదీ ప్రవాహపథమున గల కోట

రాష్ట్రమున కమమనాడొక భాగమున్నది.

నేటి గుంటూరు జిల్లాలోని నరసరావుపేట, బాపట్ల, ఒంగోలు, తాలూకాలను నెల్లూరు జిల్లాలో సముద్ర తీరస్థముత్తర భాగమగు పాకనాడును కూడినది కమ్మనాడు.

21. Ep. Call. Nos. 190 లో 230 of 1905.

22. J.O.R. Vol. V, PP 128 ff : భారతి సం. VIII (1931 July) PP 120ff

23. అప్పటి తెలుగు నాయకులపై విశ్వనాథ లేక విశ్వేశ్వర దేశికుల ప్రభావమమితమని తోచును. అనితల్లి కలువచేరు శాసనమునందు ముసునూరు ప్రోలయ చనిపోగా ఆరాజ్య భారమును కాపయ వహించినది. విశ్వేశ్వరులానతిచ్చి నందుననే ఆవిశ్వేశ్వరులను, భక్తి రాజుచే కణ్డవకొల్లు దానము గొన్న విశ్వనాధులును ఒక్కరేయనిపించును.

24. ఈశా.శ. 1277కు సరియగు కాలము క్రీ.శ. గణనమున, 1356 నవంబరు 7, సోమవారము (భారతి VIII Page 795 ff ఆదానమిచ్చినది కార్తిక (మహా కార్తిక్యము) 15 సోమవారమున.

25. శివరాత్రి మహాత్యము ।

భక్తి రాజాఖ్యచే ఒర్వతేశ్వరునకు
నర్పించే జెరువాడ నాతుకూరు
ధరణి త్రిపురాంతకున కాముదాల పల్లె
... పోలిదేవయ్య చెన్నూరు (మూర్తి...)

26. Ep. Call No. 754 of 1920 అతనికి అన్నమవేమ. అన్నయవేమ యనియు పేర్లు. హరివంశము (ఎఱ్ఱాప్రెగడ) II, III, IVI.

27. అనవేమ క్షితిపాత్రి యగు వేమాంబామహాదేవిన్ ఘనుడయ్యెల్లయ్య భూమిపాలునకు... కాశీఖండము । భరిత శ్రీనిధి యమ్మహీరమణుడొప్పన్ బోళభక్తిక్షితీశ్వర సూనుండగు భీమలింగమను జేశశ్రేష్ఠసత్పుత్రి, భాస్వర కారుణ్య దశా జనావన విధాసంధాత్రి వేమాంబికన్ వరియించెన్ పతిభక్తి గౌరవ ధృడవ్యాపార నిత్యాంభికన్. శివలీలా విలాసము । కాశీఖండమున శ్రీనాధుడల్లాడ వంశముభి వర్ణించుచు అల్లాడ భార్య వేమాంబిక అనవేముని ప్రీతియన్నాడు. ఆఅనవేముడు ప్రోలయనేముని రెండవ కొడుకును, అనవోత సోదరుడునని తెలుగు సాహిత్యకులు చారిత్రికులు నిర్ణయించిరి. అనవోత సోదరుడగు అనవేమకు పుత్రులు లేరు. అందుచే చిలుకూరు వీరభద్రరావు గారు తన ఆంధ్రుల రిత్రలో యీపాత్రి పదమును 3 పుత్ర్యాఃపుత్రిః (దౌహిత్రి) అని వ్యాఖ్యానించిరి. దీనినెల్లరు నంగీకరించిరి. అట్లేయగుచో వేమాంబిక భీమచడునికి ప్రోలయ రెండవ పుత్రుడగు అనవేముని పుత్రివలన కలుగు సంతానము కావలెను. అట్లైన భీమలింగ కేవలి కాలము నిర్ణయింపవలెను. అల్లాడ, కొమరగిరి కాలమునకే పాలనా వ్యవహారముల పాల్గొనుచుండుటచే అనవేమునికి అంత అతని దౌహిత్రికి పతియగునంత దూరముండజాలడు. అంతియేగాక భీమలింగ భక్తిరాజుకు మరొకసుతుడగు అన్నదేవ చోడునికి సవతి తమ్ముడా అన్నయో కావచ్చును. రాజమహేంద్రవర శాసనము (Mac. Mss. Nos 15,5,36 and

15-44) ప్రకారము అన్నదేవ చోడుని పట్టాభిషేకము శా.శ. 1289 (J.A.H.C. Vol. I P 40 of m8) లో శా.శ. 1310కే, కొమరగిరి హోజగ నుండగనే, అతడు రాజ్యమున్కై పోరాడు (వివదించు)చుండెను. అట్లు గావున భీమలింగ అన్నదేవచోడుని కగ్రజునిగనేను భావించుచున్నాను. అది ఆధారముగ వేమాంబిక తాత అనవేముడు ప్రోలయ వేముడే కావలెను. దొడ్డాంబికకు తోడుగ అతనికి మరొక పుత్రిక భీమలింగనికి పత్నిగానీ కలిగియుండును.

28. Ep. Coll No. 191 of 1905
29. Ep. Call No. 184 of 1905
30. వేముని సోదరుడు అన్నారెడ్డి దళ నాయకులలో నొకడు. అతనిని హరివంశమిట్లు పొగడును.
అన్నచమూవరుండు సకలార్థ సమన్వితునడన్నదాన సం
పన్నుడ భిన్న బహుబల భాసిభవాంఘ్రి సరోజపూజనా సన్నుతి తత్పరాత్ముడవసన్న విరోధి ప్రసన్న భావుడభ్యున్నతి శాలి కీలిత శుభోదయి దురిగితుడయ్యె నెయ్యెడన్.
31. Ep. Call No. 191 of 1905
32. Ep. Call No. 250 of 1905
33. Ep. Ind Vol. VIII, pp 9ff
34. రెడ్డిరాణి, Vol III (Spet. 1926) No. 12 శ.శ. 1262 నాటి వేముని మంచెల్ల శాసనము గద్యలోని సోపాన నిర్మాణ ప్రశంస ఉన్నది. (శ్రీసైల శఖరా క్రాంత సోపాన రచనా శ్రేయస్సంపాదిత...) ఈపుణ్యకార్యమును రెడ్డిశాసనములన్నియును ఒక్కటైన కాదనక, ప్రశంసిచనవి, ఈకార్యము మద్రాసు మ్యూజియం తామ్రశాసనముల నాటికే జరిగియుండిన) అందు దాని ప్రస్తావనము తప్పక యుండును. మంచెల్ల శాసనము నష్టమైనది. శాసనమందలి గద్యభాగము ప్రతిపదము నమ్మజాలము. పై శాసన గద్యలోని సోపాన రచనా ప్రశంస నిజమని నేను నమ్మను.
35. వేమభూపాలీయము (III పు 971)న ప్రోలారెడ్డి మామగారు తన కూతురు అనంతాంబ లేక అన్నెమాంబను స్కందప్రసాదమున బడసెననియు (వే.భూ.పు 17). అతడు సింహపురి వాసియనియు చెప్పియున్నది. అతని పేరు తెలుపదు గాని అతనిని 3 ఉద్ధటితరిపు బలతుక్భారఘట్టయని వర్ణించినది.
36. శృంగారనైషధము I పు. 22.
37. Mac. Mss. No. 15-4-27
38. Mac. Mss. No. 15-4-30
39. Mac Mss. No. 15-4-17
40. NDI II, No 28, P 789
41. తరువాతి విజయనగర శాసనములు ఉదయగిరిని నరాయసింహాసనానికి మొదలి దుర్గ మనవి. విజయ నగర రాజ్యస్థాపన పిదప వారు సాధించి ధృడపఱచిన ప్రధాన దుర్గమదియని ధ్వని.
-NDI, II Kn 30, P 543, Kn 77, P 61

42. వాసిష్ఠ రామాయణము । ప్ర. 33
43. వేమభూపాల సత్తమః బ్రాహ్మణో భ్యశ్చత్వారాంశ
44. పౌరజనుల ఆరోగ్యమునకై ఉపవన ప్రతిష్ఠలను నీవిశిష్ఠపాలనాధర్మమును, దాదాపారువందలేండ్లకు మునుపు నిర్వహించిన యా 14వ శాతాబ్ది పాలకుని నాగరకా బిరుములెంతేని ప్రశంసార్హములు.
- Ep. Rep. 1920, P 120, Para 60
45. S.I.I. Vol. II 243
46. Nadupuru grant of Anavema (Ep. And Vol. III, P 286) describes prolayavema.
47. Ep. Call No.s 327, 328 of 1936-37)
48. శుక్ర నీతిసారము యాదాయముల బట్టి యానాయకులలో తరతమ భేదముల నిర్ణయించును. 1 నుండి 3 లక్షల ఆయము వారు సామంతులు. 4 నుండి పది వరకు గల వారు మాండలికులు. పదినుండి 20 వరకు పొందువారు రాజన్యులు, 20 నుండి 50 లక్షలవాడ మహారాజులు.
-శుక్రనీతి సారము IV, 184 - 185.
49. Ep. Ind. Vol. IV, pp 318 కాటయ వేముని శృంగార శాకుంతల వ్యాఖ్య - ఉపోద్ఘాతము
50. Ep. Call No. 572 of 1925

## అనుబంధము

# అనవేముని చీమకుర్తి తామ్రపత్రము

ఈ శాసనమునకే తామ్రపత్రము పై లిఖింపబడినది. ప్రభుత్వపు ఎపిగ్రఫీ శాఖ వారు దీనిని 1920లో చీమకుర్తి కరణము కడ సంపాదించిరి. దీనిని ఎపిగ్రాఫియో ఇండికా సం. XXI, PP276, నుండి ప్రకటించిరి.

అదియొక దానశాసనము. శ్రీశైలములోని అమ్మన బ్రోలు సీమయందలి రామతీర్థ గ్రామమును సర్వాగహారముగా చిట్టమూరి తిమ్మన భట్ట శాస్త్రులు బడసెను. అతడు కామేశ్వర భట్టపౌత్తుడు కొండు భట్టారక పుత్రుడు కౌండిన్యశ గోత్రయుజు శాఖ ఆపస్థంభ సూత్రమువాడు. దానము గొన్నది శా.శ. 1257 యువసంవత్సర కార్తీక మాస శుద్ధ ద్వాదశి గురువారమున మన్వాది మహాపుణ్యకాల సందర్భముగా పైన పేర్కొన్నదే గాక అధికముగ అతడు పడసినవి :

1. చీమకుర్తి, భీమవరము, పులికొండ, మల్లవరము, కొమరపురి గ్రామములందు చెరువు కింది మెట్ట మాగాణి భూముల చెరకు తమలపాకు పొలములలో నాల్గవ భాగము సర్వమాన్యముగ

2. మిగిలిన మూడు భాగముల పంట లన్నిటిలో పదునాఅవ భాగము అందు ఐదవపాలు సువర్ణాదాయముగ

3. ఆ ఐదు గ్రామములు గాక ఆ సీమయందంతటను గల యితర గ్రామములలో పెద్ద చెరువు నీటి సాగు గల భూముల పండు ధాన్యమున 10 బాగము

4. పెద్ద గ్రామముల ప్రతీ దాన మందును ఇన్నూరేసి కుంటల, ప్రతీ కుగ్రామమున 100 కుంటలభూమి, 16 బారల పొడవు గడతో కొలచి నిశ్చయంచినది. సర్వ మాన్యముగ

పై శాసనములు తఱచి చూడగా అది కృతకముగ కన్పడుచున్నది.

సంశయమునకు కారణములు :

1. కొండవీటి రెడ్డి రాజుల తామ్రశాసనములన్నిటిలోను,........ముఖ్యముగ వేముని భూదాన విషయముల, ఆ భూముల పొలిమేరల సూచించు పట్ల తప్ప, మిగిలిన భాగమంతయును సంస్కృతముననే వ్రాసి యున్నది. పూర్తిగ తెనుగుననే వ్రాసిన వేముని తామ్ర శాసనముల నిది రెండవది. మొదటిది కొండపల్లి శాసనము C.P.No. 5 of 1925-26 (శారద సం.(3) 1925, మే.పు. 893) ఇదియును చేనుమర్తి శాసనము వలె కూటరచనమే.

2. సహజముగ కొండవీటి రెడ్డి రాజ శాసనముల నన్నింటను చివర జాతల సంతకలుండును. ఉదా : పల్లవ త్రినేత్ర, అనవేమ, వీరనారాయణ యిద్యాది చీమకుర్తి శాసనమున నట్టిదేమియును లేదు. కాకతీయులకనంతరము తామ్రశాసనములన్నింటను ప్రాణము వ్రాలే.

3. ఆనాటి శాసనములలోని బసువ యన్న ప్రయోగమునకు వేరుగ, బిరుదములలో యీ శాసనము బసువ యన్న రూపమునుపయోగించినది. అరి రాయ బసవ శంకర యని.

4. శాసనమునిచ్చిన కాలము సరికాదు. శా.శ. 1257 యువ కార్తిక శు. 12 ఆదివారమగును. కానిశ్వాసమున చెప్పినట్లు గురువారము కాదు.

5. ప్రశస్తి యీ శాసనమున కలంత దీర్ఘముగ కొండవీటి రాజమహేంద్ర వర రెడ్డి రాజుల శాసనముల నెందును కనుపట్టదు. ఇందలి బిరుదములు జలదుర్గ జలధిబడబాగ్నిలదుర్గ హవన హలాయుధ, కళింగ రాయ మానమర్దన, మన్నియ రాయమృగవేంటకార, వడ్డియ రాయ నిర్ధూమ ధామ, జంతుర్నాట రాయహల్ల కల్లోలల, రెడ్డి రాజ శాసనముల మరెచ్చటనూ లేవు. సముద్దండద చండ భుజాసి విఖండిత శత్రుకీలాల ప్లవమానపిశాచ రణ స్తూయమాన యశోమండన యని ప్రోలయ వేముని అమరావతి శాసన ప్రశస్తి చీమకుర్తి శాసనము సంగ్రామ సముద్దండ చండ భుజాసి విఖండిత కృతకీలాల యని తప్పుగ సమకూర్చబడినది. కొంగరాయమాన వర్ధన, వడ్డియ మాన నిర్ధూమధామ,

జంతుర్నాట రాయహల్లకల్లోల ములు సూచించు విజయములు నిజమేనని, అంతలేసి విక్రమములు వేముని యితర శాసనములు, అతని సంతతి వారల శాసనములన్నియు విస్మరించుట అనూహ్యము. వేముడు కళింగమును, ఒరిస్సాను, జయించెనన్న శాసనమిదొక్కటియే. దీని సమర్థనము మరెందుకు కానదు.

వేముని కళింగ దండయాత్ర యసంభవమగుటయు నీ శాసన యదార్థ్యమును శంకింపనాస్పదమైనది.

ఈ శాసనము శా.శ. 1257 నాటిది. అప్పుడు ఆ డెబ్బదైదుగురు నాయకుల నేత మునుసూరు ప్రోలయ బ్రతికి యుండెనో లేదో తెలియదు. కళంగమునకు చేరక పూర్వము వేముడు తన యధీనత యగు మునుసూరు ప్రోలయ నోడించి యైన యుండవలెను కాదా, ప్రోలయయో, కాపయయో కళంగ జయమునకు ధ్యమించి యుండవలెను. ఈ రెండును నేల విడిచిన సాములే. శాసన కాలమునకు నాయకులందురును ముస్లిముల బారినుండి విడవడు యత్నములందే నిమగ్నులు. వారి నుండి వరంగల్‌ను తిరిగి జయించుట శా.శ. 1258-59కు గాని లేదు. స్వయమగునో కాక మునుసూరు వారి పరమగునో వేముని కళింక విజయయాత్ర యసంభవము.

ఇన్ని కారణములుగ చీమకుర్తి శాసనము అయదార్థమనవలెను. అటయ్యును అందుటంకించిన అంసములకాస్కారమున్నది. మూలదాన పత్రము నష్టముకాగా ప్రతి గ్రహీత ఆ మూలమున తన్నైక భూదాన ధాన్య భోగ పరిరక్షణకై వేరొక తామ్రశాసనమును కల్పించి యుండును. కాని అదియను 14వ శతాబ్ది చివరనో, 15వ శతాబ్ది ప్రారంభముననో చేసి యుండవలెను. అప్పటికి గాని కొమరగిరు రెడ్డి రాజ్యకాలమున గాని - కళింగ ఓంఢ్ర, జంతుర్నాటి విజయములు జరుగలేదు. కావున చీమకుర్తి శాసనము 14వ శతాబ్దికి పిదప కల్పింపబడినదని నా విశ్వాసము.

# అధ్యాయము VI

# అనవోత

## (సు. 1353-సు.1364)

ప్రోలయ వేముడు చనిపోగా, కొడుకు అనవోత క్రీ.శ. సుమారు 1353 నుండి 1364 వరకు స్వతంత్రమునగు రాజ్యమును పాలించెను.

శా.శ. 1275 ప్రాంతమున రాజమహేంద్ర వరమునందలి ముసునూరు వంశ్యుడనవోత మరణించెను. గోదావరికి తూర్పు భూములకు రాజు లేడయ్యెను. బహ్మనిసుల్తాన్ అలావుద్దీన్ హసన్‌షా తాకిళ్ళలో తగుల్కొన్న కాపయ తూర్పు తీరపు వ్యవహారముల చక్కెట్టు నవకాశము లేదు. మంచి కొండముమ్మడి నాయకుడు తన తండ్రి యానతి మేరకు కోరుకొండలో రాజ్యాధిపత్యము ప్రకటించి ముసునూరి అనవోతచే పూర్వపాలితములగు భూములనెల్ల తన యధీనమొనర్చుకొనెను.

తీరాంధ్ర రాజకీయముల యవ్యవస్థ జూచి కళింగ ప్రభువు నరసింహదేవ IV తన యధికారమును పశ్చిమమున విస్తరింపనిదే యదనుగ యత్నించెను. అసంఖ్యాక సైన్యములతో నతడు గోదావరిని దాటి కృష్ణాతీరమున గల శ్రీకాకుళము వరకే తెంచెననుట కాచోట శా.శ. 1275/క్రి.శ. 1353 నాటి అతని శాసనము(1) సాక్ష్యము. కళింగాంగుల రెడ్డిరాజుల తొట్ట తొలి సంఘర్షణ ఇదే. పై శాసనమున నరసింహ దేవ IVని భార్య గంగా మహాదేవి శ్రీకాకుళ స్వామి శ్రీ వల్లభ రాయలకు భూషణదుల సమర్పించినట్లున్నది. ఈ ఉపహారములను రాజ్యసైన్యాదిపలు కాళిదాస సేనాపతి, గోవిందే సేనాపతి, గోపాలజియ్యలు రాణి పంపున స్వయముగ కొనిపోయి యర్పించిరట. కృష్ణకు నరసింహదేవుని పురోగమనమంతతో ఆగిపోయెను. రెడ్డి రాజుల ప్రతిఘటన కావచ్చును. అతడు కృష్ణ దాటి దక్షిణమునడచెననుటకు జయించిన భూముల చిరమధీయమున నిల్పుకొనెననుటకు ఎట్టి యాధారమును లేవు.

అనతి కాలమునకే అనవోత కళింగుల దాడికి ప్రతిగ పూర్వ విజయ యాత్రను చేపట్టెను. అన్య రాజన్య భీతి లేక దేశమున శాంతి భద్రతల నిలకడ తీరాంధ్రమంతయు,

ఏకచ్ఛత్రితముగాక సిద్ధింపదని ఇతడు గ్రహించెను. ఈ యుద్ధమున న నతనికి చెల్లెలి మామగారగు చోడభక్తి రాజెంతగనో సాయపడెను. శా.శ. 1278/క్రీ.శ. 1356 నాటి దక్షారామ శాసనము[2] అనవోతారెడ్డిని ద్వీప (దివి) జేతగ ప్రశంసించినది. కృష్ణను దాటి, కళింగమునకు విరుద్ధముగ, అనవోత సాధించిన మొదటి విజయమది.

కాకతి గణపతి దేవుని గణపేశ్వర శాసనము[3] పేర్కొన్న ద్వీపమే, అనవోత జయించిన "ద్వీప"మై యుండును. ఈ ద్వీపము లేక పెదదివి పురం, కృష్ణాజిల్లా బందరు తాలూకా తలగడ దివి[4] గ్రామము. తొలుత ధనదుడు (కుభేరుడు) కృష్ణానదీ సాగర సంగమమున నీ ద్వీపమును నిర్మించెనట. కొన్ని శతాబ్దముల తర్వాత దుర్జయ వంశ్యుడగు వెలనాటి చోడుడు పాలించుచుండగా రాజధాని యగు చందవోలును, అతని కడ యుద్యోగి నారాయణ సేధ గోపురాట్టాలకములతో ఉన్నతములగు బురుజువులతో, విప్రలోపవనములతో రమ్యమును విశాలమునుగ తీర్చెను. తీర భూములు గెల్చిన పిదప కాకతీయులు చందవోలును ఉపాంత స్థావర (Out Post) ముగ నెన్ని దానిని మరింత సుధృఢమొనర్చిరి. కృష్ణానదీ సాగర సంవేల్లితమును దుర్భేధ్యమునగు నా జల దుర్గమును స్వాధీన మొనర్చుకొని, అనవోత "ద్వీపజేత" యశస్కుడాయెను. ఇట్టి యద్భుత జయముతో ఆరంభమైన అనవోతని జైత్రయాత్ర సమస్తము సఫలమగుటలో వింత లేదు. అనవోతగాని, అతని సోదరుడు, తరువాతి రాజును అగు అనవేముడుగాని యీ పూర్వదిక్ విజయములను సవిశేషము తమ శాసనములలో ప్రస్తావించలేదు గాని, అనవోత ద్వీపమును జయించిన పిదప కళింగమును సుదూరము చొచ్చుకొని పోయినట్లు మాత్రము ఆ శాసనముల వలన దెలియగలము.

తనపూర్వ దిగ్విజయ సందర్భమున అనవోత కృష్ణకు, కళింగమునకు మధ్యగల భూముల నెందరో నాయక ప్రభువుల నెదుర్కొని యుండును. అందొకడు మంచి కొండ ముమ్మడి నాయకుడు. కోరుకొండ రాజ్యాధిపతిని యతని యధీనమున కోన, కురవాట, పానారలే గాక గోదావరికిరుతీరముల భూములునుండినవి. అతడా ప్రాంతములన్నింటిని - తొయ్యేటి అనవోత పాలించి యుండిన సకల భూభాగమును జయించినట్లు అతని కోరుకొండ శాసనము[5] శా.శ. 1275 నాటిది తెలుపుచున్నది.

అతని జయించుటకది దుష్కరమయ్యెను, అనవోత దానిని సాధించి ముమ్మడి నాయకుని తన వశవర్తి జేయగల్గెను.

దాక్షారామ శాసన[6] మాధారముగ అనవోత పూర్వదిగ్విజయ యాత్రాకాలమును నిర్ణయించవచ్చును. కళింగమునకు పోవునప్పుడో, అటనుండి మరలి వచ్చు సమయముననో దక్షారామ భీమేశ్వరునకైదు గంటల నర్పించెనట. అది జరిగినది శ.క. 1278/క్రీ.శ. 1356 లో వైశాఖ మాసశుద్ధ పూర్ణిమా శుక్రవారమున.

ఇప్పుగల్లు శాసనమున[7] అనవేముడు తన యన్నయగు నవోతని శబరప్రదేశముల దాడి వెడలుటనభివర్ణించెను. పచ్చని తాండిపల్లు[8] శాసనమున నారాజే అనవోత రాజ్యము వాయవ్యముదన వింధ్యాద్రి ప్రరోహమేఖలో పత్యకల వరకు విస్తరిల్లెనని యున్నాడు. ఇవి ఉత్ప్రేక్షా మాత్రములు; వేరు సాక్ష్యము లేక నిశ్చయింపరానివి. ఎంతగా నమ్మినను, అనవోత అటుమేఖలా పర్యంత భూములదండు వోయి కొల్లలాడెనను మాత్రమే గ్రాహ్యము.

అనవోతని పూర్వజైత్రయాత్ర ఎంత అమోఘమైనను దానివలన రెడ్డిరాజ్యము అంగుళమాత్రమైన హెచ్చలేదు; అతని మార్కొని పరాజితులైన సామంత నాయకులపై అతని యాధిపత్యము సాగనూ లేదు.

ప్రత్యబ్దం ప్రతిపక్ష దేశ జయినః అనవోతను అనవేమ తన కొల్లూరు శాసనమున[9] పొగడినాడు. ఇది అచ్చముగా నతిశయోక్తియే. ఏటేటదండు వెడలుటలు శత్రు దేశముల జయించుటలు యదార్థము కాకున్నను, అనవేమ గోదావరికి తూర్పుననున్న నాయక ప్రభువలతో పలురలు పోరుటలనది సూచించునదిను, అన్నిటను అతని విజయములూహించుటెట్లు? ఇంతకును ఆ అరివీరులెవరో? రాజమండ్రి మ్యూజియం శాసనములలో[10] తెలుగుచోడ భక్తి రాజు సూరవరము[11] యుద్ధముననొక వీరాన్నవోత నోడించెనని అతని కొడుకు అన్న దేవచోడుడు చెప్పినాడు. అన్నవోత లేక అనవోత నామధేయులు తెనుగు దేశమున ముప్పరుండినారు. రాజమండ్రిలో ముసునూరివారి ప్రతినిధి తొయ్యేట అనవోత, తెలంగాణా రాజకొండలోని పద్మనాయక వెలమ ప్రభువు అన్నవోత (శక.1283/క్రి.శ. 1361 లో

గద్దెనెక్కినాడు), రెడ్డిరాజ అనవోత, రాజకొండ సుదూరమగుటచే చోడ భక్తిరాజు ఆ పద్మ నాయకునితో తలపడునవకాశముండదు. మిగిలిన తొయ్యేటిరెడ్డి అన్నవోతలలో "వీరాన్నవోత" ఎవరు? దాక్షారామ, తదితర రెడ్ల శాసనములు, ఈ రెడ్డి రాజునే "వీరాన్నవోత" యన్నవి. భక్తిరాజు అన్నవోతకుబంధువు, చెల్లెలి మామాగారు. వారిలో పొరెందులకో అన్నాదేవుడు తన రాజమండ్రి మ్యూజియం శాసనమున తెలుపలేదు. కాని కారణమూహించుట సాధ్యమే.

తన విజయయాత్రలలో వీరాన్నవోత పోరిన కృష్ణా గోదావరీ మధ్య రాజన్యులలో సూర్యవంశజ క్షత్రియులు నుందురు. అగ్రహారవములుగా బ్రాహ్మణులకువారిచ్చిన గ్రామముల బట్టి వారి యేలుబడి యెందెందో తెలియవచ్చును. అగ్రామములలో పెక్కులు పశ్చిమ గోదావరి జిల్లాలో తూర్పు సగమునున్నవి. ఈ సూర్యకుల క్షత్రియుల ముఖ్యపట్టణము సూరవరము. స్థలనిర్దేశమున సంశయమే లేదు. అది నేటి కృష్ణాజిల్లా నూజివీడు తాలూకాలోనిది. అచటనే భక్తిరాజు వీరాన్నవోతనోడించినది. సూర్యకులుడైన ఉంది రాజు II రావుల పర్తిశాసనము[12] శక. 1304 నాటిది. ఈ రెండవ ఉండి రాజో, అతని తండ్రియైన తమ్మరాజో అనవోతకు సమకాలీనుడు. భక్తిరాజు కొడుకు అన్నదేవచోడుని భార్య ఇరుగంబికపిన ఉండి రాజసోదరి, సూర్యవంశజుడగు శ్రీచక్రవర్తి కూతురు. సూరవరపు సూర్యకుల క్షత్రియులలో పిన వుండి రాజన్న నుండవ్చును. వారలలో కొందరికి ఉండీశ, ఉండిరాజ అన్న పేర్లు గలవు. కాని అతడెవరో రూపింపరాదు; రావుల పర్తి శాసనపు ఉండి రాజు తండ్రి తమ్మరాజే గాని శ్రీ చక్రవర్తి గాడు. అది తమ్మరాజుకు మరొక పేరేమో తెలియదు. అదేమైనను, భక్తి రాజుకు, సూరవరం వారికి బాంధవ్యము సంభవమే. భక్తిరాజ రాజధాని కామపురి ఇప్పటి కామవరము లేక కామవరపు కోట (పశ్చిమగోదావరి, చింతలపూడి తాలూకా) వారివి ఇరుగు పొరుగు రాజ్యములు. అనవోత సూరవరమునాక్రమింప గల్గినచో కామవరమునకు నిలకడయెట్లు? అందునే భక్తి రాజసూరవరపు క్షత్రియులకు తోడ్పడెను. భక్తి రాజు అనవోత నోడించుట ప్రాయశః ఇట్లే అయియుండును. కృష్ణాగౌతమీ మధ్య దేశమున నధిక భాగము అనవోత చేజానట.

గుల్బర్గా అలావుదీన్ హసన్ షా తఱచు దండెత్తివచ్చుటలు చెర్లవారి రాపిళ్లు విజయనగర ప్రభువుల యెత్తిళ్ళు రెడ్డి రాజ్యబలమును సడల్చివైచెను.

అలావుదీన్‌హసన్ షా దండయాత్ర తెలంగాణమునంతను భయభ్రాంతము చేసెను. దక్షిణమున కృష్ణానదీ వరకు సర్వమును పాడువడెను. యవనులు వచ్చు వార్త విన్నంతనే భీతులై తెలుగునాట ప్రభువులు దుర్గాశ్వభట సముదాయముల దిగవిడి వనముల జొచ్చిరి. అట్టి సమయమున అనవోత ప్రభుసచివుడు మల్లయవేముడు యవనాశ్వ సైన్యము నెదిరి నురుమాడి ముస్లిముల పలాయితుల జేసి రెడ్డి రాజ్యమును కాపాడెనని, శా.శ. 1283/క్రీ.శ. 1361 నాటి అనవోతని అమరావతి శాసనము[14] తెలుపుచున్నది. ఈ సందర్భమున ముస్లిములు నల్గొండ జిల్లా పిల్లలమర్రి[15] యందు వలనే అమరావతి యందును, దేవాలయమును చెరచి మలినము గావించిరి. ధాన్య వాటిలో ఆ అమరేశ్వర దేవాలయమును ఉద్ధరించి శుద్ధి క్రియలను మల్లయ వేముడు నిర్వహింప జేసెనని, పై అమరావతి శాసనము ప్రస్తుతించినది.

ఇట్లు దేశమున శాంతి నెలకొనగా అనవోత దాని యార్థిక సౌష్టవముపై దృష్టి మరల్చెను. దేశ, విదేశ వర్తక వాణిజ్యముల పెంపొందించి, రేవు పట్టణముల సౌకర్యముల, భద్రతల పెంచి, పటిష్ఠముల జేసెను, ఆ కార్యమున నతని విశేష శ్రద్ధ నాకట్టినది మోటుపల్లి రేవు ఆనాడు విదేశ వాణిజ్యమునకది పెట్టిన పేరు. అంతటి సంపత్సమృద్ధమగు పట్టణము తెలుగునాట మరియొకటి లేదు. తత్పూర్వమది అనుచితములగు వ్యాపార వ్యవహార నియమముల వలనను, వానిని ప్రవర్తిల్లజేయుటలో రాజోద్యోగుల అవితర్కిత కాఠిన్యము వలనను, క్షీణించి యుండినది. అనవోత అచట నౌకావర్తకము మందగించిన కారణములరసి, న్యాయ రహితములగు శాసనములను వర్తింపజేసెను. శక. 1280/క్రీ.శ. 1358లో విదేశీ వ్యాపారము జేయు అచటి వర్తకులకు అనవోత ప్రసాదించిన నూతన శాసన పత్రమున విదేశ వ్యాపారమున వాలవలంబింప వలసిన విధులు, నియమములు, దిగుమతులు, ఎగుమతుల సరుకులపై సుంకముల పరిమాణములు స్పష్టముగ నిర్వచింపబడినవి. దీనితోవిదేశ వర్తకమునకు నవయుగ ప్రాణము పోసినట్లయ్యెను. రాజానతిపై, మోటుపల్లి లోని రాజప్రతినిధి

యానూత్న వ్యాపార శాసనమును స్థానిక వీరభద్రాలయ స్తంభముపై చెక్కించెను. ప్రజల యోగక్షేమములందు అనవోతనికి గల శ్రద్ధాసక్తులకు సాక్ష్యముగ నాశాసనమిప్పటికిని మిగిలియున్నది[16].

అనవోత రేచర్ల నాయకుల యుద్ధమొకటిని వెలుగోటివారి వంశావళి ప్రస్తావించినది. మాదానాయకుడును అతని సోదరుని పుత్రుడుకరాతి నాగయ నాయకుడును అనవోతారెడ్డిని దర్శాల కోట లేక ధరణికోట యుద్ధముననోడించిరట. కొండవీటి రెడ్లకును, రాజకొండ వెలమలకును 15వ శతాబ్ది మధ్యము వరకు సాగిన ఎడతెగని పోరునకిది నాంది.

ఈ రెడ్డి వెలమల ఘర్షణ గూర్చి వారి, వీరి శాసనములనెట్టి ప్రస్తావమును లేకపోవుట చిత్రము. ఇరు పక్షములవారి పోషణమున వెలిసిన సంస్కృతాంధ్ర రచనములందును ఈ పోరులు పరస్పర విజయముల సూచనలేదు. అయ్యును వంశావళిలో ఈ విషయములే చాటుపద్యముల సాక్ష్యమును మెలకువమై గ్రహింపదగును.

ఈ రెడ్డి పద్మనాయకవైరము శక. 1283లో జల్లిపల్లి ముట్టడితో ఆరంభమై, సుదీర్ఘముసాగినది. రేచర్ల అనవోత నాయకుడును, అతని సోదరుడు మాదానాయకుడును, తమ తండ్రి సింగమనాయకునిహత్యకు ప్రతీకారముగ నిందుకు తలపడిరి. దుర్గ రక్షర దళమున చంద్రవంశ క్షత్రియులకు ప్రాపుగ కొందఱు రెడ్డి ప్రముఖులునుండిరట. ఈ క్షత్రియులు ప్రాయశః చాళుక్య వంశ్యుడగు ఆరవీటి సోమదేవ రాజునకు బంధువులై యుందురు. దుర్గ సైన్యముల నిర్దాక్షిణ్యముగ హతమార్చి, ఎట్లో తప్పించుకొని పారిపోవు వారిని పద్మ నాయక వీరులు వెంట తరిమిరి. ఆ వెన్నాడుటలో రేచర్ల మాదన్న వోతలు కృష్ణానదిని దాటి, దానికి దక్షిణముననున్న కర్నూలు, గుంటూరు మండలమునాక్రమించిరి. శ్రీశైలము, మొదలగు కృష్ణాదక్షిణ భూములు రెడ్డిరాజులవి రేచర్ల నాయక పదదళితములై, పాడువారినవి[17]. రేచర్ల సింగమ నాయకుడు II సంస్కృతమున తాను రచించిన అలంకార గ్రంథము రసార్ణవసుధాకరమున తన తండ్రి అనవోతనాయకుడు I శ్రీశైల క్షేత్రోపరికి సోపానముల నిర్మించి యాత్రికులకు దానిని సుగమము చేసెనని[18] వ్రాసినాడు. ఇది రేచర్ల వెలమలు

శ్రీశైలమును జయించిరని వేరొక బంగని చెప్పినట్లే.

రేచర్ల మాదానాయకుడు, సోదర సుతుడగు కతారి నాగా నాయకుడు తోడురారెడ్డి రాజ్యమున యింకను తూర్పుగ చొచ్చుకొని పోయెను. అనవోతారెడ్డి తన సైన్యములతో వారిని మార్కొనెను. దన్నలకోట యుద్ధమున మాదానాయకుడనవోతారెడ్డిని, విరాట గోగ్రహణ సందర్భమున అర్జునుడు దుర్యోధనుని వలె నిర్జించి పలాయితుని జేసెనని వంశావళి[19] కథనము. అనవోతారెడ్డి సర్వాయుధసామాగ్రిని రణరంగముననే పారవైచి పిక్కబలము చూపెను. అతడు శత్రువుల చేజిక్కినట్లున్నది. నాగా నాయకుడనవోతారెడ్డి వీపున, అతని యోటమి చాటుట, తన లాంఛనములు[20] ముద్రించి విడిచెనట. తమ విజయోత్కర్ష ప్రకటింప రేచర్ల, వారు రెడ్లకు సహజములైన జగడొబ్బగండ, సంగ్రామ ధనంజయ, రాయవేశ్యాభుజంగ[21] యిత్యాది బిరుదములను తాము గ్రహించిరి.

వెన్నెలకంటి సూరన తన విష్ణుపురాణ గ్రంథారంభమున వర్ణించిన యొకఘటన యీరెడ్డి వెలమ సంగరమునే తలపించుచున్నది. అమరావతి (దన్నలకోట, ధరణికోట) యుద్ధమున నొక రాహుతు( అశ్వసైనికిడు) కేసభూపనాముని చిదుకగొట్టి ప్రాణములతో వదలి తరిమెనట[22]. ఈ కేసభూపుడెవరో తెలియదుకాని తుదకోడిన ఈ యుద్ధమున అనవోతారెడ్డి శౌర్యవిజృంభణలు లేకపోలేదు.

అనవోతారెడ్డిపై రేచెర్ల వారి విజయములను చాటువు లెంతగా ఎన్నిటినిగా పొగడినను అవియన్నియు ఒకే సమరమున నంతర్భాగములే. ఆ విజయముల వల్ల తీరాంధ్రమున రేచెర్లవారి రాజ్యమిసుమంతయు హెచ్చలేదు. రెడ్డి రాజ్యము తఱుగనూ లేదు. మాదానాయకాదులకు ప్రాప్యము ధరణికోట. అది క్షణమాత్రమేని వారి చేజిక్కలేదు. మఱియును విశేషము అనవోతారెడ్డిని చెఱగొని విడిచిపుచ్చుటలు రేచర్ల వారి చరితలో అట్టిది అనిందపూర్వము; విజితుల యెడవారు పరంపరగ వ్యవహరించు రీతుల కది అత్యంత విరుద్ధము. వంశావళి చాటువులను యథాతథ మంగీకరింపరాదు. కాని పశ్చిమమున శ్రీశైలసీమలో అధిక భాగమును రెడ్లు కోల్పోవుట నిజము.

పద్మవెలమలతోడి యుద్ధానంతరము సైతము అనవోత పాలనము శాంతముగ సాగలేదు. రెడ్డి రాష్ట్రమునకు దక్షిణనైఋతుల విజయనగర రాజ్యమతి త్వరితగతిని

విస్తృతమై కొండవీటి భద్రతకు ముప్పుదెచ్చెను. అనవోత పూర్వపశ్చిమముల శత్రువులతో పెనగునవసరములలో విజయనగర రాజులు తూర్పుతీరభూముల తమ ఆధిపత్యమును సుదృఢమొనర్చిరి. అప్పటికే వారి రాజ్యపు తూర్పుదెస ఉదయగిరి వారి బలిష్ఠస్థావరము. ఇతోధిక రాజ్యవిస్తరణ కనుకూలమగు స్కంధావారవమునయ్యెను. అనవోతని దౌర్బల్యమెఱిగి మొదటి బుక్కరాయలు తూర్పున కృష్ణానదికి దక్షిణ మండలములపై దండెత్తెను[23]. కర్నూలు జిల్లా తూర్పు భాగమునను నెల్లూరి పడమటి పొదొలి దర్శితాలూకాలోను గల విజయనగర శాసనములు దీనిని బలపఱచుచున్నవి. బుక్కరాయల యీ దండయాత్ర శా.శ. 1285-86/క్రీ.శ. 1363-64 వత్సరమున అనవోత పాలనము చివరిదశలో జరిగినది.

కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకాలోని దువ్వపాడు (దూపాడు) కైఫియత్‌లో ఆనెగొంది నరపతులు (విజయనగర రాజులు) బలవంతులై శా.శ. 1286 దువ్వపాడు పరిసరముల జయించిరని యున్నది[24]. ఆ పిదప దూపాడు రాష్ట్ర పాలనము రావెల వంశనాయకుల కప్పగించుటైనది.

పూర్వదిశగా విజయనగర దండయాత్రా ఫలితముగ రేచెర్ల వెలమలు తాము రెడ్ల నుండి కర్నూలు మండలమున గొన్న శ్రీశైలాది ప్రాంతములన్నియు విజయనగర వశములైనవి.

బుక్కరాయల ఆక్రమణలు అనవోతారెడ్డి స్థితిని సంక్లిష్టము జేసినవి. రాయల దాడివలన దాపురించిన ఆపద తన రాష్ట్రమునకే గాక రాజధానియగు అద్దంకిని గూడ అపహరించునట్లున్నది. అందుచే అనవోత ముఖ్యపట్టణమునద్దంకి నుండి అంతకునభేద్యమైన కొండవీటికి తరలించెను. వేమ I రోజులలో గూడ అద్దంకి రాజధానిగ నుండినను కుండినపురము (కొండవీడు) దాని కానుషంగిక నగరమున నుండెను. దానినిపుడు మరింత కట్టుదిట్టము జేసి అనవోతారెడ్డి తన ప్రప్రధాన నగరము జేసెను. శక 1286 న అనవోతారెడ్డి యనుజుడు అనవేముడు వెలయించిన మన్యమాపురశాసనము[25] న నీరాజధాని తూర్పుగుర్తింపబడినది. నాటినుండి రెడ్ల రాజ్యాంతము వరకు కొండవీడే వారి రాజధాని యైనది.

ఇట్లు రేచెర్ల వెలమల, విజయనగర నరపతులు తాకిళ్ళ వలన అనవోత పాలనము ఉత్తరార్థమున రెడ్ల వైభవ ప్రాభవముల సన్నవాఱినవి. రెడ్డి రాజ్యాముసకైన యాదుర్దశామధ్యమున శక. 1286/క్రీ.శ. 1364 తొలి మాసములలో అనవోత యంతరించెను. అతని చిట్టచివరి శాసన మాయేటి కొల్లూరు శాసనము.

చివరి అపజయము లేవైనను, అనవోత ప్రసిద్ధ యోధుడు. తన తండ్రి పాలనమునను తన రాజ్యకాలనమునను ఎన్నియో యుద్ధముల అతుల పరాక్రము నెఱపి "వీరాన్నపోత" ప్రశస్తిగాంచెను. తండ్రివేముని మలికాలమున రాజ్యభారమును వహించి పాలనానైపుణ్యమును గడించెను. తమ్ముడు అనవేముడు తన శాసనములలో నతనిని దేశమున కరిభయము తొలగించి శాంతి భద్రతల నిల్పి, ధర్మోద్ధరణ నిర్వహణాదులొనర్చి హేమాద్రి ప్రోక్త సకల దానముల ప్రజల తనిపిన వాడని కొనియాడినాడు. క్లేశాపాదకములగు శాసనముల పరిష్కరించి, కృషివాణిజ్యములను నూత్నవిధి నియమములచే పెనుపాఱజేసి అనవోత రెడ్డి రాజ్యమును సంపత్సమృద్ధమును జేసినాడు.

అనవోత చనిపోవునాటి రెడ్డి రాజ్యపు పొలిమేరలను సరిగనిరూపింపలేము. శ్రీశైలమునకు తూర్పున సముద్ర పర్యంతము ఉత్తరమున మేఖలాద్రి శ్రేణులవరకు(26) అతని రాజ్యముగ తమ్ముడన వేముని వక్కణము. అనవేముని మరియొక శాసనము అనవోత కృష్ణాగోదావరీ మధ్య భూమ్యధిపతిగ చిత్రించినది. కాని దీనిని నమ్మగాదు. మరణించునాటి కనవోత రాజ్యము కృష్ణానదిని దూరమధిగమింపలేదు.

1. S.I.I. Vol. IV, No. 975
2. S.I.I. Vol. IV, No. 1387
3. Ep Ind. Vol. III, PP 82 ff; VV 21, and 23
4. I did p 84, footnote 3
5. Ep. Coll 44 of 1912; Ep. Rep. 1912, P 68
6. S.I.I. Vol. IV, No. 1387
7. C.P. No. 9 of 1921-22; ఆంధ్రపత్రికా ఉగాది సంచిక (1922) "రక్తానూన మసావశోక విటపీ నీలస్తమాలః పురాగౌరశ్చంపక భూరుహః కుసుమిత శ్చూతశ్శుక శ్యామలఃఏవం వేమయ అన్నవో తన్నపతేః కీర్త్యాసితానాంవనే బాలేఖ్యో బహుధా వదంతి శబరా ప్రాచీదిశాం శాఖినామ్".
8. Ep. Ind, Vol. XXI, P 273

   "శశాసయః శ్రీనగపూర్వభాగా
   దాపూర్వ రత్నాకర మంధ్రదేశమ్ ఆమేఖలం మేఖల భూధరస్య
   జితాహిత శ్రీ యనవోత భూపః"
9. Elliot's Telugu Inscriptions, No. 15-6-26; Vol. I PP 206 ff
10. Ep. Ind, Vol. XXVI (1941-42), PP 14ff, J.A.H.R.S. Vol I. PP 172
11. యేనైవ సూరవర పట్టణ సన్నిధానే వీరాన్నవోత నృపతిర్విజినో వినోదాత్.
12. C.P. No. 16 OF 1917-18
13. రావులపర్తి ఉండి రాజ్యభార్య రుద్రమదేవి. ఆమెది వేంగీ చాళుక్యుల దైన మాణవ్యస గోత్రము. ఇందుశేఖర చక్రవర్తి కొడుకు చాళుక్య వీరభద్రుడు కాకతి గణపతిదేవ పుత్రిక రుద్రమ దేవిని పెండ్లియాడినది తెలిసిన విషయమే. ఉండిరాజ పత్ని చాళుక్య వీరభద్ర పత్ని సంతతికి చెందినదేమో. అర్వాచీన చాళుక్యుల కానాడు నిరవద్యప్రోలు (నిడదవోలు బలిష్ఠదుర్గము. ఈచాళుక్యులు సూరవర క్షత్రియుల తోనుచోడ భక్తిరాజు తోడను కలిసి అనవోతారెడ్డి యోటమికి కారణ భూతులైయుందురు.
14. S.I.I. Vol. VI, No. 226
15. I.T.D. H.No. 40, p. 113 ff
16. Ep. Coll. No. 601 of 1910 (?) Ep. Rep. P. 61

   ఈశాసన పత్రము సంస్కృత తమిళాంధ్రముల వ్రాసిరి. ఆంధ్ర ద్రావిడ దేశముల పరస్పర వర్తకమును వర్తక సరళిగ మోటుపల్లికి వచ్చిపోవు తమిళులును అత్యధికముగ నుండియుండును. 13వ శతాబ్దిని కాకతి గణపతి చక్రవర్తి దానిని సంస్కరింప మొదలిడిన దాదిగ మోటుపల్లి సత్వరము వర్ధిల్లి ఆవరకు ప్రసిద్ధమగు ఘంటసాల వర్తక వాణిజ్యముల త్రోసిరాజన్నది. కృష్ణాజిల్లా దివి తాలూకా లోనిది ఘంటసాల 11, 12 శతాబ్దములలో చోళపాండ్యదేశములతోడి అత్యధిక వాణిజ్యముచే ఘంటసాలకు చోళపాండ్యపుర మనియు ప్రచారముండినది.
17. ఈయుద్ధములో అనవోతరెడ్డి పినతండ్రి అన్నారెడ్డి హతుడైనట్లున్నది. వంశావళిలోని

ఏచాటువులలోనూ లేని యీవృత్తాంతము ఒక అనవోత నాయకుని అయినవోలు శాసనముననే ఉన్నది. ఆంధ్ర విశ్వకళా పరిషత్తున గల శాసన ప్రతులలో యీశాననపు సిరాప్రతి కలదు. గాని అన్నారెడ్డి మృతిజెప్పు పద్యభాగము చెఱిగి పోయినది. వెలియ గలంతలో ఆపద్యమున అనవోత నాయకుడ అన్ననృపతి లేక అన్నారెడ్డిని చంపివేసి కృష్ణాగోదావరీ ప్రాంతముల పాలించినట్లున్నది. కాని పద్యపాఠము శంకలకు తావిచ్చు చున్నది. ఆశాసనపు సిరా ప్రతి వేరొకటి తీసి చూచిన గాని అన్నారెడ్డిని గూర్చి యీకథనమును నిర్ధారింపలేము.

18. యశ్చారు సోపాన పథేన చక్రే శ్రీ పర్వతం సర్వజన ప్రగమ్యమ్
చూ. రసార్ణవ సుధాకర ఆముఖము శ్రీశైల పర్వత సోపాన నిర్మాతగా అతని సోదరుడు మాధానాయకుడును స్తుతింపబడినాడు. (వెలుగోటి వారి వంశ చరిత్ర పే. 52)

19. వెలుగోటి వారి వంశావళి, ప. 81

20. వెలుగోటి వారి వంశావళి ప. 51

21. వెలుగోటి వారి వంశావళి ప. 80

22. ... అమరేశ్వర దేవుడు చూడ గృష్ణవే
ణీనది సాక్షిగా ననికి నిల్చిన రాహుతుగే సభువిభా
గానకండోలి వెన్నడచి కాచినయన్నవోత భూ
జానికి.... విష్ణుపురాణము ।

23. Mac. Mss. 15-3-56 కొండూరు కైఫియత్. తూర్పుదండ యాత్రనుండి మరలివచ్చి బుక్కరాయలు ముల్కినాడులో పాపఘ్నినదీ తీరమున గల కొండూరు గ్రామమును శక. 1292 సాధారణ సంవత్సరమున తన గురువగు చంద్రభూషణా చార్యునికి దానమొసగెను.

24. Mac. Mss. 15-6-19, దువ్వపాడు కైఫియత్

25. Elliot's Coll. Vol. I, PP 270 ff

26. Ep. Ind. Vol. XXI, P 273

27. C.P. No. 9 of 1921 - 22

## అనుబంధము

# ఎఱువనాడు చోడ నాయకులు

నేటి నెల్లూరు గుంటూరు కర్నూలులోని కొన్ని భాగములే ప్రాచీనపు ఏఱువనాడు "ఏఱువ" పదము "ఏఱువాయి"కి సంక్షిప్త రూపమనిపించును. ఏఱువాయియన రెండు పంట కాల్వలచే వల యితమగు భూమి ఏఱువ తెలుగు చోడుల ముఖ్య స్థావరములలో నొకటి. వారటనుండి ఉత్తర పూర్వదేశములకు ప్రాకి తెలంగాణమునందును, తూర్పు తీరపు జిల్లాలందును పెక్కు అధివాసనముల స్థిరపడిరి. క్రమముగనివి విస్తరిల్లి రాష్ట్రములై ఆయాచోడనాయకులు 11-14 శతాబ్దముల ప్రబల రాష్ట్ర పాలకులైరి.

ఏరువ నాయకులు మిగిల్చిన శాసనములు చాల కొద్ది. ఏఱువ వంశమును గూర్చి అవి దెల్పు విషయములంతంతలే - కొలది నాయకుల పేర్లు, దేవబ్రాహ్మణులకు వారొనర్చిన దాన వివరములు. అవియాధారముగ వారి చరిత్ర సంధింపలేము, వారి పద ప్రాముఖ్యముల నిరూపింపలేము.

మనకు ప్రస్తుతము కొండవీటి రెడ్డి రాజుల సమకాలికుడగు ఏఱువ వంశ్య తెలుగునాయకుల వృత్తాంతము అదియు రెండే రెండు తామ్రశాసనములకు[1] - చోడభక్తి రాజు మద్రాసు మ్యూజియం తామ్రపత్రములు[2], అన్న దేవ చోడుని రాజమండ్రి మ్యూజియం తామ్రపత్రములు - అన్న దేవుని యొండు రెండు శిలాశాసనములకు పరిమితము.

నాల్గు దిక్కులు జయింప వెడలిన భక్తిరాజు తన పయనములలో శ్రీశైల క్షేత్రమున నుండగా ఆ శా.శ. 1278లో విశ్వేశ్వర బ్రహ్మచారికి రాజుకాల్వకొలను గ్రామమును దానమిచ్చెనని భక్తిరాజు యొక్క మద్రాసు మ్యూజియం తామ్రశాసనము(1) గంగాపిన్నపానీ నదీ సంగమమున గల వీసరి నాండులోని ఉత్తమగండ చోడాన్న దేవరం గ్రామాన్ని కొందరు బ్రాహ్మణులకు దానమిచ్చుటను తెల్పునది - రాజమండ్రి మ్యూజియం తామ్ర శాసనము(2) పైవానిలో మొదటి శాసనమున దాతను అతని

పూర్వీకులు గూర్చి ఏ చారిత్రకాంశమును లేదు. రెండవ శాసనమున నట్టి విషయము చాలగనే యున్నది. ఇంతకును కొండవీటి వారి సమకాలీనులగు ఏరువనామ కుల చరిత్ర కీ రెండు శాసనములే గతి. వాని వలన దెలియు దాతల వంశ వృక్షమీరీతిగ నున్నది.



పై వంశ వృక్ష ప్రకారము ఈ ఏఱువ శాఖకు మనకు తెలిసినంతలో ప్రధముడు ఏఱువ భీమలేక నల్లభీమ, అతనికి భక్తి రాజు ఐదు తరముల తరువాత వాడగుటచే, భీముని 13వ శతాబ్ది మధ్య కాలము వాడనవచ్చును. కడప జిల్లాలోని తాళ్ళ ప్రొద్దుటూరు శాసనము[3]. భీముని విజయములు పేర్కొన్నది. వేసఱినాడు, చక్రగొట్టము, మన్నియ, వడ్డెతెక్కలి, మంధెన, వేంగి, కళింగాది దేశముల జయించినాడట. వేసరినాడును జయించుటల పొగడు చాటువులు గలవు. కాని ఒక చిన్న సామంతుడు తానై ఇన్ని జయములు గొనుట సంభవముగాదు. వేఱొక మహారాజ విజయ యాత్రలలో అతని దళముల నీతడు నొక యధిపతియై యుండును. ఏరువ భీముని రోజులలో కాకతి గణపితదేవుడోరుగల్లురాజు. అతడు కళింగ విజయియని రాజనాయకుని ద్రాక్షారామ శాసనమును[4] వరంగల్ జిల్లాలోని ఉప్పరపల్లి శాసనమును వాకొన్నది. భీముని కళింగ విక్రమము కాకతి గణపతి దళములనొక యధినాయకుడుగనే యనవలెను.

భీముని పిదప కాముని వరకు ఏఱువల గూర్చి యేమియు తెలియరాలేదు. ఈ కామరాజు గంగాధరుని కొడుకు భక్తిరాజను పేర ప్రసిద్ధుడు. అతడన్నెమాంబను పెండ్లియై, ఆమె వలన అన్నదేవ చోడుని పుత్రునిగ బడసెను. శివలీలా విలాసము వలన ఈ కామరాజునకు మరియొక సుతుడు చోడభీమ లేక భీమ లింగనాముడుండెనని తెలియును. అతడు కొండవీటి రాజదుహితను వివాహమాడెను. అన్నదేవచోడ, చోడభీములు సవతులు. అందన్న దేవచోడుడు సూర్యవంశ్యుడు. హరితస గోత్రుడునగు శ్రీచక్రవర్తి పుత్రికయు, పిన్నుండి రాజసోదరియునైన ఇరుగాంబికను పెండ్లాడెను[7].

అన్నదేవుడు తన తండ్రి భక్తిరాజు విక్రమ సాహసముల వర్ణించిన విధము అతని రాజమండ్రి మ్యూజియం తామ్రశాసనమున నున్నవైనము

1. యువకుడగ నున్నపుడే అతడు బొగ్గరను, ఇతర బలశాలురగు ఇతర యవన దళపతులను గులపూండి పుర యుద్ధమున నోడించెను.
2. తూర్పున పంచధారల కడగజపతిని పడద్రోసి యచటి గద్దియపై కొప్పుల పతిని ప్రతిష్ఠించెను.

3. భరణిపాటి పుర సంగరమున సింగని నిర్జించెను.

4. పెదకొండాపుర ప్రాంతమున దాబరుఖానుని భీషణ పటాలముల పటాపంచలు గావించెను.

5. సూరవరముకడ వీరాన్నవోతను పరాజితుని జేసెను.

పైజెప్పిన సంభవములదే క్రమమున జరిగియుండకపోవచ్చును. వానిలో మొదటిది ముసునూరు ప్రోలయ నాయకుని కాలమునకు చెందును. ప్రోలయ నడిపిన స్వాతంత్ర్య సమరమున భక్తిరాజు ప్రశంసింప దగ్గ పాత్ర వహించి యుండును. యవన సేనాని బొగ్గర మహమ్మద్ బీన్‌తుగ్లక్ సర్దారు కావలెను.

భక్తిరాజు గజపతి నోడించి[8] నదిగాని కొప్పులపాటి నాయకుని అభిషేకించినది గాని ఎఱుగు నాధారములు లేవు.

భక్తిరాజ ప్రతిభటుడగు సింగమును రూపించుట కష్టము. భక్తిరాజుకు సమకాలీనులు ఇవ్వురు సింగములు గలరు. ఒకరు రాజుకొండ దాచానాయకుని కొడుకు సింగము నాయకుడు. భరణి పాటి యుద్ధమున భక్తిరాజోడించి సింగయ వీరిలోనెవరో? అట్లే దాబరు ఖానుడెవరో తెలియదు గాని యతడోడిన స్థానము పెదకొండాపురము, ఇప్పటి భద్రాపురం తాలూకా లో పాడుపడియున్న అదే పేరటి గ్రామము కావచ్చును.

సూరవర యుద్ధమును చర్చించియే యున్నాముగదా. భక్తి రాజు మరణమెప్పుడో తెలియదు. కానీ మెకంజీ వ్రాతప్రతులలో స్థానిక వృత్తాంతములలో తడకలతో అన్న దేవుని రాజమండ్రి శిలాశాసన ప్రతి యొకటి[9] అన్నదేవ చోడుని యభిషేక శక. 1259గ గుర్తించినది. మూలశాసన శిల యిప్పుడు నష్టమైనది. శకవత్సరమునకు సరియని అది తెల్పిన ప్రభవ వర్షము తప్పు. ప్రభవ యైనచో అది శక. 1288 యేగాని శాసన ప్రతిలో నిచ్చిన శక. 1289 కాజాలదు. ఆ ప్రతిలోని శకవత్సరము మొదటి రెండు అంకెలును, నాల్గవదియు 1, 2, -9 కావున శక వర్షము 1289 (వర్తమాన) అయితీరవలెను. అదే అన్నదేవచోడ పట్టాభిషేకకాలము. కావున అన్నదేవుని తండ్రి భక్తిరాజు శక. 1289/క్రీ.శ. 1366 వరకు జీవించియుండును.

1. J.O.R. Vol. V pp 128 - 143; pp 333-336
2. Ep. Ind XXVI, PP 14 ff; J.A.H.R.S. Ipp. 172 ff
3. భారతి XV (?XVII) / PP 147 ff
4. S.I.I. Vol. (?) No. 1117 - (Vol. No is not given)
5. Hyderabad Archoieological Series No. III, PP. 16 ff
6. చూ. అధ్యాయము VII అనుబంధము (లేదే!)
7. Ep. Ind. Vol. XXVI, PP 14ff
8. అన్నదేవుడు నిర్దేశించిన గజపతి, వీరనరసింహ III యనినామతము. క్రీ.శ. 1353, నవంబర్ 1354 జనవరికి సరియగు కార్తిక – పుష్యమాసముల మధ్య, అతని పాలనము ముగిసెను.

   అతని చిట్టచివరి శాసనమును తరువాత రాజైన అతని కొడుకు వీరభానుదేవ III శాసనమును రెండును శక. 1275 / క్రీ.శ. 1353 నాటివే; మొదటిది కార్తిక శు, మంగళవారమున రెండవది పుష్యపౌర్ణమి గురువారమున. కాని కార్తిక శు. మంగళవారము కాదు శుక్రవారము. వారము మంగళయని స్పష్టముగ నున్నందున తిథిని వ్రాయుటో చదువుటో తప్పయి, శుళి బదులు శు. అనుకొనిరేమో - అట్లయిన మొదటి శాసనకాలము క్రీ.శ. 1353 నవంబరు 5; రెండవ దాని కాలము జనవరి 9, 1354 గురవారము.

# అధ్యాయము VII

# అనవేమ

## (క్రీ.శ. సు 1364 నుండి సు. 1386 వరకు)

అనవోతకొడుకు కుమారగిరి రాజదండము దాల్చుటకు యుక్తవయస్కుడు కాడేమో, అతని పినతండ్రి అనవేముడు గద్దెనధిరోహించెను. అతనిని రాజశ్రీరమణి స్వయము వరించినదని అనవేముడు తన శాసనముల[1] చెప్పికొన్నాడు. అట్లనుటలో రాజ్యమునకు న్యాయముగ వారసుడు కాకున్నను, అందుగల నాయక ప్రభువులెన్నుటచే నతడు రాజాయెనవచ్చును. అతని శ్రీశైల శాలనము[2] అనవేముని "రాజ్యరమారమణి స్వయంవర లబ్ధనాయక సౌభాగ్య"నిగ స్తుతించినది. కుమారగిరి పిన్నవయస్సును, రేచర్ల విజయనగరముల యొత్తిళ్ళచే రాజ్యమున ప్రబలిన విషమ స్థిని గుర్తించి, నాయక ప్రభువులు సమర్థుడు, ననుభవజ్ఞుడగు అనవేముని పట్టము గట్టి యుందురు. రాజ్యరక్షణము ప్రప్రథమ కర్తవ్యము. దాని మాన మర్యాదలనుద్ధరించి, రెడ్డి రాజ్య యశఃప్రతిష్ఠాపనకు అనవేమ అన్ని విధములనర్హుడు. కావుననే వారతని రాజుగమన్నించిరి.

కుమారగిరిని గద్దెపైనిడి అతని పేరిట తాను పాలనము నిర్వహింపవచ్చును. కాని అనవేముడది మెచ్చలేదు. పాలనా భాద్యతలే రూపమున విభక్తమైనను, దౌర్బల్యమునకు తావిచ్చును. అందరు నట్లే భావించిరి. అనవేముడు రాజ్యమునకేకైక కర్ణధారి యయ్యెను.

రాజుగా కుమారగిరినే తురీయునిగ భావించు వారు లేకపోరు. కాని వారు పరిస్థితుల దృష్ట్యా నాయక ప్రముఖులు బహుళ సంఖ్యాకులనవేముని పురస్కరించుటయు చూచి తమకిది సమయము కాదని యూరకొనిరి. అట్టివారిలో ముఖ్యులు అనవోతారెడ్డి బావ కాటమరెడ్డి అతని మేనల్లుడునగు వేమారెడ్డి. ఇష్టము లేకున్నను వారనవేమునికి తోడు సూపక తప్పదయ్యెను. అనవేముని విజయ యాత్రాచరణలు, నతడు రెడ్డిరాజ్యమునకు పేర్చిన కీర్తి ప్రతిష్టలును, వలదను వారిని గూడ అతనినే అవలంభింప జేసినవి.

అనవేముడు రాజగు నాటికి విజయనగర రాజ్యము అధికముగ విస్తరిల్లినది.

ఉత్తరమున సస్యకేదార సంపన్నమగు పెన్నలోయయు, శ్రీశైల సీమయు కృష్ణానదీ దక్షిణ తీర భూములును, దక్షిణమున మధురయు, గల్గి పూర్వపశ్చిమ సముద్రతీరముల నొరసి యుండినది. అనవేముని శాసనములు, అతని గూర్చిన చాటువుల జూచిన అనవేముడు రాజగుట రెడ్డిరాజ్య సుస్థితికెంత ఆవశ్యకమో ఇచితమో తెలియనగును.

అగ్రజుడగు అనవోతారెడ్డి విషయముగవలెనే, అనవేముని విషయమున గూడ కల శాసనములు చాలాకొద్ది[3], అన్నియు గలసి పదునైదుకు మించి లేవు. వానిలో దేవబ్రాహ్మణ దాన పరములగు తామ్రశిలా శాసనములు అనవేముని పాలనమును స్పృశింపవు. అవి కేవలము అనవేముని, అతని పూర్వులగు వేమన్నవోతల ప్రశస్తులు, వారి ధర్మాచరణములు ప్రస్తావనలు. శ్రీశైల శాసనమొకటి యిందులకపవాదము. ఈ శిలాశాసనము అట్టివాని లేఖనా సంప్రదాయమును పాటించి రాజుల రాజ్య విషయముల వర్ణించినది. అందు అతి దీర్ఘమగు అనవేముని బిరుదావళి పట్టికయున్నది. ఆ బిరుదములు కొన్ని అనువంశికములు. మరి కొన్న అనవేముని పాలనమున కొన్ని సంభవముల సూచించునవియు గలవు. "రాజమహేంద్ర-నిరవద్య నగరాది బహువిధ స్థల దుర్గవర్గ విదళన - బలరామ, సాగర గౌతమీ సలిల సంగమ సకల జలదుర్గ సాధన రఘురామ" - ఇవి కృష్ణా గోదావరీ మధ్య భూముల ననవేముని విజయ ప్రస్తావనముల నతడు గెల్చిన సమరములు పట్టిన దుర్గములు తెలియజేయును. తూర్పు కనుమల నుండి సముద్రము వరకు, ఉత్తరమున సింహాచల పర్యంతము గల తీరాంధ్ర దేశము నంతటిని ఏకచ్ఛత్రాతిపముగ పాలింపవలెనని మొదటి నుండియు రెడ్డిరాజులయభిలాష, కృష్ణాగోదావరీ పహీవాహబూమి అత్యంతము సారవంతమే గాక, భౌగోళికముగ సునిర్దిష్టము సుఘటితమునైన భూఖండము. ఛోడభక్తి రాజు చనిపోగా అతని తనయులు చోడభీమ, అన్నదేవ చోడులయంతఃకలహములు, చిరకాలమగు తన యభిలాష కృష్ణా గోదావరీ పరీవాహభూమి అత్యంతము సారవంతమేగాక, భౌగోళికముగా సునిర్దిష్టము సుఘటితమునైన భూఖండము చోడ భక్తిరాజు చనిపోగా అతని తనయులు చోడభీమ, అన్నదేవ చోడల యంతః కలహములు, చిరకాలికయగు తన యభిలాష నెఱవేర్చుకొన ననవేమున కవకాశమిచ్చినది.

తమలోని పోరులో అన్నదేవునిపై చేయి యయ్యెను. భీమవ్రోలిసీమ (పశ్చిమ గోదావరి భీమవరం) వేంగీనాడులతని రాజ్యభాగములుగా అన్నదేవుని రాజమంద్రి

శాసనము[4] తెల్పును. అనవోతారెడ్డి చివరి రోజులలో నీభాగములు చోడభక్తి రాజాధీనములు. అన్నదేవుడు వానిని సోదరునికి దక్కనీయక తానాక్రమించెను. చోడభీముని భార్య అనవేముని సోదరి. భీముడడిగెనో యోమో, అనవేముడు కృష్ణకవ్వలి భూములపై దండెత్తెను. చోడభీముని పక్షము భీముని పూర్వపు బందుగులలో కొందరు దొడ్డారెడ్డి[5] వంశ్యులగు రెడ్డి నాయకులు అనవేమునికి తోడ్పడిరి. అందుచేత రాజమండ్రి కోరుకొండ, వాని పరిసరముల మరికొన్ని ప్రాంతముల నతడు సులభముగ జయింపగల్గెను.

## అనవేముని దండయాత్రలు

అనవేముని పూర్వదిక్ దండయాత్ర సఫలమని అతని శ్రీశైల శాసనము వలన తెలియును. అది కళింగము వరకు కళింగ పర్యంతము సాగినది. పై శాసనమున దాడి వివరములు విరివిగ లేకున్నను, అందతని బిరుదములు కొన్ని అతని విజయ ప్రస్తావులని తెల్పియున్నాము. పై నిచ్చిన వానికి తోడు "దివిదుర్గ విభాళ" యున్నది. ఈ బిరుదమతనికి అన్నయగు అనవోత నుండి సంక్రమించినదో, లేక అన్నవోత చివరి దినములలో రెడ్ల చెయిజారి అనవేముడు దానిని తిరిగి గైకొన్నపుడు వహించినదో ఈ రెండవ యూహయే నిజమగుట కవకాశము హెచ్చు.

వేంగినాడు తూర్పు భాగమున ఇక్ష్వాకు వంశ్యులమని ప్రకటించుకొను తమ్మరాజు అతని తనయుడు "ఉండిరాజులు" కృష్ణాజిల్లా నూజివీడు తాలూకాలోని సూరవర పట్టణము రాజధానిగా పాలించుచుండిరి. వారిర్వురును అనవేముని సమకాలికులని ఉండీశుని తామ్రశాసనము[6] వలన నెఱుగ వచ్చును. వారిని జయించి అనవేముడు అన్నదేవుని యధీనమున నున్న ఉత్తరవేంగిపై దాడిచేసెను. శ్రీశైల శాసన ఉపక్రమణికలో నీవేంగీ విజయము కానరాదు. కాని అందలి నిరవద్యప్రోలు ఉత్తర వేంగిలోనిదే.

తూర్పు చాళుక్యుల రోజులలో నిరవద్య ప్రోలు (నేటి నిడదవోలు) ధృఢమగు దుర్గముగ పేర్గాంచి యుండెను. కులోత్తుంగుడు రాజధానిని ఆంధ్రమునుండి ద్రవిడ దేశమునకు తరలించిన పిదప చాళుక్య రాకుమారులు ఆంధ్రమున దుర్గాధిపతులుగ నియమితులై ఆయాదుర్గ పరిసర ప్రాంతముల పాలించుచుండిరి. అట్టి దుర్గములలో నిరవద్య ప్రోలొకటి. అట్లు నియుక్తులైన రాజకుమారులు, కోనసీమ హైహయాదుల[7]

వంటి యిరుగుపొరుగు ప్రభుకుటుంబములలో వియ్యమంది తమబలమును పటిష్టము జేసికొనుచుండిరి. కొంతకాలమునకు తర్వాత వీరినందరను కాకతి గణపతిదేవ చక్రవర్తి తనయధీనుల జేసికొనెను. సాధారణముగ విజితుల యెడనాటి రాజులవలంబించు విధానమున కవిరుద్ధముగ, కాకతి గణపతి తన కుమార్తె రుద్రమదేవిని, నిరవద్యపుర చాళుక్య వీరభద్రు[8]ని కిచ్చి వివాహము గావించెను. అట్టి సంబంధ బాంధవ్యములచే కాకతి పాలనము తీరాంధ్రమున వేరుదన్ని, హరి యితోధిక రాజ్యవిస్తరణల కుపకరించెను. ముస్లిములు తీరాంధ్రమును కబళించినదనుక, నిరవద్యపురము కాకతీయ ప్రధాన దుర్గములలో నకొటిగ గణనకెక్కెను.

అన్నదేవుడు నిరవద్య ప్రోలునకై పోరాడెను, నత రాజ్యసర్వస్వమునకై పోరాడెను. ఆదుర్గము పడుట అతడు పడుటయ్యెను. శక. 1326 వరకు అతని శాసనము లెవ్వియు కన్పడకుండుట, అంతవరకు అన్నదేవుడుకాందిశీకుడనుట సూచించును. అనవేముడా భూములలో చోడభీముని పాలకుడుగా స్థాపించెనని యూహింపవచ్చును.

ఈ సందర్భమున గోదావరి ముఖ్యశాలగు వసిష్ఠగౌతమీ నదుల మధ్యదేశము, పానారకోన మండలము గూడ అనవేముని పాలయ్యెను. అచట మంచికొండ ప్రభువు ముమ్మడి నాయకుడును అతని సోదరలును, అతనికి వశంవదులైరి. అనవేముని నడుపూరు శాసనము[9] (క్రీ.శ. 1374) పలివెల[10] దక్షారామ[11] (క్రీ.శ. 1377, 1381 నాటివి) క్రీ.శ. 1381 యప్పటి వానపల్లి[12] తామ్రపట్టికలు అతడా గోదావరి డెల్టా నంతటిని జయించెననుట దెల్పును. పై శాసనముల సాయమున అతని విజయ యాత్రాపథమును నిర్ణయింపవచ్చును. నిరవద్యపుర గోదావరీ దక్షిణ భాగముల గ్రహణానంతరము అనవేముడు తూర్పుదెస పయనించెను. పానారను పట్టి, వాసిష్టను దాటి గోదావరీ ముఖద్వార భూమి కోనసీమ నంతటిని రెడ్డి రాజ్యమున గలుపకొనెను. ఇందుల కతని కచటి రెడ్లు కాటయరెడ్డి I ప్రాత్రులును మారయరెడ్డి I పుత్రులునగు కాటరెడ్డి II మారయరెడ్డి IIయు, దూపూరు దొడ్డారెడ్డి ప్రభృతులును సాయపడిరి. అచటివి జలదుర్గములు. కాటరెడ్డిIIకి "జలదుర్గమల్ల" బిరుదు[13] సార్ధక్యమగుట విశేషము. అటసాగి అనవేముడు గోదావరి నుత్తరించి రాజమహేంద్రవరము జేరెను. అది ప్రచండ దుర్గములలో మొదలిది. కోరుకొండ మంచికొండ వారి కానువంశముగ రాజధానియే య్యైననం వుువ్మడి నాయుకుడు రాజవుహేంద్రవరవుునే

ఎక్కువఅభిమానించెను. అతని ప్రతిఘటన తీవ్రమయ్యెను. తుదముట్టి ఆ పట్టణము అనవేముని పాలయ్యెను. ఇట్లా ప్రాంతమునగల స్థల, జల దుర్గములన్నియు రెడ్డిరాజులకు లోడినవి. రాజమండ్రి నుండి రెడ్డి సైన్యములు దక్షిణ కళింగమున సింహాచలము వరకు ముందుకు సాగినవి. పరవీర సామంతుల కన్నను అచటి భయ దారణ్యములు దుర్గములగు కానలు కొండలు భీషణులగు మన్నెదొరలు బలగములు అనవేముని ధైర్యసాహసములుకు శక్తి సామర్ధ్యములకు విషమ పరీక్షలైనవి. అయినను అనవేముడు వెనుదివియక ఆ ప్రకృతి జనులనెల్ల స్వాధీనము జేసుకొనగల్గెను.

గౌతమి మొదలు కళింగ వరకు "ఆంధ్ర ఖండమండల" మని పేరెన్నిక గన్నది. దానిని వీరసామంతులు కొప్పులవారు పిఠాపురము రాజధానిగ పాలించుచుండిరి. కొంతకాలమునకు వీరిని మంచికొండ (కోరుకొండ) వారుత్తమునకు తఱిమివైచిరి. క్రమమునగ వారు తునిపరిసముల స్థిరపడిరి.

కొప్పులవారి రాష్ట్రమునానుకొని మరొక రాజ్యము. దానిని తూర్పు చాళుక్య వంశ్యులు పాలించు చుండిరి. 10వ శతాబిదలో దాయాది తాళపరాజు చేత భంగపడి, చేతవిజయాదిత్యుడు వేంగి విడిచి పారిపోయెను. అతని సంతతివారు క్రమక్రమముగ చిన్న రాష్ట్రము నిర్మించుకొని, విశాఖపట్టణము జిల్లాలోని ఎలమంచిలి నుండి పాలింపసాగిరి. వారి దాన శాసనములనేకముగ పంచధారలలోని ధర్మ లింగేశ్వర గుడియందును. ఆపరిసరములందున చూచును. వారలలో(14) చెన్నేశ్వరుని(15) శాసము, శక 1294 నాటిది కలదు. అతని కొడుకు ఉపేంద్ర IV, అతని పెదతండ్రి మూడవ ఉపేంద్రుని సుతుడు ఉపేంద్ర V వీరిర్వురు అనవేముని సమకాలీనులు.

దక్షిణ కళింగమున నీ ఎలమంచిలి వారివలె మాత్స్యులు(16) విశాఖ జిల్లా వీరవల్లి తాలూకాలోని ఒడ్డాది ముఖ్యపట్టణముగా పాలించిరి. ఇంతవరకు తెలియవచ్చిన వారి శాసనముల బట్టి జయంతుని కుమారుడు వీర అర్జున దేవుడు అనవేముని కాలమువాడు. అతని శాసనములు శక 1279 నుండి 1303 వరకు కన్పించుచున్నవి.

అనవేముని శాసనములిట్లని స్పష్టముగ చెప్పకున్నను, యీ నాయకులెల్లరు నతని వశవర్తులైరనుట తథ్యము. అనవేముని శ్రీశైల శాసనమతనిని సింహాచలాది వింధ్య పాద - ప్రతిష్ఠాపిత కీర్తిస్తంభయని వర్ణించినది. దీనికి సమర్ధనమతని సింహాచల శాసనము. శక. 1297/ క్రీ.శ. 1375లో ఒడ్డాది మత్స్యనాయకుడగు

అర్జునదేవునుండి గైకొన్న గొట్టివాడ గ్రామమును సింహాచలస్వామి నృహింహ దేవునికి సమర్పించుటలందు ప్రస్తావింపబడినది. దానకర్త నారణదాస (నారాయణదాస) పుత్రుడు చెన్న నాయకుడు, అనవేముని బ్రాహ్మణ సచివుడును, సేనాపతియును అనవేముడును దేవాలయ సేవలకై "గండమాడ"లను సింహాద్రినాధుకర్పించెను. ఈ శాసనము వలన అనవేముని కళింగ దండయాత్ర శక. 1297/క్రీ.శ. 1375లో సాంతమని[18] యెరుగగలము.

కళింగము నుండి మరలి వచ్చిన అనవేముడు కొండవీటి పడమటి సరిహద్దుల సరిజూచుకోవలసి వచ్చెను. ఆ భాగమున క్రమముగా విజయనగర రాజులు రెడ్డి రాష్ట్రమునొత్తుకొని వచ్చుచుండిరి. శక. 1332 నాటి మహానంది శాసనమున[19] కర్త వెలుగోటి తిప్పరాజు, విజయనగరమునకధీనుడు, తన తాత యగు గంగ్రరాజు చెన్నరాజును "కొత్తచెర్లకోట సమరరంగభీమ" యని కొనియాడినాడు. కొత్తచెర్లకోట నెల్లూరు జిల్లా దర్శితాలూకాలోని కొచ్చెర్లకోట - మరియొక శాసనము ఏఱువ నాడు చాంగలవీడు శాసనము[20] శక. 12 94కు సరియగు పరీధావి నాటిది. ఒక విజయనగర సేనాపతి వినుకొండసీమ (గుంటూరుజిల్లా నర్సారావుపేట తాలూకా కు చెందిన వింజనంపాడు గ్రామమును పాపవినాశన దేవున కర్పించినట్లు తెల్పినది. పై రెండు శాసనవములును విజయనగర ప్రభువు బుక్కరాయల I కొండవీటి రాజ్యంతరమునకు చొచ్చుకొని వచ్చుటను స్పష్టము చేయుచున్నది. అది చాలదన్నట్లు రాజుకొండ దేవరకొండ ప్రభువులు వరంగల్లును పట్టి అప్రతివీరులై కృష్ణాగోదావరులు మధ్య కనుమల కవలి తెలంగాణము నంతనటను శాసింపసాగిరి.

రేచర్ల వెలమలు ధరణికోటకడ తనయన్న అనవోతారెడ్డిని పెట్టిన భంగపాటును అనవేముడు మఱువలేదు. తన నమ్మిన నాయకులు సింహాచలము దనుక రాజ్యము నేమరక కాచుచుండగా అనవేముడు పశ్చిమమున తనుగోల్పోయిన భూములను తిరిగ గైకొన సన్నద్ధుడాయెను.

సింగమ నాయకుని పుత్రుడును, అనవోతా నాయకుని సోదరుడును అగు మాదానాయకుడు తమపై నెత్తి వచ్చిన అనవేమునోడించెనని వెలుగోటి వారి వంశావళి నుడువుచున్నది[21]. ఇట్టి విజయప్రస్తావములకు ఒకటికన్న నెక్కుడు పద్యముల వర్ణించుట పరిపాటి. కాని యీ యుదంతము కేవలమొక్క పద్యపాదమున నిముడ్చుట

చూడగా మాదానాయకు విక్రమము శంకింపబట్టగుచున్నది. అది శంకా మాత్రము కాదనుట కాధారము రేచెర్ల వారి రాష్ట్రములో నల్గొండ జిల్లాకు చెందిన వజీరాబాద్ వాడపల్లిలోని కడియంపోతి నాయకుని శాసనము(22) శక 1299 కి సరియగు పింగల నామసంవత్సరమున నతడచటి అస్త్యేశ్వర మహాదేవుని గుడికి గోపురమును ఒక చంద్రశాలయు నిర్మించి ఆలయమున సేవలకై కానుకన నర్పించుకొనెను. ఇది యంతయు అతని ప్రభుడును, అనవేమారెడ్డి సోదరుడునగు అనమాచారెడ్డి పుణ్యావ్యాప్తికై రేచెర్ల వెలమలోడి కృష్ణానది యుత్తరమున వారి మండలమున కొంతయేని కొండవీటి రాజ్యమున గలిసెననుట నిజము. ఆ నల్గొండ జిల్లానే బూరుగు గడ్డవద్ద శ్రీశైల వాడపల్లి శాసనముల వలె పింగళన్నామ సంవత్సరముననే దాసట్ల గోత్ర చిలుకూరి అనభీమా నాయుకుపుత్రుడన్నను నాయకుని శాసనము(23) కలదు. గోత్ర నామము అతడు దాసట్ల శాఖీయుడగు రెడ్డియనజెల్లును. ఈయూహ సరియైనచో రేచర్ల వారిపై అనవేముని విజమయు వలన రెడ్డి రాజ్యపు పడమటి ఎల్లి బూరుగుగడ్డ యనుట తెల్లము. ఓడినది రేచెర్ల వారేగాని అనవేమగాదు. అనవేముని శ్రీశైల శాసనము(24) అతఢు విజయనగర మాక్రమించిన రెడ్డి భూముల గూడ తిరిగి గైకొనెనని విశదమొనర్చును. రెడ్డిరాజ్యము తొల్లింటి రూపవిస్తృతల సంతరించుకొనుటే గాక కళింగమున సింహాచలము వరకు వ్యాపించి సుసంఘటతమయ్యెను. శక 1304 దుందుభి నాటి మాన్యమాపుర శాసనము(25) అనవేముడు ఆశ్రీశైల సింహాచల మధ్యగల తన రాజ్యమును న్యాయముగ పాలించెనని నుడువుచున్నవి.

## అనవేముని బిరుదములు

అనవేముడు "పరిచితానేక గతి విశేష వారపణ మారణోపాయుడు" - ఏన్గుల మెలకువ లెల్లదెలిసి వానిని వేటాడి చంపునుపాయములందు దిట్ట. "ప్రజాపరిచిత చతుర్విధోపాయు"డు- ప్రజలకు అపరిచతములగు సామదాన భేద దండోపాయ ప్రయోగ కుశలుడు. "ఛురికాకలి - వేతాల, ఛుకిరికాసహాయ, కరలావ్వైనతేయ కలియుగ బేతాళ" యన్నవి తక్తియుద్ధమున నతని నైపుణ్యమును, ధైర్యసాహముసములను తెల్లము సేయును. శ్రీశైల శాసనమునందలి అతని ఈ బిరుదులు వాని పట్ల సార్థకములే. "విక్రమ పంజర నిగృహీతరిపు రాజసింహ, విజయ కుంజ రాలాన నిజభుజస్తభ సంబ్రుత యశోమండన" ఇత్యాది బిరుదములెన్నియో అతని నలంకరించినవి. తన విజమయులు

దైవ ప్రసాదములని యెంచి యనవేమారెడ్డి ఉపరితలముల గజముల చెక్కిన ఘంటలను (గజ-ఘంట) పంచారామ క్షేత్రములకు (అమరారామము) (అమరావతి) (ద్రాక్షారామము, క్షీరారామము (పాలకొల్లు), కుమారామ (సామర్లకోట వద్ద భీమవరము), భీమారామ (భీమవర సమీపమున గుడిపూడి). కానుకలర్పించుకొనెను.

అనవేమ నృపతి కొండవేమ రాజులలో నెల్ల అతి శ్రేష్ఠుడు. రాజ్యమెల్లవిధముల పెంపేది యున్న తరుణమున, రాజ్యమున గల నాయక సామంతులెల్లరు వరింపగ రాజ్యభారము వహించి విజయ పరంపలచే దానికి పూర్వోన్నత్యమును కూర్చుటేగాక విస్తార మహితమును వైభవోజ్వల మును చేసెను. అతడు తాల్చిన "మహానీయాంధ్రదేశ పట్టాభిషేక సంవృత మహాభాగ్య" బిరుదము అతని భాగ్యమునే గాక అతని రాజుగలు దయుటచే ఫలించిన ఆంధ్రదేశ సౌభాగ్యమును కూడ ప్రకటించుచున్నది.

అనవేముడు నయశీలుడు, ధార్మికుడు, పూర్వులిచ్చిన అగ్రహారము నిల్పుటలో, నూతనముల నిచ్చుటలో అతనికసక్తి మెండు. అతని శాసనము లనేకములు దానిని ధృవపరచును. అతడు దారుడు, వితరణశీలుడు. తన సంపదల నతడు ప్రధానము కవిపండిత పోషణకై వెచ్చించి వారి వ్యాసంగముల సంతసించెడివాడు[27]. "బహు సహస్ర సువర్ణ దాన సంతోషిత మహాకవేశ్వరుడు"[28] బ్రహ్మాండాదాన కల్పతరుదాన, కనకధారాదాన, గోసహస్రదానములు అతడిచ్చిన దానములలో కొన్ని. బహుక్షేత్రములలో సత్రములనిల్పి[29] యందు చతుర్విధాన్నముల సమకూర్చువాడు. వసంత మహోత్సవములను, మదన మహోత్సవములను, జరిపి తాననుందు పాల్గొనుచు, "వసంతరాయ"డను పేర ప్రసిద్ధి గాంచెను. అతడు శైవుడు. శివునందత్యంతము భక్తిసేయువాడు. అతని కీర్తిని కొనియాడు చాటువుల పెక్కులు. అతని యౌదార్యమును కధలుగా చెప్పుకొనెడివారు. తన రక్షణమును బ్రాహ్మణులకు తన బిరుదములుపంటలకుల నాయకులకు, తన నయమును (రాజనీతి నైపుణ్యము) ప్రజలకు[30] అతడర్పించు వాడని విష్ణుపురాణమున వెన్నెలకంటి సూరనార్యుడతని ప్రశంసించెను. అతడి న్యాయపరిపాలనమును వర్ణించుచు తెలుగు దేశమున విశేష ప్రచారముగల సంస్కృత చాటువు ఒకటి అతడు రాజుకాగా ప్రజలకు మృష్టాన్నమును దువ్వలువలును, కస్తురియు, బంగారమును, వింజామరలును సమృద్ధిగ లభించెడిదని కొనియాడిరి[31].

1. Ep. Ind. Vol XXI, P 269 B పచ్చని తాండిపఱ్ఱు తామ్రశాసనము No. 9 of 1922-23
2. Ep. Coll No. 20 of 1915
3. వీనిలో ఎనిమిది తామ్రపత్రములవి : (1) దృజ్జవరం (2) ఇప్పుగల్లు (3) పచ్చని తాండిపఱ్ఱు (4) వానపల్లి (5) నడుపూరు (6) మన్యమాపురం (7) నొల్లూరు (8) పెదచెఱుకూరు చివరి మూడును ఆస్థానిక వృత్తాంతములలోను ఈలియట్ సంకలనములోను మిగిలియున్నవి.
4. Mac. Mss. No. 15-4-4, P.231 and No. 15-5-36, P 175
5. దూపురు కుటుంబము వాడగు పెరుమాండికిగల అయిదుగురు కొడుకులలో దొడ్డారెడ్డి యొకడు. అతనికి అనవ్రోల, కోట, అల్లాడయని ముఫ్వురు సుతులు. కోమటి వేమనల్లుడగు చోడభీముని కూతును అల్లాడ పెండ్లాడెను.
6. C.P.No. 116 of 1917 - 18, శక, 1304 నాటిది.

ఈశాసనమున సూర్యవంశ్యులును హరితస గోత్రులు నగు వీరివంశక్రమము ఇట్లు:

దేవరాజు

ఉండీశ I + బిమ్మదేవి

తమ్మరాజు + వీరమదేవి

ఉండిరాజు II + రుద్రమదేవి (మాణవ్యస గోత్ర)

(దాత) క్రీ.శ. 28.1.1383

శక 1304 దుందుభి మాఘశు. 10 గురువారమున (క్రీ.శ. 28.1.1383) 80 పాళ్ళుగల రావుల పర్తి గ్రామమును రెండవ ఉండిరాజు బ్రాహ్మణులకు దానమిచ్చెను. ఆగ్రామము "ఉండీశపుర" మన బరగెను. ఆ సందర్భముననే ఉండి రాజొసగిన ఇతర అగ్రహారములు : గోపవరం, ట్వోంకపల్లి, బెఱ్వుకన్మ, కాసపాడు, చింతపల్లి, విపఱ్ఱు, నొట్లపఱ్రు, బండారుపల్లి, కరికర్లపల్లి, ఉంగుటూరు, కోండ్రుప్రోలు, కెరకట్లు, నిడుమ్రానురు, పల్లివాడ, పేరుంబల్లి, గూడపఱ్ఱు, తాండిపఱ్ఱు, ఘోటక తాండిపల్లి వీనిలో చాల గ్రమములు పశ్చిమ గోదావరి జిల్లాలోనివి. శాసనము చివర సంతకమిర్వురది – పెద ఉండిరాజు, వేంగు – పెద ఉండిరాజన్నది దాత వాడుకపేరు. ఈశాసనమున రెడ్డిరాజ ప్రస్తావమేలేదు.

7. S.I.I. Vol. V, Nos. 124, 125
8. A.S.P.P. Vol XXII (1983) No. 4; Ep Coll No. 343 of 1921
9. EP. Ind Vol. III P. 286 ff
10. S.I.I. Vol V No. 115
11. S.I.I Vol. IV. No. 1379
12. Ep. Ind Vol III, PP 59 ff
13. A.S.P.P. Vol. X No. 1; EP Ind Vol. IV App to the Toharament plates.
14. వీరిని గూర్చి అధ్యాయము VIII అనుబంధము చూడుడు.
15. S.I.I. Vol. VI. No. 921

16. అధ్యాయము VIII అనుబంధము చూడుడు.
17. S.I.I. Vol. VI. No. 785
18.. అనవేముడు నృసింహాలయ ప్రాంగణమున నొక మందిరము నిర్మించి దానికి "అనవేము నగరు" అని పేరిడి నట్లు, సింహాచల మందలి శక 1 3 0 3 శాసనము S.I.I. Vol. VI No. 806 తెలుపును.
19. Ep. Coll No. 173 of 1913
20. Mack Mss. No. 15-3-11
21. సింగయ మాధవుజేరిన (జెనకిన) ననవేము
డోడి పాఱు కొఱంత (జూడవైతి - VII 108)
వంశావళి యందు ప్రోలయ వేముని సుతుడనవేముని జెప్పినదీ యొక్కమారే. కాని యిదే గ్రంధము పెదకోమటి వేముని గూడ అనవేముడనియే వ్యయహరించినది.
22. A.R.S.H.S. 1934-35 (1344F), Appendix
23. I.T.D.H.No. 19, PP71-72. ముద్రప్రతిలో గోత్ర నామము స్పష్టమే. మూలమున పదము "దేసన" అని చదువుట సరికాదు. ఈశాసనమున చెప్పిన దానము పింగళ జ్యేష్ఠ శు 1 5 గురువారమున శక వర్షము.
24. ఈ శాసన కాలము శక 1 2 9 4, పింగళ మాఘశు 7, బుధవారము (6th Jan. 1378)
25. No. 15-6-26 Vol., PP 270 ff ఈశాసన మూలమిపుడు నష్టమైనది. దానిప్రతి ఇలియట్ సంకలమున నున్నది.
26. Ep. Coll. No. 20 of 1915
27. Ep. Ind. Vol. III, P 62 V20
28. Ep. Coll No. 20 of 1915
29. I bid
30. విష్ణుపురామ ప్రస్తావన.
31. ... భూమీశే చిరమన్న వేమన నృపతా భూయోల భంతేజనాః మృద్వన్నం, మృదులాంబరం మృగమదం చామీకరం చామరమ్.
-శృంగార శ్రీనాధము P. 55

## అధ్యాయము VIII

# కుమారగిరి

## (క్రీ.శ.సు. 1386 - సు. 1402)

తన పినతండ్రి అనవేమ చనిపోగా, శా.శ. 1308/క్రీ.శ. 1386లో అనవోత కొడుకు కుమారగిరి రాజయ్యెను. అతని మొదటి శాసనము అనపర్తి[1] దానశాసనము. నాలుగేండ్లపిదపటిది (శా.శ. 1312) అప్పటికి కుమార గెరి రెడ్డి తన పొరుగున నాల్గు దిక్కులనున్న రాజులతో చెలిమి పాటించుచుండెను. అతని పాలనమున ఆ తరువాతి గోపవరం దానశాసనము[2] నొకశ్లోకము (27.12.1395A.D.కి సరియగు నాటిది) కోటయ వేముని సాయమచే కుమారగిరి రాజ్యాభిషిక్తుడయ్యెనని సింహాసనమందు భాసింపజేసెను. అనగా పాలకుని జేసెను.

కొమరగిరి రాజగుటకు కాటయ వేముని సాయమేమి? అతని నడ్డిన దెవరు? కొండవీటి రాజమండ్రి రెడ్డిరాజుల శాసనములలో వేనిలోను వీని నెరుగు సూచనలు లేవు. ప్రోలయ వేముని ముగ్గురు కొడుకులలో అనవోత కుమరగిరి తండ్రి. అనవేమకు పుత్ర సంతానమున్న జాడలేదు. అనమాచ శాసనము[3] లేవియు నెఱుకవడవు. శా.శ. 1299లో అనవేముని వాడపల్లి[4] శాసనము అతనిని పేర్కొనును గాని యితడన వేమునకి ముందే మృతిచెందియుండును. ఇక ప్రోలయవేముని అన్నమాచ I అతని కొడుకు పెదకోమటి కిర్వురు తనయులు వేమ, మాచయనువారు. కొమరగిరికి ప్రత్యర్థులువారుగా నుందురు.

## కుమారగిరి స్థితిగతులు

అద్దంకిలో ప్రోలయ వేముడు రాజైనపుడు రెడ్ల పాలనము చిన్ని రాష్ట్రమునకు పరిమితమై యుండెను. దానికి రాజ్యగౌరవము చేకూర్చినది అనవోతారెడ్డి. ఆ తండ్రి తనయుల యుధ్యమమున ఆ కుటుంబము వారెల్లరు నొక్కుమ్మడిగ సహచరించరి. రాజ్యపాలనమున సైతము అదే సౌహృదము ప్రతిఫలించెను. ప్రోలయ వేముని అన్న

మాచయ చందవోలున, కందుకూరులో తమ్ముడు మల్లన రాజ్య ప్రతినిధులుగ నియుక్తులైరి. కొండవీటిలో రాజ్యపరిమాణమున తేజోబలమునధికిడై, మంత్రనీతికై సోదురలతనిపై నిర్భరులైనను, రాజ్య సకలపాలనము నా ముప్వురును కలసికట్టుగ నిర్వహించుచుండిరి. తరువాతి తరమున అనవేమ విక్రమములచే, కొండవీటికిని, కందుకూరు, చందవోలుకు ను, విస్తృత బలముల గల తారతమ్యము, వారి సంబంధములను ప్రభుసామంత సదృశముల జేయజొచ్చెను. అట్లయ్యును కొండవీటి బాంధవ్యము, ప్రాపుకీర్తులును వానకి చెంది, కొండవీటి రాజ్యమునకు వారి స్వత్వములను పూర్తిగ చెరగనీయవయ్యెను. ఇట్లు రాజ్యావారసత్వమనిరూఢముగా నున్నపుడు అనవేమ నిస్సంతుగ చనిపోయెను. కొండవీటికి కొడుకు వేమ వివరించెను. అందుకు ప్రాద్బలముగా సైన్యముల సమకూర్చియునుండును.

కుమారగిరి తన బావ కాటయవేముని ముఖ్యమంత్రి సహాయునిగ నియమించు కొనెను. రాచరికపు బాంధవ్యవుచే కాటయువేముని కుటుంబమునకు బలప్రతిష్టలెక్కువయ్యెను. ఇది ఒక్కనాడైనదిగాదు. రెండు తరములుగ నున్న బాంధవ్యముల పరిణామము. వేముని తండ్రి కాటయ భార్యకుమారగిరి రెడ్డి మేనత్త ప్రోలయవేముని కూతురగు దొడ్డాంబిక వారి సంతానముగు వేముడు (కాటయవేముడు) అనవోతారెడ్డి పుత్రిక కుమారగిరి రెడ్డి సోదరుని పెండ్లాడెను[5]. కుమారగిరిపై రెడ్డి రాజ్యముపై నానాట పెరుగు కాటయ పలుకుబడి పెదకోమటి పుత్రులు వేమ, మాచయలకు కనుగుట్టుటలోనాశ్చర్యముండుదు.

బ్రాహ్మణులను ముఖ్యమంత్రులుగ కొనుట రెడ్డిరాజులయాచారము. ప్రోలయవేముని మంత్రులు రామాప్రగడయును, మల్లినాధుడను[6] రాజ్య నిర్వహణమున ననవోతకు తోడ్పడినది రామరాజు పుత్రుడగు మల్లినాధుడును, సోమయ ప్రెగ్గడయు[7] అట్లే అనవేముని సచివులును ప్రధానులును. మల్లయమంత్రి కొడుకు ఇమ్మదీంద్రుడు[8] రాజ్యకార్యముల మంత్రి, సచివుడును మంత్రి సైన్యాధిపుడు భారద్వాజ గోత్రుడగు మామిడన్న కొడుకు పెద్దన[9] ఈ సంప్రదాయమునకు భిన్నముగ కుమారగిరి కాటయవేముని తన రహస్యాధికృతునిగ ముఖ్య ప్రధానిగ నియమించుకొనెను. బహుశఃఅతనియుపదేశముననే పారంపరిగ నున్న బ్రాహ్మణ సచివుల తొలగించి, అతని

నమ్మిన యుద్యోగులనే యధికార పదవుల నిల్పుకొనెను[10] కాటయ రాజ్యమును తన హస్తగతము చేసుకొనగోరెనోమో, సామంతులలో కొందరు కొమరగిరి రాజ్య స్వత్వమును మన్నించినను, ఆనాటి నాయకులు పెదకోమటివేమ, మాచయల వారసత్వమును సమర్థించి రాజ్యమునకై అంతర్యుద్ధము తప్పదయ్యెను.

ఈ లోనిపోరులోని సంభవముల జాడలెన్నుట సాధ్యముగాదు. శా.శ. 1308-12 మధ్య కుమారగిరి కాటయవేముల శాలనము లొకటిరెండేయున్నవి. దేశమందలి యవ్యవస్థ కారణగావచ్చును. ఈరోజుల దేవబ్రాహ్మణ దాన శాసనముల వేనియందును దేశపాలకుని పేరు ఉదాహరింపబడలేదు.

పూర్వము చెప్పిన అనపర్తి శాసనములోని "దక్షిణ దేశాధిపతులు పెదకోమటి వేముడు అతని పక్షము వారు కావచ్చును. ఎప్పుడీ అంతర్యుద్ధము ముగిసెనో కుమారగిరి రాజ్యమెప్పుడుధిష్టించెనో నిశ్చయింపగాదు. కాని త్వరలో వారిరువురికిని ఒప్పందము కుదురినట్లున్నది. రాజ్యసర్వస్వస్థైర్య భద్రతల నడ్డనతంకు పెద కోమటి వేముడు తన చందవోలు రాష్ట్రము స్వేచ్ఛమై పాలించుకోవచ్చును.

కుమారగిరి వారసులు లేనిచో రాజ్యమునకు వారసుడు పెదకోమటి వేముడే అట్లనుటకు అమీనాబాదు శాసనము[12] పెదకోమటి వేముని గూర్చిన వాక్యము ఆధారము. అతను "క్రమ-పరిప్రాప్త సామ్రాజ్య సింహాసనాధ్యాసి" యని కాటవేముని కుమారగిరి ప్రధానిగ మొట్టమొదట పేర్కొన్నది. శా.శ. 1308 గతనాటి యతని సింహాచల శాసనము[13] దానికించుక పూర్వమా వర్షమే ఆషాఢ మాసమునదగు అమరావతి[14] శాసనము. అదియు కాటయ వేముని పుణ్యావాప్తికై అతని యాజ్ఞప్తి (Executive Officer) అప్పన పెద్ది యిచ్చిన దానముల చెప్పునది. ఆ దానముల అంతర్యుద్ధము ఉభయ పక్షములకు తృప్తిగా ముగిసి నందులకై అమరేశ్వర స్వామి కర్పించుకొన్న దనవలెను. అగుచో లోని పోరు సమసి కుమారగిరి సింహాసనమెక్కుటను శా.శ. 1308 (1386 A.D.) ప్రారంభమున్నై యుండును.

కుమారగిరి రెడ్డి పాలనము మొదటి నాలుగేండ్లును శా.శ. 1312 వరకును విజయనగర, రాజకొండ, కళింగ ప్రభువులతోడి పోరాటములలో గడచినవి.

## విజయనగరాక్రమణములు

రెడ్డి రాజ్యమున నంతఃకలహములు రేగుచుండగా విజయనగర ప్రభువు హరిహర II త్రిపురాంతకముపై దండెత్తి దాని నాక్రమించెను. శక. 1307 క్రోధన వత్సరమున హరిహర రాయలు తన కొడుకు వీరదేవరాయల శ్రేయస్సుకై అచట భూమినిదానమిచ్చెను[15]. చటనే బుక్కరాయని Iని కుమారుడో, సచివుడో అయిన "మహాప్రధాని" భవదూర ఒడెయ శక. 1308లో భూమిదానమొనర్చినటుల మరియొక శాసమనము కలదు[16]. అటనుండి విజయనగర సేనలు సాగి వినుకొండ కోటను సాధించినవి. అట్లని వల్లభామాత్యుని క్రీడాభిరామము నిరూపించును. వల్లభామాత్యుని తండ్రి తిప్పన హరిహర II "రాయల రత్న" భాండారాధ్యక్షుడు "హరిహరరాయ II" శృత పర్వత దుర్గ మహాప్రధాన రాద్గంధ గజంబునని యానాటకమున గలదు. ఈ దండయాత్ర తాకిడి రెడ్లకే కాక రేచెర్ల వారికిని అపుడు హరిహర II గొన్న రెడ్డిరాజుల శ్రీశైల ప్రదేశములు విజయనగరాధీనముననే స్థిరపడినవి.

కుమారగిరి రాజుకాగానే అతని పంపున కాటయవేమ మహాసైన్యముతో హరిహరుల - నెదుర్కొన త్రిపురాంతక శ్రీశైలాభిముఖముగ తరలిపోయెను. అంతకే విజయనగరానీకములు వరంగల్‌పై నెత్తియుండినవి. ముస్లిం బహ్మనీ సుల్తాను హిందూ రేచర్ల నాయకులు తోడై, ఎదర్చి మహబూబ్‌జిల్లాలోని కొత్తకొండ[18] యుద్ధమున విజయనగర సైన్యముల పరాజితముల జేసినవి, ఆ స్థితిలో హరిహరుల కాటయమవేము బలము నోర్విమిలో వింతలేదు. మరియొక విశేషము ముస్లిములు రేచర్ల నాయకులు, రెడ్లకెట్లో అట్లే విజయనగరము వారికిని శత్రువులు. వారిని సమముగ నెదురుటకు కొండవీడు విజయనగరముల మైత్రి యెంతయు అవసరము. వ్యక్తిపరముగ కాటయవేముడు రాయలమైత్రి యున్న బహిశ్శత్రువులనే గాక అంతః శ్శత్రులను సైతము అణచి యుంచగలడు. కుమారగిరి ప్రతినిధిగ కాటయవేముడు హరిహర II తో సంధిగావించుకొనెను. త్రిపురాంతకము వినుకొండలు కుమారగిరి వశము గను, శ్రీశైలసీమలో నధికభాగము విజయనగర వశము గను నుండుటకు కుభయులు నంగీకరించిరి. ఈ సంధి మరింత దృఢ పడుటకు హరిహరులు తన కొమార్తె హరిహరాంబను కాటయ వేమునకిచ్చి పెండిలి గావించెను[19] అల్లయ వేమారెడ్డి తన

వేమవరం తామ్రశాసనము[20] నవీవియ్యమునే ఉటంకించినాడు.

## రెడ్డి-రేచెర్ల నాయక సంబంధములు

రేచెర్ల నాయకులు తమ రాష్ట్రమును విస్తరింప యత్నించిరి. వెలుగోటివారి వంశావళిలో సింగమ నాయకుని కుమారుడు మాదా నాయకుడు కుమారగిరిని యుద్ధమున పరాజితుజేసెనని యున్నది[21] ఇట్టి జయప్రశస్తులు పద్యపాద మాత్రమున తడవుట రేచెర్ల నాయకుల సంప్రదాయము గాదు. ఒకవేళ అది జరిగియున్నచో శక 1302 కిటు, అనవోతానాయక కళింగ యాత్ర చివరల, అతని సింహాచల శాసనము[22] తర్వాత జరిగి యుండవలెను. కుమారగిరిపై యీ దండయాత్రలో మాదానాయకుని సుతుడు వేదగిరి లేక పెదవేదగిరియు, సింగనికొడుకు మాదానాయకుడుIIను పాల్గొని యుండిరి. వంశావళి చెప్పుటలో (తూర్పుగోదావరి జిల్లా తుని తాలూకాలోని) బెండపూడి దుర్గమును వేదగిరి పట్టుకొనెను[23]. సింగయ మాద కుమారగిరినోడించి యున్న అది యీ యాత్రలో భాగముగ గోదావరికి ఉత్తర భూములలోనై యుండును. ఈ విజయమును రేచెర్ల వారు ప్రస్తావించిన రీతిని చూడగా అది పెద్ద చెప్పుకోదగినది కాదన వచ్చును. ఇంకను విశేషము రేచెర్ల నాయకులోడించిరన్న కొండవీటి సామంత సేనాపతులలో ప్రధానుడగు కాటయవేముని పేరే కన్పించదు.

కుమారగిరి రాజైన క్రొత్తలలో అతడు రాజకుమారుడగు అన్నవోత IIను కాటయవేముని తూర్పుదేశమును జయింపబంపెనని అనపర్తి శాసనము తెలుపుతున్నది.

## అన్నదేవ చోడ

మనకు ప్రస్తుతమైనది త్రిపురాంతక మందలి అన్నదేవ చోడుని యొకే యొక శాసనము[24]. అందు త్రిపురాంతక దేవునకతడు కాంచపల్లి గ్రామము నర్పించిన ఉదంతము గలదు. అందప్పటియే రెడ్డి ప్రభువంశము లేదు. అతడాయూరి నుండినది రెడ్డి మిత్రుడుగనో శత్రువగనో తెలియదు. శక 1326కు పూర్వము యీ యొకటి దక్క అతనివే శాసనములును లేవు. అనవేమునికి నోటుపడిన తన రాజ్యమును తిరుగ గైకొనుటకై సాయపడువారి నన్వేషించుచుండెనేమో. ఆత్రిమ్మరుటలో అప్పటి

రెడ్ల అంతర్యుద్ధమదనుగ అతడు త్రిపురాంతమున జేరియుండును. ఇది యూహా మాత్రమే. అతనీ త్రిపురాంత కాగమనమునకు ఉత్తరమున రేచెర్ల వారి యాక్రమణలను ఏదైన సంబంధముండుటయు సంభవమే.

## కుమారగిరి పూర్వయాత్ర

అనపర్తి శాసన కాలము శా.శ. 1312/క్రీ.శ. 1390నకు కుమారగిరి సింహాసనమున కుదురుకొనెను. ఇరుగు పొరుగులతో అతని పోరులెవ్వియును అతని తామ్ర శాసనములు పేర్కొనవు. ఒక్క అనపర్తి శాసనముననే అతని పంపున సచివుడు సర్వసైన్యాధీశుడునగు కాటయ వేముడు ఆ వింధ్య సింహాచల మధ్య భూముల గజపతులాది క్షోణీశుల నెల్ల జయించెనని యున్నది. ఈ పూర్వయాత్ర శా.శ. 1302 – శా.శ. 1312 మధ్యకాలముననీ ముందే చెప్పియున్నాము. శా.శ. 1310 నాటి కాటయవేముని సర్పవరం శాసనము[25] అతని కళింగయాత్రను సూచింపవచ్చును. కుమారగిరి అనపర్తి, గోపవరం శాసనములలో నీపూర్వయాత్రా విశేషాంశము లెవ్వియు కనిపించవు. కాని కాళిదాస నాటకత్రయమునకు కాటయ వేముని వ్యాఖ్యలలో కొన్ని వివరములు గలవు. అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యకు ప్రస్తావన[26] లో కాటయ వేముడు వివరించిన తని విజయములలో (1) మొల్లేటి దుర్గము(2)కిమ్మూరు దుర్గము (3) వజ్రకూటము(4) బెండపూడి(5) రామగిరి(6) వీరి కూటములన్నియు కళింగములోనివే.

## విజితస్థల నిర్ణయములు :

1. **మొల్లేటి దుర్గము** : మొల్లేరు గోదావరి జిల్లా యెల్లవరం విషయములోనిది. అచటి యొక 27 శాసనమున కాటమరెడ్డి వేమారెడ్డి పుణ్యావ్యాప్తికై, పుప్పుల హమ్మయ వేమాసముద్రము (తటాకము) నిర్మించెనని యున్నది. శాసన కాలము తెలిపిలేదు కాని కాటయ విజయానంతరముననే ఉండును.

2. **కిమ్మూరు దుర్గము :** స్థానిక వృత్తాంతముల 28 నీ కథనము గలదు. పూర్వకాలమున కిమ్మూరుడని యొక కిరాతక నాయకుడు. అతడు తనపేర నొక నగరమును కొండలచాయల, దాక్షారామమునకు 14 క్రోసుల దూరమున నిర్మించెను. ఈ కిమ్మూరు నగర పార్శ్వముల 54 గ్రామములు తమిరె (పెద్దాపురపు పూర్వ నామము), కట్టమూరు, కాట్రావుల పల్లి, గుడివాడ, ఉలిమేశ్వరము, కంద్రకోట, జగ్గంపేట, మల్లపాక, యిత్యాదులను కిమ్మూరు సీమ. ఈ గ్రామములన్నియు నేటి తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం తాలూకాలోనున్నవి. ఇప్పటి పెద్దాపురనకు ఆరుమైళ్ళు ఉత్తరమున ఏలేటి యొడ్డున నున్న కాంద్రకోట (యిప్పుడదియొక కుగ్రామము) కిమ్మూరని జనశ్రుతి. అచట దుర్గ శిధిలము లింకను కననగును. స్థలచరిత్ర ప్రకారము వేమారెడ్డి (కాటయవేముడే కావచ్చు) యనంతరము రెడ్డి పెదవెంకప్ప కిమ్మూరు, ప్రోలునాడు, కొత్తపల్లి, గురుగుమిల్లి, కొర్వాడ కూటాల (గూటాల సీమని పాలించెను. అతడు కమ్మూరు సీమను, ఇసుకపల్లి పెద్దపాత్రునికి[29] దండపటము (Military fief) గానొసగెను. నిర్ణయించిన సైన్యమును పోషించుటకైన ఖర్చులు పోను ఆ సీమ వలన మిగిలిన ఆదాయమును అతడు రెడ్డి పెదవెంకప్పకీయవలెనని నియమము. ఆ పెదవెంకప్పను, కోటయనవేముడే ఆ ప్రాంతముల పాలకుడుగా నియమించి యుండును.

3. **బెండపూడి :** తూర్పు గోదావరి తుని విషయమున బెండపూడి యపుడొక చిన్న గ్రామము. ఒకప్పుడది రాష్ట్రమునకు ప్రబల రాజధానిగ నుండెను. అచటి దుర్గమును కాకతీయ రాజులు నిర్మించిరని స్థల వృత్తాంతము. దుర్గ శిధిలములిప్పటికిని కనవచ్చును. అరుదుగ[30] కొన్ని ప్రాంత నాణెములును అందు దొరుకుచుండును. శిధిలాలయములును కలవు. ఆ కోటను జయించిన పిదప, కాటయవేముడు అరియేట లింగన మంత్రి సోదరుడు అన్నయ మంత్రిని దానికి పాలకుడుగ నియమించెను. నాటినుండి ఆ కుటుంబము వారు బెండపూడి వారుగ నెరుగనైరి.

4. **వజ్రకూటము :** ఇది విశాఖ జిల్లా గోల్కొండ తాలూకాలో విశాఖ పట్టణము నుండి అనకాపల్లి పోవు మార్గమునకెడముగ నరసాపట్నమున కారు మైళ్ళ దూరమున గల వజ్రగడ లేక వజ్రఘర్ అయియుండును. రెండు కొండపాదముల గలుపుతున్న పెద్దకోట శిధిలములు (అది యిపుడు సాగుభూమి) యిప్పుడునూ అగుపించును. చుట్టునుగల ఏడుకోటలు దాని భద్రతకుపయోగించెడివని పరంపరగా వచ్చు కధనము. అందు రెండు తీరులగు బంగారు నాణెలు దొరికినవి. గాని వానిని సరి పోల్చగాలేదు. ఇప్పటికిని కుండపోతగా వర్షము పడినప్పుడు కొన్ని నాణెములు బయలుపడచునేయున్నవి. ఆ కోట తూర్పుగోడ మధ్యమమున నొక చిన్న చదరపు శిల నాలుగువైపుల తెలుగు శాసనముల తోడిది మిగిలియున్నది[31].

5. **రామగిరి :** ఇది ఒరిస్సాలో నేటి జయపూరు జమిందారీ ఉత్తర భాగమున ధానాలలోనొకటి[32]. ఇచటను ఒక కోట యుండెడిది. ఆ స్థలమున వంధ్యునొకని బలియోసంగిరట (MerichSacrifice)[33]

6. **వీరకూటం :** ఇది విశాఖజిల్లా పాలకొండ సీమలోని వీరఘట్టము. అచట పడిపోయిన మట్టికోట చాలా పెద్దది. విశాఖ గజటీర్ ప్రకారము అందిపుడొక ఔషధాలమయు పోలీసు శ్రేణులున్నవి[34].

మనకు ప్రస్తుతమగు కాలమున, వీరకూటమును పల్లవ రాజు కుటుంబులు పాలించుచుండిరి. వారు కాదువెట్టివంశ్యులు. భారద్వాజస గోత్రులు. కులోత్తుంగ చోడుని పాలనమున (క్రీ.శ. 1070-1120) పండ్రెండవ శతాబ్ది ప్రారంభము దాదిగ వారు ప్రాముఖ్యము గడింపసాగిరి. ఈ పల్లవ రాజవంశ చరిత్ర సంగ్రహమునగ నీ అధ్యాయాంతమున నుబంధమున గలదు. పురుషోత్తIIను, అతని కొడుకు సౌభాగ్య దేవరాజును క్రమముగ అనవోతారెడ్డి, కొమరగిరి రెడ్లకు సమకాలికులు. సౌభాగ్య దేవరాజు శా.శ. 1322 మొదలు 1346 వరకు పారిపాలించు శక. 1322, 1342, 1346, వర్షములతని శాసనములు సింహాచలమున గలవు. అతని

పూర్వుడగు పురుషోత్తముడు వీకకూటమున కాటయవేమున కోరెను. సింహాచలమునీతనివి శక. 1278, 1279 వ శాసనములు రెండు కలవు.

తన పూర్వ దిగ్విజయ యాత్రలో కాటయవేముని విక్రమములు అతని యభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యలలో వివరించినవి మాత్రమే కావు. ఒక చాటుపద్యము[35] కాటమరెడ్డి వేముడు గౌతమి నుత్తరించి కాటమక్ష్వేని కోట జయించి అందలి క్షత్రియ రాకొమరులను, రాకొమరితలను చెఱపట్టెనన్నది. ఈ కోట ఎచటిదో తెలియదు[36]. గాని, ఆ జయము పూర్వదిగ్యాత్ర తొలిఘట్టములోనిది కావలయును.

శక. 1317 (క్రీ.శ. 1395) నాటి కొమరగిరి గోపవరం శాసనమున కాటయవేముడు "కటకచూరకార" బిరుదు. అతడు చూరగొన్న కటకము లేక పురుషోత్తముల ఓఢ్ర, కళింగము గజపతుల రాజధాని. అట్లైన యతని విజయయాత్ర సింహాచలముతో ముగియక కటకమును గూడ తాకెనన్నమాట.

పై దండయాత్రలో కాటయవేముని వెంట రాజమహేంద్రవర రెడ్డి రాజకుమారులు నుండి కొమరగిరి రెడ్డి రాజ్యమును కళింగమునందంతట వ్యాపింపజేసి యుందురు. రాజమహేంధ్రవర రెడ్డి రాకుమారులు అల్లాడరెడ్డి సుతులు వేమ, దొడ్డనలు తాము కళింగ జేతలమని ఘోషించిరి. శక. 1356 నాటి తన వేమవర తామ్ర శాసనమున[38] అల్లయవేముడు తాను కళింగమునాక్రమించి అట రాజులగు సప్తమాదియుల జయించి సింహాచల పురుషోత్తముల జయ స్థంభముల ప్రతిష్టించితినని జెప్పుకొన్నాడు. ఆ రోజులలో శ్రీనాధుడు రచించిన భీమేశ్వర పురాణ కాశీఖండములు అల్లయవేముని యితర జయములతో బాటు అతడు ఒడ్డె ధాత్రీనాధుని[39] పండువా సుల్తానుని[40] ఓడించినట్లు చెప్పినవి. దొడ్డారెడ్డి చిలక సరస్తీరమున జయస్తంభము నిల్పినట్లు కాశీఖండమున గలదు. శివలీలావిలాసమున వేమారెడ్డి తండ్రి అల్లాడరెడ్డికి గౌడాధిపతినోడించి "గజపతిదళవిభాళ"[41] బిరుదుగైకొన్నట్లు చెప్పినది. మరి ఈ విజయములెవరివి, అల్లాడరెడ్డి, అతని సుతులవా, లేక కాటయ వేమునివా? అట్లు గాక ఈ దండయాత్రలు వేర్వేరా, కాక ఒక్క దండయాత్రయే రెండుగ అభివర్ణితమా? దీనిని నిరూపించుటకు అల్లాడరెడ్డి, యతని సుతుల విజయముల వివరము

దెలియవలసియున్నది. అందులకాధారము కేవలము మూడు తెనుగు కావ్యములు. (అరియేటి లింగనమంత్రి కనిష్ఠ సోదరుడు) అరియేటి అన్నమంత్రి కంకితమగు భీమేశ్వర పురాణము, అల్లాడరెడ్డి మరియొక సుతుడు దొడ్డారెడ్డి కంకితమిచ్చిన శివలీలా విలాసము.

భీమేశర పురాణము పొగడిన అరియేటి లింగన జయములన్నియు[42] దననిజ స్వామి నల్లాడ ధరణీనాధుని, యవన కర్ణాట కటక భూధవుల తోడ చెలిమి వాటించి తెలుగుదేశ మేలించుటకే. కావున ఆ జయములు అల్లాడ రెడ్డివే యనదగును. అందలి ఝూడె, జంతరునాడు, సప్తమాదియ, బారహదొంతి, ఒడ్డాది విజయములు కాశీఖండ శివలీలా విలాసములలో[43] అల్లియవేమునివిగ వర్ణింపబడ్డవి. కాశీఖండ శివలీలా విలాసములలో విజయపట్టికలు దీర్ఘములు. ఈ సమస్యను పూర్ణముగ ఆకళించుటకు పై మూడు కావ్యములను వేమవరం శాసనమును సమకూర్చిన వివరముల

**ఝూదేశవన** : ఇది కాశీఖండ మందలి ఝూడె, అల్లాడవేముడు పట్టినది. ఆపదమునకు పెద్ద అడవియని యర్థము. నేటికిని జైపూరు జమీన్ పాలకులను ఝూడ్ఖండ్ - పాదుషాలనియే వ్యవహరింతురు. అది నందపూరు రాజుల బిరుద నామము. పార్వతీపుర ప్రభువు ధనంజయ (ధాత్రాజ) పోష్యుడగు కొమ్మాజీ సోమనాధుడు తన విచిత్ర రామాయణమున అతని పోషకుడగు నందాపుర, ఝూడ్ ఖండ పాదుషా[45]విక్రమ దేవ గజపతి(క్రీ.శ. 19వ శతాబ్ది) రాజమర్యాదలెన్నియో బడెసెనని చెప్పియున్నాడు. ఈ ఝూదేశవన లేక ఝూడ్ ఖండము సముద్రగుప్తునిచే విజితుడగు వ్యాఘ్రరాజుని మహాకాంతారము[46] అది యిప్పటి జైపూర్ జమీన్లో అధికాధిక భాగము, పార్వతీపుర బొబ్బిలి తాలూకాతో సరివచ్చును. పొత్తంగి తాలూకాలోని నందాపురము జైపురము[47]న కానువంశికమగు రాజధాని. ఆ రాజులు శీల వంశమువారు. శివలీలావిలాసమున జెప్పిన, అల్లయవేమ విజితుడగు నందాపురేశుడు శీలవంశ్యుడగు ఝూదేశుడు. ఈ శీలవంశము వారి వారేడు శాసనములు సింహాచల, శ్రీకాకుళములందు లభించినవి.

ఈ ప్రదేశముల నల్లాడ జయించెననుటకు మరొక ఆధారమగుబడుచున్నది. బొబ్బిలి ప్రాంతీయుడు బసువయనాముడు శా.శ. 1347 (క్రీ.శ. 1425) విశ్వావసు సంవత్సరమున సింహాచల నరసింహనాథునికి నిత్య దీపమునకై "అల్లాడ వెండి టంకము"ల పదింటినిచ్చెనని[48] యొక శాసనము. కళింగమును అల్లాడరెడ్డి జయించిన పిదప ఆదేశమున నల్లాడరెడ్డి టంకములు చెల్లసాగెనని నొప్పును. ఈ విజయము శా.శ. 1347కు పూర్వము కొమరగిరి రెడ్డి రాజ్య కాలముననే జరిగియుండవలెను.

## సప్తమాదియలు

అల్లాడరెడ్డియు, అతని సుతుడు వేమారెడ్డియు గూడి మన్నెసప్తమాదియ నృపాలురను బారహదొంతిని జయించిన ప్రశస్తికెకొన్నారు. వీరెవరు ఎచటివారు? సప్తమాదియలు, తెనుగున ఏడు మాడియము.... లేక ఏడు మాడెములు. మాదియ, మాలియ లేక మాళియ పదములు "మల" (కొండ) యొక్క తద్భవములు. గంజాం జిల్లాలో తూర్పు కనుమలలో కొండల కోనల కానల ఎత్తైన భూములను "మాళియ"లందురు. అవి ఆటవిక జాతులగు కోడుల సవరల వాసదేశములు, ప్రాచీనముగ నివి ఏడుగ విభక్తములై యుండినవి. అట్లు పంప భారతమున గూడ వివరించియున్నది.

## పంపకన్నడ కవి

విక్రమార్క విజయము లేక భారతము రచించినతడు. చాళుక్య వంశ్యుడరికేసరి II పోష్యుడు. తన పోషకుని తండ్రి నరసింహ II "ఏళుమాళవ" రాజుల జయించినాడట. ఈ "ఏళుమాళవను" కొందరు ఏడుమాడెములు లేక సప్తమాదియ[49]లని భ్రమపడిరి. చాటుపద్య మణిమంజరిలోనొక పద్యము[50] అల్లయవేమా రెడ్డిచే విజితములగ కొప్పుకొండ, పాలకొండ, పొట్టునూరు కలావెండిపురముల పేర్కొని యతడు మండువా యవలను విధ్వంసించి, బలియ ధూళియ - మాళువ రాజును చెరపట్టెనని చెప్పినది. ఈ బలియ ధూళియ-మాళువకు ఒప్పగుపదము "బలియగాళియ-మాళియ" అదినేటికిని గంజాం జిల్లాలోని ఏడు మాళియలలో నొకటియై "బళిగూడమాళియ"

గల వ్యవహారమున నున్నది. ఈ సామ్యయము సాయముగ "కళావెండిపురము"ను గుర్తింప వీలగుచున్నది. దాని సరి రూపము "కాళవెండిపురము", అది యిప్పటి కాలహండి లేక కాలహా పురము, గంజాం విశాఖజిల్లాలడమటి పొలిమేరల నున్నది. "పండవ", వంగ (బంగాళ) దేశస్తులనుల రాజధాని "మండువ" (మండు) మాల్వానవాబుల రాజధాని.

## బారహదొంతి

బారహ అన పంద్రెండు. దొంతియన వరుస. బారహదొంతి పన్నెండు రాష్ట్రముల వరుస. వేముడు కాలహండి దనుక దళమెత్తి పోవుటచే, ఆ చక్కని ఒరిస్సా మధ్యప్రదేశముల గల సామంత మండలముగ గంజాం విశాఖ జిల్లాల సరిహద్దులనవి యుండబోలును. వేముడు జయించిన కాలహండి[51] (కళావెండిపురము) ఆ పంద్రెండులో నొకటి యౌటపై యూహకు బలమొసంగును. రాజమహేంద్రవర రెడ్డిరాజులు బారహ దొంతి, మన్నె ధరణీపాలుర కభయమొసగి కరుణమై తద్వి[illegible]నుల కంఠసీమల మాంగళ్యముల కాచి వాసికెక్కిరి.

## జంతరునాడు

దీని నల్లాడయు అతని కొడుకు వేముడును జయించిరి. మనము పరిశీలించు రోజుల శాసనములు జంతరునాడును ప్రస్తావించునవి గలవు. ఈ ప్రదేశములనున్న గ్రామముల నిరూపింపగా నిది విశాఖజిల్లా శృంగవరపు కోట తాలూకాకు సరిపడును. దాని పాలకులు సురభి వంశ, గార్ట్స్యమద గోత్రీకులు. పన్నెండు వరకు గల వారి శాసనములు సింహాచలము లభించినవి, శక. 1207 నుండి శక. 1383 వరకు పర్వినవి. వారి వంశక్రమము నిర్ణయింప నవి సాయపడవు. శివలీలా విలాసమున నొక పద్యము అందెన్నో అవచ్ఛేదములు. రఘురాముడు విభీషణు బ్రోచిన విధమున అల్లయవేముడు సంగవ భూపుని తన ప్రాపు చిహ్నముగ శృంగారపురంగోట ప్రతిష్ఠితుజేసెనట[52]. విభీషణ సామ్యము సంగవకు సోదరుల పోరును వారి నోర్చి యోడించుటకును అల్లయవేముని సాయముప అయుటయు సూచించునేమో. సంగవ

శృంగవరపుకోట సంయోగము, సంగవను సురభిరాజాన్వ యనిగ నిర్దేశించును. అల్లయవేము కాలమున సురభి వంశ్యనృపుడొక సంగమ రాజుండెననుట తథ్యము. అతని సింహాచల శాసనములు శక. 1320, 21 వర్షములవి. అతనికి ముందు శృంగవరపుకోటను ఒక ప్రతాప వీర గంగరాజు పాలించినట్లు అతని శాసనము శక. 1290 సింహాచల శాసనము తెలుపును. ఈ వీర గంగరాజుకు, సంగమరాజునకు గల సంబంధమెట్టిదో తెలియరాదు. సంగమయే సంగముడైనచో అల్లాడ, అల్లయవేముల కళింగ దండయాత్ర శక. 1320 కి క్రొద్ది ముందుగనుండును.

## ఒడ్డాది

మత్స్యరాజులు పరిపాలించుచుండిన ఒడ్డాది నేటి విశాఖ జిల్లాలోని వీరపల్లి తాలూకాకు దాదాపు సరిపోలును. మత్స్యరాజ శాసనముల ఒడ్డాదిలోని వనగ్రామములన్నియు యీ వీరపల్లి ప్రదేశముననే కానవచ్చును. అల్లాడ సచివుడు లింగన ఒడ్డాది మాత్స్య నృపుడు ఉదయార్జును నుండి కప్పము గొనెను. శివలీలా లాసము అల్లాడ ఒడ్డిరాజును పలాయితు జేసి, అతని నివేశ నస్థలమును పెద్ద తటాకము కల్పించెనన్నది కాని ఆ గ్రంథము ఓడిన మత్స్యనృపునామమీయలేదు.

ఈ అధ్యాయాంతము మత్స్యవంశక్రమము సంగ్రహింపబడినది. అతి దీర్ఘమగు వారి వంశపు చాలున అర్జునదేవ నాములనేకులు వారిలో అర్జునులు, వీరార్జునులు, ప్రతాపార్జునులున్నారు కానీ, ఉదయార్జునులు కన్పింపరు. శక. 1272, 1347 ల అంతరమున వీరార్జునుడును, అతని కొడుకు ప్రతాపార్జునుడును ఒడ్డాదిని పాలించిరి. వీరార్జుమనుని శాసనములు శక. 1279, 1303 వర్షములని, ప్రతాపార్జునివి శక. 1321, 1344 వర్షములవి అల్లాడరెడ్డి అతని సుతులు వేమ దొడ్డయలు చేతులలో పైయర్జును లిరువురిలో నొకడోడియుండవలెను. శక. 1343 తరువాత అర్జునదేవ నామ దేవరాజును తటస్థపడడు.

## రంభ

భీమేశ్వర పురాణము ప్రకారము లింగన మంత్రి, దండకారణ్య మధ్యస్థమౌ

రంభ (రంపకు సంస్కృతీకరణము) లోని నాగవంశ పుళింద నృపుల ప్రతిష్ఠించెను. కాని రంపరాజు ఇమ్మడి రాజును అల్లయవేముడోడించెనని, శివలీలావిలాసము. కాని యీ రంపజయము అల్లాడు, వేమ, దొడ్డయలు ఉమ్మడిగ చేసిన దండయాత్రాంశమగుటచే, లింగన మంత్రి యోడించినదీ ఇమ్మడి రాజునే యనలవయును. రంప ఆ పేరిటనే నేటికిని తూర్పు గోదావరి జిల్లాలో చోడవర విషయమున నున్న గ్రామము. బహుశః రంప పాలకులు 11, 12 శతాబ్దముల బస్తరు కాక చక్రకోట్య నాగవంశ ప్రభువుల సంతతులై యుందురు.

## వీరకూటము

పల్లవ వంశ్యుడగు వీరకూటము ప్రభువును పరాజితు కావించినది అల్లాడయని భీమేశ్వర పురాణమును, వేముడని శివలీలా విలాసమును నడుపుచున్నవి. శివలీలావిలాస మారాజు పేరు పురుషోత్తముడనును, రెండవ పురుషోత్తముని తనయుడును, పల్లవరాజులలో చిట్టచివరివాడును అగు సౌభాగ్య దేవరాజు మొదటి శాసనము శక. 1342 నాటిది, చివరి శాసనము శక. 1322 కు చెందినది[53]. కావున అల్లాడ, అల్లయ వేముల ప్రత్యర్థి పురుషోత్తముడీ రెండవ పురుషోత్తముడే కావలెను. అతడు కుమారగిరి, కాటయవేముల సమకాలమువాడు.

పల్లవరాజగు వీకరూటము పురుషోత్తముని నిరూపణముని జంతరు నాటి సురభిరాజు సంగముని నిర్ధారణమును, కళింగ రాజ శాసనముల అల్లాడ టంకముల ప్రశంసయు చూడ తనయుతోడి అల్లాడరెడ్డియు, కాటయవేముడును నిర్వహించిన పూర్వ దండయాత్రలు వేరుకావనుట నిశ్చయము.

పై దండయాత్రా సందర్భమున జితుడగు కళింగ ప్రభువు గంగాభాను దేవ III కొడుకు నరసింహ దేవ IV అతడు శక. 1299-1300 నుండి 1331-2 వరకు రాజ్యమేలెను. ధరణి (ఒరిస్సా) నాథుడు, గౌడాధిపతియునతడే.

పై మూడు తెలుగు కావ్యములలోను అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్యలోను యీ యాత్రయందే కాటయవేమ, అల్లాడాదులు యెలమంచి (యలమంచిలి, విశాఖజిల్లా)

చాళుక్య బంధువుల సైతము జయించిరి. అల్లయవేముని వేమవరం తామ్రపత్రములలో నొక శ్లోకము[54] అలంకారికముగా యీ జయములు వర్ణించెను. అల్లాడ క్షితిపాలతనయుడు వేమనరపాలుని దుస్సహ ప్రతాపాగ్నిచే శిలలు చూర్ణములైనవి. కిటులు ఘర్జురించినవి, చిగురులిరిగినవి, మత్స్యకులము జలముల లీనమైనవి. భోగులు, బిలముల గుహల దూరిన నాగుల పడగలడగినవి, సగము కొరికిన అగ్రతృణములతో గోవులు ఘోషలెనసినవి, గజపతి నీరము జొచ్చెను[55] ఈ శ్లోకమున వేముని ప్రతాపాతిశయము కొనియాడుటైనది. అందలి శిలలు, కిటులు, చిగురులు, మత్స్యములు, నాగులు, గోవులు, గజపతులు రాజవంశముల పేరులో ప్రతీకలోనైలోనై, శాలి వంశ, చాళుక్య, పల్లవ, మత్స్య, నాగ, సిందవంశ్య (బస్తరు) సురభి వంశ, గజపతి వంశముల దెలుపును.

కాటయవేముని నాటి చాళుక్య ప్రభువు, పహిండి రాజ మల్లాంబల సుతుడగు చోడ సంగదేవుడు. ఈ యధ్యాయాంతమున వారి వంశ చరిత సంగ్రహించబడినది.

పండు వాజముగ్గడించుట బట్టి, అల్లయవేముడు వంగ సుల్తానులోడించినట్లు నూహింపవచ్చును. పండు వా పట్టణము బంగాళమున మాల్దాజిల్లాలో ఇంగ్లీషు బజారున కతి సమీపమన దాని కుత్తరమున నున్నది. హిజ్రా 743 (క్రీ.శ. 1342) మొదలు హిజ్రా 795 (క్రీ.శ. 1392) వరకు పండువా బంగాళ సుల్తానుల రాజధాని[56]. ఈ యంశముగూడ అల్లాయవేముని పూర్వదండయాత్ర శక. 1314 (క్రీ.శ. 1392) కు మున్నె అని దృవపరచుచున్నది.

ఈ దండయాత్ర ప్రారంభమున యువరాజు అనవోత IIతో గూడ కాటయవేముడు రాజమహేంద్రవరమునకేగినట్లు అనపర్తి శాసనము విస్పష్టముగ చెప్పినది. కావున అల్లాడరెడ్డి తనసుతులతో సచివుడు లింగనమంత్రి తోడురా రాజమండ్రి నుండి కాటయవేముని వెంటచనెనని నిశ్చయింపవచ్చును. అల్లయవేముడు సింహాచల పురుషోతము[57] లందును అల్లయదొడ్డారెడ్డి చిల్కసరస్థీరముననను జయస్థంబముల నెలకొల్పిరి.

విజయ యాత్ర ముగించి యువరాజు అనవోతIIతో కాటయవేముడు రాజగు

కొమరగిరికి జితన్నపుల నుండి గైకొన్న ధన కనకవస్తు వాహనముల నతని కర్పించెను. ప్రీతుడై కొమరగిరికి యావిజయశేలిని సవిశేషముగ బహుమానించెను. ఆపిమ్మటనే కాటయవేముని సూచనమై కొమరగిరి కొడుకు అనవోత II రాజమహేంద్రమందలి గోపీనాథ స్వామికి దేవభోగముగ అనపర్తి గ్రామమును దానమిచ్చెను. రాజు కొమరగిరియు దాక్షారామ క్షేత్రమును దర్శించుకొని అచట ఉత్సంగమున కుమార వీరాన్ని పోత II నిడుకొని తులపురుష - మహాదానము నెఱవేర్చుకొనెను.

## పూర్వ రాష్ట్రము లేక రాజమహేంద్ర వర రాజ్యము

పైన కొనియాడిన విజయ పరంపరలచే కొండవీటి రాజ్యము గౌతమీ ఉత్తరము నుండి సింహాచలము వరకు విస్తరిల్లినది. ఈ తూర్పు దేశమును ప్రత్యేక రాష్ట్రముగ తీర్చుట ఆవశ్యకమగుటచే కొమరగిరి దానినట్లుగా రాజమహేంద్ర వరము రాజధానిగ నేర్పఱచి దానికి తన కొడుకు అనవోతని II ని రాజప్రతినిధిగ నెక్కొల్పెను[59]. లింగన మంత్రి సోదురుడు అరియేటి అన్నమంత్రి పూర్వము కొండవీటి సీమస్కంధా వారమగు బెండపూడున[60] దుర్గాధిపతిగ నియమితుడయ్యెను. రాజ్య మంతటిని కొన్ని సీమలుగ ముఖ్య దుర్గముల ప్రాపుల, విభజించి వానికి నాయక సామంతుల నధిపతలు జేసిరి[61] అల్లాడ రెడ్డియు అతని సుతులును యితర విశ్వసనీయులును శ్రద్ధయై తన యాజ్ఞల పాలించుచుండ కాటమ సహాయుడుగా అనవోత II పాలనము సాగించెను. అల్లాడరెడ్డి కనిష్ఠపుత్రుడు వీరభద్రునికి తన తనయ అనితల్లి నిచ్చి పెండ్లిగావించి[62] కాట వేముడు అల్లాడ శాఖ వారితోడి మైత్రిని పటిష్టము జేసెను.

ఇట్లు అనపర్తి శాసన కాలమగు శక 1312(క్రీ.శ. 1390) నాటకి శత్రుదనమును పొరుగు రాజన్యులతోడ సుహృత్సంబంధములను వెలయగా కొమరగిరి రెడ్డి రాజనీతిజ్ఞుడును, యోధవరుడును, ప్రధాన సచివుడు, నమ్మిన మిత్రుడునగు కాటయవేమునకు రాజ్యనిర్వహణ మప్పగించి వేరుచింతలు లేని తనకాలము నధికాధికము సంస్కృతి ప్రవృద్ధికై వినియోగింప సాగెను. తన సన్నిహిత పూర్వుడనవేముని వలె తానును బహుళ ధనముల ప్రతివర్ష వసంతోత్సవములకై వ్యయింపగా సాంఘిక జీవనము ఉత్సాహ రుచిరమయ్యెను. ఆయుత్సవ ప్రవర్తనమున నతని యభినివేశోత్సాహములు

జనులకెక్కి అతడు వసంతరాయలును, ప్రజల విరియించన కపురపు జల్లుచే కర్పూర వసంతరాయలును నాపొగడొందెను. నృత్య సంగీతములనతని యను రక్తికి మేరలేదు. భరతుడాది నాట్యాచార్య గ్రంధములనెల్ల నవలోకించి కుమారగిరి రెడ్డి సమగ్ర సుందరముగ వసంతరాజీయమను నాట్యశాస్త్రమును తానై నిబంధించెను[63].

## అనవోతని యకాల మృతి

కొమరగిరి పాలనము ఇట్లు శాంత సంపదభిరామముగా సాగెను. కాని అంతలో ఒక ఘటన, అత్యయము, కొండవీటిరెడ్డి రాజ చరితము నంతయు తారుమారొనర్చునది సంభవిల్లెను. శక. 1317 (క్రీ.శ. 1395)లో కొరగిరికి ఒకే యొక పుత్రుడు అనవోత యు కాలముగ మృతినొందెను. కొమరగిరి రాజ్యమునకు వారసుడు ఔరసుడు లేదు. రాజమహేంద్రవమున నూత్న రాజప్రతినిధి యావశ్యకమయ్యెను. ఆ గౌతమీ సింహాచల మాపూర్వ రాజ్యమునకు గజపత్యాది శత్రువులెందరో! వారి చేతుల నాదల బొరయక కొండవీటి రాజ్యపు "తూర్పు" సరిహద్దును కాపాడుట కత్యంత సమర్దుడు కావలెను. అందుకెల్ల విధముల తగినవాడు తన బావ కాటమవేమున కన్యుడెవడు? కాని యతనిని రాజ ప్రదినిధిగ గాక రాజమహేంద్ర వర రాజ్యవల్లభాని గనే కొమరగిరి నిశ్చయించెను[64]. కాటయ సాయపడక తాను రాజయ్యెడి వాడే కాదుగదా! కొమరగిరి యీ చేష్ఠ గోదావరికి తూర్పుదేశమును దానికి పడమటి రాజ్యమునుండి విభజించి, దానిపై రాజ్యాధికారమును కాటయవేమునికి ధారవోసినట్లుగా భావింపరాదు. కొమరగిరి యట్లూహించినట్లగ పడదు. రాజమహేంద్రవర రాజ్యమును దండపటమగు జాగీరుగా (వీరజీవితముగా) భావించి యొసగినాడు. ఈ పద్ధతి తెనుగుదేశమున చిరకాలీన సంప్రదాయము కొమరగిరి క్రొత్తగ తొక్కిన పుంతగాదు, ఇచ్చిన జాగీరు విస్తృతి మాత్రభిన్నము. కొమరగిరికి పూర్వులు ఒండురెండు గ్రామములను "జీవితముగా" నిచ్చిరి. దానిని రాష్ట్ర ప్రమాణము చేసినాడు కొమరగిరి, రాజ్యమునకు రాజును చేసిన సేవలకామాత్రము కాటయవేముడు తగడా?

## కొమరగిరి పాలనము - చివరి దశ

ఉచితానుచితము లైట్లైనను కాటయవేముని కొనగిన "వీరజీవిత" ప్రమాణము

దేశరాజకీయముల నలజడి రేకెత్తించినది. కాటయవేముని మచ్చరించి ద్వేషించెడివారు రాజ్యమున బహుళముగనే గలరు. మొదటి నుండియు పెదకోమటి వేమునికి అతని యను యాయులకును కాటయ వేముని విక్రయములు కన్నుగట్టునవే. అతని యెడ రాచకవమువారి మెప్పులు మన్ననలు దినదిన ప్రవర్ధమానములగు నతని యధికారవైభవములు వారి కసహ్యములైనవి. కాటయ వేముడు రాజమంద్రికి తరలుటతో కొండవీటిలో వారి మాటసీతి కవకాశము హెచ్చెను. రాజు దురదృష్టవశాత్తు అప్పుడే దేశాన కఱువుకాటకములు ప్రబలినవి. ప్రజలలో జబ్బులు చావులూ తఱచైనవి. ఇది ఆధారముగ రాజ్యములోని అసమ్మత వర్గము రాజును బలహీనుని జేయునుపక్రమించినది. ఈ కఱువు కొండవీడులే గాదు, దక్షిణ దేశ మందంతట వ్యాపించిన జాడలున్నవి. కొమరగిరి సమకాలీన బహ్మాన్ సుల్తాన్ మహమ్మద్ షా II రాజ్యము కాటకాన్ని గూర్చి ఫెరిస్తా వ్రాస్తూ, అప్పుడతడు (సుల్తాన్) తన ఖర్చుతో పదివేల యెద్దులను అవిరామంగా తన రాజ్యానికి మాల్వా - గుజరాతుల నుండి ధాన్యం చేరవేయడానికుపయోగించి ఆ ధాన్యమును ప్రజలకు చౌకధరలకు అందజేసెనన్నాడు[65]. శకవత్సరము 1318 (క్రీ.శ. 1396) "దుర్గాదేవి" యగు ద్వాదశ వర్ష క్షామ[66] మారంభమయ్యెనని, అది పెట్టిన దుర్భర క్షోభను జనులు చిరకాలము మరువలేరైరని రాబర్ట్ న్యూయక్ వ్రాసినాడు. ఈ కఱువు తెలంగాణాను ప్రాకుటలో ఆశ్చర్యము లేదు. కొమరగిరి పాలనా కాలమున దాన శాసనములపురూప మగుటకు దేశమను ఆర్థిక సంక్షోభము రాజకీయముగ అశాంతులకు తోడు ఈ కఱువును కారణముగా గావచ్చును.

క్రీ.శ. నవంబర్ 1397లో ఫిరోజ్‌షా బహ్మనీ సింహాసన మధిరోహించెను. ఆమరు వత్సరముననే అతడు విజయనగరముపై దండెత్తెను. ఉదయగిరి వరకు నిరాఘాటముగ సాగిన యతని దాడి విజయనగరమునకే యేల, కొండవీటి యస్తిత్వమునకే ముప్పుదెచ్చెను. దానినేవిధముగ కొమరగిరి ప్రాయ ద్రోసెనో ఎరుగదు. కొండవీటి సామంతులతో సమర్థుడగు దళపతి గజరావు తిప్పానాయకుడు కంభంమెట్టు వెలిక్షేత్రమున ముస్లిముల నోడించినట్లు తెలియుచున్నది.

కొండవీటికి దురవస్థ కూర్చుటలో కళింగ గజపతి చేయియు లేకపోలేదు. శక 1321 దాపుల (క్రీ.శ. 1399) కళింగసైన్యములు తూర్పున చొచ్చుకొని

అతని రాయసము పురుషోత్తమయ్యాను, రెండవది[76] ప్రభవ ఆశ్వయుజ బహుళ షష్ఠికి తన యజమానుడగు మలకగజపతి రావు తిప్పానాయనింగారికిని, రాయప నాయనిం గారికిని పుణ్యావ్యాప్తికై సింగపండితుడొసిగిన భూదాన శాసనము. దానికి పూర్వపు శాసనమునను కాలము సూచింప బడినది గాని ఆ భాగము శిధిలమైనది. శక వత్సర సంఖ్య, బహుధాన్య, ఆషాఢలు మాత్రమే తెలియవచ్చినది. ఈ వెలుగోటి రాయపనాయుకు డెవడై యుండును? వెలుగోటి వారు రేచెర్ల వంశస్థులనుట అనాదిగనున్నదే. ఈ వెలుగోటి రాయపనాయుకనికి వారితో నెట్టిదైన సంబంధము కలదా?

పై నుదహరించిన శాసనముల బట్టి రాయపనాయుకుడు ఏదోనొక విషయమున సామంత ప్రభువనుట స్పష్టము. అతడు గుంటూరు జిల్లాలో కొంత భాగమును పాలించుచుండవలెను. అతడు కొమరగిరి సమకాలిడగుటు అతని యధీనుడగు మలక గజరావు తిప్పానాయక ప్రస్తావము తెల్లముసేయును. ఈ థిప్పానాయకుడే చాటు పద్యమణి మంజరి[77] తెలుగుచాటువులోని గజరావు తిప్పయ. చాటువు చెప్పిన రీతియతడు కుంబము మెట్టబైట ఒకానొక అంబరాయలు చూడగా యవనుల నోడించెను, కోనూరికడ అరివీరుల తఱిమి కొట్టెను, గుండుగొలనికడ కాటయవేము సైన్యముల బఱపెను, కొండవీటి పెద్దకండగడిని చమదపామాత్యుని చిదుగకొట్టెను. "ఓఱుగల్లు కాకతి ప్రతాపరుద్రు సేవించిన డెబ్బది యిద్దరు నాయకుల బిరుదావళు"లను తెనుగు గ్రందములో కొప్పునూళ్ళవారి బిరుదావళి ప్రకారము సైతమీ తిప్పానాయకుడు కాటయవేముని కాలము వాడు. కావున కాపయ నాయకుని శాసనములలోని ప్రభవ బహుధాన్య వత్సరములు క్రమముగా శక 1309 (1387 ఎ.డి.) శక 1320 (1398 ఎ.డి.) అగును. అగుచోనీ వెలుగోటి రాయపనాయుకుడ (I) రేచెర్ల వారి సంబంధియై రెడ్డిరాజ్యమున కొంత జయించి స్వతంత్రముగ పాలించుచుండెనో అటుగాక (ii) కొమరగిరి యధీనుడుగనే వ్యవహించుచుండెనో. ఈ రెండవదే సంభవ్యముగ దోచును. అతని శానములు కొండవీటి రాజ్యమధ్యమున విస్తృతముగ ప్రసరించినవి. ఆ భూముల నతడు స్వతంతములుగ నేలుట అసంభవము. అతనికి రేచెర్ల వారితో ఏ పొత్తును లేదు. కావున అతనిని కొమరగిరి రెడ్డి సామంతుడనే పరిగణింపవలెను.

వచ్చినవి. కొమరగిరి అధీనుడు గొగ్గయ దేవుడు వానిని "విహోరనగరి" కడ ఎదిర్చి యోడించిననట్లు నాటి సర్వవరం శాసనము[67] తెలుపుచున్నది. "విహోరనగరి" సింహాచలమని వెంకటాచల మహాత్మ్య వరాహపురాణములన్నవి, హిరణ్యకశిపు సంహరించి ప్రహ్లాదునిగా చిన హరినృసింహ రూపమని నాకొండపై విహరింప దానికాపేరు కల్గెనని గాధ[68].

విజయనగర రాజులును ఈయవకాశమును జారవిడువరైరి. ముస్లింసేనులు వెనుదిరిగి పోయినంతనే ఉదయగిరి పాలకుడును రెండవ హరిహరరాయుల తనయుడునగు, దేవరాయ I తన కొడుకు రామచంద్ర రాయలు తోడురావెలడలి కొండవీటి రాజ్య దక్షిణ ప్రాంతమును చాలావరకాక్రమించెను. హరిహర II రాయని ఎనమదల శాసనమును[69] దేవరాయ రామచంద్రరాయల మూర్కొండపాడు[70] పరుచూరు[71] దానశాసనములును అన్నియును శక 1322 (క్రీ.శ. 1400) నాటివి, ఆ ప్రాంతముల విజయనగరాక్రమణము నిరూపించుచున్నవి.

కొమరగిరి కష్టమున లాభమెంచినవారిలో నొకడు కందుకూరు రెడ్ల శాఖీయుడు కోమటిరెడ్డి. పినకోమటి రెడ్డి పౌత్రుడు, మాచ I పుత్రుడునగు నతడు గుంటూరు జిల్లాలోని తెనాలి పర్యంతము తన స్వాధీనముగావించుకొనెనని, శక 1326 (క్రీ.శ. 1404) నాటి యతని పెదపూడి శాసనము వలన[72] తెలియుచున్నది.

ఇట్టి పరిస్థితిలులలో బలప్రయోగము దమననీతి కొమరగిరి రెడ్డికి తప్పవయ్యెను. అందుకే కావలయు లోకవృత్తాంతములు (Local Records) కొమరగిరి పాలనము నిష్ఠురము, పీడాకరమునని వర్ణించినవి. దాని వలన గూడ ప్రభువులు కొందరు పెదకోమటి పక్షమున జేరి కొమరగిరి నెదుర్కొనిరి.

గుంటూరు, బాపట్ల, రేపల్లె, పల్నాడు తాలూకాలలో ఒక నాయకుడు వెలుగోటి రాయప నాయనంగారి శిలా శాసనములు మూడు నాల్గు లభించినవి. వీనినెందును కొండవీటి రాజనామము కనరాదు. గుంటూరు[73] బాపట్ల[74] శాసనములు రాయప నాయనింగారి రాయసము పురుషోత్తమ్మయ న్నిర్ణయించిన కొలబద్ద నిడివిని మాత్రమే చెప్పినవి. మిగిలిన రెంటిలో నొకటి[75] వెలుగోటి రాయపనాయనింగారిని,

చాటుపద్యము చెప్పిన విజయములా? ఉదయగిరిపై కురవడించిన ఫిరోజ్‌షా సేవల కొన్ని పటాలములు రెడ్డి రాజ్యమున జారబారగా రాయపనాయకుని దళావాయిగజరావు తిప్పయ వారిని హతమార్చియుండును. ఇతర సంఘటనలు కొమరగిరి యనంతరము పెదకోమటి వేముని రాజ్యారంభముననై యుండును. పెదకోమటి వేమునియను యూయులుగ వారు కాటయవేముని వరూధినుల పరాజితముల జేసియుందురు.

కొరగిరి చిట్టచివరి శాసనము వృషవత్సరపు (బెజవాజ తాలూకాలోని) కొత్తూరు శాసనము(78); కొమరగిరి రెడ్డి వసంతరాయ లక్ష్మీనృసింహ స్వామి కాతని భూదన మందు ప్రస్తావింపబజడినది.

శక 1324 (క్రీ.శ. 1402)లో మాచారెడ్డి I పౌత్రుడు పెదకోమటి కొడుకునగు వేమారెడిడ కొమరగిరిని తరిమి యాతని సింహాసన మాక్రమించెను.

కొమరగిరి చివరి దినములు రాజమహేంద్రవరమున గడిపినట్లున్నది. అతడు జ్వరపడగా శక 1324 చిత్రభాను పుష్యమకర సంక్రాంతిని అతని విరామవాత్తకై కాటయవేముడు దాన లచ్చినని యొకశాసనము తెలియవచ్చినది(79). ఆ వెనుక త్వరలోనే కొమరగిరి రెడ్డి మరణించెను.

# ఆధారములు

1. J.A.H.R.S. Vol XI, pp 9 ff దానకాలము 2 2 ఏప్రియల్ 1 3 9 0 ఎ.డి
2. పైదే, pp. 21 1f కాలము దెలుపు శ్లోకుము
"శాకేశ్వ (ష్వే) దుగుణశితౌయువ శరద్యర్కేయనేచోత్తరే
కృత్వాగోపవరం తమేమశుక సద్యోగి ప్రతిష్ఠాపితే
గ్రామం రాజమహేంద్ర నామ నగరీ వప్రాంతరే గోపికా
నాధయార్పిత కాటయేంద్ర తనయః శ్రీవేమ పృధ్వీపతిః"
కాటయ కృష్ణల, కుమారగిరి ధర్మజుల పోల్చుటలు అర్థ రహితములని కొందరు కాటయవేముని పంపున శాసనకావ్యము లిఖించి నతడు స్వయము సంస్కృత పండితుడు. అతడు గూర్చిన ఔపమ్యముల కర్థయుక్తి శంకింపరాదు.
3. ఉండవల్లిలో మాచారెడ్డి శాసన మొకటి గలదు. కాని ఆమాచారెడ్డియే యీతడనలేము
4. A.R.H.S. 1934 - 35 (1944f) Appendix
5. కొమరగిరి చెల్లెలి పేరు నిశ్చయముగ తెలయరాదు. కాటయ వేముని దక్షారామ శాసనాధారమున (Ep. Ind. IV, P 328) కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు ఆమెను మల్లాంబిక యనిరి. (ఆం.వి.స IIp. 29) కాని ఆశాసనమోమె అనవోత కూతురని స్పష్టముగ ననదు. కలువచేరు శాసనము (ఆం.సా.ప.ప. III pp 103 ff) ను ప్రకటించుచు శ్రీజయంతి రామయ్య పంతులవారు, కాటయ వేముని భార్యలు దొడ్డాంబిక మల్లాంబికలలో మల్లాంబ ఇక కుమారగిరి చెల్లెలను మన్నారు. కాటయవేముని తొత్తరమూడి శాసనమునను (Ep. Ind. IV, pp 318 ff) మల్లాంబిక అనవోత, కుమారగిరి రెడ్డి, వీరల సంబంధము ఇట్టిదనలేము.
లక్ష్మణ రాయ పంతుళ్ళవలెనే చిలుకూరు వీరభద్రరావు గారును మల్లాంబికను కుమారగిరి చెల్లెలనియే మన్నించిరి (ఆంధ్రుల చరిత్ర III, p 171; p 256) మల్ల సానమ్మ ఒక కన్ని బోరయ (?) కుమార్తె (S.I.I.V, No. 105) ముక్కంటి రాయని సోదరి. ఈకన్నిబోరయ యెవరో తెలియదు. ఇదియొక వింతపేరు. సాధారణము కాదు. బహుశ శాసన పఠనమున పొరబడి యుందురు. అదేమైనను మల్లసాని అనవోత కొమరితయు, కుమారగిరి సోదరియు కాదనుట నిజము.
6. N.D.I. Vol. III, 0.78, p 1037
7. Ep. Coll. No. 602 of 1909
8. Ep. Ind Vol. III, pp 59f
"సీతా మంత్రీశ్వరో విద్యా గోష్ఠీషు విబుధాగ్రణీః
మిత్రం హితోపదేశేషు భూభుజామిమ్మ దీశ్వరః"
9. ఈయన వంశము శృంగార నైషధమున నిట్లున్నది :-
పెదతుర్కన

చిటిపెద్దన
మామిడన్న + అక్కాంబ
పెద్దన వీరభద్రమారన నామన
(అనవేముని మంత్రి)
పెద్దనకు వేమ, ప్రెగడ, సింగనలని ముగ్గురు కొడుకులు. పెద్దన సోదరులు, సుతులు కోమటి వేమునితో సహకరించిరి.

.... ద్వితీయార్జునుం
ధనవేమాధిప రాజ్య భారభరణ వ్యాపార దక్షుండుపె
ద్దన మంత్రీశుడు మామిడన్న సుతుడే తన్మాత్రుడే చెప్పగానె

10. కాటయ వేమునికొక బ్రాహ్మణ మంత్రి యుండెను. అప్పయ కొడుకు పెద్ది S.I.I. VI, p 226
12. ఆం.సా.ప.ప. ol. IX, pp 319 - 325
13. S.I.I. Vol. VI, No. 781 ఇందు దెల్పిన దాన మిచ్చినది కార్తిక శు. 7 ఆదివారమున శక వర్షము గత వత్సరము. ఈయంశములన్నియు శక. 1309కి సరిపడును (క్రీ.శ. 138) అక్టోబరు 20, ఆదివారము)
14. S.I.I. Vol. VI, No. 226 ఇందలి దాన కాలము అధికాషాఢ శు (క్రీ.శ. 1386 మే 30, బుధవారము)
15. Ep. Coll. 270 of 1905
16. Ep. Coll. 257 of 1905
17. ఈప్రాంతమును మొదట శక 1283 దాటిన క్రొత్తలలోనే అనపోత I అతని సోదరుడు మాడ I జయించి యుండిరి. (వెలుగోటి వంశావళి P 17). దానిని బుక్కరాయలు I ఆక్రమింపగా తిరుగ అనవేముడు దానిని గైకొనెను. ఈప్రదేశముల రేచెర్ల పాలనము దెల్పు శ్లోకము లిందు పొందుపరచు చున్నాను–

ఏకోయం భాగ్యలక్ష్మీం ప్రథయతి జగతి జ్యాయనే మంద్రదేశః
దేవః శ్రీశైల నాథ స్త్రిభువన తిలకో యత్ర చాహో బలేంద్రః
వాహిన్యౌ యత్ర... హరిహరతనూ గౌతమీ కృష్ణవేణ్యౌ
యంచాసావన్నపోత ప్రభురవతి సమం మాధవే నానుజేన
"ప్రత్యర్థిగాయి గోవాళ స్సోయం సమరసాత్యక్ః
శ్రీశైల వింధ్య మధ్యోర్వీ మండలం పరిపాలయన్"
ఏ 26, ఇమా మహేశ్వర శాసనము
వింధ్య శ్రీశైల మధ్య క్షమామండలం పాలయక్ సుతైః
వంశ ప్రవర్తకై రర్థాన్ భుంక్తే భోగపురం దరః"

J-40 రసార్ణవ సుధాకరం

18. Ep. car Vol XII, Ct 15, V.O. p. 121
19. ఈవివాహము ప్రశంసించు శ్లోకమునకు పండిత వేటూరి ప్రభాకర శాస్త్రి గారొనర్చిన సవరణలను నేనంగీకరింతును.
20. Ep. Ind. Vol. XIII, V-22, P. 242
21. కొమర గిరిరెడ్డికి గోరి సింగయ మాడు
తనర బెట్టిన బొమ్మ దలపవైతి - V. 108, p 39
తనర మీపెద తండ్రి దాచ భూపాలుండు
కొమరగిరికి బొమ్మగోరి పెట్టి - V. 121, p 43
రేచెర్ల వారి వంశమున దాచనముడీ ఒక్కడే. అనపోత I, మాదవ I, అతని కొమరులు, కాని దాచయ కుమరగిరి కాలమువాడు కాదు.
22. S.I.I. Vol. VI No. 1081
గయిని వెళుదాన పాఠము తప్పు. అది "గోయ గోవాళుడైన" అని యుండవలెను.
23. వంశావళి 37, పెద్దవేదగిరి నేడునకు బెండపూడి దుర్గ విభాళ యన్న బిరుదు గలదు. చూడడు వంశావళి ఉపోద్ఘాతము P 20.
24. Ep. Coll. No. 254 of 1905
26. ఈపద్యములు శ్రీజయంతి రామయ్య పంతులు ప్రకటించిన తొత్తరంపూడి శాసన అనుబంధము (Ep. Ind. Vol. IV)నను, పండిత పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి ప్రకటించిన దానిలోను (ఆం.సా.ప.ప. Vol) X గలవు. :-
ధాటీ ఘోటీఖరాగ్ర త్రుటి తగిరి తటే యత్ర మొల్లేటి దుర్గం కిమ్మూరు సంజ్ఞం దళితిపుబలే దుర్గమంబెండపూడిమ్ దుర్భేదం వజ్ర కూటం జితవతి రభసా రామగిర్యాఖ్య దుర్గమ్ విఖ్యాతం వీరఘోట్టం గరిత మసుహృదాం వీరసన్నాహదార్ట్యష్యం. శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు నీపద్యములను తన నశృంగార నాధమున నిచ్చినారు. వ్యాఖ్యప్రతులలో కొన్నిట మొల్లేటి దుర్గము బదులు మల్లేది దుర్గము అని యున్నది. అది సరికాదు (మా ఆం.సా.పడు X p52).
27. Ep. Coll No. 278 of 1924
28. కిమ్మూరు కైఫియత్
29. అదే pp. 3-4
30. Dg. Gd. 234
31. Vizagapatnam Dt. Gazeteen, pp. 255 - 56
32. Dg. Vj. P. 271
33. Dg. Vj. P 202
34. Dg. Vj. p 292
35. చాటు పద్యమణి మంజరి II, p 66

కాయుట రెడ్డి వేమ.....
కాలయతేని కోటగొని గౌతమి వాహిని దాటిపోయి యాకోటల నున్న రాసుతుల గోమలులన్
దగ గొంచువచ్చెబో
ఘోటక.... ధాటికి కొండవీటికిన్"

36. ఇది తూర్పుగోదావరి అమలాపురి తాలూకాలోని క్రొత్తేనికోనికోన యో కాక రాజోలు తాలూకాలోని క్రొత్తేనిపాడో కావలయును.

37. J.A.H.R.S. VI P 215, పంక్తి 42
యః కటక చూరకారః ప్రఖ్యాతః పాండ్యరాజ గజ సింహః

38. Ep. Ind. Vol. XIII, p 242 V. 17
జిత్వాయ పటు సప్తమాది యన్నపాక్ క్రాంత్వా కళింగక్షితమ్ సింహాద్రౌ పురుషోత్తమే పటుజయస్తంభాన్ సజ్జృంభన్ మధాత్

39. కాశీఖండము I 69

40. "పండువా సురతాణి పావడంబిచ్చిన
భద్రీ భములు వీధి బాలెముండు
నొర్డై ధాత్రీనాధుడు పదబుత్తెంచిన
బించారుణోష్ణీ సంచెల వహించు" - భీ.పు. I ప 37

41. చూ. త సప్తమాధ్యాయను బంధము Pt. II ప. 42

42. భీ.పూ. I. ప. 62

43. Pt. IIలో అధ్యాయము VIIన అనుబంధము చూడుడు.

45. ... చారు నందాపుర స్థానమందు
ఝూద్భండ పాదుషా...
శ్రీవిక్రమాహ్వాయ దేవగజప
తీంద్రులే...

46. అలహాబాదు శాసనము Fl. chap. discriptions, P.7.1.10. ఇప్పటి జైపూరు జమీన్ ప్రాచీననందాపుర శీలవంశ రాజుల రాష్ట్రనల్ప భాగము మాత్రమని యందురు.

48. S.I.I. Vol VI. No. 798

49. పంప భారతము 1:35. శాసనములలో సాహిత్యమున నగుపడు సప్తకళింగము లీ సప్త మాళియలే.

50. "దండయాత్రా ఘోష తమ్మట ద్వనుల చే గంతులు వేయించె గొప్ప కొండ కితవకలా భీల కీలానలము చేత సేల పొంగడగించె బాలకొండ ఆరాట్ట జాధట్ట హయదట్టముల చేత మట్ట తూర్పెట్టించె బొట్టనూరు భూరి ప్రతాపాగ్ని బుటములు పెట్టించె విద్వేషులన గళా (కాళ) వెండి పురము అనగనుతికెక్కె కేళాడిరాయ, యరుల పండువ మండువాయువనహరణ బలియ

ధూళియ మాళవబండికార, విజయ రఘురామ అల్లాడ విభూని వేమ.

ఈఅమూల్యమగు చాటువునుద్ధరించిన వేటూరు ప్రభాకరశాస్త్రిగారు మిక్కిలి వందనీయులు.

51. కుతోత్తుంగ చోడుని ద్రాక్షారామ శాసనము S.I.I. Vol IV No. 1239) అతని యధీన సామంతులు కొందరును "కోసల ఖండి వాలనిదహము"లని చెప్పినది. ఈకోసలము దక్షిణకోసనము.

52. చూ. రెండవ భాగము ఏడవ అధ్యాయమున కనుబంధము V51.

53. S.I.I. Vol. VI., No. 3.961, 1101.

54. 11, 36-39, P. 242

55. Ep. Ind. Vol. VIII, PP. 532-3, r-18.

ఈతామ్ర పట్టికల ప్రమరించి డ్యాక్టరులమొనల్డి. బార్నట్టే పైపదముల అర్థస్ఫూర్తిని గుర్తించినాడు. అవి నిర్దేశించు రాజవంశముల రూపించుటలో కొంత పొరబడినాడు. అతడిట్లు వ్రాసినాడు. : దవదహన రూపమున వేముని ప్రతాపము (వేడిమి లేక విభుత) వర్ణిపబడినది. దరాహములనెన్నుట బహుశః విజయనగర రాజులనూహించి యేమో.

చాళుక్యులకు వలె విజయనగర రాజులు వరహలాంఛనులు లేజివుళ్లు పల్లవులు; మత్స్యములు పాండ్యులు; మీనముల జోడు వారి టిక్కెము : గజముల పతి గజపతి రాజగుట స్పష్టమే. ఇతర విషయ స్ఫురణలు నాకు బోధపడనివికావు. గడ్డికరచుట ఓటమి నంగీకరించుట అను సంప్రదాయమును గూర్చిచూడుము.

F.N. No. I P. 252

56. రియాజస్ సులాటిన్, P.90.

57. సింహాద్రౌ పురుషోత్తమే పటు జయస్తంభా సజృంభన్యథాత్.

EP. Ind, Vol. XIII, P.242, V.17, 11, 35, 36...

58. కాశీఖండము I, 52

ఔరా, యళ్ళయ రెడ్డి దొడ్డవసుధాధ్యక్షుండు

..... నిర్భేదించె నొడ్డాది శ్నం

గారం కోటయు లోతుగడ్డయును నుద్ఘాటించె

కీరాంభోధి తటంబున న్నిలిపె దిక్సీమా జయస్తంభముల్.

59. J.A.H.R.S. Vol. XI P.P. 194-5

60. ఆరేటి లేక ఆరియేటి వారే తరువాత బేండపూడి వారైరని ముందేతెలిపి యున్నాను.

61. కిమ్మూరు కైఫియత్, PP.3-4

"వేమారెడ్డి తరువాతను, ఈసంతతి వారి వాడు రెడ్డి పెదవెంకప్ప అనే ఆయన కొవ్వాడ, గురుగుమిల్లి, గూటాల, కొత్తపల్లి, కిమ్మూరు, పోలునాడు అధికారము చేస్తూ ఉండి వారి వద్ద

సరదారుడైన యిసుకపల్లి పెద్దపాత్రుడు అనే పాత్రసామంతుడికి కిమ్మూరు సీమ అధికారము చెప్పి ఆసీమ వల్ల వచ్చే పైకము పెద్ద పాత్రుడు వశాన వుండే సిబ్బంది వారికి వసతుల క్రిందను, నియమించి విశేషించిన పైకము నగరు కిచ్చేలాగుననున్నూ యీ ప్రకారము మొకరరు చేసి యుండిరి.

62. కాశీఖండము I, V-43.

63. A.S.P.P. Vol. X, No. 1, శృంగార శ్రీనాథము P. 57.

64. Nil

65. Brigg"s Feristha, Vol II P. 349.

66. H.I.S. I.P. 205

67. సర్పవరం తూర్పుగోదావరి జిల్లా, కాకినాడ తాలూకా లోనిది.

S.I.I.Vol. V,No. I,V

విహరణగిరేః పురస్తాదజయః ప్రాంశు గజపతేః సైన్యమ్

ప్రణమతి గోగ్గయదేవ స్యాయం ధర్మైక శాసునాన్ భూపాన్

68. Tirumalai Sri Venkateswara, Vol. P.23

69. Ep. Coll. No. 417 of 1915

70. Mac. Mss.No.15-6-21

శాకేరూ ఫాల యూబ్దె నరపతి తిలకో దేవరాయః ప్రమాథే సోదాద్రావూరి మల్లాన్వయ వరవిదుషే యజ్వనే గ్రామమగ్ర్యమే పోషేరాకౌఖ్య పర్వణ్యహి శశిపతిఃకౌండిన్య సద్రోత్రిణాం...

పై శ్లోకము దోషయుక్తము ప్రమాదిక శక. 1321 యగును. 1322 కాదు.

71. N.D.I. Vol. I Cp. No. 1

72. Mac.Mss, No. 15-4-42.

శాకాబ్దే ఋతునేత్ర లోక శశివే (?కే) సంవత్సరే తారణే మాఖారనామ్ ఉడుపోపరాగ సమయే శ్రీ కోమటి క్ష్మాపతి దద్యాల్లక్ష్మణ దీక్షితాయ విభుదాగ్రణ్యే ర్గురోర్వ్యాసరే ఎల్లేపెద్ది కులోద్భవాయ విదుషే శ్రీ పెద్దపూడింముదా"

దీనికి సరియగు తేది గురువారము 15 జనవరి 1405.

73. Ep. Coll, No, 145 of 1917

74. Ep. Coll.No. 825 of 1922

75. Ep. Coll No. 542 of 1928-29

76. Ep. Coll No. 23 of 1929-30

77. చాటు పద్య మణిమంజరి II పు. 65

78. Ep. Coll. No. 395 of 1926 శక వత్సరము 1312 తప్పు 1322 నట్లు పొరబడి యుందురు. వృషకు సరియగునది 1323, 1322 గతమై 1323 వర్తమానమై యుండును.

79. ఆం.సా.ప.ప. X (పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కాటయవేముని పై వ్రాసిన వ్యాసమున దాని నుదాహరించిరి.

# అనుబంధము

# కళింగరాజ వంశములు కొన్ని

కళింగరాజ్యమును తూర్పుగాంగ వంశజులగు గజపతులు క్రీ.శ. 5 వ శతాబ్దమునకే పాలింపనారంభించిరి. నాటినుండి వారి పతనము వరకు, వేయేండ్లు వారి పాలనము అవిచ్ఛిన్నముగ సాగెను, క్రమముగ వారుత్కలలేక ఓఢ్రదేశమును గూడ తమయధీనము జేసుకొనిరి. వారి సైన్య చతురంగములలో గజదళమత్యంత ప్రబల మగుటకు కారణమాదేశారణ్యముల నుత్తమ గజముల వారిగ లభ్యముగటయే.

కళింగమున నధిక భాగము కొండలు, గనారణ్యములు అగుటచే చిన్న చిన్న రాజ్యములు, స్థానిక నాయకరాజవంశము లనేకములు ప్రబలమగుట కాస్పదమునయ్యెను. వారి స్వస్వశక్తి సామర్ధ్యము లెక్కువే. దృఢగాత్రులు ధైర్యశాలురునగు వారికి ప్రాపుదుర్గములు దుర్భేద్యములు నౌవారి గిరిదుర్గవనదుర్గములే. ఈ మన్నెనాయకులు అరిది విలుకాండ్రు గిరిసమరముల నిపుణులు. వారిలోనే యొకని జయించినను అది ఘనకార్యముగ పరిగణించెడివారు. విజయి, విజితు బిరుదములను తాన్నుగైకొనెడివాడు. ఇరుగుపొరుగు రాజ్యముల పొలిమేరలలో వీరివలన యలజడి చెప్పనలవిగాదు.

దేశప్రకృతి నెఱిగి గాంగరాజు భానుదేవుడు I పాలనా-వ్యవస్థను సంస్కరించి రాజ్యాంగ నిర్వహణను సులువుజేసెను. "రాజ్యక్షేమమునకై పదునార్గురు పాత్ర సామంతులను (సచివులను) నియమించెను. రాజనీతిజ్ఞులేగాక శత్రు నాశనమునకు వలయు సకలోపాయ ప్రయోగదక్షులను దృఢనిశ్చయులును భానుదేవుడు వారి మంత్రముబడి రాజ్యపాలనము జేసెను. అతని తరువాతి రాజులా జాడనే నడచి, శాంతి సంకట సమయనుల రెంటను దేశ సౌష్టవమును పెంచిరి.

శాసనముల జూచినచో కళింగమందలి ప్రతిసామంతుడును తన మండలమును స్వతంత్రముగ నేలినట్లగుపడును. వారు వేరెవ్వరిని అధిరాజుగ తమ కొడయునిగ శాసనములలో పేర్కొనరు. వారికి గాంగ చక్రవర్తికిని గల సంబంధమెట్టిదియో ఎందును నుడివిలేదు. కాని వారిలో నుండియే షోడశ మహాపాత్రుల వరణమని నమ్మవచ్చును.

యుద్ధ సమయముల మేర వారు తమ సైన్యములతో రాజునకు తోడ్పడుట వినావారెల్ల విధముల తమ తమ రాష్ట్రముల నిర్నింభంధనులే. వారినరి వర్గము నుండి రక్షించుట రాజునకు విధి. విశిష్ట సమయముల పర్వదినముల రాజు వారి వారి ప్రాముఖ్యమునకు తగిన రాజమర్యాదల వారిని సమ్మానించెడివాడు.

ఆ స్థానిక రాజవంశములలో కొన్ని, మనకు ప్రస్తుతమగు కాలమున ప్రముఖపాత్ర నిర్వహించిన వాని- నిందు పొందుపఱుచుచున్నాను.

## ఎలమంచి చాళుక్యులు

వేంగీ చాళుక్యులలో చివరి వారి శాఖలకు చెందిన వీరు పిఠాపురమున కొంతకాలము పాలించి, తమకు పడమటి యేలికల యొత్తిడికాగలేక తూర్పు దెస కళింగమునకు వలస పోయి, అచట గాంగరాజుల ప్రాపు నందిరెడ్ల కాలమునకు సామంత ప్రభు పదవులకెక్కిరి. విశాఖజిల్లా ఎలమంచిలి పరిసరములు వారి రాష్ట్రము. వారు క్రమముగ గాంగ రాజ వంశములతో వియ్యము నెఱపి, తోడి సామంతులతో నయ్యన్నతులైరి.

వారిలో కొప్పరాజు నారాయణకు గంగాంబ వలన జనించిన ఉపేంద్ర III వేమునికి అతని సుతుడు అనవోతా రెడ్డికి సమకాలమువాడు.

### ఎలమంచి (యల్లమంచిలి) చాళుక్య వంశక్రమము

విజయాదిత్య + చందాంబిక

|

మల్లపదేవ + లక్ష్మి

ఉపేంద్ర I + గంగాంబ
(శక 1175)

|

మల్లపదేవ II + చోడాంబ
(శక 1205)




## ఒడ్డాది మాత్స్యులు

వీరు మఱియొక స్థానిక సామంతులు. వారి ముఖ్యపట్టణము ఒడ్డాది (ఇప్పటి వడ్డాది) విశాఖ జిల్లా అనకాపల్లికి పన్నెండుమైళ్ళు దూరమున నున్నది. ఈ వంశమున కొంత చారిత్ర ప్రాముఖ్యము గల్గిన వారిలో మొదటివాడు మంకాదిత్యుడు. అతని పుత్రుడు జయంత I జయంతుని తనయుడు ప్రతాప అర్జునదేవ దిబ్బిడతామ్ర శాసనములోని దానకర్త. ఈ సామంతులు 13 వ శతాబ్ది ప్రారంభముల అధికారము గడించిరి. వారి మొట్టమొదటి శాసనము శక 1153 (క్రీ.శ. 1231) నాటి దక్షారామ శాసనము.

వీరి సింహాచల, దక్షారామ, దిబ్బిడి శాసనముల దొరకు దీర్ఘ వంశక్రమమున మంకాదిత్యుని పూర్వుల వదిలి, తరువాతి వారి క్రింద పేర్కొనబడినవారు




## పై వంశ నిర్ణయమిట్లు

సింహాచలమున శక 1261 నాటి యొక శాసనమున దానకర్త జయంతరాజు తాను అర్జున దేవుని పుత్రుడు, జయంతుని మనుమడను అన్నాడు. ఈ తాత జయంతుడు రెండవ జయంతుడో, మూడవ జయంతుడో అతని కొడుకర్జున దేవుడు తాతపేరటి వాడు కావచ్చును, అతనిని రెండవ జయంతునిగ నెన్నితిని.

మఱియొక అర్జునదేవుడున్నాడు. అతని శాసనములు శక 1279 నుండి శక

1303 వరకు పర్వియున్నవి. అతడు నాల్గవ జయంతుని కొడుకు కావచ్చు.

ఇంకొకమత్స్య ప్రముఖుడు ప్రతాపార్జున దేవుడు, వీరార్జున్ దేవుని పుత్రుడు. అతని శాసనములు శక 1321 మొదలు 1334 వరకు సాగినవి. ఈతడు నాల్గవ అర్జునుడేమో. తండ్రి కొడుకు లిర్వురకు ఒకపేరు గనుక తండ్రిని తెలుపుటకతడు వీరార్జునుడుగ కొడుకు శాసనముల జెప్పియుండును.

## జంతఋనాటి సురభివంశరాజులు

ఇప్పటి విశాఖ జిల్లా శృంగవరపు కోట తాలూకా ఆనాటి జంతఋనాడనుకోవచ్చును. దాని నాయకులుగా గార్త్స్యమదగోత్రులు, సురభివంశ్యులు. వారి శాసనములు పండ్రెండు వరకు సింహాచలమున నున్నవి. శక. 1207 నుండి 1383 వరకు డెబ్బదేండ్లు యున్నవి. కాని యివి ఆధారముగ వారి వంశక్రమమును నిరూపింపవలనుగాదు. వీరిలో రెడ్డిరాజ్యకాలమున నున్నవారు

ప్రతాపగంగరాజు (శక. 1241, 1258)

ప్రతాప వీర గంగరాజు (శక. 1290)

సంగమరాజు (శక. 1320, 1321)

ప్రతాపగంగరాజు (శక 1342)

పై నల్గురిలో మొదటి యిర్వురు నొకరే కావచ్చును.

## వీరకూట పల్లవులు

వీరు భారద్వాజ గోత్రులు, కాడు వెట్టి (కాడువెట్టి వంశవలార) సంతతి వారమందురు. వారు ఖట్వాంగ। (ఒకరకపు బెల్లు)। ధ్వజలు, వృషభ లాంఛములు. వారి రాజధాని వీరకూటము, ఇపుడు విశాఖ జిల్లా పాలకొండ తాలూకాలోని వీరఘట్టము. వారు 12వ శతాబ్ద్యారంభమున గణనకెక్కిరి.

13వ శతాబ్ది మొదటి పాదమునకు పూర్వము వారి తొలి శాసనములు దక్షారామము నందలివి నాయకులే ముర్వురనో సూరపరాజు, బయ్యరాజు, అతని తమ్ముడు గంటి బయ్యపరాజులను పేర్కొన్నవి. 14వ శతాబ్ది నుండి వారి శాసనములు సింహాచలమున నగుపించును. ఆనడుమ డెబ్బదేసేండ్ల కాలమున వారి శాసనము లేవియు వెలికిరాలేదు. ఈ పల్లవుల మలి శాసనము లాధారమున, తాత్కాలికోపయోగమునకుకై

యుక వంశక్రమము రూపింపవచ్చును.

శ్రియాదేవి లేక శ్రీ రంగలక్ష్మి
|
పురుషోత్తమ (శక 1230)
నరసింహ + లకుమాదేవి లేక లక్ష్మీదేవి (శక 1270)
(1274, 1279)
|
పురుషోత్తమ II + మదనరేఖ
(శక 1278, 1279)
|
సౌభాగ్యదేవరాజ
(శక 1322, 1342, 1346)

## నందాపుర శీల వంశరాజులు

వీరు విశాఖ జిల్లా పడమటి మన్నెప్రాంతముల, పొత్తంగి తాలూకాలోని నందాపురము రాజధానిగ పాలించుచుండిరి. ఇప్పటి జయపుర సంస్థానము నాటి శీలవంశస్న పతుల రాజ్యమునకొంత భాగమేయని అందురు. వారి శాసనము లారేడు పుణ్యక్షేత్రములగు సింహాచల (విశాఖజిల్లా) శ్రీ కూర్మ (గంజాంజిల్లా) ముల వారిచ్చిన దానముల తెల్పునవి. ఆ శాసనముల కనబడు వారి నాయకుల పేర్లు

1. విశ్వనాధరాజ, గంగరాజపుత్రుడు (శక 1275)
2. భైరవ రాజు, అక్కమదేవి తనయుడు (శక 1292)
3. భచ్చలదేవి, భయ్యరాజ సుత (శక 1318)
4. గంగరాజ, భయ్యలేక భైరవరాజ పుత్రుడు( శక 1349)
   ఒడ్డాది జయంతుని కొడుకు మత్స్య సింగరాజు, గంగరాజు యొక్క మేనమామ
5. విశ్వేశ్వర లేక విశ్వనాధ రాజు, మత్స్య జయంత రాజ తనయ సింగమాదేవిని పెండ్లాడెను (శక 1349)
6. గంగరాజ (శక 1357)

పై దెల్పిన వంశముల వారు గాక కళింగము మరెన్నియో వంశముల నాయుకులుండిరి. కానివారి వృత్తాంతము లేవియు దెలియరావు.

# అధ్యాయము IX

# పెదకోమటి వేమ

## (సు.క్రీ.శ. 1402 - సు 1420)

కొమరగిరి చనిపోగా మాచారెడ్డి పౌత్రుడు I పెదకోమటి రెడ్డి పుత్రుడు వేమారెడ్డి శ. 1324 దాపుల కొండవీటి సింహాసన మధిరోహించెను. కొమరగిరి శక. 1324 (క్రీ.శ. 1402) వరకు జీవించినట్లు శాసన సాక్ష్యము[1] న్నను, గోదావరి పశ్చిమ భూముల నతని శాసనములు మృగ్యములగుటచే శక. 1324నకు కొలది యేండ్లకు పూర్వమే అచట అతని పాలనమంతరించెననవచ్చును.

## పెదకోమటి వేముని రాజపదాప్తి

రాజ్యములోని అవ్యవస్థ, నలుదెసలను అరులతాకిళ్ళు వీనినరికట్టుటకై, పెదకోమటి వేమ కొండవీటి సింహాసనమును బలిమి గైకొనెను. అందుకైన పోరులలో నతని పక్షము వహించి జయముమొనగూర్చినవారిలో ముఖ్యులు వెలుగోటి రాయపనాయకుడును, గజరావు తిప్పానాయకుడును మున్నుదాహరించిన చాటుపద్యము[2] గుండుగొలను (పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు తాలూకా) యుద్ధమున గజరావు తిప్పని చేతులకాటయవేమ పరాజయము వర్ణించినది. పెదకోమటి రాజత్వ మడ్డుటకై, కొమరగిరి పేర కాటయవేముడు సకల విధముల యత్నించెనన్నమాట. అది రాజుగ కొమరగిరి నిలుకడకై కావచ్చును. అతడు నిస్సంతు కావున రాజ్యము తుద తనకే అగుననియు కావచ్చును. రాజ్యమునకైన ఆ పోరు నిజముగ కొమరగిరి పెదకోమటి వేమలకు గాదు. పెదకోమటి వేమ కాటయవేములకు గుండుగొలను, కోనూరు రణములు ఆ యుద్ధములోని రెండు ఘట్టములు. ఆ చాటు పద్యమునే పరిగణించినచో, పెదకోమటి వేమ బలము వికర్షించి తన మిత్ర పక్షము వాడును, జామాతయునగు కాటయవేమునికి సాయపడుటకై విజయనగర రాజు హరిహర II పంపున అతని సైన్యములు చేండపామాత్యుడు నడపగా కొండవీడు దాపులకు చొచ్చుకొనిపోయినవి[3]. అతనిని కొండవీటి పెద్దకొ[illegible]డిని గజరావు తిప్పానాయకుడ "సాచిగాకొట్టి"

పలాయితు జేసెను. ఇట్లు పరిపంధులెల్ల రోడియదగి పోగా పెదకోమటి వేమ రాజై కృష్ణానది యుత్తర తటము నుండి కొండవీడు వరకు గల సీమనంతటిని పరిపాలించెను. శక. 1326, 1336 వత్సరముల నతని కలువాములు[4] నందమూరు[5] శాసనములు కృష్ణానది యుత్తర తటభూముల నతని పాలనమును సమర్థించుచున్నవి. ఆ భూములనతడు తన సోదరుడగు మాచయకప్పగింపగా, నతడు కొండపల్లినియభేద్య దుర్గమునొనర్చి దాని నా రాష్ట్రమునకు ముఖ్యపట్టణము నొనర్చెను.[6]

అటనట పదములు చెదిరిన చాటు పద్యము[7] పెదకోమటి వేముని పాలనారంభమున ననుకొన దగిన కొన్ని ఘటనల వర్ణించును. కాటయ వేముని మెచ్చి అతడన్నపోసుభూతి వారొనర్చిన విద్రోహ చేష్టలకు కోపింపని పెదకోమటి వేముని వౌదార్యక్షములనది కొనియాడును. తమ పన్నిన యశక్త దౌష్ట్యములెల్ల వమ్మైకాగా వారెల్ల కొండవీడును వదలివెళ్ళిరి. కాటయవేమునితో కొమరగిరియు రాజమహేంద్ర వరము జేరి తన మిగిలిన జీవిత మటగడపెను.

## పెదకోమటి వేముని తొలి విజయములు

పెదకోమటి వేముడు రాజ్యమున స్థిరపడు నాటికి, విజయ నగరము వారసత్వపు పోరులో మునిగియుండెను. హరిహరరాయలు II శక. 1326 (1404 ఎ.డి.)లో గతించెను. అతని తనయులు దేవరాయ I, విరూపాక్ష II, బుక్క II - ముప్పురును రాజపదవికై పెనగిరి, ఉదయగిరిలో యువరాజుగనుండిన దేవరాయల చోటినుండి సేనల రావించుకొనెను. రాజ్యమంతట అరాచకము మెండయ్యెను. అదియదనుగ తమ భూములను కించిత్పూర్వము ఆక్రమించిన విజయనగర దళములను తఱిమివైచి కోమటి వేముని సైన్యాధిపులు అందు పునఃరెడ్ల పాతకను ప్రతిష్టించిరి. కందుకూరు మాచయ కొడుకగు కోమటిరెడ్డి II నోడించి తీరప్రాంతమును కోమటివేముడు తిరుగగైకొనెను. తన సోదురుడు మాచయ తోడుగా పెదకోమటి వేముడు, కందుకూరు మాచయకోమటిరెడ్డి II ఆక్రమించియున్న తన కోస్తా మాగాణ్యము నంతయు మరల తన యధీనము చేసుకొనెను. ఆ యోధన పటువుగా కొండవీటి కీర్తి యిట్లు పునఃప్రతిష్ఠింపబడినది.

కొమరగిరి మరణించిన పిదపనైనను కాటయవేమ పెదకోమటి వేమలకు పొత్తు కుదరలేదు. రాజమహేంద్రవరసీమ కొండవీటి రాజ్యములో నొక సామంతమండలము. దాని యధిపతి కాటయవేమునికి స్వతంత్ర ప్రతిపత్తి యెట్లు? అతడు తన సార్వభౌమత్వము మన్నించి సామంత మాత్ర విధుల తన్ను పచరింపవలెనని పెదకోమటివేముని దృఢసంకల్పము. కాని కాటయవేముడు, కొమరగిరి రోజులలోవలెనే యతనిని ధిక్కరించి తన స్వాతంత్ర్యము ప్రకటించెను. ఇట్లు రాజమహేంద్రవరమును రాజ్యముగ తీర్చి దాని పాలనము కాటయవేముని పరము జేసిన కొమరగిరి చేయిదము రెడ్డి రాజ్యమును రెండుగా పరస్పర వైరులుగా చీల్చి, దాని పై చిరము కన్నిడియున్న ఉపాంతరాజుల యాశల బెంచెను. రాజమండ్రి, కొండవీడుల వైరమున లాభపడనెంచిన వారిలో ప్రథముడు చోడభక్తి రాజు కొడుకు అన్న దేవచోడుడు. కాటయవేముడు బలిమిగైకొన్న తన రాష్ట్రమును తిరిగి సాధించు కొనగోరు నతని ఆశ్రయమిచ్చి, సాయపడినతడు దేవరకొండ వెలమ ముఖ్యుడు మాదయ(1) కొడుకు వేమగిరి[8]. ఈ ప్రయత్నమున అన్నదేవునికి కొంతకు కొంత పెదకోమటి వేముడును తోడ్పడెననుటకవకాశము లేకపోలేదు.

అన్నదేవ చోడ పెదకోమటివేముల చెలిమి తనకెంతటి ముప్పో కాటయవేమునికెరుకయే. శక. 1330 నాటికే అన్నదేవచోడుడు కాటయవేముడు ఆక్రమించిన తన భూముల స్వాధీనమొనర్చుకొని యుండెను. కావున కాటయ వేముడు విజయనగరముతోడి సఖ్యసహాయమ్ముల పునరుద్ధరింపనుద్యమించెను. అట్లనుటకు కాటయవేముని శక. 1332 నాటి అహోబలశాసనము ప్రోద్బలకముగనున్నది[10] అప్పటికి విజయనగరములోని పవరము లడిగి సింహాసనమున దేవరాయ సుప్రతిష్ఠుడై[11] యుండెను. తన గొడవలలో గుడుసళ్ళువడుమన్న కాటయవేముడు విజయనగర రాజ్యాంతరమునహోబళమునకు మిత్రుడుగనే గాని వైరిగవచ్చుటకవకాశము లేదు. అతని శాసనముచట నాయొక్కటియే వైరిగవచ్చుటకు కవకాశము లేదు. అదియును అచటి నృసింహస్వామి కతడొగిన గ్రామముల ప్రకటించుటయే. దేవరాయ కాటయవేములు కలుసుకొన్నారో లేదోగాని విజయనగరమునుండి కాటయవేమునకవసరమగు సహాయ్యము సునిశ్చితమయ్యెను. ఇది అసంశయముగట

అన్నదేవచోడుని రాజమంద్రి మ్యూజియం తామ్రపత్రములు[12] వర్ణించు ఘటనలను నిశితముగ పరిశీలించిన తెలియగలదు.

ఇచ్చినమాట ప్రకారము దేవరాయలు తన సైన్యములను కొండవీటి రాజ్య హ్యాత్సీమలకు నడపెను. పెదకోమటివేమ, అన్నదేవచోడుల యొత్తిడి కాటయవేముని కపుడు భరింపరానిదయ్యెనేమో. విజయనగరము నెదురుటకై వారి సేనలలో చాలావరకు మరలుటతో, కాటయవేమునికి తన బలముల కూడదీసుకొనుటకును, శత్రువుల మార్కొనుటకును అవకాశమిచ్చెను. దేవరాయని ఇంకొల్లు శాసనము సూచించినట్లు ఈ దండయాత్ర శా.శ. 1333 నందన వత్సరమున (క్రీ.శ. 1412) జరిగెను. తన రాజ్యమును కొండవీటి కోస్తా భూములకు విస్తరింపజేసి, యచటి సుప్రసిద్ధ రేవు పట్టణము మోటుపల్లిని పట్టవలెనని దేవరాయని తలంపు. తాత్కాలికముగ రెడ్ల భూమి కొంతవశమైనను, దేవరాయని ఆశయము నెరవేరదయ్యెను. మోటుపల్లి గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోనిది. ఆ ప్రాంతముల దేవరాయల శాసనములు కానము. కావున పెదకోమటి వేముని కోహటించి విజయనగరము వారు వెనుదిరిగి రనవచ్చును. పెదకోమటి కాటయవేముల సమర ప్రకారము తెలియుటకు పరోక్షాధారములేగాని ప్రత్యక్షములు లేవు. కాని ఆనాటి యితర శాసనములు, సాహిత్యము పరిశీలించిన అప్పటి సంభవముల రూపింపవచ్చును. కొప్పునూళ్ళ కుటుంబీకులు పరంపరగా దాల్చిన బిరుదములలో కాటయవేముని తలగొండుగడ[14] యన్నది యొకటి. పెదకోమటి వేమునిదే పై చేయియని అతని తోడి యుద్ధమున కాటయవేముడసువుల బాసెనని నిశ్చయింపవెలను. ఈ యుద్ధమున నా వంశపు గజరావు తిప్పానాయకుడు[15] ప్రముఖపాత్ర నిర్వహించెనని మన మెఱిగినదే. పెదకోమటి వేమ, అన్నదేవ చోడుల జయము నిస్సంశయమని శా.శ. 1336 తర్వాత కాటయవేముని శాసనము లేవియును ఆ ప్రాంతమున లేమి ధ్రువపరచును.

కాటయవేముని తరువాత రాజమహేంద్రవర చరిత్ర సులువుగ తెలియరాదు. అన్నదేవునికి, పెదకోమటి వేమునకి గల సంఖ్య స్వరూపమెట్టిదో తెలియదు. కాటయవేముని కొడుకు కొమరగికిర రెడ్డి అనంతరమే రాజమంద్రిని నన్నయదేవ చోడుడు వశమొనర్చుకొనెను. పిమ్మట నైనను దానినతడు పాలింపజాలడయ్యెను.

కాటయవేమునికి వారసులతని కుమార్తె అని తల్లి యొక్కతే ఆ పక్షమున నల్లాడరెడ్డి యన్నదేవచోడుని ప్రతిఘటించెను. అల్లాడ కుటుంబము వారామె ప్రతిపక్షుల నెల్ల రాజ్యమునుండి వెడలద్రోలగా అని తల్లి రాజప్రతినిధిగ (Regent) అల్లాడ పాలనమొనర్చెను. అల్లాడతోడి పోరున అన్నదేవుడు మరణించెనని తోచును. ఏమైనను, రాజమండ్రిని కబళింపనెంచిన పెదకోమటి వేముని యాశ నిరాశ యయ్యెను. కాని అతడా యత్నమును విరమింపడయ్యెను.

## పెదకోమటివేమ - అల్లాడలు

పెదకోమటివేముని రాజత్వ పదవి భద్రతా స్థిరత లింకను రూఢములుగావు. అతని రాజ్యమును తూర్పు పడమరల బలవద్రిపులు అల్లాడ దేవరాయలు - పాదివియున్నాడు. ఏమి జేసియైనను రాజమహేంద్రవర స్వతంత్ర ప్రతిపత్తి సంపాదింప అల్లాడ కంకణము గట్టుకొన్నాడు. అతని పట్టుదల పెదకోమటి వేమునికి బాగుగ తెలిసివచ్చినది. అందుచే ఆత్మరక్షకై అతడు సుల్తాన్ ఫిరూజ్ బహ్మనీ మైత్రినర్థించినాడు. ఈ సంధి కార్యము నిర్వహించినాతడు పెదకోమటి వేముని సచివుడు మామిడి సింగయ. ఈ సింగయను శృంగారనైషదము యవనాధీశ సభానిరంకుశ వచోవ్యాపార పారంగతు నిగ వర్ణించినది[16]. ఈ రెడ్డి బహ్మనుల మైత్రి ప్రస్తావము వెలిగోటివారి వంశావళి[17] యందును కలదు. ఈ మైత్రి కొండవీటికి బద్ధశత్రువులగు దేవరకొండ పద్మవెలమలకే మాత్రమును గిట్టదు. కాని తాము బహ్మనీ యధీనులగుటచే వారు దానిని భంగింపజాలరైరి. ఇట్లు ఫిరూజ్‌షా సాయము లభింపగా పెదకోమటి వేముడు రాజమండ్రిపై దండెత్తెను.

అది యిట్లగునని యూహించి సన్నద్ధుడై యుండిన అల్లాడయా రెడ్డి - యవన నోడించి తరిమికొట్టెను. అల్లాడ యవనుల పరాజితుల జేసెనని కొమ్ముచిక్కల తామ్రశాసనము[18] విస్పష్టముగ చెప్పినది. అజీజుల్లా తబాతబాగాని, ఫెరిస్తా గాని యీ సుల్తాన్ పరాజయము మాటయెత్తరు. "తెలంగాణాను జయింపబూని సల్తాన్ దిశపయనించి రాజమండ్రి దాక నడిచి ఆదేశమున గల ఎన్నో దుర్గములను, సీమలను పట్టుకొని, ఆ దేశమంతటిని వశమొనర్చుకొని, పాలనమున తన ప్రతినిధుల నిలిపి

తన రాజధానికి మగిజినా"డని తబాతబా(వాత[19] ఫెరిస్తా దానినతి సూక్ష్మములో ముగించెను హిజ్రీ 820 (క్రీ.శ. 1417)లో ఫిరూజ్‌షా తెలంగాణా రాయలవద్దకు కొన్నియేండ్లుగా తనకీయవలసిన కప్పమడుగుటకై తన రాయబారుల నంపగా ఆ రాయలావమాత్రమేగాక దానికి తోడుగ నవమూల్యములగు పసదనముల సైతమర్పించినాడు[20].

వేదాద్రియందు (కృష్ణాజిల్లా, నందిగామ తాలూకా) ఫిరూజ్‌షా శాసనము[21]లు రెండు శా.శ. 1339 (క్రీ.శ. 1417)లోతూర్పుసీమపై సుల్తాన్ దాడిని సమర్థించుచున్నది. అందొకటి కృష్ణాతీరాన వాడపల్లి వజీరాబాదులో నుండిన మన్నదయేలి అబీబునిదాములు మాలూకా యొక్క అనుజుడు సరఖ్మాలుకజైనది వోడేయ చెరువు త్రవ్వించెనని చెప్పునది. ఈ నిదాములు మలుక(నిజామత్ ముల్క్), ఫిరూజ్‌షా పాలనము తుదిరోజులలో వానిపై అతిగ పెత్తనము సాగించిన వాని యిర్వురు బానిసలలో నొకడగు బీదరుననతడే. రాజమండ్రిపై నెత్తిన పెదకోమటివేమునికి సాయపడ సుల్తానీ సర్దారుల నంపెననుట తథ్యము. రాజమండ్రిని పట్టుకొన వారి యభీష్టము నెఱవేరలేదు. విఫలురై వారు వెనుదిరుగ వలసి వచ్చినది.

రాజమండ్రి విషయముననే గాక ఇతరములందును పెదకోమటి వేముడనే కాపజయముల కగపడెను అన్నింటిలో రామేశ్వరము కడ నతని యోటమి దుర్భరమైనది. రామేశ్వర యుద్ధమున అల్లాడ పెదకోమటి వేమునోడించి అతని యుద్ధ సామగ్రి, సంపదల సర్వము కొల్లగొనెనని శివలీలావిలాసము[22] నుడువును. సార్వభౌమత్వ నిశ్చయకమైన సమరాంగణము రామేశ్వర[23] మెచటిదో సరిగ చెప్పలేము - ఆ పేరిటివి రెండు తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలలో రాజోలు, తణుకు తాలూకాలలోను కలవు.

## కొండవీటి రాజ్యపతనారంభము

సుల్తాన్ ఫిరూజ్ షా ఫౌజులును పెదకోమటివేముని సైన్యములను రాజమహేంద్రవరము దెసల శత్రుదళములతో పోరుచుండగా విజయనగర దేవరాయలు, అల్లాడ సాయమునకో, తన దళములతో శత్రువులను రెండు పాయలుగ తలపడెను. తన

సైన్య విన్యాసముల కూడలిగా నతడు నల్గొండ జిల్లాలోని పానగలు[24] నెన్నుకొని, యట నుండి ఒక సైన్యమును ముస్లిము భూభాగముల పైకిని మరియొక సైన్య నివహమును కొండవీటి రాజ్యములోని మోటుపల్లిని వశపరచుకొనుటకును నియోగించెను. అతని యీ ఎత్తుగడ ఫలించెను. అల్లాడ చేతిలో ఓటమి ముస్లిం పాలిత ప్రాంతములపై విజయనగర ఆక్రమణ వార్తలు ఫిరూజ్‌షాను రాజమంద్రి నుండి వెనుదిరుగ వేగిరించెను. అతని ఆశయము విజయనగర స్కంధావారమగు పానుగల్ పట్టుకొనుట. త్వరితగతి వెనుచని ముస్లింసేనలు పానుగల్‌కోటను ముట్టడించినవి.

ఈ ముట్టడి రెండేండ్లు సాగినది. ఎన్నోమార్లు దుర్గములోని సైన్యములు వెలికి నిర్గమించి ముస్లింఫౌజులనుఊమాడినవి. ముస్లిములెన్నియో యిడుములజిక్కి, మిదుకుచుండగా, పెదకోమటి వేమ ఫిరూజ్ కష్టముల కాదుకొని కొండపల్లి దుర్గాధిపతియగు తన తమ్ముడు పెదకోమటి మాచారెడ్డిని సైన్యముగ సుల్తానుకు సాయమంపెన నవచ్చును.

ఇది యిట్లు సాగుచుండగా దేవరాయలుI రాజకొండ దేవరకొండల రేచర్ల వెలమ నాయకులతో మంతనములు నెఱపెను. వారు సుల్తానుల కధీన సామంతులు. అయినను వారిబద్ధ శత్రువగు కొండవీటిరెడ్డితోడి సుల్తాన్ మైత్రికప్రియకరమైనది. వారు తూర్పు కనుమల కవలి ఫీఠభూమి తెలంగాణా ప్రభువులు. వారి భూములకాగ్నేయమున గల వాడపల్లి, వజీరాబాదులో సుల్తాన్ సర్దారుల మోహరించి యుంచుట వారిని మరింత క్రించుపరచుటగా వారు భావించిరి. సుల్తాన్ అమీర్లకు వజీర్లకును సలాంర్నిషులో నర్పుచూ, ముస్లిం మిత్రులగు రెడ్ల దళముల జాడగ తాము వ్యవహరింపవలసి వచ్చుట వారికి తలవంపులయ్యెను. కావున విజయనగరమువారి సామసంవాదములు వెలమల కాదరణీయములైనవి. వారు సుల్తాను పక్షము వదలి విజయనగరము వారికి గలయుట ముస్లిముల గోత దింపినట్లే వారు దుస్సహపరాజయమున కగ్గమైరి[25]. దేవరాయల మోటుపల్లి శాసనము[26] కొండవీటి రాజ్యమున నత్యంత ప్రధానమగు నా రేవు పట్టణము విజయనగర వశమయ్యెనని స్పష్టముగ చెప్పుచున్నది. ఇది శా.శ. 1338 (క్రీ.శ. 1416) దుర్ముఖి వర్షము నాటిది. ఆ మరు సంవత్సరపు (శా.శ. 1339/క్రీ.శ. 1417) పొన్నూరు (బాపట్ల

తాలూకా, గుంటూరు జిల్లా) శాసనము[27] కూనపులి అనవోతానాయకునిది. దానినీసందర్భమున గ్రహింపవలసియున్నది. కూనపులి వంశ్యులు పరంపరగా విజయనగరాధీనులు. కావున యీ శాసనము దేవరాయని తడవకున్నను విజయనగరము వారిదిగనే భావించవలెను. కొండవీటి రాజ్యపు ఆగ్నేయ సీమలిట్లు విజయనగరము పాలగుటతో ఆ రాజ్య పతనమారంభమాయెను.

## పెదకోమటి వేమ - రేచర్ల రాజులు

పెదకోమటివేముని పాలనము చివరి సంవత్సరములు రాజకొండి దేవరకొండల రేచర్ల నాయకుల తోడి యుద్ధమున గడచినట్లున్నవి. వెలుగోటి వారి వంశావళి పెదకోమటి వేముడును, అతని సోదరుడగు మాచయ మొక పక్షమగను, కుమార మాదా నాయకుని పుత్రులగు కుమార వేదగిరి, లింగమనేడు లొక పక్షముగను పోరుటల వర్ణించును కుమార వేదగిరి మాచారెడ్డిని సంహరించి, యతని ప్రతిమను తన పడిగముపై చెక్కించెనట[28]. తన తమ్ముని పరచిన పాటునకు వేదగిరిపై కసి తీర్చుకొనుటకు పెదకోమటివేమ యతని యుద్ధమున చంపి, అతని ప్రతిరూపమును తన పదిగముపై నిలిపెను. అంత పండ్రెండేండ్ల బాలుడు లింగమనేడు బహుళసైన్యములతో బందులతో, అనుచరులతో వెడలి పెదకోమటి వేముని తనుమాడి వాని ప్రతికృతినట్లే తన పడిగముపై మలచెను. అంతతో నిలువక పెదకోమటి వేముని సింహతలాటమును, సుప్రసిద్ధమగునతని నందికంట పోతరాజ కఠారి[29] ని సంగ్రహించి కొనిపోయెను. ఇంతచెప్పిన ఆ వెలుగోటివారి వంశావళిలోనే మరొకచోట లింగమనీడు పెదకోమటివేముని చెరగొనిపోయి[30] ఏ కారణముననో విడిచెనని, సింగయ అన్న (సింగయ కొడుకగు అన్న) పెదకోమటి వేముని రణమున పిలుకల మార్చెనని యున్నది[31].

వెలుగోటివారి వంశ చరితలో పెదకోమటివేమ లింగమనేడు సింగయ అన్నల చేతుల హతుడయ్యెననుచున్నది[32]. నిజమిదియని నిర్ణయింపలేము. బహ్మనీ విజయనగర యుద్ధమున రేచర్ల కుమార వేదగిరి మాచారెడ్డి తుదముట్టించి యుండెను. వంశావళి కథనములోని పెదకోమటి వేమునితో వేదగిరి మాచరెడ్డి తుదముట్టించియుండెను. వంశావళి కథనములోని పెదకోమటి వేమునితో వేదగిరి లింగమ నేడుల యుద్ధములు ఆ ఘటనకు పర్యవసానము కావచ్చును.

## పెదకోమటి వేముని మరణము

శా.శ. 1341 వికారినాటి రుద్రవరం దానశాసనము[33] పెదకోమటి వేముని చిట్టచివరిది మార్గశిరమాస ధనుస్సంక్రమణ పుణ్యకాలమున పెద్దియజ్వ సుతుడును గంగాధరని జ్యేష్టసోదరుడునగు రామచంద్ర జ్యొతిష్కునకు పెదకోమటి వేముడు రుద్రవర గ్రామమును అగ్రహారముగ దానమిచ్చెను. ఇది యతని చివరి దానము, అతని విద్యాధికారి శ్రీనాధునిచే రచితమగు దానపత్రములలో కడపటిదియు.

పెదకోమటివేముని పాలనము శా.శ. 1342 (క్రీ.శ. 1420) తో అంతమయ్యెననవచ్చును. అతడు యోధాగ్రేసరుడు, విద్వత్రుకాండుడు, గణనీయుడగు కవియును. గద్దెనెక్కినదాదిగ అతడు కొండవీటి హతము నరయుచు దాని యవికలతా స్వతంత్రతల పరిరక్షించుటకై, మిపుల శ్రమించెను. తనకు సంక్రమించిన రాజ్యమును విస్తరింపనేరకున్నను, దానినంతర్బహి శత్రువుల నుండి దాని కాపాడి యచ్ఛిద్రముగ తన పాలనాంతము దనుక నిలుపజాలినాడు. కాని తానును కొమరగిరి త్రొక్కిన తప్పుపుంతనే ద్రొక్కి, కృష్ణానది యుత్తరసీమకు పాలకునిగ తమ్ముని మాచారెడ్డిని నిలిపి, రాజ్యమును ద్విధా విభజించినా కానీ కొమరగిరి పాలనమున వలె పెదకోమటి వేముని కాలమున యీ విభజనము రాజ్యైకతను భంగింపకున్నను, రాజ్యమును దుర్బలము జేసి, చుట్టూనూ వేచివ బలవద్రిపులు కాళింగ గజపతులకును విజయనగర నరపతులకును గుల్బర్గా అశ్వతులకును లోననీయమొనర్చెను. బహ్మనీ సుల్తాన్‌లతో నెరపిన సంధివలన పెదకోమటి వేముడు విజయనగర రాజద్వేష్యుడైనాడు. ఆ సంధి అపవిత్రము దూష్యముననను, మిష విజయనగరము కొండవీటి నాక్రమింపనెంచుటకును సమర్థించెను.

పెదకోమటి వేముడు సమర్థుడగు పాలకుడు, చక్కని కవి, పండితుడు. సంస్కృతముననెన్నియో ప్రముఖ రచనల గావించెను. సాహిత్యమున వివిధ శాఖలలో పరిణత ప్రజ్ఞుడు. శ్రవ్యదృశ్యకావ్యములను సంగీత సాహిత్యముల శాస్త్రీయ గ్రంథములను, సంస్కృత గ్రంధములపై వ్యాఖ్యలను, రచించెను[34]. కవి పండితులయెడ అతని గౌరవౌదార్యములతి వేలములు. అతని మన్నన దానశీలతల గొనియాడు

చాటువులు సంస్కృతాంధ్రముల పెక్కులు. అందొకటి పెదకోమటి వేముని భవ్యౌదార్యమును ప్రశంసించుచునే కల్పక తలమున నాగమువలె అతనికడ తురగా రాముడు కలడగును[35]. అతని వలన పెదకోమటి వేముడు సులభముగ అభిగమ్యుడు కాజాలడయ్యెనని భావము.

1. ఆం.సా.ప.ప. X సంచిక।
2. చాటు పద్యమణి మంజరి II, p-65
3. చౌండపామాత్యుని సుతుడు నాగయమంత్రి శాసనము (శక. 1345 శో. భక్రుత్) త్రిపురాంతకమున దొరికినది (Ep. Coll. No. 255 of 1905)
4. శృంగార శ్రీనాథము pp. 12-14 అనుబంధము
5. C.P.No. 14 of 1919-20

6. తస్యానుజోవేమ నృపస్య మాచక్షితేశ్వరో లబ్ధి మహీ విభాగః
శ్రీకొండపల్లీం నిజరాజధానీం కృత్వాసుఖీ దీవ్యతిధర్మ ధుర్యః
శృంగార శ్రీనాథము, అనుబంధము, పు. 11 మాచనిబాల్యపల్లి శాసనము శక 1336

7. ఆచెంప నుద్దండ (అచ్చంపు వుద్దండ) అనవేమపురమను
గ్రామంబుతోరణ కట్టిరేని
ధరణికోటను గల్గు ధనధాన్య వస్తువు
లరికట్టుకొన చూఱలాడిరేని
మునుకొని యభిమాన ముద్ద (?) భక్షింపంగ
సారెకు జేతులు సాచిరేని
అభ్యంగనము సేయు నన్నగారికి (నన్నవేముకు) దెచ్చు
నూనెలో చెప్పులు నూటిరేని
కణగి శత్రులు (విప్రులు) సేయు నాఘాత్యమునకు
నొర్చి యుంటివి నీసాటి యుర్విగలడె
అతుల బిలభీమ పెదకోమటన్న వేమ!

8. నల చోడ భక్తేందు ననదేవరాజును
వెంపారగాంచె మీపెన్నతాత - వెలగోటి వారి వంశావళి V.122 P. 44
9. పోలవరం శాసనము Ep. Coll No. 293 of 1920
10. Ep. Coll No. 84 of 1915
11. Mack. Mss. 15-3-25

12. J.A.H.R.S. Vol. I, pp 172 ff, Ep. Ind XXVI, pp 33ff
14. S/5-2-33, Birudavali of the seventy two nayaks" చూ
Koppunullavari Birudh, See also mac. Mss. Nos. 15-5-32 and 15-4-3
15. మహాపదవీ సామంతులైన కొప్పునూళ్ళ నాయకులైన గజరావు వంశోద్భవులైన తిప్పారావు అన్నమవేడు మొదలుగా... -I dib.
16. శృం. నై. II. ప. 144
17. వెలుగోటి వారి వంశావళి పు. 39. ప. 108
18. J.A.H.R.S. III, P 228, II. 30-31 యస్సానుజతో యవనాన్ విజిత్య పౌరస్త్యబూపాల్ పరిభూయఖియ అల్లాడభూప...
19. Burhan-i-Ma-ariv, p-40
20. Briggs Ferista, Vol. II, P. 389
21. Ep. Coll. Nos. 306, 307 cf 1921
24. క్రీ.శ. 1397 లో బహ్మనీసుల్తాన్ షమ్సుద్దీన్ పాలన చివరి దినాల్లో నారాజ్యమున నంతర్యుద్ధమారంభమయ్యెను. అది యదనుగ విజయ నగర రాజు హరిరహ II రెండవ బుక్కరాయని పుత్రుని, ఇరుగప్పదండ నాథుడు తోడుగ, పానుగల్ దుర్గముపై కంపెను. పానుగలు విజయ నగరము చేత జిక్కినది. శా.శ. 1319 (క్రీ.శ. 1398) లో నాటినుండి ఆదుర్గము విజనగర వశమునసే యుండెను.

వీర శ్రీవరణోచితం హరిహరక్షోణీ పతిస్తత్సుతమ్
సామ్రాజ్య ప్రతి పాలనా పటుతర ప్రజ్ఞాబలో దంచితమ్
ధీమానిరుగ(గ్ల)ప మంత్రి వర్య మకరోద్దండాధి నాథేశ్వరమ్
విద్యావీర్య వివేక ధైర్యకరుణా సత్య క్షమాలంకృతమ్
శాకాబ్దేషు నిధీందు వహ్ని శశిభిః సమ్మిశ్రితేష్వేశ్వరే వర్షేమాసి... సహస్ర నాయని తథా పక్షేవలక్షే దినే
... శంభోర్భాస్కర వారభాజి విజితా శ్రీపానుగల్లు
తేనానేక తురుష్క వీర విజయ గ్రావావలీ వేల్లితా॥
ఇమ్మడి బుక్క మహీపతి తన యోనంత క్ష్మాపతి ర్జయతి
క్రీ.శ.మున సరియగు తేది 30 డిసెంబరు 1398, ఆదివారము Ep. Ind. Vol. XXVI, P 36 f.n.y.

25. Ep. Ind. XXVI PP 36 ff
26. పై శాసనము (Loc.Rec. Vol. XVII, pp 422-23) యింకను ప్రకటింపబడలేదు. అందు చూపిన కాలము శక 1312 దుర్ముఖియని, ఆశాసన మాధారముగా దేవరాయ I క్రీ.శ. 1390 కు పూర్వము మోటుపల్లి పర్యంతము కోస్తాసీమను వశమొనర్చుకొనెనని యందురు.

(V.C.E.p. 126) ఇది సరికాదు. అందిచ్చిన శక వత్సరము తప్పు. కాకతి గణపతి దేవుడు, కొండవీటి అనవోతారెడ్డి గారల అనేఖ్యముల బొలిన యీశాసనము మాఘశుద్ధ పాఢ్యమి శుక్రవారము నాటిదట. దుర్ముఖి వత్సరము శక 1338 యేగాని శక 1312 ఎట్లునూ గాదు. శక 1312 ప్రమోదూత యగును. దుర్ముఖి మాఘశుద్ధ పాఢ్యమి మంగళవారమగును, కాని శుక్రవారము కాదు. దుర్ముఖి యనుట స్పష్టమగుటచే నేని శాసనము శక 1338కి సరిపెట్టుచున్నాను. సంవత్సరము దెలుపు అంకెలను సరిగ చదివి యుండరని నాయూహ. ఈశాసన అంశములు దేవరాయలను గూర్చి లభించెడి యితర విషయములతో చక్కగ పొందియున్నవి.

27. S.I.I. Vol. VI, No. 118

28. వంశావళి, పుట 39 పద్యములు 105; 106; pp. 43-44 పద్య 121-122 ఈగ్రంథమున రెండవ భాగమున XIIవ అధ్యాయమున చూచునది.

29. వంశావళి పు. 39, గద్య 10

30. వంశావళి పు. 48

భువిలోన ననవేమ బూపాలు జెఱవెట్టి

యతనిని పేడ్కతో నంపినాడు ప. 126

ఈయుద్ధముల లింగయ జాతి సింగIII గూడ పాల్గొన్నట్లున్నది. పెదకోమటి వేముడు పారిపోగా సింగయ యతని తఱుముకొనెనని వంశావళి :

పుడమిని నాకాశంబున

బిదుగు కరణి రావు సింగ పృధ్వీశ్వరుడు దా

బొడు పొడుయని వెనుదగిలిన

వెడవెడ జగనొబ్బ గండ వేముడు పాఱెజేp. 57 ప. 145

31. వంశావళి 60, ప. 155

బట్టు తలాటణా బల్లరగండడై

యనవేమురెడ్డిని నాజిదునియె

32. వంశచరిత, పుటలు 57, 67

33. C.P. No. 7 OF 1919 - 20

34. ఈగ్రంధమున రెండవ భాగమున సాహిత్యముపై గల అధ్యాయమున పెదకోమటి వేముని గ్రంధముల వరుసయిచ్చి యున్నది.

35. చాటుపద్యమణి మంజరి I, పు. 34

## అనుబంధము

# రాజమహేంద్రవర రెడ్డిరాజ వంశక్రమము




1. Ep. Ind. Vol. XIII, P. 242 శ్లో
పౌత్రీం కాటయ వేమయ క్షితిపతేః పుత్త్రేంచ కాటప్రభోః
దౌహిత్రీం చతురర్ణవీం హరిహర క్షోణీపతేః శాసితుః
తన్నామ్నా విదితాహ్వయాం హరిహరాంబాం చారుమగ్రాహయ
త్పాణి ఆవేమమహీశ మల్లనృపతి స్సామ్రాజ్య లక్ష్మ్యాసమమ్!!
పండిత వేటూరి ప్రభాకర శాస్త్రి గారు పై శ్లోకము మొదటి పాదము నిట్లు సవరించినారు :
పుత్త్రేం కాటయ వేమయ క్షితిపతేః పౌత్త్రేంచ కాట ప్రభోః!!

# అధ్యాయము X

# రాచవేమారెడ్డి

## క్రీ.శ.స. 1420 నుండి సు - 1424 వరకు

పెదకోమటివేముడు గతింపగా నతని కుమారుడు రాచవేముడు రాజయ్యెను. అతని తల్లి సూరాంబ, ధాన్యవాటి ప్రభువు గన్న భూపాలుని కూతురు. రాచవేముని శాసనమేదియు నింతవరకు లభించలేదు. తల్లి సూరాంబ "సంతాన వారధి" తటాకమును నిర్మింపగా రాచవేముడు శా.శ. 1337 కు సరియగు మన్మథనామ సంవత్సరమున దానికి నీటివనరుగ "జగనొబ్బగండ కాలువ" త్రవ్వించెనని తెలుపు అమీనాబాదు శాసనము, రాచవేముని తండ్రి పెదకోమటి వేముని పాలనకు చెందును. కొండవీటి దండకవిలె కొండవీటికైఫీయత్తులు రాచవేముడు నాల్గేండ్లు పాలించెనన్నవి. అవి అతని ప్రజాపీడకునిగ చిత్రించినవి. అతడు ప్రజలను క్రూరముగ బాధించెను. క్రొత్త పీడకునిగ చిత్రించినవి. అతడు ప్రజలను క్రూరముగ బాధించెంచెను. క్రొత్త పన్నులను విధించి వాని నతి కఠినముగ రాబట్టువాడు. సత్ ప్రభువుల లక్షణములనతని యందు మందున్ననైన లేవు. అందుచే నాతడు తండ్రి పిదప ప్రబలిన విప్లవ విద్రోహ వాత్సలలో రాజ్యనౌకకు కర్ణధారి కాలేకపోయెను. గోదావరి, కృష్ణా గుంటూరు జిల్లాల గ్రామకైఫీయత్తులు కాళింగ లాంగూల గజపతి శా.శ. 1342లో కోస్తా జిల్లాలనెల్ల ఆక్రమించి కొండవీటి దుర్గమున జీర్ణస్థానముల నుద్ధరించుటేగాక అచట క్రొత్త కోటలను పెదమాలెంకోట, చినమాలెంకోటలను చెప్పుచున్నవి[1]. దీనికెచ్చటను ఎట్టి శాసనాధారమును కనము. గజపతుల కొండవీటి జయము నిజమనవలయుచో అది శా.శ. 1342 కనంతరమే జరుగవలెను. ఆ వత్సరమందో తత్పూర్వముననో కొండవీటి రాజధాని పరిసరములన్నియు విజనగరాధీనమున నున్నట్లు శా.శ. 1342 శార్వరి లో కొండవీటి సమీపస్థ పొత్తూరు (గుంటూరుజిల్లా, గుంటూరు తాలూకా) లోని దేవరాయ I శాసనము[2] నిరూపించుచున్నది. (అతని దుష్టపాలనమున వేసారి విసిగిన ప్రజల తూష్ణీంభావముచే అతడు కళింగ విజయనగరముల తాకిళ్ళ నిలువరింపనోపడయ్యెను. అతనిది నాల్గేండ్ల పాలన మన్న కొండవీటి దండకవిలె

యతని యధీన ప్రజయొకడు రాచవేముని హత్యగావించెనని తులుపుచున్నది(3). కాని దీనిని బలపఱుచు వేరు సాక్ష్యమేదీయు లేదు.

ప్రోలయవేముడు స్థాపించిన కొండవీడు రాజ్యము ఎన్నియో సూతికా గండములు గడచి గట్టెక్కి ప్రథిత యశులగు అనవేమ, కొమరగిరి రెడ్ల నాట బలవీర్యముల పరాకాష్ట నందినది. కాని ఆ ఔన్నత్యము చిరకాలము నిలిచినది కాదు. పెదకోమటి వేముని కాలములో అంతర్యుద్ధములు దానిని సంపాతమునకు దార్చినవి. అయోగ్యుడగు నతని కొడుకు రాచవేముడు అదిలయ మొందజూచెను. అతి ప్రశస్తము శతైక మాత్ర జీవనమగు రెడ్డి రాజవంశ అంతకంతకే అంతరించిపోయినది.

1. కొండవీటి కైఫియ్యతు pp 10-11

... లాంగూల గజపతి జమయ్యతు చేసుకొని కటకము మొదలుకొని ఉదయగిరి పర్యంతమున్ను గిరి దుర్గ స్థలముల నాక్రమించి ౧౩౭ శకముల గాయతు శా. ౩౭౩ శకము వరకు ౧౭ సంవత్సరములు ప్రభుత్వము చేసి దుర్గము (కొండవీడు) మరామతు చేయించి, పెదమాలెంకోట చినమాలెం కోటలనేవి కట్టించెను.

2. Ep. Coll.No. 125 of 1917 అందలి శా.శ. 1344 తప్పులు శార్వరి శ.క. 1342

3. "ఇతడు (రాజవేమారెడ్డి) తన పూర్వుల మార్గము గాని తండ్రి మార్గము గాని యవలంభింపక, తానొక క్రొత్త మార్గమవలంబించి, క్రొత్త పన్నులను విధించి ప్రజలను బాధింపు చుండెనని కొండవీటి దండకవిలె వాకొనుచున్నది. రాచవేమన ప్రజలపై పురిటి పన్ను విధించి యక్రమముగా రాబట్టు చుండెననియు తన భృత్యుడగు సవరము యెల్లయు యను బలిజ నాయకునిపై పురిటి పన్నువేసి బలాత్కారముగా వసూలు జేసినందున నాతడాగ్రహించి యొకనాడు ముత్యాలమ్మ గుడి కడ నాతనిని కతారితో బొడిచి చంపెననియు బైదండకవిలె నుడువుచున్నది." - ఆంధ్రుల చరిత్ర III pp. 243 - 244.

# అధ్యాయము XI

# రాజమహేంద్ర రాజ్యము - ప్రాచ్య రాజ్యము

రాజమహేంద్రవర రాజ్యము 14వ శతాబ్ది చతుర్ధ పాదమున పొడమినది. మొదట అద్దంకిలో, ఆ పిదప కొండవీటిలో తమ రాజ్యము ప్రతిష్ఠించినది మొదలు రెడ్డిరాజులు తమ పాలనము తీరాంధ్రమునందంతటను విస్తరింపజేసి, ముస్లిముల దురాగతముల నడగారుచున్న హిందూ ధర్మమును పునరుద్ధరింప నాశించిరి. కాని వారి యత్నములు పునః హిందూ స్వాతంత్ర్య లాభము తరువాత మరొక ఏబదేండ్లకు గాని ఆ ప్రాంతములో ఫలోన్ముఖములు కావయ్యెను. రెడ్డి రాష్ట్రమును సుస్థిరముగను సుధృడముగను తీర్చి, మార్పుగ తీరాంధ్రమున కృష్ణకు ఉత్తరమున గల సస్యశ్యామల సీమను వశపరచుకొన దండు వెడలినవాడు అనవోత I ప్రోలయవేముని చివర దినములలో అతని సుతుడనవోత పాలన మాదిని నెల్లూరు పాకనాటి రెడ్డి కుటుంబములు గోదావరీ తీరములకు వలసలు పోయి అచట స్థిరపడి యుండుట సంభవమే. అనవోత దండయాత్ర విజయుపరంపరలు ఆ తావుల రెడ్డి ప్రాధాన్యాధిపత్యమునకు చిరప్రతిష్ట గూర్పవయ్యెను. అచటి నాయకులు కొండవీటి యాధిపత్యము త్రోసిపుచ్చి స్వతంత్రులగుటకెంతో కాలము పట్టలేదు. అనవోత తమ్ముడనవేముడు రాజు కాగానే యీ పూర్వ దిగ్విజయమునతడు మరల నిర్వహించెను. నాయకులందరు నతనికి వశ్యులై కొండవీటి ఆధిపత్యము రాజమహేంద్ర వరము వరకు నవిచాల్యముగ బర్వెను. అనవేముని మృతి యనంతరము రేగిన అంతర్యుద్ధ సమయమున సైతము కొండవీటి యాధిపత్య మాభాగముల కళింగము వరకు సడలలేదు.

రాజమండ్రియు దాని పరిసర ప్రాంతములును వాస్తవముగ రెడ్లయధిని వేశములును స్థావరములునై మొదటి అనవోత రాజ్యారంభమునుండియు రెడ్డినాయక ప్రభువుల వారి యుపజీవుల యధీనములు వెలిసినవి. అట్టివారిలో రాజమహేంద్రవర మండలములోని కాటయరెడ్డి, దూవ్వూరి వంశ్యులవి ప్రధానములు. కాట I పౌత్రుడును, మారారెడ్డి పుత్రుడునగు కాట II అనవోతారెడ్డి I అనవేమ సోదరుల

సమకాలీనుడు. అతని పత్ని దొడ్డాంబిక అనవోత I సోదరి, ప్రోలయవేముని కుమార్తె. అటుగావున అతడును తండ్రి మారారెడ్డియు, రెడ్డిరాజ్యము తొలిదశలలో అధిక ప్రతిపత్తి గలవారగుటలో వింత కాదు. దువ్వూరు కుటుంబము వ్యాపకమెక్కువ. ఈ వంశ్యుడగు పెరుమాండి రెడ్డికైదుగురు వింత కాదు. దువ్వూరు కుటుంబము వ్యాపకమెక్కువ. ఈ వంశ్యుడగు పెమాండి రెడ్డి కైదుగురు కొడుకులు. ఆ సీమలోని ప్రభు కుటుంబములలో వారి వివాహస సంబంధ బాంధవ్యములు దేశరాజకీయములలో వారి ప్రాభల్యము మరింత పెంచినవి. పై సోదర పంచకమున దొడ్డారెడ్డి యేరువ ప్రభువును, భక్తిరాజ సుతుడునగు భీమదేవ చోడుని సంబంధి. దొడ్డారెడ్డి కనిష్ట సుతుడు అల్లారెడ్డి భీమదేవ చోడుని కూతురు వేమాంబను పెండ్లాడెను. అల్లారెడ్డియు, అతని యగ్రజులు అనప్రోల కాటయలును, వారి పినతండ్రులును - అందరును దువ్వూరివారే. గోదావరిలోయలో రెడ్డిరాజ్య విస్తరణమునకై సర్వ విధముల తోడ్పడిరి. ఇంత బంధు బలగములున్నందుననే రాజమహేంద్ర వరము అనవేముని మృతికి పిదప రేగిన అంతర్యుద్ధములలో సైతము అచెంచలముగ రాజకుంటుమును వెన్నుదన్ని నిలిచి కొమరగరి పక్షమున జేరి అతని శత్రువగు కాటయరెడ్డి (సుతుడు) వేమారెడ్డిని ప్రతిఘటించినది.

ఈఅంతర్యుద్ధ మదునుగా తూర్పు సీమలోగల లఘునాయుకులు పలువురు తమతమ మండలముల స్వతంత్ర ప్రభుత ప్రకటించిరి. వారిననచి మా తూర్పు పొలిమేరను పరిరక్షించుకొను నావశ్యకతను కొమరగిరి గుర్తించెను. అందుకు స్థిరసంవిధాన మేర్పరచుటకై, యువరాజ అన్నవోత II నట నిలిపి, తన ప్రధాని మహాసేనాపతియునైన కాటయవేముని ఆ తూర్పు దెస గల ప్రబువుల ననప నియమించెను. ఇందు అల్లాడ రెడ్డియు అతని సుతులు వేమయ దొడ్డలయలను మిక్కిలిగ పాల్గొనగా కాటయవేముని సైన్యములు నిరాఘాటముగ పురుషోత్తమము - పూరి జిల్లాలోని కటకము - వరకు చొరబారినవి , చిల్కసరస్తీరమున, సింహాచలమున వారు విజయస్థంభముల నిల్పిరి. సింహాచల పర్యంత దేశము రాజమండ్రి రాష్ట్రముగ గలసినది. దానినంతటిని శా.శ. 1312 (క్రీ.శ. 1390) దాపుల రాజమండ్రి రాజదానిగ రాజమహేంద్రవర రాజ్య లేక పూర్వ రాజ్యముగ ప్రకటించి కొమరగిరి తన సుతుని అనవోత II ను రాజప్రతినిధిగ నియమించెను.

## కాటయవేమ నృపతి

అంతలో అనుకొనని విధముగ ననవోత II మరణింపగా అతని స్థానమున కొమరగిరి కాటయవేముని ప్రతిష్ఠించెను. కాటయవేముని విక్రమములు కొమరగిరికంతగ తృప్తి గూర్చినవి (యస్మ్కై విక్రమ తోషితః). రాజమండ్రి రాజ్యము అతనికి బహుమతిగ నిచ్చిన దండవటము - జాగీరు - గనెన్నవలెను. శా.శ 1317 క్రీ.శ. 1395 పూర్వమే ఆప్రదేశమంతయు కాటయవేముని యధీనమున నుండినట్లతని గోపవరము శాసనము I సూచించెను. కావున అప్పటి అనవోత II మృతిజెంది యుండును. కాటయవేమునికి అల్లాడరెడ్డి దక్షిణ భుజమై అతడు వేరెడలకేగి యున్నపుడు రాజ్యవ్యవహారముల సరిజూచుచుంజెను.

కొమరగిరి చివరి వత్సరములలో పెదకోమటి వేముడు కొండివీటి రెడ్డి రాజ్యమపహించెను. కొమరగిరికై కాటయవేముడు పెదకోమటి వేమునితో పోరిపోరి విఫలుడై, కొమరగిరి తన వెంట రా రాజమండ్రికి పారిపోయెను. అచటనే కొమరగిరి యస్వస్థుడై యుండి కొంత కాలమునకు మరణించెను.

కొమరగిరి మృతితో కాటయవేమ పెదకోమటి వేముల సంబంధములు మరింత విషమించినవి. రాజమండ్రి రాజ్యము కొండవీటి అంతర్భాగమనియు, కాటయవేముడు సామంత మాత్రుడుగ తనకరివెట్టువలెనని పెదకోమటి వేముడు. కాని కాటయవేముడు సామంత మాత్రుడుగ తనకరి వెట్టువలెనని పెదకోమటి వేముడు. కాని కాటయవ్వేముడు స్వాతంత్ర్యము ప్రకటించి పెదకోమటి వేముని ప్రతిఘటించెను. వానినణచివైచి రాజమండ్రిని కొండవీటి గలుపుటకైన యతని యత్నములు, అందుకు కాటయవేముని తీవ్ర నిరోధము దేశమును మరల తీరని యంతర్యుద్ధమున ముంచివైచినది. ఈలోని పవరములోని వివిధ ఘట్టముల నిరూపించుటకు చాల ఆధారములు కానరావు.

వారట్లు పోరుచుడగా భక్తి రాజు కొడుకు, ఏఱువ ప్రభువునగు అన్నదేవ చోడుడు తాను గోల్పడిన రాజ్యమును తిరిగ సంపాదింప దొరకొనెను. రేచర్ల మాదానాయకుని వేదగిరి I అన్న దేవుని కాశ్రమిచ్చెనని వెలుగోటివారి వంశావళి నుడువుచున్నది. కావున అన్నదేవ చోడుడు దేవరకొండ ప్రభువు పెదవేదగిరి I

నాశ్రయించెననుట నిశ్చయము. అచటనుండగా బహ్మనీ సుల్తాన్ దర్బారునకు అతడు తరుచుపోవుచు, వచ్చుచు వారి ప్రాపుకై యుద్ధముల సహకరించినట్లున్నది. క్రీ.శ. 1398లో ఫిరోజ్‌షా కర్ణాటకముపై నెత్తిపోయిన తటిని సాగర్ యుద్ధముననతని కన్నదేవ చోడుడు తోడ్పడి జయమొనగూర్చెను [2]. ఇట్లు దేవరకొండ గుల్బర్గాలమైత్రి సమకూరగా అన్నదేవచోడుడు కుమారగిరి చనిపోగానే, తన రాజ్యమును బలిమిమై జయింప నుద్యమిచెను.

## అన్నదేవచోడ - కాటయవేమలు

కాటయవేముడు పెదకోమటి వేమునితో యుద్ధమున తగుల్పడి యున్న సమయమున రేచర్ల రాజసైన్యముల నడుపుచు అన్నదేవచోడుడు దేవరకొండనుండి వెడలి కళింగము వెంటగా రెడ్డిరాజ్యమున జొచ్చెను. ఆ ప్రాంతములగల రెడ్డిరాజ సామంతులగు తూర్పు చాళుక్య నాయకులతన నెదుర్కొనిరి. ఎలమంచి పాలకుడగు చాళుక్య విశ్వేశ్వరుని పంచధారల శాసనము[3]లో నొక శ్లోకము, విశ్వేశ్వరు నాస్థానకవి విన్నకోట పెద్దన రచన కావ్యాలంకార చూడామణి యందలి యొకపద్యమును, విశ్వేశ్వర ప్రభువు శక. 1324/క్రీ.శ. 1402లో సర్వసిద్ధి (విశాఖజిల్లా) కడ ఒక ఆంధ్రసైన్యమును పరాజితము జేసెనని పులుకుచున్నది. సింహాచల పర్యంతము రెడ్డిరాజ్యమే యగుటచే నా చాళుక్య విశ్వేశ్వరుడు రెడ్ల సామంతుడు గనే అన్నదేవచోడు నిలువరించెననుట నిస్సంశయము.

విశ్వేశ్వరుని చేతుల యోటమితో నిరుత్సాహిగాక అన్నదేవచోడుడు మరొకమారు తన ప్రయత్నము సాగించెను. ఈ తడవ అతడు విజయియై తన రాజ్యమునే గాక రాజమహేంద్ర రాజ్యభాగమునుగూడ కొంత సాధించెను. శక. 1326/క్రీ.శ. 1404 నాటి అతని ద్రాక్షారామ శాసనము[4] అన్నదేవ చోడుని రాజధిరాజ పరమేశ్వర, పూర్వసింహాసనాధీశ్వర బిరుదములతో సంభావించినది. కాని యీ బిరుదములు సూచించినంతగా రాజమంద్రి చిరమతని చేతుల నిలువలేదు.

శా.శ. 1326 పిదప రాజమంద్రి కాకినాడ తాలూకాలలో కాటయవేముని శాసనములు లభించినవి. శక 1327న రాజమంద్రి తాలూకా మధిరపూడి[5]లోను,

కాకినాడ తాలూకా సర్పవరమునకు[6] రాజమండ్రి తాలూకా తొట్టెడు నందును[7], శక 1328న అచ్యుతాపురమున[8]ను అతని శాసనము లభించినవి. వీని వలన రాజమండ్రి శక. 1326 తర్వాత కాటయవేము నధీన సీమయే యనుట స్పష్టము. కావున కాటయచేనోడి అన్నదేవుడు తన రాష్ట్రము గోదావరి లంకలు మోటె, పట్టెసములలో తలదాచుకొనెను. మోటె అప్పటి గోముఖగిరి లేక మోతిఘర్ భద్రాచలమున కెగువ నున్నది. పట్టెసము లేక పట్టెశగిరి ఆ నదిలోనే పోలవరము దిగువన చిన్నలంక. పోలవరమున శక 1330/క్రీ.శ. 1408 నాటి అన్నదేవ చోడుని శాసనము[9] దీనినే సూచించుచున్నది.

కాటయవేము నంతటి బలవంతుడగు శత్రువు తన పొరుగున నుండుట సైపని అన్నదేవ చోడుడు అతనినైట్లైన యడగార్చి రాజమండ్రి, రాజ్యమును కబళింప యోచించి, కాటయవేమ శత్రువగు పెదకోమటి వేమునితో సఖ్యము కుదుర్చుకొనెను.

ఇట్లు రేచెర్ల బహ్మన్ సుల్తాను లొకప్రక్కను, మరొకదెస అన్నదేవచోడ, పెదకోమటి వేమలును పొదువగా కాటయవేమనకు విధిగా బలవంతుడగు విజయనగర ప్రభువు దేవరాయ I తో సఖ్యము శరణమయ్యెను. దేవరాయ I శా.శ. 1329 న సింహాసనాసీనుడయ్యెను[10]. కాటయ వేముని అహోబల[11] శాసనము శా.శ. 1332/క్రీ.శ. 1410 విజయనగరముపైకైన అతని పయనము సూచించును. దేవరాయ నతడు కలుసుకొన్నట్లు చెప్పలేముగాని, ఆచాయములనే కొండవీటి రాజ్యమందు యిప్పటి బాపట్ల తాలూకాకు సరిహద్దు ప్రదేశము దేవరాయల ఆక్రమణ కగ్గమగుట, కాటయవేముని సంధికార్య సాఫల్యమును నిరూపించును. దాని వలన పెదకోమటి వేమ అన్నదేవ చోడసైన్యముల సంయోగము సాగకుండుటో, కాటయవేమునితో పెదకోమటి వేమ. అప్పటిక పోరుచున్నచో, కోమటి వేముని దళములలో నధిక భాగము విజయ నగరమును మార్కొనస మరలుటచే తూర్పున కాటయవేమునికి తెలిపిగల్గుటో యొనగూడినది.

ఇట్లు కాటయవేముడు కోనమండలము తోడ రాజమహేంద్రవర రాజ్యమును తన వశమున నిల్పుకనజాలెను. ఇందుకు సమర్థనములు అతని తిరుపతి[12] (పెద్దాపురం తాలూకా), కొమరగిరి పురం[13] (పిఠాపురం తాలూకా), తొత్తరమూడి[14] అమలాపురం

తాలూకా) సర్పవరం[15] (కాకినాడ తాలూకా) ములలోని క్రమముగా శా.శ. 1330, 1332, 1333, 1334, 1336 వత్సరముల శాసనములు. కావున తొట్టతొలిగా శక. 1317/క్రీ.శ. 1391లో రాజమహేంద్రవర లేక పూర్వరాజ్యమతని యధీనమయినది మొదలు, శా.శ. 1326లో స్వల్పకాలము దక్కి, ఇరువది సంవత్సరములు కాటయవేముడా సీమని పాలించెననుట నిర్వివాదము. కాని యతని శాసనములేవియు గోదావరికి దక్షిణమున నింతవరకు లభింపలేదు.

కాటయవేముడిట్లు గోదావరీ ప్రాగ్దేశమును పాలించుచుండగా అతనికి పశ్చిమమున గోదావరీ తీరభూమి[15a] అన్నదేవచోడుడు, పెదకోమటివేముని సాయముతోను, సూర్యవంశ శ్రీచక్రవర్తి[16] కొడుకును, తన బావయునగు పిన ఉండిరాజు (పిన్నుండి రాజ) సహాయ్యముతోను పరిపాలించెను. ఈ "చక్రవర్తి" ఎవరో తెలియదు. రావులపర్తి[17] తామ్ర శాసన దానకర్త ఉండీశ, లేక పెద ఉండి రాజు గనుక, యీ పిన ఉండిరాజు సూరవరమునకు చెందిన ఆ కుటుంబము వాడే. తరువాతి వాడు అయివుండును. అన్నదేవుడు గోదావరిని దాటిన కోనమండలమే. దానిపై ఎత్తి వచ్చుట అతనికి సులభము. కావున మొదట తానే గోదావరిని తాటి కాటయవేముడు అన్నదేవ చోడుని తాకెను. శా.శ. 1334 తర్వాత వారిరువురి నడుమ చెలిసిన పోరులన్నియు గోదావరికి పశ్చిమ తీరముననే యనుట రాజమండ్రి మ్యూజియం తామ్రశాసనముల వలన తెలియనగును.

## అన్నదేవ చోడుని విక్రమములు

పై పోరాటములలో కొన్నిటికి అన్నదేవ చోడుని రాజమండ్రి మ్యూజియం తామ్రపత్రములు పేర్కొన్నవి. అన్నదేవుడు జగవాగు[18] మొదలగు నరిపురముల బట్టినాడు. ఈ జగ్గవాగెటనున్నదో యేదియో యింకను తెలియరాదు. గోదావరి జిల్లా తణుకు తాలూకా అత్తిలి పొలిమేరలలో తన దాక్షిణాత్యరిపులనెల్ల నోడించి, ఆ దుర్గములో తలదాచుకొన్న పదివేల యరిసైన్యములకభయమిచ్చెను. ఇట తడవిన దాక్షిణాత్యరిపులు[19] విజయనగరమువారును వారి సామంత నాయకుమనుట స్పష్టమేయ దీనివలన గూడా కాటయవేముని సహాయ్యమున్నకై దేవరాయలు I బహుళ సైన్యము లంపెనని తెలియనౌను. అయ్యును, అన్నదేవ చోడుడే జయింపగల్గెను.

అన్నదేవచోడ కాటయవేముల ఈ దీర్ఘ యుద్ధ వ్యవసాయము నందెల్ల అత్యంత ప్రధాన సమరము కాంకరపర్తి (ఇప్పటి తణుకు తాలూకా) యొద్ద, గౌతమీ నదీ తీరమున జరిగినది. అది నిశ్చాయకమైనది. అందు కాటయవేముడును, అతని సహాయకులును పడిన భంగాపటు చెప్పనలవి గాదు. అతని జన ధన మాన నష్టములు విపరీతములు. రాజమండ్రి మ్యూజియం తామ్రపత్రములు దానినిట్లు వర్ణించినవి : "తన మిత్రుని కాపాడుటకై అతడు (అన్నదేవచోడుడు) సాహసిక యజ్ఞము గావించెను, పిన ఉండిరాజు ఆధ్వర్యుడు, గౌతమీ తీరస్థ కాంకరపర్తి యజ్ఞవేది, వేదిక యజ్ఞ పశువులు కన్నడ ముఖ శత్రువులు"[20]. ఆ తామ్ర పత్రములలో అన్నదేవ చోడుని ఆ మిత్రుడెవరో పేర్కొనలేదు. కానీ ఊహకు తగిలెడి వాడే. కొందరనుకొన్నట్లు అతడు ఫిరోజ్ బహ్మనీ కాదు. అతని తెలంగాణా దండయాత్ర ఫెరిస్తా ప్రకారము హిజ్రీ 820లో, అజీబుల్లా తబా తబా దానిని హిజ్రీలు 815-820ల మధ్య యనును. ఖాఫీ ఖాన్ హిజ్రీ 818 తర్వాత[21] ఆ దాడి నుంచును. హిజ్రీ 818 సంవత్సరము శా.శ. 1337 మన్మథ (క్రీ.శ. ఫిబ్రవరి 1416)తో అంతమై, హిజ్రీ 819 శా.శ. 1338 చైత్రము (క్రీ.శ. మార్చి 1416)తో మొదలిడును. కావున ఫిరోజ్ దాడి క్రీ.శ. 1416 తర్వాత చైత్రశక 1338లోన ఆ పిదపనో అననొప్పును. కృష్ణాజిల్లాలో ఫిరోజ్ శాసనములు కన్పట్టుటలు[22] శా.శ. 1339/ క్రీ.శ. 1417 ప్రాంతమున. అది హిజ్రీ 820 కు సరిఅగును. కావున ఫిరోజ్షా హిజ్రా 819 అంతమున - అనగా శక. 1339 ఆరంభమున తెలంగాణా పై నెత్తివచ్చి యుండును. శా.శ. 1338 మధ్యమున (1416 క్రీ.శ. ) అన్నదేవచోడుడు చనిపోయి యుండెను. అట్లుగాన కాంకరపర్తి యుద్ధమున నన్నదేవచోడ రక్షణము నందిన మిత్రుడు ఫిరోజ్షా కాజాలడు విజయనగర మన్నదేవ చోడ శత్రు స్థానము గావున ఆ మిత్రుడు దేవరాయలును గాడు. రేచర్ల నాయక ప్రభువందమాయన్న, దేవరకొండ అన్నదేవ చోడుని యెడగల పెదవేదగిరి నాటి సంభావనాదరములు యిప్పటికి తగ్గు ముఖము పట్టి యుండిన, కావున నా మిత్రుడతడును కాడు. ఇక మిగిలినది పెదకోమటి వేముడొక్కడే. కాటయవేముడు వారిర్వురికిని సమానద్వేష్యుడే. చిరము సాగిన ఈ సమరములలో నొకట దేవరాయ - కాటయవేముల యొత్తిడికి పెదకోమటి వేముడాగలేకపోగా అన్నదేవ చోడుడు పిన ఉండి రాజ సహాయుడై వెడలి

యా శత్రువుల దరిమి మిత్రుడగు పెదకోమటి వేముని గాచి యుండును. ఈ విజయము వలన గోదావరీ పశ్చిమ ప్రాంతము అన్నదేవుని వశమైనది. శా.శ. 1335(గతము) జయ సంవత్సరమున నతడు శ్రీరామమున కేగి యచటి దైవము శ్రీరామేశ్వర శ్రీ మన్మహాదేవునికి తన తల్లిదండ్రులగు అన్నదేవమ్మ భక్తిరాజుల పుణ్యావ్యాప్తికై భూముల దానమొసగెను (23 జూలై 1414)[23].

## కాటయ వేముని మృతి

ఈ యుద్ధములలో పెదకోమటి వేము పక్షమున జేరి కాటయవేముని తీవ్రముగ నెదరిచ్చిన వారు కొండవీటి సామంతులు- కొప్పునూళ్ళ నాయకులు. వీరల బిరుదము "కాటయవేముని - తలగొండ - గండ". కాటయవేముడు అన్నదేవ - చోడ పెదకోమటి వేముల తోడి యుద్ధములలో నొకట కొప్పునూళ్ళ వారి చేతుల మరణించెనని తెలుపుచున్నది.

## కాటయవేమ

కాటయవేముడెన్ని వత్సరములో జీవించెను, ఎన్నదగిన వెన్నింటినో సాధించెను. సంస్కృతము నతని పాండిత్యము ప్రగాఢము. కాళిదాస నాటక త్రయముపై కుమారగిరి రాజీయమను నతని వ్యాఖ్య అతని విద్వత్తునకెత్తిన పతాక. అతని కడ వ్రాయస కాండ్రలో రాయనిబాచ (రాయని మంత్రి భాస్కరుడు) ని సుప్రసిద్ధనొక చాటువు వర్ణించును[24]. అతని "పసిండి గంటము" నుతికెక్కినది. కాటయవేముడు రాజనీతిజ్ఞుడు, నేర్పరియైన యోధుడు. అతని విస్తార విజయ పరంపరలచే, కొండవీటి రాజన్యులలో నెవ్వరునూ సాధింపనంతగా రెడ్డి రాజ యశః ప్రతిష్టలు దిశలకెక్కినవి. కొమరగిరి పాలనలోనతడు నడిపిన సేనలు దూరాన చిల్కసరస్తీరముల కటక దేహళుల వీర విహారములు గావించినవి. కాని పెదకోమటి వేమునితో తెగ త్రెంపులెఱుగని వైరము కొండవీటి కబలన విదాబద్ధ దీక్షితులగు విజనగరము వారితో అవివేచన సంధి సఖ్యములు రెడ్డి రాజ్యమూలచ్ఛేదకములైనవి.

కాటయవేమునికి తన బావమరది కొమరగిరియన్న ప్రేముడి యెక్కువ. అతనికి మహా సచివుడుగ మహాదండ నాయకుడుగ అచంచల భక్తి ప్రత్యయములతో

వ్యవహరించెను. కొమరగిరి యానతినెన్నడును మీరక శ్రద్ధమై నెరవేర్చువాడు. తానేది వ్రాసినను, ఏమి చేసినను సర్వమును కొమరగిరి నామాంకితముగ నొనర్చెను. బ్రహ్మదేయములుగ దేవాదాయములుగ నతడిచ్చిన గ్రామములన్నియును, వాని పేర్ల కొమరగిరి పేర, నతని పుణ్యావ్యాప్తికై యొసగినవే. అహూబల శాసనమున నట్టి గ్రామములెన్నియో కనబడును. అతని కాళిదాస నాటక త్రయ వ్యాఖ్య "కొమరగిరి రాజీయము", అతని కొడుకునకు కొమరగిరి పేరే యిడెను. వ్యక్తిగా మిత్రుడిగా కాటయవేముడు సజ్జనుడు, సచ్ఛీలుడు.

కాటయవేమునికొక కొడుకు - పేరు కొమరగిరి. కూతులిర్వురు, అనితల్లి, హరిహరాంబలు, కొమరగిరి రెడ్డి సోదరి దొడ్డాంబిక వారి తల్లి. అనితల్లి అల్లాడరెడ్డి కొడుకు వీరభద్రారెడ్డిని, అతని అగ్రజుడు వేమారెడ్డిని హరిహరాంబయు వివాహమైరి. కాటయవేముడు చనిపోవునాటికి అతని కొడుకు కొమరగిరి పదేండ్లప్రాయమువాడు. తొట్టేడు శాసనము[25] అతని జన్మము శా.శ. 1405న నని చూపును. ఆ గ్రామమును కాటయవేముడు శక. 1327 లో కొడుకు కొమరగిరి పుట్టిన సందర్భమున చివుకుల మాధవ పండితునికి దానమిచ్చెను. కారణములు రాజకీయములేమోకాని, యీ కొమరగిరికి చిన్నవయసుననే పెండ్లి జరిగినది. కొమరగిరి రెడ్డి అతని వధువువారల శుభప్రాప్తికై శా.శ. 1336 (క్రీ.శ. 1414), శా.శ. 1338 (క్రీ.శ. 1416లలో యిచ్చిన దానములను దక్షారామ శాసనములు రెండు పేర్కొనుచున్నవి[26].

## అన్నదేవ చోడ - అల్లాడరెడ్డి

కాటయవేముని మరణానంతరము అతని కుటుంబము వారి నెల్ల అన్నదేవచోడుడు చెఱపట్టెను. కాని "కీర్తికాముడొటచే" వారు చరణనుత లొటచే చెఱవదల్చి రక్షించను[27]. అదెట్లులైనను, కాటయవేముని యనంతరమునను, అన్నదేవ చోడుని స్థితి మెరుగుపడలేదు. అతడు రాజమండ్రినాక్రమింపజాలడయ్యెను. కాని ఆ ప్రయత్నమును విరమింపలేదు. అతని నూతన ప్రత్యర్థి కాటయవేముని దక్షిణభుజమగు అల్లాడరెడ్డి, అతని ప్రతిరోధముచే అన్నదేవచోడ పెదకోమటివేములకు శాంతి విశ్రాంతులు కఱవయ్యెను.

అల్లాడరెడ్డి, అన్నదేవచోడుని సోదరుడగు భీమదేవచోడుని యల్లుడు. అతడు కాటయవేమునికి సన్నిహిత బంధువు, అన్నదేవ చోడునికి బద్ధ శత్రువు. అయినను అతడు కాటయవేమునికై పోడిచిన పోరుల జాడలేదు. వ్యష్టిగా అతని విక్రమములన్నియు కాటయవేముని నిర్వాణానంతరమే కాటయవేమపుత్రుని కొమరగిరి గద్దెయందు నిలిపి అల్లాడరెడ్డి రాజప్రతినిధిగా రాజమండ్రిని పాలింపసాగెను.

## అల్లాడి రాజ ప్రాతినిధ్యము (Regency)

తండ్రియనంతరము కొమరగిరి II చిరము జీవించలేదు. అకాలిమగు అతని మృతి ఎన్నో శంకలకు, ఊహలకు తావిచ్చినది. కాని వానిలో వేనికిని నిశ్చాయకములౌ ఆధారములు లేవు. కొమరగిరి మృతిచే రాజ్యస్థితి మరింత దిగజారెను. కలువచేరు శాసనమున[28] తెలిపినట్లు రెండవ కొమరగిరి చనిపోగా రాజ్యము స్వామి ద్రోహ పరాయణుల దుష్టన్నపతులచే కల్లోలితముకాగా, దానిని, ధరనువారివలె, దొడ్డయ (కొడుకు) అల్లనరేంద్రుడు సముద్ధరించి కాటయవేము సుత అనితల్లికి అప్పగించెను. కొమరగిరి II మరణించగనే అన్నదేవచోడుడు తన సహాయులతో రాజమండ్రి నాక్రమించినట్లున్నది. కోనరాష్ట్రమున బోడసకుర్తి స్థలమున "అన్నచోడ వర-మహా గ్రహారము"న్నట్లు భీమేశ్వర పురాణము[29] నుడువుచున్నది. ఆ గ్రామమునకు తన పేరిడి అన్నదేవచోడుడు దానమిచ్చియుండును. కోనసీమలో అధికభాగము అన్నదేవచోడుడు వశమొనర్చుకొనియుండును. అతనికి కాటయవేము "స్వామిద్రోహులు" సాయపడినారు. వారలందరను అల్లాడ ఓడించి పారద్రోలి యాభూములను అనితల్లి కమరించి ఆమె పేర రాజ్యమును పాలించెను. ఇందతనికెంతగనో తోడ్పడిన వారతని సుతులు వేమ, వీరభద్ర, దొడ్డయ, అన్నయలును, మంత్రియగు అరయేటి లింగనయు, పిన్నమనేని కొడుగు నరహరి లేక నరభూప దండనాయకుడును.

## అన్నదేవచోడుని మరణము

అన్నదేవుడు బహుశః అల్లాడ తోడి రణమున మరణించి యుండును. అతడు క్రీ.శ. 1414 జూలై తుదివరకు జీవించియుండెననుట కతని పాలకొల్లు[30] శాసనము ప్రమాణము. అది శా.శ. 1335 (గతము) జయవత్సరమునదని ముందే

చెప్పియున్నాము. పలివెల[31] శాసనమొకటి శక. 1338 దుర్ముఖి పుష్యమాసమునాటిది. అల్లాడ రెడ్డి ద్రోహి కులములనెల్ల నాశనముచేసి కాటయవేమ వంశ్యుల పునఃరాజ్యప్రతిష్ఠుల జేసినాడన్నది. అతని సేనాపతి నరహరినేడు "శ్రీమత్ దొడ్డయ - యల్లభూతల పతేః రాజ్య ప్రతిష్ఠాకు"డని శక. 1338 దుర్ముఖి శ్రావణ మాస గత పాలకొల్లు శాసనము[32] కొనియాడినది. కావున అన్నదేవచోడుడు జూలై 1414-ఆగష్టు 1416ల నడుమ ప్రాయశః శక. 1337 (1417 ఎ.డి.లో) మృతి జెందియుండును. అన్నదేవుని కొడుకు సైతమాదరిదాపులనే మరణించెను.

## అల్లాడ రెడ్డి - పెదకోమటి వేమ

అల్లాడరెడ్డి కింకను పెదకోమటి వేమునితో పోరు మిగిలియే యుండెను. కాని యంతలో నతనికి క్రొత్త తావుల క్రొత్త వైరుల తలసూపిరి. పూర్వ పశ్చిమములనుండి గజపతి నరపతులు (ఒరిస్సా, కర్ణాట) రాజమహేంద్రవరము త్రోసి నడచిరని వారితో అల్లాడరెడ్డి చెలిమి గావించుకొనెనని అల్లాడ (కొడుకు) వేమయవేమ-వరపు తామ్ర శాసనము తెలుపుచున్నది. (మైత్రీ కృత్య సమాగతం గజపతిం కర్ణాట భూపంచతం). వారి రాక శాత్రవముననే అల్లాడ విజనగరముతో అనవోతారెడ్డి కొమ్ముచిక్కాల[33] తామ్రపట్టికలలో అల్లాడరెడ్డి పౌరస్త్యభూపుల (తూర్పురాజుల) జయించెనని యున్నది. ఆ పిదప మాత్రము అల్లాడ గజపతులతోనెయ్యమునే పాటించెను.

ఇట్లు విక్షేపముల తొలగించుకొని అల్లాడ రెడ్డి తన దృష్టిని పెదకోమటి వేమునిపై కేంద్రీకరించెను. అన్నదేవ చోడుని మృతితో తన బలము సన్నగిలుటయు, పొరుగున విజయనగరము తన భంగమునే వాంఛించుటయు నెరిగిన పెదకోమటికి బహ్మాన్ ఫిరోజ్‌షా సహాయ్యమర్థించెను. అతని సచివుడు మామిడి సింగన్న[34] గుల్బర్గా కేగి ఆ సఖ్యమును సాధించెను. ఫిరోజ్ తన బానిస వజీర్ ని జాముల్ముల్క్‌ను బహుళసైన్యములతో తెలంగాణా పై కంపెను. కృష్ణాజిల్లా నందిగామ తాలూకా వాడపల్లిలోని యతని శాసనములు[35] ముస్లిముల యీ దండయాత్ర శక. 1339 (క్రీ.శ. 1417) ప్రారంభము)న నని స్థిరపరచుచున్నవి.

అజీజుల్లా తబా తబా యీ దండయాత్రను వివరముగా వర్ణించెను. రాజమహేంద్రవరమును పట్టుకొనుటకే సుల్తాన్ వెనుదిరిగిపోయెను. ఈ తిరోగమనమునకు ప్రధాన కారణములు రెండు. (1) అదే సమయమున విజయనగర దేవరాయలు దేవరకొండకొండవీడులపై నెత్తివచ్చుట. అల్లాడరెడ్డి తోడి సఖ్యము వలన తూర్పు మొగమున నతని యుద్ధ భారమును సడల్చుటకై విజయనగరము వారి సంవిధానమది. కొండవీటి సైన్యములు చాల పశ్చిమమునకు తరలినవి. బాపట్ల తాలూకా లోని దేవరాయని శాసనములు విజయనగర ధాటి తూర్పు తీర పర్యంతము పర్నివదని విశదము చేయును. అంతేగాక కొన్నేండ్లుగ విజనగర వశమున నున్న పానుగులు విజయస్కంధావరము వెడలి రాయల సైన్యములు రేచర్ల భూములను సుల్తాన్ పరిగణాలను రాచి వెంపరలాడగా, రాజమండ్రి నుండి సుల్తాను పౌజులు వెనుదిరుగక తప్పలేదు. అదియును గాక (2) రాజమండ్రి మొగను తురకలు ఘో పరాజయము పాలైరి. అనవోతని కొమ్మ చిక్కల తామ్ర శాసనము[36] అల్లాడరెడ్డి యవనులకోటమి ఘటించెనను. కాని యాఘటన ఎప్పటిదో చెప్పదు. కాని బహ్మన్ షా తెలంగాణాపై నెత్తిపోవుట నొకేసారి, అదియు హిజ్రా 820/క్రీ.శ. 1417 కావున యవనుల పరాజయము క్రీ.శ. 1417 పరమార్థమున నిర్ణయింపవచ్చును. ఫెరోజ్షా విరుగుటతో నిస్సహాయుడగు పెదకోమటివేముని, అల్లాడ రెడ్డి రామేశ్వర యుద్ధమున మరల (భూయః), మరల (భూయః) అనుటచే అల్లాడరెడ్డి చేతుల పెదకోమటి వేముడోడుటిది మొదటి తడవగాదనుట ఎన్ని మారులో!

అల్లాడరెడ్డి విజయము మరొకటి, అది అలఫ్ ఖానునిపై శివలీలావిలాస కాశీఖండములు అల్లాడరెడ్డి జయించినది ధారానగర సుల్తాన్ నన్నవి గాని వేమవర శాసనము విజితుడలఫ్ ఖాననియే పేర్కొన్నది. నిజమునకీ రెండును ఒకే ఘట్టమునకు చెందినవి. దిలావర్ఖాన్ తనయుడలఫ్ తన తండ్రి అలఫ్ఖాన్ తరువాత హిజ్రి808/ క్రీ.శ. 1408లో మాల్వా సింహాసన మధిష్టించినపుడు సుల్తాన్ హుషంగ్షా యన్న పేరుదాల్చెను. వాని రాజధాని ధారా పట్టణము. అల్లాడ యోడించినదతనినే. ఇది శక. 1341కి ముందు, అల్లాడరెడ్డి చివరి దగు పాలకోట శాసనాత్పూర్వము[37].

## అల్లాడ మరణము

పై జెప్పిన పాలకొల్లు శాసనమున నారభూపాలుడు మాఘమాసమందు (క్రీ.శ. 1420, ఫిబ్రవరి) అల్లాడేశ్వర (శిలా) లింగమును ప్రతిష్టించి దానికభిషేకోత్సమొనర్చెనని యున్నది. ఆ రోజులలో యిట్టి లింగ ప్రతిష్టలు మృతుల నధికరించి జరుపు నాచారముండెడిది. తన జీవిత కాలముననే తనపేర నట్టి ప్రతిష్ఠ గావించి దానిపై గుడి కట్టించుటయు కలదు. మొదటి పద్ధతి యైనచో మృతునికై యితరులొనర్చెడివారు, రెండవ దాన అట్టిది ఆ వ్యక్తి స్వయమొనర్చుట విధి. శక. 1341 తర్వాత అల్లాడ శాసనములు మృగ్యములగుటయు పైలింగ ప్రతిష్ఠ అతని యధీనుయగావించుటయు చూడ ఆ శాసన కాలమునాటికి (ఫిబ్రవరి 1420), కాక కొద్ది ముందుగనో, అల్లాడ చనిపోయెననవచ్చును. అగుచో ధారానగర సుల్తాన్ హూషంగ్షాను అల్లాడ యోడించుట క్రీ.శ. 1420 దరిదాపులనై యుండును. కాని ఈ సమరమెట్లు సంభవించెనో, ఎప్పుడో, ఎచ్చటనో నిర్ధారింపలేము[38]. అల్లాడరెడ్డి తన సర్వశక్తులను జీవితమును రాజమహేంద్రవర రాజ్య స్వేచ్ఛా స్వాస్థ్యములకు వినియోగించెను. శత్రువర్గమునెల్ల నిర్జించి, రాజ్యము క్షీణముగ తన ప్రభువు బాంధవుడునైన కాటయవేముని వంశమునిల్పి అతని ఒకే యొక ఔరస అనితల్ల కర్పించి ఆ పై ప్రతినిధిగా రాజ్యము పాలించెను. అనితల్లి తన రెండవ కోడలు, వీరభద్రారెడ్డి భార్య. కావున అల్లాడ యత్నము రాజమహేంద్రవర రాజ్యమును తన వంశమున నిల్పుకొనుటకయ్యెను. అందతడు పూర్ణుగ సఫలుడయ్యెను.

## కుమారగిరి III - అనవోత III

తండ్రి అల్లాడరెడ్డి చనిపోగానే, అతని తనయులలో పెద్దవాడు వేమారెడ్డి రాజమండ్రి పాలనము చేబట్టెనన్న యభిప్రాయమే ప్రచలితమైనది. కానిరెడ్డి రాజ శాసనముల గాఢ పరిశీలనము దానిని సమర్థించదు.

అల్లాడ రెడ్డి చివరి శాసనము శక. 1341 (క్రీ.శ. 1420) లో అనితల్లీ వీరభద్రారెడ్డి తొలి శాసనము శక. 1345 (క్రీ.శ. 1423) నాటిది[39]. ఈ

నాల్గేండ్ల అంతరము ఆ రాజత్వమును విధిగ సూచింపదనవచ్చును. కాని శక. 1345 పూర్వము అల్లాడ తనయుల శాసనములేవియు లేమికి సమాధానము వలదా? విశేషించి యీ అంతరమున అనవోతారెడ్డి తామ్రశాసన మొకటి[40] శిలాశాసనము[41] మరొకటి లభించియున్నవి. రెండును శక. 1344 (క్రీ.శ. 1422) నకు చెందినవే. ఈ అనవోతారెడ్డి అనప్రోలారెడ్డి సుతుడును, అల్లాడ రెడ్డి కగ్రజుడును. ఈ శాసనములు అల్లాడరెడ్డి పిదప అనప్రోలారెడ్డి కొడుకులు, కొమరగిరి III అనవోత III - యిర్వురు రాజమంద్రి నాక్రమించి పాలించుటను సూచించును. ఇందలి కొమరగిరి శక. 1344 నకే మరణించెను. అతని పుణ్యావ్యాప్తికై అప్పుడు అనవోత III దానమిచ్చిన గ్రామమునకు నూతనముగ "అనప్రోల-కొమరగిరి పుర"మని పేరిడిరి[42]. అన్నమరణింపగా అనవోత III రాజయ్యెను.

పై రెండి శాసనములును గోదావరికి పశ్చిమము నరసాపుర భీమవరము తాలూకాలలో దొరకుటచే ఆ యిర్వురు సోదరుల పాలనము ఆ ప్రాంతములకే పరిమితమని వాదింపవచ్చును. కాని వారు రాజమంద్రిని పాలించి రనుటకు గట్టి కారణమే కలదు. వేమవరం తామ్ర శాసనము అనప్రోలారెడ్డి - కొమరగిరిపుర[43] ముగ్రామ గ్రాసపు ఊరును పేర్కొన్నది. అదియొక పుంత-వెదురు పాక, పిన మహేంద్ర వాడల కలిపి ఏర్పరిచిన వేమవరము ఎల్లల్లలో నొకటి ఈ "అనప్రోలారెడ్డి - కొమరగిరి పురము", తన అన్న పుణ్యావ్యాప్తికై అనవోత III బ్రాహ్మణులకు దానమిచ్చినది కాకపోవచ్చును. కాని "అనప్రోలారెడ్డి - కొమరగిరి పురము" తూర్పుగోదావరి రామచంద్రాపురము తాలూకాలోనిది. కావున అనప్రోల కొడుకు అనవోత యధీనమున తూర్పు గోదావరియు నుండెననుట[44] స్పష్టము. కొమ్ముచిక్కల తామ్ర పట్టికలురాజమంద్రిని అనవోతారెడ్డి వాసభూమిగ[45] వర్ణించినవి. (ఆసీత్ రాజమహేంద్రనామ నగరం యస్యప్రభోర్వాస భూః) కొమరగిరి III లు రాజమంద్రి నాక్రమించుట నింద్యమని కాబోలు, కాశీఖండ, శివలీలావిలాసములు పెరుమాండి రెడ్డి వంశానుక్రమము వివరించు పట్ల ఆ సోదరులు స్పృశింపలేదు.

కాని బలవంతులు సమర్థులైన అల్లాడ రెడ్డి కొమరులు వేమారెడ్డి ప్రభుతులుండగా, కుమారగిరి రెడ్డి III, అనవోతా III సోదరులు సింహాసనా రోహణము

వెట్లు సంభవించెను? తీరాంధ్ర దేశమున గ్రామ ముల కైఫియత్తులదెల్ల పంపరగా నొక్క కథనము గాన నగును. కొండవీటి పతనానంతరము - కైఫియత్తు కదిశక. 1341-2 న కళింగ దేశపు లాంగూల గజపతి రెడ్లను తఱిమి ఆ ప్రదేశములను తర్వాత తర్వాత విజనగరమాక్రమించు పర్యంథము, తన పాలన సాగించెను. గజపతిచే రాజమండ్రి యాక్రమణము శక. 1342 నని కైఫియత్ లేక కంఠముగ నుడువును. కాని అట విజయనగరాక్రమణ కవి భిన్నభిన్న కాలముల సూచించును. వానిలో చిట్టచివరిది శక. 1364[46] కొన్ని కైఫియత్తులీలాంగూల గజపతిని నరసింహ లేక లాంగూల నరసింహయన్నవి[47]. ఇది సరికాదు. నరసింహ IV అంతకు పదేండ్లు పూర్వమే శక. 1331[48]లో చనిపోయెను. అతని కొమరుడు భానుదేవ IV, అతనిని నిశ్శంక భానుదేవుడనియు నందురు. అల్లాడరెడ్డికి, అతని సుతులకు సమకాలీనుడు, ఈ నాల్గవ భానుదేవునికి , నరసింహ లేక లాంగూల నరసింహ నామ సుతుడొకడున్నట్లు వినము. చరిత్ర కల్పమగు గంగ వంశాను చరితము"న నిట్లున్నది: కళింగ గాంగ రాజు కజ్జల భానుదేవు పశ్చిమ దేశ జయమునకై దండెత్తిపోయి, ఇంకను అచటనే యుండగా, కళింగమున విప్లవమేచి కపిలేశ్వరుడు కటక సింహాసన మధిరోహించెను. కైఫియత్తులన్నియు కజ్జల భానుదేవునే నిశ్శకభానునిగా భ్రమించి కజ్జిలు దాడినే నిశ్శంకునిదిగా వ్యవహరించినవేమో. ఈ గజపతి దండయాత్రకును, శక. 1341-2లో అల్లాడ అన్నకొడుకు సింహాసనాసీనతలకును ఏదో పరోక్ష సంబంధముండును. కొమరగిరి III అన్నవోత III లు గజపతి సాయమున రాజులై గజపతి సామంతులై యుండుటయు సంభవమే.

ఆ పిదప కాలమున అల్లాడరెడ్డి కొడుకు వేముడు గజపతికి బహుశః దక్షిణకళింగ మప్పగించి సఖ్యమొనరించి శక. 1345లో అనప్రోల సుతుల దోలి రాజమహేంద్రమున పునః తమ అధికారమును ప్రతిష్ఠించి యుండును. నామమాత్రమునకైనను అతడు గజపతి సామంతుని వలె వర్తించి యుండును.

## వీరభద్రారెడ్డి పాలనము

ఇట్లు రాజమహేంద్రవర రాజ్యమును తిరిగి సంపాదించి వేముడచట రాజుగ తమ్ముడును, అనితల్లి భర్తయు నగు వీరభద్రుని అభిషేకించెను. అట్లని శివలీలా

విలాస కాశీఖండములు స్పష్టము చేసినవి. అల్లయ వేముడును కాటయవేమునకల్లుడే కాని సింహాసనమునకు న్యాయముగ ఉత్తరాధికారి గాడు. తమ్ముని వారసత్వము వేముడు స్థిరీకరించినాడు. వీరభద్రుని భార్య అనితల్లి దొడ్డాంబిక తనయయుగటచే అనవోతారెడ్డి దౌహిత్రియు కొండవీటి కొమరగిరి I సోదరియును. తల్లివైపు కొండవీటి అనవోతారెడ్డికి సాక్షాత్, క్రమాగత సంతానమే గాక కాటయవేముని కుమార్తెయు, రాజ్యమునకు మిగిలిన ఏకమాత్ర అంశభాగ. ఆమె మూలముగ వీరభద్రారెడ్డికి రాజ్యాధికారము రూఢము. వీరభద్రారెడ్డి రాజుగ అభిషిక్తుడై, వేమారెడ్డియే సకల పాలనా వ్యవహారముల నడపెడివాడు. రాజగు వీరభద్రునివియు, వేమారెడ్డివియు, శాసనములు శక. 1345 (1423 ఎ.డి.) నుండి శక. 1356 (1434 ఎ.డి.) వరకు పరివ్యాప్తములై యున్నవి.

దక్షిణ కళింగ నష్టము వేమారెడ్డి హృదయమును వేధించుచునే యుండెను. తరుణమునకై అతడు వేచియుండగా అనుకోని యొకఘటన తటస్థించినది. కొండవీటి కైఫియత్[49] అనుసారము విజయనగర పాలకులు శక. 1353 లో గజపతి నోడించిరి. శక. 1253 సరియని తోచదు. సింహాచలమున విజయనగర సామంతుడగు తెలుంగు రాయని శాసనకాలమ శక. 1350[50] విజయనగర రాజులు తీర దేశమును జయించిన దప్పుడేయనుకొననౌను. దేవరాయ II యొక్క ముదబిదురె శాసనము, శక. 1351 సౌమ్య వర్షము నాటిది, పై నిర్ణయమును సమర్థించుచున్నది. పై శాసనము దేవరాయలను మాతంగరాజ సిందూర వరకోటి మర్దన మృగేశ్వరమ్ ఆంధ్రనరేంద్ర సైన్య సాగర కలశోద్భవమ్, విజయరాయ తనూభవ - దేవభూవరమ్[51] అని కొనియాడినది. విజయానంతరము తెలుంగు రాయలు సింహాచలముననే నిలిచిపోయి యుండుట రూఢియే. ఈ రణ సముద్యమమున రెడ్డి ప్రభువుల పూర్వ రాజ్య కబళమున విజయనగరమునకు వెలమ నాయకులు తోడ్పడియే యుందురు. దేవరకొండ కుమార మాదానేడు కుమారుడు లింగయనేడు అల్లయ వేమ వీరభద్రుల నోడించి రాజమంద్రి రాజ్యమును రాచిపైచి సింహాసనమును పట్టినాడని వెలుగోటి వారి వంశావళి[52] నుడవును. శక. 1339(1417 ఎ.డి.) నుండి అనగా పానుగల్లు విజయనగరమునుకు చేజిక్కినది మొదలుగా రేచర్ల వారు విజయనగరము వారితో మైత్రి పాచింటుచుండిరి. కావున యీ విజనగరము వారి దండయాత్రా సందర్భమున వారి పక్షమున లింగమనేడు

విక్రమించుటబ్బురముగాదు. విజయనగర రాజసింహాసనమును శక. 1346(1424) లో ప్రౌఢదేవరాయ లేక దేవరాయ II అల్లయవేముని సమకాలికుడు, రెడ్డి రాజ్యముల పూర్ణ్ణగ సాధించి కొండవీడును విజయనగరమున గలిపి వైచినాడు. నాటినుండి విజయనగర రాజపూర్వ్వ వధి సింహాసనము వేమ వీర భద్రులు విజయనగర సామంతులైరి.

వేముడు రాజ్యపాలనా దక్షుడు. అతని మంత్రి బెండపూడి అన్నయకు శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణము కృతినిచ్చెను. అప్పటి పరిస్థితులలో తన తండ్రి అల్లాడ అనుసరించిన మార్గమే అనుకూలమని దానినే అవలంబించి వేముడు ఇరుగు పొరుగు రాజులతో చెలిమినే పాటించ యత్నించెను. పేరుకు విజనగర విధేయుడైనను, కార్యముల తన స్వాతంత్రమును చెదరనీయలేదు. కోల్పోయిన దక్షిణ కళింగమును తిరుగ రాబట్టుకొను నాశయము నెట్టులో శక. 1352 తర్వాత అతని కాలమునకే ఫలింపజేయగల్గెను. వేము, వీరభద్రుల సింహాచల శాసనములు[53] దానినే నిర్ధారించును. సింహాచలమున భానుదేవ IV గజపతి చివరి శాసనము[54] శ. 1352 కావున, ఆ పిదప శక. 1352 మధ్యమమున దక్షిణ కళింగము రెడ్డిరాజ హస్తగతమైనదనవలె, శక. 1352 లో కపిలేశ్వరుడు భానుదేవ IVను పదచ్యుతుని గావించెను. గనుక శక. 1356 నాటి వేముని సింహాచల శాసనము అతడు కలువలపల్లి, ఒడ్డాది, పాట్నూరు ఆది గ్రామములందు దేవాదాయ, బ్రహ్మోదాయముల పన్నుల విస్తరించెనని తెల్పు చున్నది. వీరభద్రుని శాసనము కాలమను తెల్పదు గాని అతడు శత్రుసేనల తిరోగమనము సాధించుటకు కొనియాడును.

## వీరభద్రుని చరమ దినములు

రాజమహేంద్రవర రాజ్య చమర ఘట్టములు అజేయములు గనే ఉండిపోయినవి. దాని పతనమునకు దారితీసిన పరిస్థితిలెట్టివో అవిదితములే. ఉన్న ఆధారములతో రాజకీయముగ రాజమండ్రి తిరోధానము ఇప్పుడనిశ్చయింపలేము. శక 1356 పౌషమాసానంతరము అల్లాడ వంశ్యుల శాసనము లేవియు గానరావు. శక. 1359 పింగళ ఫాల్గుణ మప్పటి రెండు శాసనములు అనధికార వ్యక్తులవి[55] వేమ వీరభద్రుల

యుపకృతుల దానముల ప్రశంసించినది. అప్పటికింకను వీరభద్రారెడ్డి రాజుగనే యుండినచో రెడ్ల పూర్వాద్రిరాజ్య విలయమునకు ఆపై కొలది వత్సరములైన జరిగియుండును. ఆ మినుకు లింకను కననయ్యేనుటకు కారణము శక. 1366 రక్తాక్షిలోనే దేవరాయ II శాసనము ఆ వైపుల దక్షారామమున గన్పించినది[56].

క్రీ.శ. 1435-5 లో కటకమున కపిలేశ్వరుడు రాజగుటలో ఆంధ్రదేశమందలి రాజకీయ స్థితి మారిపోయినది. కాలేశ్వర గజపతి మిక్కిలి శక్తివంతుడు, తన రాజ్యమును ఆద్యంతము విస్తరింప జేయవలెనన్నది అతని జీవితాశయము, ఆకాంక్ష. దక్షిణ కళింగము విజయనగర విధేయుల యధీనమున నుండుట అతడు సహించలేదు. విజయనగరమునెడ అతడికి స్పర్ధ ఎక్కువ. దక్షిణ కళింగమునే గాక రాజమహేంద్రవర రాజ్యమును గూడ వశము జేసుకొన యత్నించెను. రాజమండ్రి రెడ్డి రాజులకు సాయపడుటకై దేవరాయ II, మల్లప్ప ఒడెయారును బహుళ సైన్యములతో పంపెను, కపిలేశ్వర గజపతినరికట్టుటకే అయ్యుండును. దేవరాయని దక్షారామ శాసనమున చివరి పంక్తులు కొన్ని చెరిగి పోయినవి[57]. అవి మెకంజీ ప్రతులలో భద్రపరచియున్నవి. అవి సరికావనుకోనక్కరలేదు. ఆ పంక్తులు శాసనమున తెలుపుదానము అల్లయవేమారెడ్డి ఆనతి మేరకని[58] విశదపరచుచున్నవి. ఆ కారణముగనే వేమవీరభద్రులు శక. 1366 వరకు జీవించియే యుండిరని, విజయనగర పక్షమున ఆ ప్రదేశములు పాలించుచుండిరని చెప్పనైనది.

గజపతినరపతుల సంఘర్షనడుమ రాజమండ్రి రాజ్యము నలిగి యడగారిపోయెను. చివరకు గజపతిదే పైచేయియైనది. దేవరాయ దాక్షారామ శాసనకాలము తర్వాత నాలుగేండ్లకే రాజమహేంద్రవర రాజ్యమున కపిలేశ్వర గజపతి శాసనములు కననైనవి. తణుకు తాలూకాలోని పెనుగొండ యందొక శాసనము[59] శక. 1370, విభవకు చెందినది అచ్చట గజపతి క్షోణేశునిపాలనమును సూచించినది. రెడ్డిరాజ పాలనమంతటితో అంతరించినది.

# ఆధారములు

1. J.A.H.R.S. Vol. XI, pp 211 ff
శా.శ. 1313 నాటి కాటయవేముని తామ్రపత్ర శాసనమొకటి యింత వరకు ప్రకటింపనిది కలదు (Mac. Mss. No. 15-4-4, pp 283-84) అందు కాటయ వేముని సంతకమున్నది. దీనిలో చెప్పిన దానమిచ్చినది పుష్యశుద్ధ 10 గురువారమున కాలము సరికాదు. అది మంగళ వారము. వత్సరము 1313 గతమై 1314 వర్తమానమైనది. సంతకము కాటయవేముని దౌటచే కుమారగిరి పుత్త్రుడనవోత॥ అప్పటికే చనిపోయి, కాటయవేము పూర్వరాజ్య పాలకుడు నియమితుడయ్యెనను శంకకు తావిచ్చుచున్నది.
2. Ep. Ind. Vol. XXVI,p29
3. Ep. Ind. XIX, p 170, verse 24, Vol. XXV, pp 335-36, S.I.I.VI. No. 665.
4. S.I.I. Vol. IV, Nos. 1347 and 1348
5. Mack, MSS. 15.4.4, Loc. Rec-Vol. II, P 212 శా.శ. 1327 తప్పు 1326 సరి. తారణ పుష్య బ౧౧౦. మి. గురువారము, మకర సంక్రమణ సందర్భము క్రీ.శ. 27.12.1404 అది శనివారము, గురువారము కాదు.
6. Mack. Mss. 15-5-36 శా.శ. 1327 పార్థివలో, నిజాషాఢ శుక్ల ఏకాదశి, బుధవారమున కాటయ వేముడు కుమారగిరి పుణ్యావాప్తికై, సర్పవరమున వసంతరాయ మండపమును కట్టించినాడు. దానికి సరియగు తేది క్రీ.శ. 1405 జులై 8.
7. Mack. Mss. 15-4-4, pp. 278-79, ఇది కాటయవేముని తామ్ర పత్ర శాసనము "శ్రీ శాకేగిరి నేత్ర వహ్నిశశిభిర్గణ్యే శరద్యుత్తమే కృష్ణే పార్థిన నామ్ని చందిరదినే వారే గురోఃవారేగురోః ఫాల్గుణే"
8. Mack.I Mss. 15-5-36, p 325 శా.శ. 1328 సర్వజిత్, మాఘ కృష్ణ చతుర్దశి గురువారమున కాటయవేముడు కుమారగిరి పుణ్యావాప్తికై యొసగిన దాన శాసనము. సర్వజిత్‌నకు సరియగు శకవత్సరము 1329 శాసన కాలము క్రీ.శ. 1408 జనవరి 12, గురువారము.
9. Ep. Coll No. 293 of 1920
10. Ind. Ant. Vol. XXIV P. 204, No. 304 admote Mack. Mss. 15-3-25 ఇందిచ్చిన పట్టాభిషేక కాలము శా.శ. 1329 సర్వజిత్ గురువారం కార్తిక బహుళ 10. వారము గురువారము కాదు. అది బుధవారము (26 అక్టోబరు 1407)
11. Ep. Coll. No. 84 of 1915
12. S.I.I. Vol. I.V., No. 103
13. "రెడ్డి రాణి" Vol. II (1924, అక్టోబరు) PP. 33ff. ఇది తామ్రశాసనము. కాలము మాఘమాస శుక్ల 15 న సరసింహులను ఆయుర్వేద వైద్యునకు కొమరగిరిపుర గ్రామ దానము తెల్పును. కాలము నిశ్చయము సాధ్యముకాదు.
14. Ep. Ind. Vol. IV PP. 318 ff
15. S.I.I. Vol. V., No. 20, Saka 1334 of No. 2 of శక 1336
ఈరెండు సర్పవర శాసనములను కాటయవేమునివే.

15.a. పాపికొండలు మొదలు రాజమండ్రి దాటి చాల దూరము వరకు గోర్వాం ఉత్తరము నుండి దక్షిణమునకు ప్రవహించును.
16. Ep. Ind. XXVI., P.44. II, 28-29
17. CP. No. 16 of 1917
18. Ep. Ind. XXVI, PP. 31. 34
19. Ep. Ind. XXVI, P. 34 fim
20. Ep. Ind. XXVI, P. 16
21. Ep. Ind XXVI, PP. 85-86
22. Ep. Coll.Nos. 306, 307 of 1924
23. S.I.I Vol. No. 145 శక 1336 వర్తమాన జయవత్సరము
24. "కలము పసింఢి గంటమున గాటయ వేమ సమక్షమందు సత్ఫలముగ రాయని ప్రభుని బావదు వ్రాసిన వ్రాలమ్రోతలున్ గలుగలుగల్లుగల్లురన్ గంటక మంత్రుల గుండెలన్ని యున్ జలుజలు జల్లుజల్లురని సత్కవివర్యులు మేలుమేలన - చాటు పద్య మణి మంజరి I.p. 76
25. వావూంక స్థరవుః ప్రతీత విభవః పద్మాసస్థోజగన్నాధ శ్రీకువూరాద్రిరెడ్డ జనఘోష్ఠి జయత్యభ్యుతః Mac. Mss. No. 15-4-4.
26. Ep. Ind. Vol IV, B.PP. 329; and C.PP. 330
27. Ep. Ind. XXVI P. 45
పాదాంబుజ ప్రణత కాటయవేమ వంతః ......... సమరక్షియేవ
సోయం విభాతి శరణాగత భూపరక్షా!
దీక్షా గురుర్జయతి చోడకులాన్న దేవః!!
28. భారతి XXI Pt. I, p. 556, VV. 45, 46
29. భీమేశ్వర పురాణము, I ప. 64.
30. S.I.I. Vol. V, No. 145 శాసన కాలము శక 1335 (గత) జయవత్సర శ్రావణ శు. 6 సోమవారము (క్రీ.శ. 23 జులై 1414)
31. S.I.I V.No. 113- గతే దివం కాటయవేమ భూపే నిర్మూల్య తద్ద్రోహి కులం సమస్తం
32. S.I.I. V, No. 133
శకాబ్దే వసుమూర్తి రామ రజనీ నాథైశ్చ గణ్యే గతే
స్యాతే దుర్ముఖి వత్సరేచ విలసన్ మాస్యుత్తమే శ్రావణే!
శ్రీమద్దొడ్డయ యడ్ల భూతల పతేః రాజ్యప్రతిష్ఠాప కోమంచెల్లాఖ్య పురీశ్వరో నరహరిః పిన్న క్షితేశాత్మజః
33. J.A.H.R.S.Vol. III, P. 328
34. "మామిడి సింగన పారశీ భాషలో గొప్పవక్త. శృంగారనైషధము II ప. 144 అతనిని యవనాధీశ సభానిరంకుశ వచో వ్యాపార సారంగతా" అని సంబోధించును.
35. Ep. Coll. No.s 306 : 307 of 1924
36. J.A.H.R.S. Vol. III, P. 228- "యస్యానుజాతో యవనాన్విజిత్య"

37. S.I.I.I Vo.I. V, No. 135. దీని కాలము క్రీ.శ. 1420, ఫిబ్రవరి 4 ఆదివారమునను సరివచ్చును. 3వ పంక్తిలోని "తద్భుత్యను తత్పుత్రో "గ సరిదిద్దవలెను – PP - 13-14 లలో నారభూపుని పిన్నయ నారణః పిన్నయ కొడుకు నారనయని యున్నందున.

38. కాని ఊహింప సాధ్యమే. అల్లాడ సచివుడు లింగన రాజమండ్రిలో తన ప్రభుపాలనమును, యవన కర్ణాట గజపతులతో చెలిమి వాటించి సుకరము చేసెను. (భీమేశ్వర పురాణం I ప 627) ఈ యవనులు బహ్మనులుగారు వారెవరో భీమేశ్వర పురాణము వలన తెలియవచ్చును. లింగన తమ్ముడు బెండపూడి అన్నయ పారసీలిపిని చాల చక్కగ వ్రాయునట. అతని లిఖితమును అల్లయ వేమారెడ్డి రాజ్య సమృద్ధి వృద్ధులకై అహమ్మద్‌షా దర్బారు కంపెడివారట. అహమ్మద్‌షాలపుడిద్దరుండిరి. ఒకరు బహ్మన్ ఫిరోజ్‌షా తమ్ముడు క్రీ.శ. 1422 మొదలు 1435 వరకు రాజ్యమేలినవాడు. కాని యతడు అల్లాడ ప్రత్యర్థి పెదకోమటి వేముని మిత్రుడ కావున అల్లాడ మిత్రుడు హమ్మద్‌షా హిజ్రీ 814-1411లో గద్దె నెక్కిన గుజరాత్ వాడే కావలె. అతడిప్పుడును ధారా నగరేశుడు హుషంగ్‌షాతో పోరాడెడివాడు.

39. S.I.I. Vol. V, No 109

40. J.A.H.R.S. Vol. III, PP. 323 ff

41. S.I.I. Vol. V, No. 127

42. ఈగ్రామ దానము కొమ్ము చిక్కల తామ్ర శాసనము తెలుపుచున్నది.

43. Ep. Ind. Vol. XIII, P. 250, II, 211 - 212

44. సర్వవరము కడ క్రీ.శ. 1421 నాటి అనవోతారెడ్డి శిలాశాసనమును రాబర్ట్ స్యూమెల్ గుర్తించి యున్నాడు.
(Ant. I, 24; ii, 59)

45. J.A.H.R.S. Vol. V, 229; I, 42

46. Loc. Rec. Vol. Lx, P. 216

47. Loc. Rec. Vol. Lx, P. 75

48. నరసింహ IV తనయుడు భానుదేవ IV యొక్క తొల్టతొలి శాసనము శ్రీ కూర్మము నందలిది (S.I.I.V. 1205) కాళింగ శకము (పొరపాటున శకాబ్దమన్నారు). 3వ అంక, (శక 1333) రవి (12) బాణ (5) సాగర (4) - 4512 వత్సరము నాటిది. అతడు రాజ్యమునకు వచ్చినది శక 1331లో ఆపిదప సన్నిహిత శాసనము శక 1336 నాటి సింహాచల శాసనము (S.I.I. Vol. VI No. 1115)

49. కొండవీటి కైఫియత్ pp. 10-11
"తదనంతరము గజపతి సింహాసనస్థుడైన లాంగూల గజపతేః " జమియ్యాతు చేసుకొని కటకము మొదలుకొని వుదయగిరి పర్యంతమున్ను గిరి దుర్గస్థలములు ఆక్రమించి శా. 1342 శకము లగాయతు శా. 1353 రకము వరకు ౧౨ సంవత్సరములు ప్రభుత్వము చేసి...

50. S.I.I. Vol. VI, No. 905 షష్టివత్సర చక్రమున నవి కీలక గాని అందునట్లు ప్లవంగ కాదు.

51. S.I.I. Vol. VII No. 202 (Cp. Co4. No. 33 of 1901)

52. వెలుగోటి వంశావళి; 110, 112, 118, 126
చటులో గ్రగతి రాయ శరభమై యవలీల, దిరుగసింహాద్రి సాధిచినాడు గంగ సాతిగ సాటి కదిసి రాజమహేంద్రవరము మూఅలుగొని వచ్చినాడు వీరభద్రుని దొడ్డ విభువేమ నృపతుల రట్టడై కాలందె బెట్టినాడు.

53. S.I.I. Vol. VI, Nos. 1168, 1169

54. S.I.I. Vol. VI, No. 784

55. S.I.I.I Vol. IV Nos. 1352 of 1355

56. S.I.I. Vol. IV, No. 1375

57. స్తంభము మూడు ప్రక్కల గల 40 పంక్తులే ప్రకటితము లైనవి (S.I.I. Vol. IV, No. 1375) చివరి పంక్తులుండగల నాల్గవ ప్రక్క కట్టడమున కలిసిపోయినది.

58. Loc. Rec : Vol. II, P. 157 - శాసనము యీక్రింది విధముగ ముగియును న..... సర్వమాన్యంగాను అల్లాడ్రెడ్డి వేమారెడ్డింగారి అజ్ఞను సమర్పణ చేస్తిమి

59. Mac. Mss. No. 15-44. Rec. Vol. II, P. 200
శాకాబ్దే గగనాద్రి రామ ధరణీ సంఖ్యా సమాపూరితే
వభవాబ్దేచ తపస్య మాసి శశినో వారే ద్వితేయంతి థౌ
పెన్గొండాఖ్య పురోత్తమం గజపతి సందీపితమ్.

## అధ్యాయము XII

# కందుకూరు రాజ్య చరిత్ర

ఆంధ్రదేశపు ఆది చరిత్రలో నెల్లూరు జిల్లాలోని కందుకూరు చాలగనే ప్రశస్తికెక్కినది. తూర్పు సముద్రతీరము నుండి "బోయవిహార దేశము" వరకు గల ప్రదేశము కందుకూరు సీమ. ఇప్పటి ఆత్మకూరు, ఉదయగిరి, కనిగిరి తాలూకాలను మరికొంత ప్రదేశమును కలిసినది బోయ విహార దేశము, కొండలు కోనలు బలసిన యాస్థలములలో చాలగనే దుర్గములు పట్టణములు (బోయవీడులు) వెలసియుండినవి. బోయ నాయకులు వారి వారి వీడులలో సర్వస్వతంత్రులు. తీర దేశమునుండి తమపై నెత్తివచ్చిన వారిని తరిమి కొట్టుటే కాక వారియూళ్ళపై బడి తఱచు దోచెడివారు.

9వ శతాబ్దమున తూర్పు చాళుక్య మూడవ విజయాదిత్యుని సచివుడును, దండనాయకుడు నైన పండరంగ, తొలిసారిగ వారి నణచివైచి, వారిని పూర్వ చాళుక్యాధీనుల జేసినవాడు. అచటి కందుకూరువేంగీ ఆ చాళుక్యులకు దక్షిణ విజయస్కందా వారముగ తీరినది. అప్పటి నుండి శతాబ్దముల బడి కందుకూరు ప్రాశస్త్యము సాగుచునే యున్నది.

11, 12 శతాబ్దములలో కందుకూరు సీమ విక్రమసింహపుర (నెల్లూరు) తెలుగుచోడుల యధీనమై ఆ పిదప తెలుగు చోడుల తోడుత తానును వరంగల్ కాకతీయుల వశమైనది.

ఓరుగల్లు పతనానంతరము దేశమున అవ్యవస్థ ప్రబలినది. కృష్ణా దక్షిణ భూములలో తన యాధిక్యము ప్రతిష్ఠించు యత్నమున మగ్నుడు ప్రోలయవేమునికి తనచిన తమ్ముడు మల్లారెడ్డి సహకారము పూర్ణముగ లభించినది. ప్రోలయవేముని మల్లవరము[1] శాసనమతని తమ్ముని మల్ల సేనాపతి యని హరివంశమతిని "మల్లరధినీనాధ" పేర్కొన్నవి. మల్లారెడ్డి సాధించిన వానిలో నత్యంత ప్రధానము మోటుపల్లిని జయించుటే[2]. తెలుగుదేశము జొచ్చి తీర పర్యంతము సాగిన అల్లాయుద్దీన్ హసన్ బహ్మన్‌షా పటాలములను అతడు త్రిప్పికొట్టి[3], నిర్మాణ దశలోనున్న రాజ్యమును

పరిరక్షించెను. ప్రోలయవేముని సోదరులలో జ్యేష్ఠుడు ధనదపురము లేక చందనవోలు ఆ రాజధానిగ ఉత్తర రాష్ట్రములకును కనిష్ఠుడగు మల్లారెడ్డి కందుకూరు ముఖ్య పట్టణముగ దక్షిణ రాష్ట్రములకును రక్షణ బారము వహించిరి.

లభ్యములగు కందుకూరు రెడ్ల శాసనములు అల్ప సంఖ్యలు, అందు చారిత్రకాంశములు అరుదు. తటాక దేవాలయ నిర్మాణముల దేవ బ్రాహ్మణులకొసగిన దానములనే గాని, సమకాలీనులగు పొరుగు రాజులను ముఖ్యముగ కొండవీటి ప్రభువులను, ప్రస్తావించవు. ఈ కారణముగ కందుకూరు రెడ్లు స్వతంత్రులుగ వ్యవహరించిరనవచ్చును.

మల్లారెడ్డి శాసనములు రెండు[4] అందొకటి[5] శక. 1246 చెప్పబడినది. ఈ యొక్కటి గాక కందుకూరి వారి తొలి తొలి శాసనములన్నియు శక. 1320, 1322 ల నాటివి, మల్లారెడ్డి పౌత్రుడును, పినకోమటిరెడ్డి పుత్రుడు నగు శ్రీగిరి రెడ్డికి చెందినవి[6].

వారి శాసనముల బట్టి చూడ కందుకూరు రెడ్ల ప్రాముఖ్యము 14వ శతాబ్దాంతమునకు గాని ప్రఖ్యాతము కాలేదనవచ్చును. కొమరగిరి రెడ్డి చివరి వత్సరములలోని అరాచక స్థితులలో పినకోమటివేముని సుతులు స్వాతంత్రము ప్రకటించిరి.

కందుకూరు రాజ్యము పరిధుల సరిగ న్నిర్ణయింప వీలుగాదు. మల్లారెడ్డి సంతతి వారిని ఆ ఉన్న కొలది శాసనముల వ్యాప్తిని బట్టి వారి రాష్ట్ర విస్తీర్ణమును గుర్తింపవలసియున్నది. అవియన్నియు నెల్లూరు జిల్లాలోనివే. కందుకూరు లోను కందుకూరు తాలూకాలోని ప్రాతచుండి యుందును దొరికినవి. అవిగాక మల్లారెడ్డి పౌత్రుడును, మాచా రెడ్డి పుత్రుడునగు కోమటిరెడ్డి II పెదపూడి తామ్రశాసనమనమొక్కటే యొకటి యున్నది, కాని ఆ తామ్ర పత్రములు నష్టములైవాని ప్రతి మెకంజీ వ్రాతప్రతులలో నొకటి కనబడుచున్నది. అది పెదపూడి గ్రామమును శక. 1326 తారణ మాఘ, గురువారము సోమోపరాగ సమయమున, కౌశిక గోత్ర షడ్దర్శనాల వల్లభయజ్వకును, శాండిల్య గోత్ర యెల్లేపెద్ది లక్ష్మణ దీక్షితులకును

అగ్రహారముగ దానమొసగుటను తెల్పును[7]. కాలగణనము న పొరపాటు. పెదపూడియు దాని పొలిమేరల గ్రామములు, అమృతలూరు, తాడిపర్తి, ఆలపాడు, మూలుపూరు, ముండూరు, లన్నియును గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోనివి. కందుకూరు రెడ్ల శాసనము గుంటూరు జిల్లాలోనిది యొక్కటే. శక. 1326 కు ముందు వెనుకలు గూడ వారి మరి యే యితర శాసనము లేనందున విజయనగరము వలనియుపద్రవకాలమున కోమటి II కొండవీటిని ధిక్కరించి తెనాలి వరకూ తీరభూమిని ఆక్రమించెనని యూహింపవలసియున్నది. అదియును స్వల్ప కాలము మాత్రమే. శకత 1334 (1324?), శక. 1326 లలో క్రమముగా ఆలపాడు, కసువుకుఱ్ఱు గ్రామములను బ్రాహ్మణ పండితులకు పెదకోమటి వేముడు దానమిచ్చెను[8]. ఆలపాటి పెదపాడు పొలిమేర గ్రామము, కసువు కుఱ్ఱు బాపట్ల తాలూకాలోని పొన్నూరు పరిసరములలోనిది. కావున కందుకూరి కోమటివేమ II తీరాంధ్రదేశము తాత్కాలికమే యనుట సిద్ధము.

## కందుకూరు రెడ్ల వంశక్రమము

కందుకూరు రెడ్ల వంశక్రమము సుదీర్ఘముగ పై జెప్పిన పెదపూడి దాన శాసనముననను, మల్లారెడ్డి సంతతి వాడగు శివలింగ భూపతి రచించిన గిరీశ శృతి సూక్తి మాలా వ్యాఖ్య యందును కనిపించును. వ్యాఖ్యలో శివలింగ భూపతి, అతని సోదరుడు సోమేశ్వరుడు[9] మరికొందరి పేర్లు కూడా కలవు. దొరికిన ఇతర శాసనముల గూడా ఉపయోగించినచో కందుకూరి వారి వంశక్రమమిట్లు తేలుచున్నది.




పై పట్టిక సిద్ధపరచుటలో నెల్లూరు జిల్లాకు వెలుపల కనుపించిన నాల్గు శాసనములను కూడా పరికించుటైనది. వానిలో మూడు కడపజిల్లాలోను, (రెండు లేపాక, ఒకటి టంగుటూరు- రెండును రాజంపేట తాలూకాలోనివే). నాల్గవది చంగల్పట్టు జిల్లాలోని కాంజీవరం తాలూకాలోని దామల్ వద్దను లభించినవి. టంగుటూరు శాసనము శ. 1328 నాటిది. మల్లారెడ్డి పుత్రుడు (పౌత్రు)డనవలెను[22]. అన్నారెడ్డిది లేపాకలో శక. 1329[23] శక. 1335 వత్సరములవి. అన్నారెడి సుతుడు మల్లారెడ్డివి[24] ఈ అన్నారెడ్డియే టంగుటూరు శాసనదానకర్త. దామల్ దానశాసనము[25] మల్లని పౌత్రుడును మాచపుత్రుడుగు గణపతి రెడ్డిది. ఇతర రెడ్ల సామాన్య బిరుదములకితడు ఒళుదిలం పట్టు స్థాపనాచార్య యన్నది జోడించినాడు.

# కందుకూరు రెడ్ల చరిత్ర

కందుకూరు శాఖ రెడ్ల గూర్చి తెలిసినది అల్పాల్పము. ఆ నాయకులు తమ శాసనములలో అద్దంకినే గాని కొండవీటిని ప్రస్తావించరు. ఇప్పటికే తెలిపినట్లు వారిలో రాజకీయముల ఎన్నికైన మొదటివాడు శ్రీగిరిరెడ్డి, మల్లారెడ్డి పినకోమటి రెడ్డి కొడుకు, అతనిని రెండు శాసనములు శక 1320 లోని కందుకూరు[26] శాసనము శ. 1323 లోని కొండ ముడుసుపాళెం[27] శాసనము. కందుకూరు శాసనము తెల్పునట్లు అతడు పినకోమటికి గౌరాంబిక యందు జనించినవాడు జ్యేష్ఠపుత్రుడు. అతడు శిల్ప సాహిత్యముల విమర్శ జ్ఞానము గలవాడు.

అతనికి సంగీత సాహిత్యముల అందము తెలియును. ప్రాత చుండిలోని[28] యొక శాసనమతనిని కళావాణి ప్రశంసించినది. అతడు సస్యభర ప్రశస్త్యముల అనేక సహస్ర - అబ్ధి సమాన గాంభీర్య మహాతటాకములను నిర్మించెను. హేమాద్రినుత దానములన్నియు చెల్లించినాడు. ఘొడెయ రాయ సంతతి వాడగు శ్రీగిరి యతని గురువు[29]. రాజశ్రీ గిరి పాలనము విశిష్ఠ ఘటనా పూర్ణము. రెండవ కోమటి పెదపూడి శాసనమతని తండ్రి మాచ అరిది విలుకాండ్రయిన తురుష్కుల నాత్మ రాష్ట్రమునుండి తరిమివైచినాడని తెల్పుచున్నది[30]. దీనివలన కందుకూరు రాజ్యముపై యవనులు దండెత్తిరనుట స్పష్టము. ఎపుడో తెలుపలేదు కాని, శక. 1326 లేక క్రీ.శ. 1404కు పూర్వమే. అప్పటికి దక్కనులో నున్న ఒకే ఒక ముస్లిము రాజ్యము బహ్మన్ సుల్తానులది. 23 సఫర్ హిజ్రా 800 (15 నవంబరు, 1397)[31]లో ఫిరోజ్ గుల్బర్గా సుల్తానయ్యెను. శ్రీగిరి సోదరుడును, రెండవ కోమటి తండ్రియునైన మాచ ఫిరోజ్‌షా సమకాలికుడు. హిజ్రా 801-2 (క్రీ.శ. 1398-99) లో ఫిరోజ్ విజయనగరముపై దాడి వెడలెనని ముస్లిమ్ చరిత్రకారులు చెప్పుచున్నారు. "విజయనగర రాజ్య జయము సంకల్పించె"నని అజీజుల్లా తబా తబా సత్వరముగనే ఫిరోజ్ ఆ దిశకు సైన్యములతో వెళ్ళి ఆ ప్రాంతముల కాఫిరుల చంపి యద్ధగించెను. వారి రాజు దేవదర్ (దేవరాయ) సుల్తాన్‌తో సంధి వేడి ఏటేట నిర్ణీతమైన కప్పమును సుల్తాను సన్నిధి కంపి కోశాధ్యక్షునుండి రసీదు పుచ్చుకొనుట కంగీరించెను[32]. అంత ఫిరోజ్‌షా

తన రాజధానికి మరలిపోయెను. ఫెరిస్తా కథనము వేరు. అతని ప్రకారము గుల్బర్గా-విజయనగర పోరాటక కారణము. ముప్పది వేల అశ్వికులతో, అసంఖ్యాక పదాతులతో దేవరాయులు కృష్ణా-తుంగభద్రాల మధ్య దేశముపై దండెత్తుటే. అది హిజ్రా 801[33] (శక. 1320-క్రీ.శ. 1398 లో లోనైనది. యుద్ధ పర్యవసానము ఆ యిర్వురు చారిత్రకులును ఒకేరీతి వర్ణించిరి. ఓటమి దేవరాయనికే. ఫెరిస్తా వ్రాతః సంది సంవాదముచాల నడచిన తరువాత (ఫిరోజ్ తరుపున) మీర్ ఫజులుల్లా బందీల పరిక్రయ మూల్యంగా సుల్తాన్ ఖజానాకు పది లక్షల హూన్నులను, సంధి వ్యవహర్తగా తనకు ఒక లక్ష హోన్నుల పుచ్చుకొనుట కంగీకరించెను[34] . వారి వ్రాతలెట్లున్నను, యదార్థముగ ఫిరోజ్ యుద్ధముననోడి తన రాజధానికి పలాయనము చిత్తగించెననుట కాధారములు లేకపోలేదు.

ప్రస్తుతము ఫిరోజ్ విజయనగరముపై దాడి వెడలుట ప్రధానము. యవనులు కందుకూరుకై పొరలుట లీ సందర్భముననే యనవచ్చును. అగుచో పెదపూడి శాసనము చాటిన వూచని యువన విజయువు శక. 1320 (1398 ఎ.డి.) ప్రాంతములగావలెను. శ్రీగిరి సోదరుడగు రాచవేముడు యుద్ధమున నోడి వెనుదిరిగి పారిపోవమని బాస చేసిన శత్రువులను (సంశప్తకాన్ సపత్నాక) తన హరి (అశ్వ) బలసాయమున జయించెనని కందుకూరు శాసనము[35] నుడివినది. ఈ శత్రువులు ముస్లిములే అయియుందురు.

రెడ్లకెట్లో అట్లే రాయలకును ముస్లిములు శత్రువులే అయ్యును, రెడ్లు రాయలు వారి ప్రాత పగల మరచి ఒకటిగ వ్యవహరింపరైరి. రెడ్లు రాయలను పరమశత్రునిగ గణించిరి. ఇర్వురును ఒండొరుల రాజ్యముల నంతఃకలహముల దౌర్బల్యముల తమ తమ స్వార్థములకై యుపయోగించుకొన్నవారే. హరి హర II చనిపోగా[36] విజయనగర సింహాసనముకై హరిహరుని కొడుకులు విరూపణ్ణ ఒడైయార్ I బుక II దేవరాయులు తమలో కలహించుకొనిరి[37]. ఆ తరుణమున కందుకూరు రెడ్లు తమ పడమటనున్న ఉదయగిరి రాజ్యమును ఆక్రమింపజూచిరి, సిద్ధవటం మండలమున దగు పొత్తపినాడును, చంద్రగిరి సీమలోని పులుగుల నాడును వశపరచుకొనిరి. స్థానిక వృత్తాంతములో వారు చిత్తూరు జిల్లాలో రాయచోటి (అదే తాలూకా ముఖ్య పట్టణము) వరకు

చొచ్చుకొనిపోయి రాచవేడు దుర్గమును ముట్టడించి, రక్తప్లావితదూషిత యుద్ధము చివర దానిని "స్వాధీన పరచు"కొని రని వ్రాసియున్నది[38]. ఈ దండయాత్ర నాయకులు శ్రీగిరి సోదరుడు అన్నారెడ్డియు, అతని కొడుకు మూడవ మల్లారెడ్డియు. కందుకూరు వారు ఉదయగిరి రాజ్యమున ప్రవేశించుటను అన్నారెడ్డి మల్లారెడ్డి టుంగుటూరు లేపాక శాసనములు[39] సమర్థించును. శక. 1328 (అన్నారెడ్డి శాసనకాలము) నదగు ఈదాడి ఫలితముగ శిథిలములు ప్రధ్వంసితములగు గ్రామములనెన్నింటినో లోకల్‌రికార్డ్స్ పేర్కొన్నవి.

ఈ దండయాత్ర సాగుచున్న సమయముననే శ్రీగిరి పాలన మంతరించి యతని స్థానే శ్రీగిరి యనుజుడు మాచ II పుత్రుడు కోమటి II రాజాయెను. పై చెప్పిన పెదపూడి శాసనకర్త అతడే. పెదతండ్రి అన్నారెడ్డి పొత్తపి ముఖ దేశముల స్వాధీన పఱచుకొనుచుండగా, కోమటి II తన యధికారమును కోస్తా ప్రాంతముల విస్తరింపజేసెను. ఉదయగిరి మండలము ఏడేండ్ల కాలము కందుకూరు రెడ్ల వశమున నుండినది. లేపాకలో మల్లారెడ్డి చివరి శాసనము శక. 1335 (క్రీ.శ. 1413)

కోమటి II కొడుకులు, సోమేశ, శివలింగ యనువారు, వారి శాసనములేవియు లభించవు. వారిర్వురిలో శివలింగసంస్కృతమున గొప్ప పండితుడు హరిదత్తాచారని గిరీశ శ్రుతిసూక్తిమాల పై అతని వ్యాఖ్య రచించెను. కోమటి II పాలించు తఱిని అతని పెద తండ్రి కొడుకు మల్లారెడ్డియు అతని అనుజులును చుండినగరమును తమ యధినివేశనము జేసికొనిరి. మల్లనివి దొరికిన కొలది శాసనములన్నియు లభించినవచటనే. అవి శక. 1328[40] శక. 1330[41] లకు చెందినవి. అతడు జనార్దన దేవునకు గోపుర మండప ప్రాకారములతోడి గుడిని కట్టించి దేవాదాయముగ దానికి భూముల దానము జేసెను. అతడు గంగాంబ వలన శ్రీగిరికి జనియించినవాడు. అతనియు, అతని తమ్ములయు శాసనముల పౌర్వాపరములు నిశ్చయకములైనచో శ్రీగిరి పుత్రులలో మల్లారెడ్డియే జ్యేష్ఠుడు[42].

మల్లారెడ్డి సోదరుడు కోమటి III పాలించుచుండగా విజయనగర దేవరాయలు తన కోల్పోయిన సీమల తిరుగగైకొనుటకును, కందుకూరు రాజ్యమును ముట్టడించుటకునునై బహుళసైన్యములతో వారిని తలపడెను. విజయము దేవ రాయలదే.

స్థానిక వృత్తాంతములు చెప్పినట్లు దేవరాయలొక పెద్దసేనను ఉదయగిరి నుండి చంద్రగిరి సిద్ధవటంసీమల కాపాడుటకై పంపెను. మూడవ మల్లారెడ్డి దేవరాయలకు లోబడెను. విజయనగర సార్వభౌమత్వమచట పునఃప్రతిష్టితమాయెను[43] శక. 1335 (క్రీ.శ. 1413) నుండి పదునేడేండ్లు కందుకూరు రెడ్ల శాసనములాతావుల కన్పట్టవు. ఆ రెడ్ల చివరి శాసనము శక. 1352 సాధారణ వత్సరమునది చుండి[44] శాసనము. అందలి విశేషము మూడవకోమటి సుతులైదుగురు - తిప్ప, శ్రీగిరి, రామ, దేవరాయ, నారాయణదేవులు - కలసి తుంగభద్రానదీ తటమున విరూపాక్ష దేవుని సన్నిధిని (అనగా విజయనగరముననే) భూదాన మిచ్చుటలు. అటుపై స్వతంత్రులు కందుకూరు రెడ్డి ప్రభువులు లేరు, విజయనగర వశవర్తులేగాని.

## ఆధారములు


1. N.I.D. III, 0., P. 1022 ff
2. హరివంశము I.P.
3. Mac. Mss. 15-4-42; కోమటిరెడ్డి పెదపూడి దాన శాసనము
4. N.D.I. Vol II. Kr. 34, P. 546; Kr. 15, P. 489
5. N.D.I. II, Kr. 15
6. N.D.I.II. Kr. 35, P. 549; Kr. 43, P. 568 : Kr. 43 విక్రయ సంవత్సరము నది. ఇచ్చి సంవత్సరము 1222 తప్పు. అది 1322 చూ. Mote and P. 568 II
7. ఇండియన్ ఎఫెమెరిస్ ప్రకారము మాంసులో చంద్రగ్రహణము శక. P. 325 స్వభానులోనే గాని శక. 1326 తారణలో గాదు. స్వభానులో దాని సరియగు తేది 27 జనవరి 1404 A.D.
8. CP. No. 6 OF 1908-d9-ఆలపాడు దాన శాసనము : Loc. Res. Vol. 48 PP. 48ff. కసువు కుఱ్ఱు దాన శాసనము.
10. N.D.I. II, Kr. 15, p. 489; Kr. 34, p. 546
11. Ibid : Kr. 35, P. 549
12. Ibid : Kr. 43, P. 568
13. Es. Coll. No. 11: of

14. Mac. Mss. 15-4-42. అతని పెదతండ్రి రాచవేమ పినతండ్రి అన్నదేవ, పెదపూడి శాసనమున వేమయని, అన్నవేమయని పేర్కొనబడిరి.
15. Ep. Coll. No. 433 of 1911 : Ep. Reg 1912, Para 69
16. N.D.I.C.P. No. 5. P. 23
17. Ibid, II Kr. 13, P. 502; Kr. 19, P. 505; Kr. 21, P. 515
18. Ep. Coll. No. 422 of 1911
19. Ibid, No. 42 of 1911
20. N.D.I. II, Kr. 68, P.608
21. Ibid Kr. 16, P. 495
22. Ep. Coll. 433 of 1911; Ep. Rep. 1912, para 69, P. 81. దీని ప్రతి యొకటి (Local. Rec. Vol. 22, P. 166) దానకర్తలు లఅద్దంకి సింహాసనా ధీశ్వరులైన వేమారెడ్డి గారి తమ్ముడు పెరుమాళ్ల రెడ్డింగారి పుత్రులు చన్నారెడ్డి, అన్నారెడ్డి, మల్లారెడ్డి గార్లని తెలుపుచున్నది. వేమారెడ్డి తమ్ముడు మల్లారెడ్డి-పెరుమాళ్ళ రెడ్డి యనుట పొరబాటు కావచ్చు. Local Records లోని ప్రతి Ep. Rep. లోని ప్రతి చెతిగియున్నది. కాని రెండు ప్రతులును సంవత్సరము శ. 1328 వ్యయనియే యున్నది. Ep. Rep. ప్రతిప్రకారము దానకర్త మల్లని పుత్రుడు అన్నారెడ్డి, కాని యీరెడ్ల శాసనములలో మల్లారెడ్డికి అన్నారెడ్డి యను కొడుకు లేడు. అన్నాదేవ రెడ్డి, పినకోమటి వేముని పుత్రుడు మల్లారెడ్డి పౌత్రుడు కలడు. బహుశ. Ep. Rep. లోని టంగుటూరు శాసన ప్రతిలోని దానకర్త అతడే కావచ్చును.
23. ఈశాసనముల ప్రతుల Local Records లో భద్రపఱుపబడియున్నవి. శతాబ్ద సంఖ్య ఆశాసన ప్రతి అంధలిది. Ep. Rep. లో అది 13 (30)గ అగపడును.
24. Ep. Coll. 422; 422 of 1911. Mac. No. 1538 PP. 8587 Ep. Rep. లోని యీశాసన దానకర్తలు Loc. Rec. ప్రతులలోని వారికి బిన్నులుగా కన్పట్టెదరు.

ఉదా:- బుక్క పట్టణంకై ఫియత్తులో దానకర్త రఅద్దంకి నగర సంస్థానాధీశ్వరులైన చెన్నారెడ్డి, అన్నారెడ్డి, మల్లారెడ్డింగారు అద్దంకి చెన్నారెడ్డి సుతుడైన అన్నారెడ్డి కొడుకు మల్లారెడ్డి. పైపేర్కొన్న లేపాక శాసనపు మల్లారెడ్డియే యీకైఫియత్ మల్లారెడ్డి కాని లేపాక మల్లారెడ్డి టంగుటూరు శాసనపు దాత అన్నారెడ్డి కొడుకు. Local Records ప్రతిలోని అన్నారెడ్డి, చెన్నారెడ్డి సుతుడు, మల్లారెడ్డి మనుమడు. కాని కందుకూరు రెడ్ల శాసనము లేవియు మల్లారెడ్డి కొడుకు చెన్నారెడ్డిని పలుకవు. చెన్న శ్రీగిరి స్థానముననో, లేక చిన్నరెడ్డి బదులో కావచ్చును. ఈచిన్నరెడ్డి పినకోమటియైన కావచ్చును. టంగుటూరు శాసనముల ప్రతులు మెంజీ ప్రాత ప్రతులలోను : స్థానిక వృత్తాంతములలోను తప్పుల తడకలు.
25. Ep. Coll. No. 115 of 1923 : Ep. Rep. 1923, Para 95.

26. N.D.I. Kr. 35.
27. N.D.I. Kr. 43
28. N.D.I. Kr. 19, p 505
29. N.D.I. Kr. 35 లిఖిత మిట్లు - శ్రీమద్-వాదియరాయ- శ్రీగిరి గురోః-
పాదాబ్జసేవా పరం (P 555, ప. 8). అది వాదియరాయగాదు ఘొదెయరాయ :
30. Mac. Mss. 15-4-42. మూలములోని శ్లోకముట్లున్నది.

ధానుష్య ధౌరేయ తమఃతురుష్క
ప్రాపయ్య నిష్కాసన మాత్మ రాష్ట్రాత్
నిష్కంటకం సర్వభావం వ్యధత్త
సమాచ బూపో భుజవైభవేన

31. J.B.O.R.S. XXVII (1941)
32. J.S. King : 'History of the Bahmuny Dyastny' P. 37
33. Brigg's Ferishta. Vol. II, P. 370
34. Brigg's Ferishta II. P. 375
35. N.D.I. II. Kr. 35, V. 15
36. Ep. Rep. 1921, P. 46
37. Ep. Rep. 1921, P. 46; 1932, P. 34
38. Loc. Rec. XXII; చిట్టి వేల్లికై ఫయిత్తు, పు. 166-172; Vol. XVII, పు. 178-79; బుక్క పట్టణంకై ఫయిత్తు.
39. Ep. Coll. No. 3. 433, 422, 424 of 1911
40. N.D.I. I, C.P.:No. 5, p23
41. N.D.I. II. Kr. 18, P.502; Kr. 19P. 505; Kr. 21, P. 515
42. N.D.I. II. Kr. 68,P 608
43. Loc. Rec. Vol. XVII, PP. 178-179
44. N.D.I. II, Kr. 16, P.495

# అధ్యాయము XIII

# పాలనా యంత్రాంగము

కేంద్ర ప్రభుత్వము, రాష్ట్రములు వాని పరస్పర సంబంధ విధులు, నియమములు, పాలనా యంత్రాంగము ఆయా రాష్ట్రోద్యోగుల బాధ్యతలు, అధికారములు ఆది వృత్తాంతాఖ్యానము రెడ్డిరాజుల తామ్రశాసనములగాని, శిలా లేఖనముల గాని విశేషము అగపడవు. వానిలో సేకరింపదగినది కొంచెము అని రూఢము. అనవేమారెడ్డి వానపల్లి తామ్ర పట్టికలలో నొక పద్యము రాజు దినచర్య నిట్లు వర్ణించును : లోక రక్షాక మహాభాగ్య స్తుత కీర్తియు, సర్వ సద్గుణ నిధియునైన అనవేమ భూపాలుడు రత్న సింహాసనస్థుడై కొలువుండగా కొందరు క్షితిపాలకత్వమును, కొందరు రాజ లాంఛనములగు పల్లకి, చౌరి, ఛత్రములను, మరి కొందరు రాజు పూర్వము సర్వస్వ దండముగ గొన్న తమ రాష్ట్రములను, ఇతరులు కొందరు సంపన్నాగ్రహారములను బడయుచుందురు(1). ఇట్టి వర్ణములు రాష్ట్రోద్యోగుల విధుల గూర్చిగాని, రాష్ట్రముల గూర్చి గాని నిశ్చయ జ్ఞానమున కెట్లుపకరించును?

రాజనీతిశాస్త్ర గ్రంథములనుండి సేకరించిన పాలనా సూత్రముల వివిధ రచయితలవి గల సంపుటము సకల నీతి సమ్మత మను తెలుగు గ్రంథము - రెడ్ల రాజులలో ప్రచారముననున్నది. ఇది రాజకీయ నీతి నియమముల మాత్రమే తెలియజేయును. దుర్గ నిర్మాణము, సాధనా సంభార సేకరణలు, రక్షణ, దుర్గ ప్రాముఖ్య ప్రతిపత్తులు, సచివులు, దండనాయకులు, వైద్యులు, కార్యకర్తలు, గణకులు మొదలగునవి వివిధోద్యోగుల అర్హతలు, విధులు, ఆయవ్యయముల కరగ్రహణముల విషయముల నవలంభించివలసిన ఉపాయములు, జాగరూకతలు, కరగ్రహణముల విషయముల నవలంభించవలసిన ఉపాయములు, జాగరూకతలు, రాజులకు తగని అలవడులు, ఆచరణలు; సంఖ్యాన సంది విగ్రహ చారదౌత్య నీతిరీతులు - ఇవి ఈ గ్రంధస్త విషయములు. అయినను, నాటి రాజకీయ నీతి నిర్వాహణల గూర్చి ఈ గ్రంథము క్రొత్తగ తెలుపునవేమియు గటగవు. రాజనీతి గ్రంథములవి యే భాషలలోనివైనను, ఒకే అచ్చు పోసినట్లుండును. కానీ ఆయారోజుల వర్తిల్లు విధుల

ప్రస్తావించవు. నిజమునకు అన్ని దేశి రచనలు సంస్కృతాను వర్తనములే. ఇది సకల నీతి సమ్మతమునకు వర్తించును. దానిలోని పద్యములన్నియును సంస్కృత గ్రంథముల నుండి సంగృహిత శ్లోకముల యనువాదములు. వాని మూలములు ముద్రామాత్య, పంచ తంత్ర కామందక శాలిహూత్ర, నీతి భూషణ, నీతితారావళి[2], పురుషార్ధ సార, ధౌమ్యనీతి, దృతరాష్ట్రనీతి, మహాభారత, పద్మ పురాణేత్యాదులు, బద్దెననీతి, చారుచర్యలవంటి తెనుగు గ్రంథముల నేరినవియును, రచయిత రచనలే కొన్నియును అందున్నవి. ప్రాచీన కాలమునుండి, మధ్యయుగము వరకు మన రాజనీతి వ్యవస్థలో మార్పేమియు కానరాదు. కావునపై సకల నీతి సమ్మత గ్రంథము వలన మనకు విశేష ప్రయోజమేమియు లేదు.

సకలనీతి సమ్మతము కన్న కొంతకు కొంత ఉపయోగించునది ప్రౌఢకవి మల్లన రచన "రుక్మాంగద చరిత్రము". ఇది మనకు ప్రస్తుతమైన కాలమునకు చెందినది. రాజరుక్మాంగదుని కథ, ఏకాదశీ వ్రత మహోత్మ్య ప్రఖ్యాపకము. రాజ్యమున గల అడువుల క్రూర మృగములు ప్రబలి, వాని యలజళ్ళ బడలేక, ఆటవికులు మొఱపెట్టగా? వాని వేటాడుటకై రుక్మాంగదుడు రాజధాని వీడిపోవుచు రాజ్యమును తన సుతుని రక్షణమున వదలును[3]. ఆ తరుణమున రుక్మాంగదుడు తనయునికి ఉపదేశించుటగా, గ్రంథకర్త రాజనీతిపై తనకు గల యభిప్రాయముల వేలార్చెను. పద్యములలో చాలా భాగమును అందలి విషయములు ప్రాతవడ్డ రాజనీతి పద్ధతియేయైనను, అప్పటి రాజకీయస్థితులనెరిగినవారికి ఆ ప్రభావమా పద్యముల గన్పింపగలదు. సకలనీతి సమ్మతము, రుక్మాంగద చరిత్రముల పరిశీలనము వలన అప్పటి ప్రభుత్వ విధాన బాహ్య స్వరూపము అవగతము కానగును.

## సచివ సమితి

రెడ్డియుగమున పాలనా విధానము ఏకప్రభుకము (Monarchy) ప్రభుత్వమునకేడు అంగములు - రాజు, సచివుడు, రాష్ట్రము, దుర్గము, కోశము, సైన్యము, సుహృదుడు. రాజ్యమును సర్వాధికారి రాజు. పాలనానిర్వాహణ సకలమాతని ముఖమువనే జరుగవలెను. పాలన స్మృతి ధర్మ శాస్త్ర విధిత సూత్రముల కణుమాత్రమైన దప్పరాదనుట తప్ప,

యతని యధిరాకము నిరంకుశము. అతడేమి చేసినను, మంత్రులతో సంప్రదించియే. మంత్రు పన్నిద్దరని మనువు, పదునార్గురని బృహస్పతి. ఇరువదియని శుక్రుడు, రాష్ట్రముఖ్యావసరముల బట్టి, నిర్ణీత సంఖ్య మించని యందరనతడు నియమించుకోవచ్చును[4]. మంత్రుల సంప్రదించు నావశ్యకత ప్రాముఖ్యములెంతగనో నొక్కి చెప్పియున్నారు. "సర్వకార్యములను సచివ సాహాయ్యముననే జరుగును గాన వారున్నెపుడును పరివేష్టింప జూడవలయును, వారి సేవ వలసినంతనే మంత్రి వర్గము వారిని కోశాధీశులను దండ నాయకులను రావింతుననుకొనరాదు. అది ఇల్లు గాలుచండ నుయ్యిద్రవ్వుటే యగును[5]. తన విధుల నిర్వర్తించునెడ రాజు గర్వియై మంత్రుల అభిప్రాయమరయకో, కాక తద్విరుద్ధముగనో వర్తించెడిచో, వాతడరుల కతి సులభమగు నామిషయై కోశరాష్ట్రములు గోలుపోవను[6]. ప్రౌఢకవి మల్లన రాజు మంత్రిపై పూర్ణముగ నిర్భరుడు కారాదనును. రాజు రాష్ట్ర రక్షణమును మంత్రికప్పగించి ప్రభుత్వ వ్యవహారములు నొప్పరికించినచో, కాలక్రమమున మంత్రియే ప్రభువు కాగలడు[7]. పైవచనముల బట్టి రాష్ట్ర వ్యవహారములన్నింటిను సంప్రదింపులకు రాజుకొక సచివ సమితి యున్నదని తెలియును. సచివ సమితిలోముఖ్యుడుప్రదాని, ఇతరులు మంత్రులు. అనవేమారెడ్డి వానపల్లి తామ్ర పట్టికలందు దానము పట్టిన ఇమ్మడి మంత్రి నీతిని మంత్రీశ్వరుడు, విద్యాగోష్టుల విబుధాగ్రణి, భూభుజులకు హితముపదేశించుటలో మిత్రుడు[8]. పై ప్రశంసల జూడగా ఇమ్మడి మంత్రి అనవేమారెడ్డి మంత్రులలో నొకడనిపించును. నీతి శాస్త్రములు మంత్రులుగా బ్రాహ్మణుల నియమించుటను శాసించును. రెడ్డిరాజులు కొమరగిరి రాజువరకీ నిబంధన ననుసరించవచ్చును. రెడ్డి రాజ్య స్థాపకుడగు కోమటి వేముని మంత్రులు రామాప్రగ్గడ, మల్లినాథులు. అనవోతని మంత్రులు సోమయ, మల్లినాథులు. మామిడి సింగయ పెదకోమటివేముని సచివుడు. ఈ ఆచారమునకపవాదు కొమరగిరి రెడ్డి. మంత్రిగా, దండనాథునిగా అతడు తన బావ కాటయవేముని నియమించుకొనెను, కాని అతడు తన వంతు వచ్చునప్పటికి రాజకీయముల తన యుపదేశకునిగ అప్పయ పుత్రుని జతనము పెద్దినెన్నుకొనెను[9]. అతడు బ్రాహ్మణుడు. పురోహితు మాత్యులలో నతడు పెద్ద, సర్వశ్రేష్ఠుడును.

మంత్రి వర్గమున పురోహిత ప్రధాని దండ నాయకాదులు రాష్ట్ర వ్యవహారములలో

రాజునకు సలహాదారులు. వారి యభిప్రాయము రాజు పాటించి తీరవలసినది లేదు. అన్నింటను రాజు మాటయే తుదిమాట. ప్రజల బాగోగులు రాజ గుణశీలములపై ఆధారపడెడివి. మంత్రుల వలని నిగ్రహముండినను, ఆచరణమున నీరపాలుడు అనియంత్రిత శాసనుడు, ప్రాయశః లోకోప ప్లవకుడు కూడా. అతని మాటయే శాసనము. కొమరగిరి రాచవేములు నిష్టురులు, నిరంకుశులని జన వాక్యము. కావననే వారిరువును రాజ్యచ్యుతులైరి. రాచవేమునంత ప్రజా పీడకుడు రెడ్డిరాజులలో మరొకడు లేడు. పురిటి పన్ను విధించుట, క్రూరముగ రాబట్టుటలు అతని అక్రమములోనొకటి. అది కారణముగానే బలిజకులుడు[10] సవరం యల్లప్ప చేతులలో నతడు హతుడయ్యెను.

ఒకటి మాత్రము నిజము. పూర్వరాజ వంశములలో నెన్నడును నంతగా రెడ్డిరాజుల పాలనమున మంత్రుల సామంతుల మాటలకు మన్నన యుండినది. వారసుడు పిన్నయైనచో, రాజ్యక్షేమ మరసి వారతని కాదనుటయు గలదు. ఇందులకుదాహరణము కొమరగిరి. అతని తండ్రి అనవోత చనిపోగా పిన్నయనియతని కొనక మంత్రి సామంతులు అనవోత తమ్ముడు అనవేముని రాజు చేసుకొనిరి. రాజ్యశ్రీ రమణీయమవర పతిః[11] అని అనవేమా రెడ్డి శాసనములలోని కూర్పునకర్థమిదేనేమో.

## యువరాజు

రాజు తరువాత అంతటివాడు యువరాజు. ప్రధానికి గలంత ప్రాముఖ్యము గలవాడు. వారిర్వురు రాజుకు రెండు భుజములు[12]. ప్రోలయవేమారెడ్డి రోజులలో యువరాజు అనవోతారెడ్డి రాష్ట్ర పాలనమున తండ్రితో పాల్గొనెడివాడు. ప్రోలయ వేముని యాస్థానకవి ఎఱ్ఱాప్రగ్గడ అవనోతా రెడ్డిని చామూపాగ్రేసరుడని[13] వర్ణించినాడు. అప్పటికనవోత వయసువచ్చినవాడై యుండును. తీరాంధ్రమున హిందూరాజ్య పునరుద్ధరణ తొలిరోజులలో రెడ్డి రాజ్య ప్రతిష్ఠాపన మపుడు ప్రోలయవేముని తమ్ముడు సేనాపతిగ నుండినాడు. అతని కనుసన్నల మెలగుచు ఆనతుల పాలించిన ప్రోలయ అన్నదమ్ములందరూ సేనాపతులే.

కొమరగిరి రెడ్డి తను రాజైన క్రొత్తలలోనే తన తనయుడు అనవోత II ను యువరాజుగ నియమించెను. అప్పటిననవోత చాల చిన్నవాడు. కావున కొమరగిరి

యతనిని తన బావ, ప్రధానియు నగు కాటవేముని శిక్షణమున నుంచెను. పూర్వ దిగ్విజయ సమయముల, నితరములను అనవోత II కాటయవేముని వెంట నంటి యుండి రాష్ట్ర పాలనా శాఖలన్నింటను మెలకువలు గ్రహింపగల్గెను. రాజమహేంద్రవర రాజ్య నిశ్చయము కాగానే, అందనవోత II ను తన ప్రతినిధిగ కొమరగిరి యభిషేకించెను. కాని దుర్విధి వశమున అనవోత II బాల్యముననే మరణించెను. పెదకోమటి వేముడు పాలించు చుండగా రాచవేముడు యువరాజై యుండును. కాని ఎందును ఆ ప్రస్తావమే లేదు.

## కేంద్ర ప్రభుత్వోద్యోగులు

కేంద్రప్రభుత్వోద్యోగులలో ముఖ్యలు లేఖకులు లేక గణకులు (కరణములు) వారి విధుల వలె వారి ఉద్యోగములను వివిధ శ్రేణులవి. వారి కూటము యిప్పటి సెక్రటేరియట్‌కెనయగును. రాజనీతి శాస్త్రములన్నియును, లేఖకుని రాజనగర రత్న దీపికయని, మూర్తిగొన్న ప్రజయని ప్రధానముగ నాయవ్యయ లేఖ్యముల కందువ వెరగుటలో జాణయని ప్రశంసించినవి[14].

## కవిలె సంప్రతులు

లేఖకుల విధులను సవిశేషముగ వర్ణించు నెన్నో పద్యములను మడికి సింగన రచించినాడు. కాని అందలి లేఖనా సాంకేతిక పదములెన్నో మఱుగున పడినవి. చాల వాని యర్థమును పూర్ణముగ తెలియరాదు. దివాణమున కవిలె సంప్రతు (Hed Accountents) లుండెడివారు. ముఖ్యముగ నాయవ్యయముల ఖాతాలను ఆ విషయముల రాజ నిర్దేశముల వ్రాసి యుంచు పుస్తకముల, ఆ పుస్తకములు భద్రపరచుట వారి వంతు. గణకులు పురస్కారముల బాధ్యతల బట్టియే తరము (Grade) వారైనను సమిష్టిగ ఆర్థిక శాఖానిర్వాహకులు ప్రాచీన రాజ్యపాలనా యంత్రాంగమున నెన్నదగిన శాఖ అదొక్కటే. అది అత్యంత ముఖ్యము గలదియు, అతి వ్యాపకమును. రాష్ట్రముల నుండి, దుర్గముల నుండి రాబడిని ఆయా అంశములకగు వ్యయములను ముందుగ నిరూపించి, అవి యేయే వర్గములకు చెందినవో, ఆయావర్గుల నాయా పరిమాణములను, పుస్తకముల నిబంధించి యుంచెడివారు. అప్పటప్పటికి రాజనుమతించిన పన్నుల

•

మోచనులు (అతిశయములు) గమనించి నికరాదాయ వ్యయముల, ధన, వస్తురూపుముల నిర్ణయించి రాజునకు నివేదించిడివారు.(15)

## రాయసములు

గణకులలో వేరొక శ్రేణివారు రాయసములు. రాయసముపభ్రంశము. అది వ్రాయసము. లేఖనము వ్రాతయనియర్థం. కాని రెడ్డి రాజులలో నాపదము వైశిష్ట్యము నంతరించి పదవికి చిహ్నమై, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వముల ముఖ్య సంప్రతుల సూచించునదైనది. ఈ పదవీ నియుక్తుడు రాయసము. కావున లేఖకులెల్లరు రాయసములుగారు. అది సాంకేతికమై, రాజునొద్దనో, సామంత ప్రభువులొద్దనో రాష్ట్రముల నుచ్చ పదవీ స్థితుల కడనో, వారి యాజ్ఞల వేచి మెలగుచు వారు వాక్రుచ్చిన ఆజ్ఞలను, సందేశములను, ఉత్తర ప్రత్యుత్తరములవారి సన్నిధిని లిఖించి, వినిచి వారి సమ్మతి నందుకొనవలెను(16). బహుభాషా జ్ఞానము, ఆయా లిపులవ్రాయునైపుణ్యము, చేతివడి, గాంభీర్యము ఇవి రాయసము వారి అర్హతలుగా మడికి సింగన వివరించినాడు. గుంటూరుకు చెందిన యాజలిశాసనము(17)న ఒక పురుషోత్తమయ్య వెలిగోటి రాయప్ప నాయకుని రాయసము రాయప్ప కొమరగిరి యధీనుడు ఉద్యోగి. కాటయవేముని రాయసము రాయని బాచ లేక రాయని భాస్కరుడు. రాయసము నేటి కార్యాధికృతు (సెక్రటరీ) డనవచ్చును.

## కేంద్ర ప్రభుత్వ విభాగములు

కేంద్రపాలనా యంత్రాంగములో ఎన్నదగిన విభాగము ఆర్థికశాఖ యొకటి. కోశజాతము సమృద్ధమా పరికించి వ్యయము కన్నా నాయమెక్కుడుగ సరితీర్ప యత్నించునది. ఇతరములు ప్రభుత్వ విభాగములే అయిన, పౌర నిర్మాణముల శాఖ సంధి విగ్రహశాఖల గణించవచ్చును.

### (i) పౌర నిర్మాణ శాఖ

ప్రజల నిత్యోపయోగము గల తటాక నిర్మాణములు సప్త సంతానముల

ప్రశస్తిగాంచి చిరస్మరణీయునిచేయునది. రెడ్డిరాజ్యమున నిట్టి తటాకములు అల్ప ప్రమాణములవి స్థానిక దాతల యత్నముల వెలసినవి ఎన్నో గలవు. అసంఖ్యాక శ్రామికులు ధనములు వలసిన విస్తృత జలాశయము (సాగరము)లు, పంట కాలువలు, ఆనకట్టలు - యిట్టి వాని నిర్మాణమునకు సామాన్యముగా ప్రభుత్వమే పూనుకొనెడిది. కొండవీడు నొద్ద సంతానసాగరము దానికి నీరు జేర్చు వనరులు కాల్వలు నిర్మింపబూనినది కొండవీటి రెడ్డిరాజులే అట్టి నిర్మాణాలు లేక నాటి ఆర్థిక జీవన ప్రాణమైన వ్యవసాయము ఫలింపదని వారెఱుగుదురు. కానికట్టు, త్రవ్వుపనులు, పూర్తియైన పిదప వారికి వాని సంవర్ధన సంరక్షలపై దృష్టి ఉండెడిది కాదు. అందులకై వారే యుద్యోగి శాఖను ప్రత్యేకించి యుంచలేదు. కాని చెరువు క్రింది సాగుబడి భూములలో నొక నిర్ణీత ప్రమాణము వారు దశబంధము పద్ధతిన[18] కౌలుకిచ్చేవారు. ఆ చెరువులు, కాల్వల మరమ్మతులు నీటి పారుదల సరిచూచుకొనుట కౌలు పుచ్చుకొన్నవారి బాధ్యత. చెరువులు కాల్వల పని పూర్తి అయిన ఆ నీటి తీరువు భూములను మాగాణి సేద్యముగ నేర్పరచి, దానిపై క్రమక్రమముగా పన్ను విధించేవారు. వాని వలసి వరుమానం ఖర్చులు లెక్కలు గట్టి, పుస్తకముల లిఖించి యుండెడివారు.

## II) సమరకక్ష్య

రాష్ట్రమందలి సైన్యసంవిధానము, నియామకము, నిర్వాహణము, ఆయుధాది సేకరణము, సైనికుల జీతములు, పోషణ, యిత్యాదుల చూచుకొనుట వలసిన నిధుల సరిపెట్టుట, యిత్యాదు పనులకు ప్రత్యేకముగ నుద్యోగి మండలి యుండెడిదని, వారాలేఖ్యముల జాగ్రత్త పఱతురని, యూహింప వచ్చును. దీనిని కొద్దిగ విస్తరించి XV అధ్యాయమున వర్ణించి యున్నది.

## III) రాజస్వ విభాగము (Revenue)

ఈ విభాగమున అధిక సంఖ్యాకులు గణిక సంప్రతులును, ఉన్నతాధికారులునుండుటలో ఆశ్చర్యములేదు. వీరు రాష్ట్ర ఆదాయ వ్యయముల పద్దులను ఖాతాలను సిద్ధపఱచి యుంతురు. మధ్య యుగపు ప్రారంభమున రాజనీతిపై

గ్రంథము వ్రాసిన బద్దెన[19] మనకు ప్రస్తుడు ప్రౌఢకవి మల్లన[20] రాజునకు రాబడి నిచ్చు బహ్వాందముల నేకరువు పెట్టినారు.

| | బద్దెన | మల్లన |
|---|---|---|
| 1. | కృషి ప్రపంచము - అరి | పంటలో రైతులు రాజుకిచ్చెడి భాగము |
| 2. | గనులు | గనులు |
| 3. | గోకులము | గోరక్ష |
| 4. | సుంకము | సుంకము |
| 5. | వణిక్క్రియ | (జల, స్థల పద స్థకులు) వాణిజ్యము |
| 6. | నందన వనము | శృంగార వనము |
| 7. | కప్పము | అప్పనములు |
| 8. | రక్షణము | దుర్గ |

## ఆయము

బద్దెన కృషి ప్రపంచమన్నను మల్లన "ఆరంభ "మన్నను సేద్యమనియే అర్థము. ఆదాయమెనిమిది రీతులు బద్దెనప్రశంసింపగా మల్లన ఏడురీతులనే పలికినాడు. ఉన్నంతలో అవి సదృశములే. "దుర్గ రక్షణ" మన "కావలి" లేక కోట కాపునకైన పన్ను అనుకోవలెను. తెనుగున "కరము, కప్పము, అరి, అప్పనములు" సమానార్థకములు. అందొక్కొక్క దానికి గల వైశిష్ట్యము మనకు తెలియదు. తమిళమున "వరి"యన్న పన్ను, ధాన్యము గూడా. "అరి"యన్నది తమిళ "వరి" సంక్షేపమోమో. ఆంధ్రులు "వరి"ని ధాన్యమునకును, "అరి"ని పన్నునకును ప్రయోగింతురు. కావున అరియన్న ధాన్యభాగము లేక ధాన్యరూపమున పన్ను.

తొలి తెలుగు శాసనములలోని "అరిగాపు"లు రాజునకు ధాన్యరూపమున పన్నులు

చెల్లించు కర్షకులైయుందురు. "అరి అప్పనములు" రెండునూ పన్నుకే చెల్లినను అరి ధాన్యరూపమను కొనుటచే "అప్పనము" ధన లేక సువర్ణ రూపమున నిచ్చు పన్ను కాదగును. రాజునకు వచ్చు ధాన్యాదాయ సువర్ణాదాయములు వ్యక్తిపరముగ గాక గ్రామ పరముగ ననుకోవలెను.

ఇరువురు శాస్త్రజ్ఞులును సూచించిన రాజస్వాధారములివి

1. సేద్యము లేక వ్యవసాయము
2. పరిశ్రమలు
3. వాణిజ్యము
4. శుల్కము (సుంకము లేక)
5. పుల్లరి (బీళ్ళు అడవులు మేతకు) - గోరక్ష
6. సంఘ సౌకర్యము (ఉపవనములు లేక నందన వనములు)
7. అనూచానముగ ధన రూపముగ నిచ్చు ఉపాయనములు

## వ్యవసాయము

రాష్ట్రాదాయమునకు ప్రాణము వ్యవసాయము. నిర్ణీత ప్రమాణము గల గడతో భూమినెల్ల కొలిచి లెక్కగట్టుట యనూచానాచురము. ఆ పిదప దానిని మాగాణి, మెట్ట, తోట భూములుగ విభజించి పంట దామాషానూహించి అరివిధించువారు. మాగాణి కొలమానమునకు మెట్ట కొలమానముకు చాలా వ్యత్యాసము గలదు. అట్లే వానిపై విధించు అరి ప్రమాణ విషయమునను కాని యీ భేదమెంతటిదో తెలియదు. ధాన్యము పండు భూముల నుండియే పంట రూపమున పన్ను వసూలుండెడిది. కాని యితరముల నన్నిటను సువర్ణ రూపముననే అరిగ్రహణమని యూహింపవ్చును. ప్రోలయ నాయకుని విలస శాసనమున[21] రాజస్వము పంటలో ఆరవపాలని తెలియవచ్చినది. తమ నాయకులగు ముసునూరు వారి యీ విధానమునే అవలంబించి రెడ్లును షష్ఠాంశమునే పన్నుగ విధించియుందురు. కాని వసూలైన ధాన్యాదులను వారెట్లు వినియోగించెడివారో తెలియదు.

పంటకోతల నూర్పిడుల మహసూళ్ళ కాలములలో (గ్రీష్మ శిశిరర్తులు) రాజోద్యోగులు తనిఖీలు చేసి వసూలు చేసేవారు. తోటలపై పన్ను నాణెముల రూపముననే ప్రోలయవేముని చీమకుర్తి[22] శాసనమీ సందర్భమున సువర్ణాదాయమునే చెప్పినది. ఇదిగాక గ్రామముల పట్టణములలో ఇండ్లపన్ను (ఇల్లరి) దండుటయు రొఖ్ఖ రూపముననే - మాడలో, టంకములో శ్రీనాధుని చాటుపద్యము[23] యీ సందర్భమున టంకములనే చూపెట్టినది. కృష్ణా తటాన బొడ్డుపల్లె శివారులో విహిత కాలమునకు నిర్ణీత మూల్యమునకు శ్రీనాధుడు. పట్టాపై గొన్న భూమి పంట కృష్ణా ప్రవాహమున కొట్టుకొని పోయెను. రాజునకీయవలసిన పన్ను ఏడునూర్ల టంకము లెట్లీత్తునని అతడు వాపోయినాడు. పై పద్యము వలన రాజులకు కొన్ని క్షేత్రములను పట్టాపై వ్యక్తులకు కౌలుకిచ్చెడి (Farming) / ఆచరముండెడిదని తెలియుచున్నది.

## పరిశ్రమలు

బద్దెన మల్లన లిర్వురును గనులను రాజస్వమున కాకరములుగా చెప్పుటచే పరిశ్రమలలో గనులు ముఖ్యములుగ తెలిసినను ఆ పరిశ్రమ మెట్టిదియో చెప్పజాలము కాని విదేశ యాత్రికులు యీ ప్రాంతముల వజ్రపు గనులను చెప్పియున్నారు. అదియుగాక లోహకారక వృత్తియు ముఖ్యమని ఎన్నవచ్చును. మగ్గములు, నూనెగానుగలు మొదలగు వానిపై "వృత్తి కట్నములు" రాజులకు చెల్లెడివి. రెడ్డిరాజ శాసనములలో ఇల్లరి పుల్లరులు తప్ప వేరు పన్నుల ప్రశంసయే లేదు. కాని వారి పూర్వులు కాకతీయులు సమకాలీనులు విజయనగరము వారలు విధించెడివిగా తెలియు అన్ని పన్నులును రెడ్లను వసూలు చేయునవిగనే భావింపవచ్చును. ఒకమారు నెలకొన్న ఆచారము విద్రోయుట అరుదు. ఆ పద్ధతులు కట్టుబాట్లు దేశమున ననాదిగ ప్రచారమునున్నవే.

"సుంకము" విశేష, విస్తార అర్థము గలది. రహదారులలో గల వ్యాపార కేంద్రాలలో సంతలలో వస్తు సంభారాల సరఫరాలపై విధించు పన్ను సాధారణముగ సుంకమందురు. (హాసిళ్ళు). కాని కాకతీయ ప్రతాపరుద్రుని పానెం శాసనము[24], శక 1241 నాటిది "నేల సుంక్యాధికారు"లను పేర్కొన్నది. "నేల సుంకము స్థలము ఉపయోగించుటకై యీయవలసిన నొక విధమైన బాడుగ (అద్దె) కావచ్చును. వ్యాపార

వస్తు సంభారములపై హాసిళ్ళుకు తోడు యితరములగు పన్నులను గూడ సుంకముగ గణించేవారు. పట్టణాల్లో వారం వారం సంతలు జరుపుకొనే గ్రామాల్లో, పడవ ఘట్టాల్లో యీ సుంకాలను కేవులను వసూలు చేసేవారు. పడవలపై కాలువ, నది దాటుచో వసూలు చేసే పన్నును పుట్టి కూలి లేక పుడిగ ముల వీసాలు[25]. (ఏరుదాటుటకుపయోగించే గంపలు). శక 1280 నాటి అనవోతారెడ్డి మోటుపల్లి శాసనము[26]లో "మడిసుంకము"ల ప్రస్తావనమున్నది.

"ఎక్కుమడి" (ఎగుమతులపై) "దిగుమడి" (దిగుమతులపై) ఆ పన్ను విధింపు వస్తువులను వ్యాపారమున్నకై కేంద్రీకరించి యుంచిన స్థలాల్లో "మార్గ సుంకము లేక ఉభయ సుంకము" లేక అడగడ సుంకము (అడ-ప్రవేశము, కడ-బయటికి పంపే చోటు) ఉండెడిది.

పై పన్నులు వసూలు చేసేవారిని సుంకాధికారులు లేక సుంకరులనేవారు. ఆ ఈ పన్నులు వసూలు చేసుకొనే హక్కును, ఏలంపాట పెట్టి అందఱకన్న హెచ్చైన మొత్తము యిచ్చే వ్యక్తికో, కొందరి కుమ్మడిగనో అప్పగించేవారు. వారికి సుంకగట్టు కాడు, సుంకగట్టు కాండ్రు అని వ్యవహారము. కుమారగిరిరెడ్డి రోజులలో శక 1313 నందు, గుంటూరు జిల్లా తంగేడా వద్ద దొరికిన శాసనముపై అధికారులు పేర్కొన్నది. ఉప్పుపై స్వత్వము రాజునకు, కాని ఆ పన్నునైనను రాజోద్యోగులు తాముగా వసూలు చేయరు. దానిని గూడ యితరములపై వలెనే ఏలము పాటల పద్ధతిన నిర్ణయింతురు.

## గోకులము లేక గోరక్షణము

ఇదియును రాజునకు ఆదాయ మొసగునదిగ బద్దెన మల్లనలు గణించినారు. అది పశూత్పాదన పాలన పోషణములకు సంబంధించినది. ప్రాచీన కాలంలో దేశైశ్వర్యమును గోగణములాధారమున నిర్ణయించెడివారు. గోవులను ఐశ్వర్యము (ధనము) గణించెడివారు. వాని మేతలకు విశాలములగు బీళ్ళు బయళ్ళు అవసరము. అటవీ భూములు గూడ అందుకుపయోగించేవారు. ఇవి సూటిగ ప్రభుత్వ నిర్వహణముననే నుండినవి. ఈ మేత భూములను రైతులకు అద్దెకిచ్చేవారు. వానిపై

పన్నును పుల్లరి అందురు. పుల్లు అనగా గడ్డి అరి అన్న పన్ను. దీనిని వసూలు చేయు పద్ధతినిదియని నిశ్చయింపలేదు. అద్దెగనో, లేక ఏలంపాట విధానముననో.

## కప్పము

ఇది సామంత నాయక ప్రభువులు రాజునకేటేట చెల్లించు పన్ను. ఆయా నాయకులు విశాల భూభాగములకు సీమలకు రాజాధీశులకు పాలకులుగ నుండి అనేక గ్రామములకు పట్టణములకు ఒడయలుగా పండిరి. వారు నిలుపవలసిన సైన్యమునకైన ఖర్చులు పోను, మిగిలిన రాజ్యభాగమును వారు రాజకోశమునకు చెల్లించువారు. వారి వారి సీమలలో కొన్ని గ్రామముల నుండి రావలసిన ఆదాయమును వారు ఏలముపై నిర్ణయించుట గూడ సాధ్యమే. స్తోమతుగల వ్యక్తులలో వారి తాహతును బట్టి ఒక్కొక్కరికి రెండు మూడు గ్రామముల పన్నుల వసూలు చేయునధికారము సంక్రమింపజేసి వారికా మొత్తములను అద్దెగా ఖజానాకు చేర్చు బాధ్యతనప్పగించుటయునుండినది. ఇట్టి వారద్దెగా నిచ్చు సొమ్మును గూడ కప్పముగా వ్యవహరించుటయున్నది. ఈ అర్థముననే తూర్పు చాళుక్య అమ్మరాజ II విజయాదిత్యుని శాసనమొకటి కప్పము పదమును వాడినది. అస్యగ్రామస్య కప్పాభిదానం కరం వర్జితమ్[27] ఈ గ్రామము నుండి రావలసిన కప్పమును పన్నును వర్జించుటైనది. కావున కప్పమన్న పదము రాజునకు సామంతుడు చెల్లించు మొత్తమే గాక అద్దెకొన్న గ్రామ పెద్ద రాజున కర్పించు మొత్తమును గూడ సూచించునని తేలును.

రాజస్వమునకు మరియొక మూలము "రాచ-ఊళ్ళు" (రాజుగారి గ్రామములు) కృష్ణాజిల్లా కొత్తూరు నందలి యొక శాసనము[27]న "రాచ-ఊళ్ళు" ప్రస్తావింపబడినది. దాని క్రమమున గ్రామములు మూడు తెఱుగులు-రాచఊళ్ళు, అగ్రహారములు, నాయంకరపట్లు. అగ్రహారములు పన్నుల రాయితీగ బ్రాహ్మణులకిచ్చిన ఊళ్లు. కొన్ని గ్రామములను పాలనా సౌకర్యమునకై ఉమ్మడిగ కలిపి ఆయా సమిష్టి గ్రామముల పాలనమును నాయకుల యధీనమున ఉంచెడివారు అట్టి సమిష్టి గ్రామములను నాయంకరములనిరి. రాచ-ఊళ్ళు విషయమున రాజోద్యోగులే బాధ్యులు. ఇట్టివే విజయ నగర యుగ మధ్యమున - బండార - గ్రామములు అట్టివే మొగలు పాలన పరభాగమున "హవేలి" గ్రామములు.

## వ్యయము

ఇన్ని విధములుగ కూర్చిన రాజస్వము నెట్లు, వేనికై వ్యయించిరో తెలియదు. చాల భాగము రాష్ట్రకోశములోని మూల ధనమునకు చేర్చుచుండిరనవచ్చును. వచ్చిన సర్వములో నాల్గవ పాలో, కాక మూడవ పాలో వ్యయించి శేషమును మూలధనమునకు పేర్పవలెనని బద్దెన ఉపదేశము[28]. వ్యయమున అధిక భాగము సైన్య సంవిధానమునకై ఉపయుక్తమయ్యేడిది. పోగా మిగిలినది. దాని ధర్మములకు పౌర నిర్మాణములకు ఖర్చుపెట్టువారు. రాజోద్యోగులకు భృతికిగా పన్నుల రాయితీగా భూములను, సర్వమాన్యములుగా నిచ్చెడివారు. వారు ఆ భూములపై వచ్చు రాబడి ననుభవించుచు రాజసేవ చేసెడివారు.

## పాలనా విభాగములు

పాలనా సౌలభ్యమునకై రాజ్యమును, భూమి, సీమ, నాడు, స్థల, గ్రామములుగ విభాగించిరి. అందునాడు స్థలములు క్రొత్తలుగావు"నాడు" తూర్పు చాళుక్యుల పూర్వముననూ ఉండినది. సాంఘికము భౌగోళికమునైన నాడు రాజకీయార్థము సంతరించుకొన్నది. కాకతీయుల రోజులలో నాయంకరమున ఒకటి అంతకెక్కుడు నాడులు కలిసి యుండినవి. నాయంకరమొక నాయకునధీనముననో కాక రాజసైన్యముల నుద్యోగి వశముననో నుండెడిది. నాడు పెక్కు స్థలములగ విభజింపబడినది. ప్రతి స్థలమునందును గ్రామములనేకములు. రాష్ట్ర పాలనమున గ్రామము ప్రాథమిక విభాగము. లోకవృత్తాంతముల బట్టి గ్రామమున ఒక్కటికెక్కుడు పల్లెలుండెడివి. రెడ్డిరాజుల కాలమున నాయంకర పద్ధతి మార్పులేక సాగినది. అట్లే నాడులు, స్థలములును. పూర్వము తెల్పినట్లు కొత్తూరు శాసనమున గ్రామ సముష్టుల నాయంకరములు చెప్పబడినవి. శక. 1260 నాటి ధేనువకొండ శాసనము[29] న (ఒంగోలు తాలూకా) పాదిళ్ళ పల్లి సింగమ నాయకుని నాయంకరము ప్రస్తావించబడినది. సీమ యన్నది రెడ్లు క్రొత్తగ ప్రవేశపెట్టినది. కాకతీయ శాసనములు "సీమ"లను చెప్పవు. వారి కాలమున "నాయంకరము"లవలె, రెడ్ల రోజులలో "సీమ"ల ప్రాచుర్యము. కొన్ని నాయంకరముల గల్పినది "సీమ". ఒకటి కెక్కుడు సీమలు గూడినది భూమి కొండవీటి రెడ్ల

శాసనములు[30] "కోటభూమిని శ్రీశైల భూమి"ని పేర్కొన్నవి. కాని "భూమి"కి "సీమ" గల ప్రాధాన్యమగపడుదు. పెక్కు సీమలతోడి. ఒకటియో అంతకెక్కుడో, భూములను ఒక దుర్గముతో జతపఱచెడివాడు. కొండవీటి దండ కవిలె నాల్గే దుర్గములు. 14 సీమలు, 2048 గ్రామములను చెప్పియున్నది. అది తెల్పిన దుర్గముల సీమల పేళ్ళు[31].

## దుర్గములు

1. కొండవీడు
2. వినుకొండ
3. బెల్లంకొండ
4. నాగార్జునకొండ

## సీమలు

1. కొండవీడు
2. వినుకొండ
3. బెల్లంకొండ
4. అద్దంకి
5. ఉదయగిరి
6. కోట
7. నెల్లూరు
8. మారెళ్ళ
9. కందుకూరు
10. పొదిలి, దర్శి
11. అమ్మనబ్రోలు
12. చుండి
13. దూపాడు
14. నాగార్జునకొండ

దండకవిలె "సీమ"లు చోళుల నాటికే ఉన్నవనును గాని అందుకు సాక్ష్యాధారము లేదు. పైనిచ్చిన సీమల పట్టిక సరియని రూఢముగ చెప్పలేము. కాని ఆ పట్టికలో ఉదయగిరి నెల్లూరు లుండుట గుర్తింపదగినది. కృష్ణకు ఉత్తరమున ఏ సీమయు దుర్గమును అగుపించదు. పై పట్టిక సరియైనచో నది ప్రోలయ వేముని రాజ్య ప్రారంభ సమయమునకు చెల్లును. అప్పటికింకను ఉదయగిరి నెల్లూరు లతని యధీనమున నుండినవి. తరువాత తరువాత ఉదయగిరి నెల్లూరుల నష్టపడుటకు కృష్ణకుత్తర దేశగ్రహణమున పరిహారమైనది. పై పట్టిక రెడ్ల పాలన తొలిరోజుల దైనను అది సమగ్రము కాదు. నాటి వారి శాసనములలోని తంగేడసీమ పై పట్టికలో కనబడదు.

తెలిసినంతలో నాటి పాలనోద్యోగులు మూడు తెఱగులవారు. (1) అధీన నాయకులు. 2. కప్పము కట్టుసామంతు. 3. ఇతరోద్యోగులు అధినాయకులు వారు సమకూర్చు సైన్య సహాయమున్నకై నిర్ణీత భూముని రాజువద్ద పొందినవారు. సామంతులు రాజు కేటేట కప్పము చెల్లించు పద్ధతిపై అద్దెకో లేక పాలనకో, గ్రామ సముదాయములను గ్రహించి యుండెడివారు. ఇతర రాజోద్యోగుల గూర్చి వివరము మనకేమియు తెలియదు.

## గ్రామము

గ్రామోద్యోగుల దదియొక విశిష్టమైన తెగ. వారికి కేంద్ర ప్రభుత్వమునకు గల బంధము దుర్బలము. గ్రామ పరిధిలో కొద్దిగనో, ఎక్కువగనో నివేశనములు వానికి సంబంధించి వందలాది "ఖారీ"ల కృషియోగ్య భూములు బీళ్ళు ఉండును. గ్రామ ఇంటిపెద్దలు నిర్వహించు ఉమ్మడి కుటుంబము వంటిది. ప్రతి గ్రామములో గ్రామ సేవకులు గ్రామావసరముల తీర్చుట కుండెడివారు. వారికి బృతిగా కరరహితముగా "మాన్యములు" "మేరలు" "మిరాశీలు" యిచ్చువారు. వారిని ఆయగార్లని, గ్రామభటులని, వారికిచ్చిన పట్టాభూములను భటవృత్తి మాన్యములని వ్యవహరించినాడు. అట్టివారు ప్రతి గ్రామమునకు సామాన్యముగ పంద్రెండుగురు : గ్రామ విస్తీర్ణమును బట్టి ఆయమును బట్టి ఆ సంఖ్య మారుచుండెడిది. ఒక్కొక్కప్పుడు గ్రామములో ఒకే సేవకుడు యిర్వురికి విధితమైన వేర్వేరు పనుల నిర్వహించుటయు నుండెడిది.

రడ్డి లేక రెడ్డి గ్రామములో వ్యావసాయక సంఘమునకు పెద్ద. అతడే గ్రామ వ్యవహారముల చక్కజూడేవాడు. వానికి "గ్రామకూట"మని పేరు[32]. ఇది తరువాత గౌడ అయినది. మొదట అతనిని రాజునియమించెడివాడు. మధ్యయుగమున అడవుల కొట్టి చదును చేసి గ్రామముల ప్రతినిష్ఠించుకొనురోజులలో, అందు పాల్గొన్న కుటుంబముల పెద్దల్లో పలుకుబడి గలతడు రాజు నొద్దకు పసదనములతో బోయి ఆయా గ్రామ రడ్డికమునకు నియుక్తుడయ్యేవాడు. ఆ రోజుల శాసనములు లోక వృత్తాంతములు యిట్టి ఘటనలెన్నిటిలో వర్ణించినది. ప్రభు నియాకము లేనిదే రడ్డి లేక గ్రామ పెద్దగా వర్తించుటకును ఆ సేవకు గల "కాణాచి" హక్కులను ఎవరునూ పొందగాదు. గ్రామములలో అతడు రాజుకు ప్రతినిధి. గ్రామ మొత్తము మీద రాజునకు చెందవలసిన పన్నులను ధన, ధాన్య రూపములలో వసూలుచేసి, రాజు భూభాగమున అతనికి చెల్లించు బాధ్యత యీ రెడ్డిది. భూమిశిస్తును తఱచు ధాన్యరూపమున, కానుకలు, కట్నాలు సువర్ణ (రొక్క) రూపమున వసూలుచేసేవాడు. శిస్తు ధాన్యమున "రాచగాదె"లలో భద్రపరచి, కొంత గ్రామసీమలకు, రక్షణల కుపయోగించి మిగిలిన ధాన్యమును వెల హెచ్చియుండగా అమ్మి, రాజునకు అందజేయుట వాని విధి. ప్రతి గ్రామమున "రాచగాదె"లుండెడివి. తంగేడలోని కొమరగిరి రెడ్డి శాసనము[33] దీనిని ధ్రువపఱచుచున్నది. ఈ శాసనము తెల్పునట్లు సీమలోని రాజప్రతినిధికి స్థానిక దేవాలయములోని అర్చలకు, ఉత్సవములకు రాచగాదెలో కొంత ధాన్యమును వినియోగమునకిచ్చు నధికారము కలదు. కాని అందుకతుడు మున్నుగా రాజానుమతి నంది యుండవలెను. స్థానికముగ పెద్దరెడ్డి స్వయముగా అతని పలుకుబడి పెద్దరికములు, గ్రామజనుల యిష్టాయిష్టాలతో, ఉద్వేగౌత్సుక్యములతో అతనికి గల పరిచయములు రెడ్డికి తన విధి నిర్వహణమున కెంతగనో ఉపకరించెడిది. కేవలము పౌరకార్య నిర్వహణమే గాక అతనికి ధర్మాధికారిక విధులు గలవు. గ్రామములోని వివాదలనతడు పరిష్కరించువాడు.

## గ్రామ గణకుడు - కరణము

గ్రామమునకు చెందిన భూవిస్తీర్ణము, అందు కృషియోగ్యమెంత, నిస్సారమెంత,

సాగులోనెంత, దున్నినది ఎంత, మాగాణి ఎంత, మెట్టపంట ఎంత, పన్నులు వసూలు చేయవలసినది. పన్నుల మినహాయిపు గలది, పండించే పంటల పంట ప్రమాణములు మాగాణిమెట్ట పంటలపై రాజభాగము పూర్వప్రభుత్వములనెంత, ప్రస్తుత పాలనలో నెంత, దేవాదాయ బ్రహ్మాదాయముల విస్తీర్ణము, గ్రామసేవ ప్రత్యంశము, గ్రామోద్యోగులు, పౌర నిర్మాణములు - వీనినన్నిటిని లెక్కలు గట్టి పుస్తకములలో దాఖలు పరచుటలు కరణము విధులు. భూములను కొలిచి, పంట దామాషా గట్టి అందుండి ప్రతి అరికాపు యీవలసిన రాజభాగము నిర్ణయించి, అన్ని లావాదేవీల రిజిష్టరులు కరణము సిద్ధపఱచి యుంచెడివాడు. ఇట్టి ప్రతిపత్రము (Deed or document) పొల్లులు పోకుండ వ్రాసి, సాక్షి సంతకములతో తీర్చెడివారు. ఆ పత్రముపై అందలి కార్యము జరిగిన శక సంవత్సరము మాస పక్ష తిథి వారములు, దేశము, దాని ప్రభువు, కార్యము తేలిన తావు, గ్రామ నామములాది అన్ని ముఖ్యాంశములు ఆ పత్రము వ్రాసిన వాని వ్రాలు - అన్నియు నుండవలయును. అటుపై దానిని సాక్షులు తమ సంతకములతో ప్రమాణీకరింతురు[34] గ్రామోద్యోగులలో కరణము రెడ్డి ప్రధానులు. వారిర్వురు నొండొరుల సమ్మతి సహకారములతో రైతులకు పొలముల నిరూపించి రాజభాగమును రాబట్టెడివారు. ఆ గ్రామ మంతకును సంబంధించిన వ్యవహారమేదియు వారి సమ్మతి లేక సక్రమమును సునిబద్ధము కాదు.

గ్రామ పెద్దలలో పురోహితుని స్థానము గణనీయము. హిందూ సంఘమున ఏ శుభకార్యమైనను పంచాంగము చూచి తిథివార నక్షత్రములు, వర్జము, యోగము, రాశి చక్రములోని గ్రహగతులు మొదలగు వాని గుణించి శుభముహూర్తము నిర్ణయించి ఆపైననే దాని జరుపుట చిరకాలానుగతమగు నాచారము, సంప్రదాయము. ప్రపథమంగా దుక్కిదున్నుటకు, పొలములలో బీజావాపనమునకు, ప్రయాణమునకు, ఏ వ్యష్టి సమిష్టికార్యానికిగాని పురోహితుని సంప్రదించుట తప్పదు. గ్రామజనుల కతడే రోజు ఏ వ్రతమో, నాటి శుభదుశ్శకునములు, ఏ పని ప్రారంభించుటకైనను శుభ దుర్ముహూర్తములు, వారి వారి జన్మ రాశి చక్రాదుల వేసి వ్యక్తుల భావి ఎట్టిదియో, తెలియజెప్పును. ప్రాతఃకాల విధుల నాహ్నికముల పూజల సకలము నిర్వర్తించుకొని యతడు దొరల యిండ్లకేగి వారికి తులసీ తీర్థంబు లిచ్చి నాటి పంచాంగ విశేషంబుల

జెప్ప వచ్చును[35] గ్రామమున నతనినది ప్రముఖ స్థానము.

తొలితొలి నాళ్ళలో గ్రామ రక్షణము, గ్రామ పెద్ద (ముఖ్యుడు) విధులలో నొకటి. కాని క్రమముగా గ్రామములు పెరిగి పెద్దవై, అందలి జనసంఖ్య ప్రమాణము హెచ్చి, పాలనా భారముయొక్క చేత నిర్వహించుట సాధ్యమైనది. కావలి విధులకని అప్పుడప్పుడు తలారి నియామకము జరిగెను. అతనిపై పర్యవేక్షణ గ్రామపెద్దది. తలారికి ఆరెకుడని మరియొక పేరు. ఇతర గ్రామోద్యోగులకు వలె అతినికిని పన్నులేని మాన్యము భృతిగా నిచ్చెడివారు. ఆవరు మానమే గాక, గ్రామములో ఉత్సవ సమయములలో, వ్యక్తుల ఇండ్ల శుభకార్యముల వేళ అతనికి కానుకలు సమకూడెడివి. వానికి తలారి కట్నములని పేరు. ఆ పదవి వంశపారంపర్యము. పగళ్ళ రేళ్ళగూడ అతడు గ్రామమున నల్గడల తిరిగి ఏమరక రక్షణ భద్రతల నరసి, నేరమొనర్చెడి వారిని, దుష్టులను శిక్షించుట అతని పని.

ఈ రక్షక శాఖకు చెందిన మరియొక ఉద్యోగి బారికాపు. పూర్వకాలములో ప్రతి గ్రామము చుట్టు ప్రహారీ గోడ, గవనులతో, బురుజలలో నుండెడిది. ఆ రోజులలో ఎల్లెడల అడువులు బలిసి వన్యమృగములు సందడించెడివి. అడవి మెకముల నుండి, అరుల దాడుల నుండి, కాపునకై ప్రహారీల పద్ధతి వెలసినది. రేయింబవళ్ళు పుర బాహ్యవీధుల, ప్రహరీల చుట్టును కాక గ్రామ నివేశనముల వెలుపలి వీధులలో తిరుగుచు గ్రామమును అలజడుల బడనీయక చూచుట బారికాపు పని. అతని స్థానము ప్రహరీ బురుజుల్లో నొకటి. దొంగదోపిడి కాండ్రు శత్రువులు వచ్చుట గుర్తింపగనే తప్పెటల మ్రోగించి గ్రామజనుల హెచ్చరించువాడు. గ్రామ ప్రహరీ వెలుపల ఆ యూరి పంట పొలుమలు, బీళ్ళు, దుక్కికి రాని భూములు నుండెడివి. ఆ పొలముల కాపు గూడ విధుల లోనిదే. అతని ప్రహరీ తిరుగుటలన్నియు నందులకే[36].

ఈ ప్రహారీ తిరుగుట క్రమముగ సంక్షిప్తమై, పరితిరుగు టయ్యెను. అట్లే "పారి కావలి", "పారికాపు". పారి కాపునకు పర్యాయ పదము బారి కాపు. తలారి బారికాపు లివ్వురును రక్షణ శాఖలే. తలారి గ్రామములోన, బారికాపు గ్రామము వెలుపల వ్యవహరింతురు.

గ్రామ పరివారములోని వారే కంసలి, కుమ్మరి, చాకలి, మంగలి, వడ్రంగి, కమ్మరి, కొన్ని గ్రామములలో తటాకముల, ఇతర నీటి వనరుల పర్యవేక్షించి, సాగుకు వలయు రీతిని నీటి సదుపాయము సమకూర్చుటకు ప్రత్యేకముగ నొక ఉద్యోగి జనుల భాగదేయముల నాదేశించు జ్యోతిష్కుడు - యిట్లు గ్రామ అవసరముల కనువుగ గ్రామ భటుల సంఖ్యయు నిశ్చయించువారు.

గ్రామమునకు ఆర్థికముగా స్వయంప్రతిపత్తియు నుండిడెది. గ్రామ వాసులందరికి వలసిన సంభారములకు వేనికి పొరుగులపై ఆధారపడు నవసరముండెడిది కాదు. గ్రామ జనము సుసంఘటితము గ్రామ వ్యవహారములన్నింటిని గ్రామస్థులే నిర్వహించి, పరిష్కరించుకొనెడివారు[37].

గ్రామములందలి పౌరసభ నియమ నిర్మాణములు చాల సరళములు, అక్లిష్టములు. దాని సాయముతో గ్రామ జీవనము శాంత సమృద్ధముగా జరిగిపోయెడిది. పౌరులకు ఊరియందభిమానాసక్తులు గాఢముగా ఉండెడివి. కరువు కాటకముల గూడా వారు తమ ఇల్లు, ఊరుల విడువ ఇష్టపడురు. మశూచి మహామారి, గృహ దాహములు, ఇత్యాది ఉపద్రవముల వల్ల విధిలేక వారూరు వదల వలసి వచ్చినచో, ఆ బెడద వదలినదే తడవుగా వారు తమ ఫూళ్ళకు తిరిగి వచ్చెడివారు[38] తమ తమ యిండ్ల స్థలములలోనో, దానికతిసమీపములోనో ఇండ్లు నెలకొనజేసి తమ తోటి జీవితమున కుదురుకొనెడివారు. దేశము, రాజ్యములే సంత బోయినను పాలకులు పాలక వంశములు మారుచుండినను, గ్రామజనులు, వారి స్వామ్యములేమో వారి జీవితములేమో, ఏమియూ పట్టించుకొనువారు కాదు.

కొండవీటి పాలకులు, రెడ్లో, విజయనగరమువారో, ముసల్మానులో వారెవ్వరైనను, గ్రామములో తమ తమ బ్రహ్మోదాయ దేవాదాయములు స్వామ్యములు, ఆచార వ్యవహారములు అవి అడ్డులేక సాగిన చాలును. కావుననే దేశమందు రాజకీయముగ నవ్యవస్థ ప్రబలిన శాంతి తాండవించు పెక్కు సమయములలో గ్రామ జీవనము చెక్కు చెదరక నిలువ ద్రొక్కుకొనగలిగినది. గ్రామములనుండి రావలసిన కప్పము, రాజభాగము క్రమముగ ముట్టినంత కాలము ప్రభువులు గ్రామ జీవన వ్యవహారముల నెట్టి జోక్యమును

కలిగించు కొనుట లేదు. వారిపై రాజోద్యోగుల అజమాయిషీ నామ మాత్రమునకే. గ్రామమునకు పూర్ణముగ స్వయం ప్రతిపత్తియే అనవచ్చును. రాజపట్టాభిషేకములప్పుడు గ్రామ పెద్ద (రెడ్డి) ఏనదనములతో రాజధాని కరిగి స్వయముగ వానిని రాజునకు సమర్పించి తన పదివిని మరల స్థిరీకరించుకొనుట ఉండిన నుండవచ్చును. రాజోద్యోగులు అప్పుడప్పుడు గ్రామముల పొలిమేర తగాదాల తీర్పులకు, నూర్పిళ్ళకు ముందు పంటనంచనా వేయుటకు, గ్రామపు లెక్కలను పరిశీలించుటకు గ్రామముల సందర్శించుటయు నుండును.

ఈ గ్రామ పాలనా విధానము గ్రామముల నించుమించుగా ప్రజాసత్తాక రాజ్యసామ్యము గూర్చినవి. కాని కాలక్రమాన సంగ నియమములు ఆచారములు సంప్రదాయములు పావిత్ర్యము సంతరించుకొని దాటరాని విధులై గ్రామ జనములలో పలు విధముల నిర్మాణ కల్పనా శక్తులు యభివృద్ధిని నిరోధించినవి. వృత్తి వ్యాపార జీవన విధానములు పరంపరీణములై, వానిని వర్తించు వారాయా కుల వర్ణముల వారితో ఆంతర అంతర్వివాహాది భేద నియమములలో స్థిరపడిరి. గ్రామ సర్వాని కుపయోగించు పౌరకార్యములు పరస్పర సహకారములో నెట్టి జనము చేతనో అనధీన శ్రామికుల చేతనో నిర్వర్తింపబడెడివి.

ఆర్థికముగ గ్రామముల స్వయం సమృద్ధి గ్రామాంతరములకు జనుల రాకపోకల ఆవశ్యకత పరిహరించుటతో వారిలో సాంగత్యము లేకపోయి, గ్రామముల మధ్య రాస్తా రవాణాది సౌకర్యములు సరి కూర్చుటలు వాని సుగమత హెచ్చించుటలు పట్టించుకొనువారు కనబడరైరి. వారి దేశాభిమానము గ్రామమునకు పరిమితమాయెను. సంఘాభి వృద్ధి సమిష్టిగా కుంటుపడినది. ప్రాచీన కాలమున గ్రామము ధర్మ, ఆచార, సాంప్రదాయములుకు పెట్టని కోట.

1. Ep. Ind. III, P. 65, V. 18 అనువాదం
2. నీతి తారావళి అలభ్యము. ఇది తెనుగు రచన. దానిపేరు సూచించునట్లు 27 పద్య పరిమితము. జౌళళ మంత్రి కొడుకు కందా మాత్యునకది యంకితము గానతని పోష్యుడు మడికి సింగన రచించెను. సకల నీతి సమ్మతముల నున్న అందలి పద్యములు కందా మాత్యుని సంబోధించినవే. సింగన తన యితర గ్రంధములలో లేనివి కొన్ని అందును పొందు పరచనివి వ్రాసి యున్నాడు వానిని నమదీయము లన్నాడు.
3. రుక్మాంగద చరిత్రము, III, V.V. 15-66, PP-92-101
4. మనుమత ద్వాదశ మంత్రి మండలమైన
సుర మంత్రి మత మంత్రి షోడశంబు
కవి మత వింశతి కంబైన మణి యధా
సంభవం బైనను సచివ సమితి
తనదు చుట్టు గొలు వదవిలి యధా శాస్త్ర
మార్గవృత్తి గార్య మంత్ర చింత
యమరజేయ వలయు నాహిత చిత్తుడై
బుద్ధి వృద్ధికై సుబుద్ధియుగుచు
సకల సమ్మత. III, 696 ప.
5. స. సమ్మత. IIIP. 33, త. 735
6. స. సమ్మత P. 79, V. 699
7. రుక్మాంగధ (iii), V. 28
8. Ep. Ind. Vol. III, P. 65. V22 అనువాదము
9. S.I.I. Vol. VI, No. 226, అమరావతిలోని యీ శాసనము కాటయవేమమంత్రి పెద్ది నిట్లుకొని యాడును.
తస్యాభుత్ప్రధమ- పురోహిత గణే మాత్యేషు చోక్తర్గవా
శ్రీ మానప్పయ విప్రవర్య తనయః శ్రీ పెద్ది నామాద్విజః
యేనాత్మ స్థిత మంత్రశక్తి విభవై రుత్సాహజాతో దయై
ర్ధాతుర్వే మన్నపస్స నిత్య మఖిలా స్సంపాదితా సిద్ధయః
10. కొండవీటి దండకవిలె : కొండవీటి సామ్రాజ్యము (తెలుగున మద్దుపల్లి గురు బ్రహ్మశర్మ రచితము) P. 83. రెడ్డిరాజుల రోజులలో వాడుకలో నున్న పదము మబలంజ్య- బలియజని కాదు. చూ. Pt. III - వ్యాపారముపైవి అధ్యాయము.
11. Ep. Ind. Vol. XXI, V. 31, P. 274
12. యువరాజు సమాత్యుండును

నవనీపాలునకు దంచి తామత భుజముల్.

13. హరవిలాసము, I, Pt. II
14. సకలనీతి సమ్మతము II, V.V. 293-294
15. సకల నీతి సమ్మతము II, V.V. 295, 297 - 99
    ఈపద్యములను శర్మగారిందు పూర్ణముగ పొందు పరచినారు. అందలి సాంకేతిక పదముల పూర్ణముగా నవగాహన మొనర్చుకొని వాని సరిగా, ఎవరైన వివరింపగలరేమోనని ఆశ. మూలము వారి కర్థమైనంత వరకు సంగ్రహించి చెప్పినారు (అను)
16. సకల నీతి సమ్మతము II. V. 303
17. Ep. Coll. No. 542 of 1928-9 రాజులేగాక ఉన్నతోద్యోగులును వారివారి రాయసముల నియోగించుకొని చుండిరని యీశాసనము వలన తెలియగలదు.
17. Ep. Coll. No. 542 of 1928-9 రాజులేగాక ఉన్నతోద్యోగులును వారివారి రాయసముల నియోగించుకొనిచుండిరని నాశాసనము వలన తెలియగలదు.
18. రెండవ భాగమున వ్యవసాయముపై అధ్యాయమున చూచునది.
19. సకల నీతి సమ్మతము I, V. 99
20. రుక్మాంగద చరిత్రము III, V. 36
21. For. Chapter. Ap. I
22. Ep. Ind. XXI, P. 150
23. కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము, బిలబిలాఖులు తినిపోయెదిలలు పెసలు,
    బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి, నెట్లు చెల్లింతు దంకంబు లేదునట్లు
24. Ep. Coll. No. 163 of 1913
25. Ep. Coll. No. 380 of 1926
26. Ep. Coll. No. 601 of 1909
27. Ep. Ind. VII. P. 188
27a. Ep. Coll. No. 395 of 1926
28. తనకు న్యాయమైన ధనములో నాలవ, భాగమొందె మూడుపాళ్ళ పాలనొందె నర్థమైన సుచితంబుగానమి, క్కలివ్యయంబు సేయవలన దధిప.
    సకల నీతి సమ్మతము I, ప. 131.
29. N.D.I. Vol. II 0, 35 P. 962
30. Ep. Ind. XXI. Ep. Coll. 331 of 1933
31. చూ. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ : కొండవీటి సామ్రాజ్యముపు 15-16 దండకవిలె సీమల దుర్గముల నాయకుల నెందరినో చెప్పినది గాని వారివారి ప్రభుపుల తేడవలేదు. అందులోనిచ్చిన పేర్లతోడి నాయకులెవ్వరును రెడ్ల శాసనములలో కానరాదు.
32. Ep. Ind. Vol. VII,P. 170

33. Ep. Coll. No. of 1926. ఆశాసనములోని దాన కాలము శక 1 3 1 3, ప్రజాపతి, మార్గశిర బహుళ శుక్రవారము An Rep. of Epigraphy తిథి వారములను దశమి సోమవారములని తప్పుగా నిచ్చినది. దానిని పైవిధిగ నేను సరిజేసినది. జయంతి రామయ్య పంతులు గారి సేకరణలలోని యీశాసన ప్రతిని జూచిన తర్వాత ఆప్రతియిప్పుడు ఆంధ్ర విశ్వకళా పరిషత్తు నందున్నది. ఆంగ్ల కాలమున దానికి పసిరయగు తేది 2 1 - 1 2 - 1 3 9 1. ప్రతి గ్రామమునందు గాక కరాచగాదెలు పాలనా విషయిక ప్రాధాన్యముగల పట్టణములలోనే అగుటయు సంభవమే. తంగేడులో రాచగాదె ఉండుటలో వింతలేదు ; అది సీమకు ప్రధాన పట్టణము.

34. శక కాలంబును వత్సరంబు, నెల పక్షంబు తిథి వారమునొక్క దేశంబును దానినేలు విభు నయ్యోరుం, నిజస్థానము సకలార్థంబును నామనిశ్చయముగా సాక్షీసమేతంబు వ్రాయక, కాదంబరి వ్రాల వ్రాయు కరణం బజ్ఞాని గాకుండునే.
సకల నీతి సమ్మతము - II, ప. 3 0 2.

35. ....ప్రభాత కాలమున
దొనల యిండ్లకు నేగి తులసియుబెట్టి
వరుస నిచ్చలు విన వారంబు జెప్పి.... నవనాథ చరిత P153

36. ప్రహోరి చరింతు రెప్పుడును భైరవు లర్థ సిశాగమంబులన్-
భీమేశ్వర పురాణము!

37. 4.7.1786లో సర్‌జాక్‌మాక్ ఫర్సన్ హైందవ గ్రామ జీవనమును గూర్చి యిట్లు వ్రాసెను. రెవెన్యూ విషయకంగా మనం నేర్చుకోవలసినదెంతో గలదని నిశ్చయంగా కనుగొన గలిగితే అది గొప్ప. ప్రాతకాలపు విధానంలోని అనుసంధులను (links) సంకలించి కొనసాగించ గల్గితే అది మన అదృష్టం. ఒకటి మాత్రం నిజం. ఈదేశంలోని ప్రాచీన రెవెన్యూ విధానమంత సమగ్రము, సరళము, నిర్దుష్టము, యధాక్రమమైనది మరొకటి లేదు. ప్రజల పీడింపనీక కాపాడుటకు, రాజునకు న్యాయముగ చెల్లదగిన దంతయు చెల్లుటకు దానిని కల్పించిరి.

38. Ep. Rep. 1908 Paras 76 of 77

# అధ్యాయము XIV

# శిక్షాస్మృతి

మనము పర్యాలోకించెడి దినములలోని శిక్షాస్మృతి యెట్టిదో తెలియనవకాశములు తక్కువ. నాటి వాఙ్మయము చూచిన అప్పటి న్యాయనిర్ణయ విచారము ఎట్టిదో, వివాద పరిష్కారమునకు వారవలంబించిన పద్ధతులేవో చాలవరకు ఊహించగలము. ఆవాఙ్మయము నిర్దేశించిన స్మృతి నిర్దేశములతో పోల్చినచో అప్పుడ వర్తిల్లిన న్యాయ విచారణల తీరు విశదము కావచ్చును. న్యాయ విధానమున కాకరములు నేటివే అప్పుడును, యాజ్ఞావల్క్యనారదాదుల ధర్మ శాస్త్రములు స్మృతులనగా, యాజ్ఞ వల్క్యముపై విజ్ఞానేశ్వరుని మితాక్షర వ్యాఖ్య న్యాయ నిర్ణయమునకు ప్రధాన ప్రమాణ గ్రంధము. విజయనగర రాజులు హరిహర బుక్కరాయల ఆధ్యాత్మగురువు విద్యారణ్య మహర్షి కృతి పరాశర మాధవీయము మరొక ప్రమాణ గ్రంధము. దాని నామహర్షి విజయనగర రాజోద్యోగులకై కూర్చి న్యాయశాస్త్రసార సంగ్రహమందురు[1]. తీరాంధ్రమున రెడ్డిరాజులు దానినెంతవఱకనుష్ఠించిరో చెప్పలేము. న్యాయధీశుల అర్హతలు, వారి నియామకము లెట్టి రీతులనవో, నాటి శాసనములు గాని వాఙ్మయముగాని సూచింపనే సూచింపవు.

## ధర్మాసనము - వ్యాజ్యములు

న్యాయము విధించి నేరస్థుల శిక్షించుట రాజధర్మము. న్యామునకెల్ల అతడు మూల స్థానము. న్యాయ నిర్ణయమున అతడు తన మంత్రి వర్గ సభ్యులతో సంప్రదించెడివాడు. ఆసభయలలో పురోహితుడతి ముఖ్యుడు; అతడు ధర్మ శాస్త్రములందు ప్రమాణజ్ఞానము గల్గియుండును. న్యాయాలయమును ధర్మ సభలేక ధర్మానమందురు. వాజ్యముల విచారించెడివారికి ధర్మసభా"[2] జనులని లేక ధర్మ సభ్యులని వ్యవహారము. విజయనగరమునొక ధర్మాసనము "వైశ్యవంశసుధార్ణవ"[3] మను గ్రంధమున చెప్పియున్నది. యధార్థమునకా గ్రంధము సమాజ సంబంధి వివాదమున మల్లినాధుని పరిష్కార లేఖనము. శ్రీనాధుని చాటువు ఒకటి[4] రాజమహేంద్రవర

ధర్మాసనమును పలుకును.

తెలుగునాటకము "క్రీడాభిరామము"(5)న మరియొక ధర్మాసన యున్నది. ఈధర్మాసనము అప్పటికప్పుడు తాత్కాలికముగ నేర్పరచినది. ఒకవేశ్య తన కూతురి విటునిపై చేసిన అభియోగము. రక్షక భటులు ఆవేశ్యను ధర్మాసనమునెదుట హాజరు పెట్టిరట. క్రీడాభిరామమందలి ఈవాక్యాణము వలన పౌరులు వ్యవహారములలో మధ్యస్థముగ తీర్పుటకై ధర్మాసనముల సమీకరించుట కలదని తెలియును. శాస్త్ర గ్రంథములు ధర్మాసనము విచారించి నిర్ణయింపదగు వ్యవహారములు పదునెనిమిదింటిని వివరించినది వివాద విషయములు భూములు, యిండ్లు, గుబ్బములు, ఋణములు, అమ్మకములు, కొనుగోళ్ళు, (విక్రయించుటలు, విలుచుటలు.) దౌర్జన్యములు (Assaults), వారసత్వములు, ఒప్పందమునొప్పరికించుటలు మొదలగునవి. న్యాయాధిపతులు సాక్షుల విచారించి తీర్పులిచ్చెడివారు. వాఙ్మయమున "కూట"(6) సాక్షుల ప్రస్తావము గూడ గలదు.

## దివ్యగ్రహణ నిర్ణయులు. (Trail by ordeal)

సింహాసన ద్వాత్రింశికలో నొకపద్యము(7) న్యా నిర్ణయమున కితరవిధానము లున్నవని తెలుపును. ఆపద్యభావముట్లు- పూర్వదిగంగన ఎప్పుడును సూర్యోదయమునే కోరును. కాని రాత్రి కావచ్చినది. సూర్యడస్తమించినాడు. ఆ అస్తమయము సూర్యుడు తన ఎడల తప్పువెట్టి తను విడనాడినట్లుగ ఆమె భావించి తన నిర్దోషిత్వమును జగమెరుగుటకై "ముద్దుపట్టినది"వలెనున్నదట. ఉదయచంద్రుని ఎఱ్ఱదనము, "ముద్దుపట్టు" అన్న ప్రయోగము విశేషార్థము గలది. తెలుగన మద్దు అన్న ఎఱ్ఱగ కాలిన యినుపగుండు. ఈమద్దు పదము భోజరాజీయమున రెండు చోట్ల అగుపించును. అందొకట మద్దునకు బోయునట్లొక త్రెడ్డుదుడుకు పాయసంబు దెచ్చి యతని చేనిడ్డ(8) అని యున్నది. మద్దు ఆదివ్య గ్రహణకు, ఆగ్రాహకుని గూడ సూచించును. అందే మరొకచోట "అగ్ని స్తంభనంబు పట్టుకొని మద్దు దివిచినట్లు"(9) అని. పై ఉదాహరించినది దోషన్నిర్ణయము శాస్త్రవిధినే గాక యితరముల అనగా మద్దుపట్టుట, దైవ ప్రమాణముగైకొనుట, మొదలగువాని. వలనగూడ చేసెడివారని తెలియ వచ్చును.

ఈమద్దుపట్టుట న్యాయాధీశుల పౌరుల సమక్షమున కాక దేవాలయములందును జరుపుదురు. ఈవిధముగ నేర నిర్ణయము చిరంతముగా నున్నదే. ఘోరమగు నేరమతి రహస్యమున జరుగును. దోషము మోసినతని శిక్షించుటకు నిశ్చయ సాక్ష్యము దొరకదు. అట్టిచో నీ"దివ్యము"(10)ల నాచరింతురు. దోషి నిరూపణకో అతని సారళ్యస్థాపనకో దైవమే పూనుకొనునని ప్రత్యయము. అగ్ని దివ్యమును తెనుగున మద్దు పట్టుటందురు. దోషము మోసినతడు అగ్ని తప్తమగు లోహ పిండమును చేత పట్టుకొని నిర్ణయించిన దూరము నడువవలెను. చేయికాలి బొబ్బలు వోయిన అతడు దోషి: కాలనిచో నిర్దోషి. స్మృతులలో పలు విధముల దివ్యముల జెప్పియున్నారు. రెడ్డ రాజులలో నాయితరముల ప్రయోగించినట్లు లేదు. పైనుదహరించియున్నట్లు సలసలకాగు ద్రవమును పుక్కిలించుటయు, దివ్యములలోనొకటిగ నెన్నవచ్చును.

ముస్లిం చరిత్ర కారుల, విదేశీ యాత్రికుల లేఖనములలో నిట్టి దివ్యములు వర్ణనములు కాననగును. ఢిల్లీసుల్తాన్‌ముబారక్‌షా సేనాని ఖుస్రూఖాఁ వరంగల్లును ముట్టడించినపుడు కాకతీయ ప్రతాపరుద్రుడతనికి జిజియాగా నగలను దుకూలమలను చందనము, కుందనము, గుఱ్ఱము యేనుగులు మొదలగు అన విషయముల నందజేసెను. ఖాన్ తృప్తిపడక రాజునకు గల సర్వస్వము నివేదింప నిర్బంధించెను.

రాజు నిజమది అయినచో అతడు దివ్యము వెఱువక సలసలమ్రగ్గుచున్న తైలమున చేయి జీనుపవలెను. చేయి కాలనిచో అతని మాటను కోపించునవసరము ఉండదని బదులాడెను. దక్కను వచ్చిన ముసల్మానులకును హైందవమగు దివ్యములంగము పరిచితమని విశదమే. నికోలోడి కోంటి అన్నాడు. తాము నిశ్చయించుటకు సాక్ష్యము లేకున్నపుడు వారు ప్రమాణములననుమతింతురు. (ప్రమాణము చేయువాడు దేవ విగ్రహమెదుట నిలిచి ఆదేవత సాక్షిగా తాను నిర్దోషినని ప్రకటించి ఎఱ్ఱగా కాలిన యినుప శలాకును నాకవలెను. నాలుక కాలినచో అతడు నిర్దోషి. మరొకరీతి - అట్లు ఘోషించి ఆతప్తశలాకనో, పళ్ళెరమునో చేతగొని ఆవిగ్రహమెదుట కొన్నిమార్లు నడువవలెను. అతనికేవిధమగు కాల్పు అయినను అతడు దోషియని నిర్ణయించి శిక్ష విధింతురు. మూడవ విధమగు ప్రమాణము - దీనిని బహుళముగ ఆచరించువారు :- విగ్రహమెదుట నొకపాత్రనుంచి అందువెన్నను మఱగింతురు. అది అగుచుండగా

నేరము మోయునతడు తనవి రెండు వ్రేళ్లనందు ముంచవలయును. తక్షణమే ఆవ్రేళ్ళచుట్టును వస్త్రమును చుట్టి దానిపై ముద్రవేయుదురు. ఆకట్టును విప్పరాదు. మూడవ రోజున కట్టువిప్పి వ్రేళ్లను పరిశీలించి వానిపై నెట్టి గాయమగుపించినను అతడు దోషిగ శిక్షింపబడును. గాయము లేకున్న నతనిని నిర్దోషియని విడిచిపుత్తురు[12]. Criminal Cases రాజు స్వయముగనో, అతని యుద్యోగులో విచారించువనుట కాస్కారమున్నది. క్రీ.శ. 7వ శతాబ్దినో 8వ శతాబ్దినో వేసిన యొక తూర్పు చాళుక్య శాసనమున[13] "దశాపరాధముల"ను పేర్కొనును. కాని యవి ఏవియో తెలుపదు. స్మృతుల నేరముల పేరు పెట్టి వర్ణించుచు వానిని స్వయముగ రాజే విచారించి తీర్పు నొసగవలెనను.

## నేర పరిశోధనము - రక్షకశాఖ

రక్షకశాఖ వారే పరిశోధనము గావింపవలెను. పాలనాయంత్రమున రక్షక విభాగమత్యంత ప్రధానము. ఇతర శాఖల వలెనే రక్షకశాఖయు గ్రామప్రాతిపదిక పైననే నిర్మితము. గ్రామము కూటస్తంభము. నేర పరిశోధనమును, రాష్ట్ర రక్షణమును గూడ దానిని వలగొని యెదిగినవే. గ్రామ రక్షకభటుని "శుక్రనీతి సారము" "యామికుడనుచు" అతని విధులను విపులముగ వర్ణించినది. గ్రామమున రక్షకభటుని నెలవు ప్రజావాసములతొడినో చివరనో యుండవలెను. గ్రామమునకు వచ్చువారిని వీడు వారిని ముఖ్యముగ నూతనుల నతడు అతిజాగ్రత్తగా కనిపెట్టుచుండనగును. ఆగంతకుల నైజమెరిగి సచ్ఛీలురను ప్రసిద్ధులను మాత్రమే గ్రామము జొరనిచ్చుచు యితరులను వారు తమ పూట (Security)ను నిర్దేశించిననే ప్రవేశింప నీయవలెను. రాత్రులలో ప్రతి అర్ధయామములకును అతడు వీధుల చుట్టి రావలెను. రక్షకభటుల తెలుగున "ఆరెకులు, తలారులు"అనియందురు. మనకు ప్రస్తుతమగు కాలమున ఆరెకులు రేపవళ్ళు గ్రామ వీధుల చుట్టు వచ్చుట విధిగానుండెను[14] కృష్ణపక్ష రాత్రుల వారు తమవెంట కరదీపికలు గొనిపోయెడివారు[15]. వారికి భృతి నిర్ణయించిన గడువుమేరకు వేతనమును గ్రామస్థులప్పటికిప్పటి కిచ్చు కట్నకానుకలును, యామికుల సంఖ్య గ్రామవైశాల్యమును బట్టి ఒకటి కెక్కువైనచో వారిలో నొకడు "పెద్ద తలవరి". రక్షకభటులలో ప్రధాన కర్మచారిని "పట్వాలక" లేక "పట్టెళ" (పటేలు) అనిరి. తూర్పు

చాళుక్య శాసనములలో సీపట్టెళ ప్రసక్తి కలదు[16].

***రక్షణశాఖ విధులు రెండు :-*** నేరములు, చోరీల జరుగనీకుండుట; జరిగినచో దోషులను పట్టి యుక్తదండనము పాల్సేయుట. చోరీ జరిగినపుడు చోరుని కనుకొని పట్టుకొను బాధ్యత రక్షకభటునిది. చోరుడు గ్రమము విడిచి పారిపోయినచో, దొంగను అతడు చేరిన గ్రామము మేరకు జాడతీయుటతో రక్షకభటుని బాధ్యత తీఱిపోయెను. పట్వాలకుని విధి నిర్వహణలో నతనికి గ్రామ భటులందరు అవసరమైన గ్రామ జనులందఱును సాయమిత్తురు. దొంగజాడదీసి పట్టుకొని దొంగిలిన ఆస్తిని నష్టపోయినతనికిప్పింపలేని రక్షకభటుడు దానిని తానే యిచ్చుకోవలెను. ఇది చిరకాలానుగతమగు ఆచారము. స్మృతి సూక్త కాలములందు ఉండినది. దొంగ పోయి సొత్తును స్వామికి తిరుగ లభింపజేయుట రాజవిధి; సొత్తుతోడి దొంగను పట్టుకొన జాలనిచో రాజు తన కోశము నుండియైన చేకూర్చవలసినదే[17]యని విష్ణుస్మృతి. దానికన్న ప్రాచీన గ్రంథము గౌతమ ధర్మ సూత్రమును అట్లే "చేరహృతమప జేత్య యధాస్థానమ్ గమయేత్, కోశాద్వాదద్యాత" చోరులు హరించిన ధనమును రాజు రాబట్టి స్వామికిచ్చివేయుట కాకున్న తన కోశము నుండి యో యీవలెను[18]. అట్లు తలారి లేక ఆరెకుడు మధ్య యుగమున అత్యావశ్యకులగు పన్నిద్దరు భటులలో నొకడుగ తీరెను. రక్షక దశజాగరూకత లేక "కావలి" గ్రామమునకే గాక, దాని కనుబంధములగు పంట పొలములకు గూడ వర్తించెను.

***అచ్చుకావలి - వేలికావలి :-*** పై వివరించిన రక్షక భట విధానము కొండవీటిరెడ్డి రాజుల పాలనమున చెల్లెనని లోక వృత్తాంతముల వలన తెలియనగును. అనవేమారెడ్డి పాలించుచుండగా పైరెండు కావలియుండెనని కోటకైఫియత్ నుడువును. "సిద్దిరాజు గారి పరిపాలన అయిన పిమ్మట అనవేమారెడ్డి గారి ప్రభుత్వం యితని ప్రభుత్వంలో గ్రామాదుల పంట పరియాయ ధ్యానాదులు మొదలయిన మహస్సూల్ తలార్లు కావలి కాస్తూవున్నంతలో చోడుల వుపద్రవం చాత నిర్వాహకం లేక సంసార్లు ప్రభువుతో చెప్పుకున్నంతలో అప్పుడు చిప్పేటి చోడిలింగమనాయుడు అనే ముతరాజ కొల్వుడు కాడయి యుండగా అతని సామత్యంకు (?) అ(చ్చు) కావలి నిర్వాహకం చేయగలదని ప్రభువుకి తోచి యీకోట మొదలయిన సీమలు కొన్నింటికి అచ్చుకావలి

న్నిర్ణయం చేసినారు. అడపా సింగము నాయనికి వెలికావలి..." పైచోడులు ఏఱవనాడులోను త్రిపురాంతకం సీమలోను బలవంతులుగా నుండిన తెలుగు చోడవంశనాయకులలో వారు అయియుందురు. వారి అపాతములు తట్టుకొనలేక ప్రభువున కా సంసారులు (సేద్యకాండ్రు) మొఱలు, రాజుచే అచ్చు కావలికి గాముత రాజ[19] బోడి లింగము నాయని నియామకమును "అచ్చుకావలి" యన్నది విశేషార్థము గల పదము. ఆవిధానమునందు దొంగిలిన ధనముతో చోరుని పట్టుకొని దానిని స్వామికి చెందింప జాలనిచో "కావలివాడు" తానే ఆమొత్తమును నష్టపడిన స్వామికి అచ్చుకోవలెను. ఆకోట కైఫియత్తులోనే అడపా[20] సింగమనాయని "వెలికావలి"గా నియోగమును చెప్పబడినది. కాని ఆకైఫియత్ యీ నియామకముల నిబంధనము లెట్టివో ఆయా కావలికై యిచ్చెడి భృతి ఎంతటిదో, ఏ రూపమునసో ధనమో, ధాన్యమో, పొలమో - ఏమియు తెలుపదు. కాని నాటి ఆచారమును బట్టి అతనికి "మెరయు" వత్సరమునకు నిశ్చిత ప్రమాణ ధాన్యమును, "వర్తనలు"ను ప్రతి గ్రుహస్తుడును పండుగ పర్వములలో అతనికిచ్చు కట్నములు, కానుకలుముట్టెడివని నమ్మదగును. అచ్చు కావలికాని పర్యవేక్షణలో ఒకటి కెక్కువ సీమలుండుటయు ప్రతి సీమకు వేర్వేరుగ తానుగనెన్నిన రక్షక దళము నతడు సమకూర్చుకొనుటయు వారికి సాయపడు తలారులనుఇట్లు అచ్చు కావలి విభాగము బహు వాయపకమై ప్రభుత్వ యంత్రాంగమున క్రమ విభాగములు గాక అనుబంధ శాఖలుగా పెంపొందినది. అచ్చు కావలి విధానముచే సూత్ర స్మృతుల కాలముల యట్లే రెడ్ల కాలమునకు రక్షకశాఖ ప్రవర్తిల్లెడిదని విశదమగుచున్నది.

అచ్చుకావలి యట్లు గాక "వెలికావలి" పద్ధతి చాల సరళము. ఆపదము కూర్పు సూచించునట్లున్నది. గ్రామ ప్రవేశనిష్క్రమణ ప్రదేశములకు సంబంధించినది. ఆగంతకుల రాక పోకలు, అనుపానులు, శీల స్వభావాదులు గుర్తించుటయు, గ్రామ ప్రవశనియమమును గ్రామప్రహరి కావలి గ్రామ పొలము పంటల కాపుదలయు వెలికావల వారి విధులు. వెలికావలికి అడపా సింగము నాయని అనవేమ నియమించనని కోట కైఫియత్ - అనగా అచ్చు కావలి వెలికావలి ఉద్యోగములకు రాజ నియామకమవసరము. అట్లు నియమితులైన వారు తాము తమ పరివారముల నెన్నుకొందురు. అచ్చుకావలి పర్యవేక్షణలోని సీమల సంఖ్యలలో గాని వైశాల్యముల గాని ఒక నియతి ఉన్నట్లు

తోచదు. వేలి కావలిలో బారికాపు అట్టె అడుగు సోపానము.

దారి దోపిడికాండ్రు ముష్కరులు దాగుకొను నవకాశముల తోడి కొండ కనుమ మార్గముల గస్తికై ప్రత్యేకముగ రక్షక భట దళములుండెడివి.

***దండనములు :-*** దొంగతనములు, దోపిడీలు, హింసాయుతములగు యితర నేరములకు శిక్షాస్మృత్యనుసారము దండనము లుండెడివి. రాజద్రోహమునకు మరణమే శిక్ష. మరణ శిక్ష నందిన రాజద్రోహిని ఎర్రనియుడుపులతో[21] రక్షకభటులు వధ్యశిలకు కొనిపోదురు. అతని శిరః ఖండనమచట నిర్వర్తింతురు. బ్రాహ్మణుల యెడ దండనములు అతీవ్రములు, క్షమాన్వితములుగ నుండినవి. తీవ్రనేరములకు శిక్షలతికఠోరములను క్రూరములు ననవలెను. చేసిన నేరమును బట్టి, దాని యాచరణను బట్టి శిక్షలలో భేదములు, క్రూర దండనముల మూల సూత్రము దానిని చూచు వారలలో భీతి గొల్పి యట్టి నేరముల పొంత బోనీక ఆగుట. తెలుగు పుస్తకములలో శిక్షలుగ వర్ణించిన హింసనములతిశయోక్తులు గాక నిజముగ ఆచరితములే అయినచో అంత అమానుషములు, క్రూరములునగు దండనముల నూహింపజాలము; కాలుచేతుల నరకుట, నేరస్థుని రాళ్ళగానుగలో ద్రిప్పి ముద్దగా చిదిమి చంపుట, బ్రదికియుండగనే చర్మమొలుచుట యిత్యాదులు. వినినసే ఒలదరింపజేయునట్టివి[22]. ఆకాలమున నట్టివి లేక పోలేదు గాని, ఉన్నట్లు నిరూఢమగు ఆధారములు చాలవు. కాని ఆశిక్షలలో చాలవరకు ముస్లిముల పాలనమున నుండుట నిశ్చయము : తన "ఫతూహత్ ఫిరోజ్ షాహి"లో ఫిరోజ్షాయే యిట్లు వ్రాసెను. నాకు మునుపు రాజుల పాలనమున ఎందరో ముసల్మానుల రక్తమోడినది.ఎన్నియో విధములగు పీడనముల ననుష్ఠించిరి. కాలుసేతులు, ముక్కుచెవులు ఖండించుట, గ్రుడ్లు పేకించుట : నోట కరగిన సీసము పోయుట, కాళ్ళ చేతుల యురమున మేకుల దిగగొట్టుట, స్నాయువులద్రెంచుట, దేహమును అంపముతో నఱకుట యిట్టివే మరెన్ని రీతుల హింసనములనో జరిపిరి. ఉద్దేశ్యము జనముల హృదయముల భయకంపితముల నొనర్చుటకు ప్రభుత్వ నియమముల పాటింపజేయుటకు[23] పై లేఖనమును జూడగా పై శిక్షలలో కొన్నియైన ఆనాటి హిందూరాజులు రెడ్ల రాజ్యమున వర్తింపజేసి యుందురనవచ్చును. వారినాటి అభ్యాసనములకు బావ వరణములకు వారతీతులు కాజాలరు కదా !

సివిల్ వ్యాజ్యముల విషయములలో శిక్షలు పరుషములేగాని క్రిమినల్ సిక్షారీతులు గావు. ఋణమీగాని పన్ను చెల్లింపని వానికి కఠిన దండనమే. అట్టి సందర్భముల విధించు పలు విధ దండనములను రుక్మాంగద చరిత్రము వర్ణించినది(24). పెదకోమటి వేమారెడ్డి ఆస్థాన కవీంద్రుడైన శ్రీనాధునంతటి వానికిని దుస్సహములగు నిట్టి యవమానములు, పీడనములును తప్పవయ్యెను.

రాజు ఖజానా కాతడప్పువడ్డ ఏడువందల మాడల నాతడు తన చివరి రోజులలో చెల్లింపలేక పోయెను. అత్యంత కరుణా జనకమగు చాటువునతడు తాను పాల్పడ్డ దండనముల నతిదీనముగ వెల్లడించినాడు. ఈ దండనములు రుక్మాంగద చరిత్రమున జెప్పియున్న వానికేమంత భిన్నములుగావు.

"కవిరాజు కంఠంబు కౌగిలించెను గదా
పురవీధి నెదురెండ పొగడదండ,
ఆంధ్రనైషధకర్త యంఘ్రి యుగ్మంబున
దగిలి యుండెను గదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురుగొడియ
సార్వభౌముని భుజాస్తంభమెక్కెను గదా
నగరి వారిట నుండు నల్లగుండు
కృష్ణవేణమ్మ గొనిపోయె నింత ఫలము
బిలబిలాక్షులు తినిపోయె దిలలు పెసలు
బొడ్డు పల్లెను గొడ్డేరి మోసపోతి
నెట్టు చెల్లింతు టంకంబు లేడునూర్లు"

బ్రాహ్మణునకు మరణదండనము లేదన్న దొకటియే గాని, చెల్లులేయని ఋణములకు, పన్నులకు, యితర నేరములకతనికి శిక్ష యవశ్యమనుభోక్తవ్యమే.

# ఆధారములు


1. Wick's History of Mysore P. 169
2. సింహాసన ద్వాత్రింశిక i,iii ప. 102
3. A Volume of Indian and Iranian Studies Presented to Sir E. Demisan Ross. The vaisyavamsa Sudharnva of Kolachala Mallinatha, by Drt. V. Raghavam. PP. 23ff.
4. ... విద్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమున
   ధర్మాసనంబుండి . . .
5. క్రీడాభిరామము rr 264; 265
6. రుక్మాంగద చరిత్రము I, V, 164
7. సిం. ద్వాత్రింశిక I, IV, V 106
8. భోజ రాజీయము III, P 59
9. భోజరాజీయము VI, 181
10. దివ్యముల గూర్చిన వ్యాసము, దినేశ్ చంద్ర సర్కారు J.A.H.R.S. VII; PP.195ff
    Jullius Jolly : " Hindu Law and Custom".
    Greter India Society Publication PP. 310-317.
11. Appendix, Nah Sipitor of Ami Khusru P. 560
12. Major, Canti, PP. 31-32
13. I.A. Vol. XIII, P.187; Bharah, Vol. V, P. 99
14. దిననాథుడు గ్రుంకె దమము దిక్కులనిండెన్
    జనులు పనులుడిగి రారెకు, లను వరులై తిరుగజొచ్చి రానగములలోన్
    సిం. ద్వా. త్రింశిక II, X, V.117
15. ...బిలములోన ఘనముగా, అంతయ్యె ! నారెకులును దివియలందు కొనుచు
    గల్లపుట్టైననుచు నెల్ల దిక్కుల దాడ! లరయ జొచ్చి రతి విహస్తులగును
    సిం. ద్వా. II. V.124.
16. నెల్లూరు జిల్లా బడమన రాయలపాడు శాసనము
    ఈగ్రామమిప్పుడు నిర్జనము
    సిం. ద్వా II.V. 124
17. I.B.E. VII, The Institutes of Vishnu, III, 60-67
18. Goutama Dharma Sutra, X, 40-47
19. మత రాచకులమువారు కృష్ణా, నెల్లూరు, కడప, ఉత్తర ఆర్కాటు జిల్లాలో చాల అధికముగా కన్పింతురు. వారు వేటరులు, పల్లకీ మోయువారు, వంశానుగతముగ గ్రామ తలారులు.
20. Mac. Mss. No. 15-6-1; Kaifiyat of Kota.

21. అనుచు వధ్య చిహ్నమైన రక్తాంశుక
మడిగి మ్రొక్కినత ... సిం. ద్వా I, V, 211
మత్త వాకిచ్చిన యరుణాంశు కంబులు
వధ్య చిహ్నమునకు వలను గాగ
బులకించి చనివాధ్య శిలమెక్కి... సిం.ద్వా V, 216

22. సిం. ద్వా III, V.60: భోజరాజీయము V, V.316

23. Ed. III.P.375. తెనుగు గ్రంథముల గాదుగాని, యీరోజులలో విజయనగరమునకు వచ్చిన అబ్దుల్ రజాక్ నేరస్థులను ఏనుగు కాళ్ళ మట్టించుటను చెప్పినాడు కొన్ని యెడలనేరస్థులనేనుగు కాళ్ళ కడత్రోయుదురు, అది తన తొండముతో, దంతముతో, మోకాళ్ళతో క్రుమ్మి వానిని చంపును. ఏనుగు దంతమునకు కత్తి వాదర పదును గల నాగలి కొఱ్ఱు వంటి యినుప శలాకల గట్టిగ బిగించియుంతురు. దాని ముందుకు త్రోసిన నరుని అది తొండముతో చుట్టిపైకి విసరివైచి పడుచున్న అతనిని దంతముతో పట్టి గ్రుచ్చి నేలపై విసరికొట్టి వాని యరమును కాలితో ద్రొక్కును. ఆతరువాత సుల్తాను నానతిమై మావంతు డుదాదేశించి నట్లది వ్యవహరించును. ఆవ్యక్తిని గది కండలుగ చీల్పవలెనని సుల్తాన్ కోరినచో మావటి సూచనపైనది దంపుపై గల యినుప శిలాకాలతో అట్లేగావించును. సుల్తానవలదన్నచో ఆవ్యక్తినది అట్లే విడిచి పుచ్చును. ఆపై నాతని చర్మమొలువబడును. E.D.III, Appendix. P. 618.

24. కట్టిరి కొట్టి రీడ్చిరధికంబు గలాగిరి గుండు ఱొమ్మునన్
బెట్టిరి చెంగ ద్రోచిరి తపింపగ నెండల నిల్పి రంటగా
జుట్టిన పచ్చడంబు వడి జూడగ దోచిరి పట్టుకారులన్
బట్టిరి సన్ను పాసముల బాలుగ జేసిరి వీరలిందఱున్
రు.చ. IV, ప. 112

# అధ్యాయము XV

# సైన్య సంవిధానము - సమరము

సేనలను చతురంగ బలములనుట సంప్రదాయము. అందు రథగజ తరుగ పదాతుల నాల్గు విభాగములు. అతి ప్రాచీన కాలమున సైన్యముల రథ విభాగమే అత్యంత ప్రధానము. మద్రాసు మ్యూజియంలోని అమరావతి చలువరాతి ఫలకములపై చెక్కియున్న యుద్ధ దృశ్యములలో క్రీ.శ. తొలి శతాబ్దములలో ఆంధ్రదేశమున ఉపయుక్తములగు రథములున్నవి. కొన్ని శతాబ్దములకు వాని యుపయోగము పోయి, సైన్యములు మూడంగములుగ మిగిలినవి గజ, తురగ పదాతులగా -

## ఏనుగులు

మధ్యయుగ సమరములలో గజబల ప్రాముఖ్యమెక్కువ. సేనలలోనవి ప్రధనములు కాకున్నను, వాని కధిక ప్రాబల్యముండినది. జయము వానిపై నాధార పడెడివి. 12వ శతాబ్ది వరకు, అనగా పశ్చిమ చాళుక్య భూలోకమల్ల సోమేశ్వరుని కాలము వరకు, కళింగదేశారణ్యములు ఉత్తమ గజముల సమృద్ధి ప్రసిద్దులుగన్నవి. కళింగాటవులలోని గజము లతిశ్రేష్ఠములని "అభిలషితార్థ చింతామణి" వర్ణించును[1]. వరంగల్‌ను జయించిన పిదప రాజకుమారుడు ఉలుఘ్‌ఖాన్ స్వయముగా జాజ్‌నగరుకు వెళ్లి అచటి రాజుకడ నలువదేనుగులగైకొని తన తండ్రి పంపెనని ఫెరిస్తా వ్రాసినాడు[2]. కాని రెడ్డిరాజుల రోజులలో ఆంధ్రదేశమునకు సింహళ నుండి గజముల దెప్పించుకొనుచుండిరి.

ఏనుగు వెన్నుపై చేదోలు (చదరపు పలక) దానిపై చప్పరు. అందు వివిధాయుధ ధారులగు యోధులు. ఏన్గుల మెడల గంటలు, వాని శుభ్రదంతముల దట్టించిన బంగరు వలయము దంతముల మొనల ఘన శాతశస్త్రములు, పదములను తొండములను గొలుసు - యిట్లు పగవారలకు భయములు సేయు బహురోన్నత భద్రగజములు, వాని యలంకరణములు పల్నాటి వీర చరిత్రమున సవిశేషముగ

వర్ణింపబడినవి[3]. అచటి భద్ర గజము ప్రభువుదైయుండును. అల ంకరణములంత అనర్ఘముగ కాకున్నను, ఆవిధముగనే తీర్చిన గజములనారోహించిన సామంత ప్రభువులు సేనాపతులు - ఇంత సన్నాహముతో గజములను యుద్ధమునకు తరలించువారు. వాని దంతముల మొనల శాతశస్త్రములున్నవని, 15వ శతాబ్ది చివర దక్షిణ భారతమును దర్శించిన నికిటి, వార్తే మావంటి విదేశియాత్రికులను వ్రాసియున్నారు. అందు నికిటిః వర్ణనమిట్లు-

"ఏన్గు దేహమునకు శిల్పములు చెక్కిన యినప పలకల కవచము తొండమున దంతములను మూడేసి పొండ్ల కొడవళ్ళు, వెన్నుపై అంబారి, అంబారిలో తుపాకులు శరములతో కవచధారులు పన్నెండుగురు[4] వార్తే మాయుద్ధ సన్నద్ధమగు గజమును, ఏనిక పోరును వర్ణించినాడు. కాని గజారోహకులు మావటీనితో కలిసి ఏడ్గురే అన్నాడు". యుద్ధమునకై తరలించు ఏన్గుపైనొక, పక్కెర, నేపిల్స్ రాజ్యమున కంచర గాడిదలకు వలెనే వేడుపు కడుగున యినుప గొలుసులతో కట్టియుంతురు. ఆపక్కెర కిరువైపుల ఒక్కొక్క దృఢ విశాల దారు మందసము. ప్రతి మందసమున మూవురు యోధులు. ఆమందసముల మధ్యమును ఏన్గుమెడయు నాధారముగ నొకజేనెడు వెడల్పు కొయ్యపలక, దానిపై కాళ్ళిరువైపుల వ్రేలాడవేసి యొకడు కూర్చుండి, ఆఏన్గుతో మాటాడుచుండును.

ప్రపంచమున నన్ని జంతువుల కన్న ఏన్గునకు తెలివితేటలెక్కువ. ఇట్లు[5] ప్రతి ఏన్గునకు సవారీలేడ్గురు. వారికినుప కవచములు, ఖడ్గఖేటకములు, ధనువు లీటెలు,. ఆరీతిగనే ఆఏన్గునకును కవచము, ముఖ్యముగ దాని తొండమునకు తలకు తొడిగియుండును. దాని తొండమునకు మనుజుని బాహువంత వెడల్పు మందము, రెండు బ్రాక్యియా(?)ల పొడవునైన కృపాణమునను సంధింతురు. ఆవిధముగనవి పోరును....., ఎపుడైన నది వెనుదిరిగి పారినచో దానిని ఆగుట అసాధ్యము; ఈ దేశవాసులు బాణా సంచా తయారీలు (making fire works) ఏన్గులకు అగ్నియన్న అతిభయము, కావున నీకారణమున విఫలాయితములగును" 5 విజయ నగర ప్రభువు దేవరాయ II కడవేయికధికముగ గజములున్నవని అబ్దుల్ రజాక్ వ్రాసినాడు.

[6]ముసునూరి కాపయ నాయకుడు బ్రహ్మనీ సుల్తానులతో పోరి మోదినపుడెల్ల సంధి షరతులలో నొకటిగ నలుదేన్గులొసగుటను ముస్లిం చరిత్రకారులు వర్ణించుదురు.

కొండవీటి సైన్యములలో గూడ గజ దళణముండెను గాని వాని సంఖ్య తెలియదు. అనవేమారెడ్డి "పరిచితానేక గతి విశేష వారణ మారణోపాయ" బిరుదని యతని శ్రీశైల శాసనము[7]న గలదు. ఆనైపుణ్యమే అతనికి పశ్చిమాంధ్ర విజయముల చేకూర్చినది. "ఆఏనుగులు శత్రువులు విసరిన యీటెలను మావటీల ఆరోహకుల తగులనీక తమ పాదముల మట్టించునంత ప్రజ్ఞగలవి[8]. నాటి యుద్ధములలో గజబలమునకు గల ప్రముఖ స్థానము, విదేశి యాత్రికుల యీవృత్తాంతము వలన విశదమగును.

## అశ్వదళము :

ఏనుగుల తర్వాత అతి ప్రాధాన్యముగలవి అశ్వదళములు[9]. గుఱ్ఱములను అతి సుందరములైన అలంఖరించుటలుండెడివి. సమరాశ్వములు అరేబియా, పర్షియా మున్నగు దేశములనుండి పిలిచెడివారు. సింధు, ఆరట్టాది పశ్చిమ సముద్ర ప్రాంతముల ప్రత్యేకముగ పెంచిన దేశీజాతులును ఉండెడివి. గుఱ్ఱములను కళ్ళెములకు దార్చి సవారి యోగ్యములు జేసెడివారిని "దావంతు"లనియు, అశ్వికులను "రాహుతులనియు" పిలిచెడివారు. తెలుగు రాజ అల్లాడరెడ్డి తనయుడు రాజమహేంద్రవరపు దొడ్డారెడ్డి ఉత్తమాశ్వికుడగ పేరొందెను. అతడు తన గుఱ్ఱమును బఱపి ఇరువదినాల్గు మూరల మేర దాటించెనని[10] గొప్పగా చెప్పుకొనెదరు. ఢిల్లీ సుల్తానులకును బహ్మనీలకును ఆశ్విక సైన్యమే అదికాధికము ప్రముఖము. వారి సమకాలీనులగు హిందు రాజుల అందరికన్ననూ హెచ్చుగ ముస్లిముల ఆశ్విక దళములుండెడివని ప్రసిద్ధి. ముసునూరు ప్రోలానాయకుని విలసతామ్ర శాసనము[11] ఢిల్లీ పాదుషాకడ "నవలక్షాశ్వ సాధన" మన్నదన్నది. ఆకారణముగ ముస్లిం సుల్తానులను అశ్వపతులనియు దక్షిణమున హిందూ ప్రభువుల నరపతులనియు గణించెడివారు.

## పదాతులు

పదాతులలో నాల్గు విభాగములు i) సెలగోలు బలము ii) విలుకాండ్రు iii) కై జీతగాండ్రు iv) ఎక్కట్లు వారికాపేర్లు వచ్చుటకు వారు ప్రయోగించు ఆయుధములు, వారి సేవకు లభించు భృతి కాక సైన్యమున వారు నిర్వహించు విధుల వైశిష్ట్యము కారణములు.

శూలమును, యిటెను తెలుగున సెలగోలయందురు. ఈటె పొడుకు తక్కువ. దానికి నేజాయని లేక బల్లెమని పేరు. మూల రూపమొకటే అయినను, వానిలో సూక్ష్మవిశిష్ట భేదములున్నవి.

ధానుష్కుల బలము, విలుకాండ్రు ప్రాచీన కాలమున విల్లు యుద్ధమున నతిముఖ్యమగు నాయుధము. అమ్ములనుంచెడు బుట్ట తెనుగున అమ్ముల పొది సంస్కృతమున మాణీరము. రెడ్డిరాజులు, అందును ప్రోలయ, వేమ అనవేమారెడ్డి అరిది విలుకాండ్రుగ ప్రసిద్ధిగాంచిరి. విల్లు అమ్ములును 16వ శతాబ్ది ఆదికింకను ప్రచలితముగనే యుండినవి. 3పదాతులు పట్టు తొడిగిన దృఢములగు గుండ్రని డాలులను కొనియుందురు. ఒక్కొక్క పదాతికి రెండేసి ఖడ్గములు, ఒక బాకు, పదునైన మొనలు గల శరములతో టర్కీవిల్లును ఆయుధములు. కొందరు ఇనుప గదలు గండ్రగొడ్డళ్ళను దాల్తురు. చాలమంది యినుప కవచములను, కొందరు ప్రత్తి దట్టముగు పొదవిన బొంతలను తొడువుదురు. వారివిండ్లు ఇంగ్లండు నందువలె చాల పొడవైనవి[13]. రష్యన్ యాత్రికుడు కొందరి సేవకులు నిడుపాటి విండ్లను అమ్ములను రణమున ప్రయోగింతరు"[14]. విల్లును హిందువులు ముసల్మానులు గూడ ఉపయోగించుచుండిరి. ధనుఃప్రయోగ నిపుణులు శర కాండముల మీద తమతమ పేర్లను చెక్కించుకొందురు. ఎదిరిని భయభీతుని చేయుటకేమో! అట్లు శ్రీనాథుని హర విలాసమున నొక పద్యము[15] సూచించును. ఈయలవాటు అతి ప్రాచీన కాలము నుండి తంజావూరు మహారాష్ట్ర రాజుల కాలము వరకు నుండినది[16].

పదాతులలో మూడవ కక్ష్యకై జీతగాండ్రు. కై జీతమున సామాన్యముగా కాయకష్టమని అర్థం. ఈతెగ సైనికులు దిన సరిగనో, వారానికొక్క తడవనో తమ వేతనముల నందెదరు. పిదప కాలపు గ్రంథము ఆంధ్ర భాషార్ణవము" అచ్చుతెనుగు నిఘంటువు - పుదుకోట రాజుల ఆస్థాన కవి కోటి వెంకయ్య కూర్చినది, కై జీతగాని "శపథాయుధనిషేవి"[17] గ యుద్ధరంగము నుండి పాఱిపోనని శపధము చేసి సైన్యమున జేరువానిగవర్ణించును. ఈకైజీతపు గణములు తాత్కాలికముగ యుద్ధ కాలమునకు మాత్రము వినియోగించుకొందురేమో. "వీర బలంజ సమయ" సభ్యాలు గూడనట్లే సమరసమయముల పాలొనినట్లు వారి తెలుగు కన్నడ శాసనముల వలన

తెలియ గలము. యుద్ధములలో చాలమంది వాణిజ్య నిగమములవారు పాల్గొని ధైర్య సాహసములను ప్రదర్శించి మెప్పు గడించిన నిదర్శనములున్నవి.

12వ శతాబ్దమున విజయబాహు I యొక్క పోలొన్నరుప శాసనము "వెలైక్కార" (శ్రామికుల) సైన్యముల పేర్కొనును. వారు "మహాతంత్ర, వలాంజియర్, నగరత్తార్"లు మూడు చమువుల పాటియుండిరి[18]. ఈవలంజియర్, నగరత్తారులు తెలుగు దేశశాసనములలోని వీరబలంజ్య, నగర తెగలకు సరిపోదురు. చోళ రాజసైన్యములలో వళంగై దళములు[19] మెండుగ నుండినవట. ఆదృష్ట్యా, ఆంధ్ర వాహినులలో వీరబలంజ్య, నగర, వళంగై శాఖల వారధికముగ చేరియుండిరన వచ్చును. కై జీతగాండ్రు తాత్కాలికావసరములకే గాన, వారికి భృతి దినసరిగనో, వారమున కొక పర్యాయమో ధన రూపముగనో ధాన్య రాపముగనో ముట్టెడిదని నమ్మదగును.

## ఇక మిగిలిన పదాతి శాఖవారు ఎక్కట్లు

ఎక్కటీడు[20] ఎక్కటియై బహువచనమున ఎక్కట్లు అయినది. ఎక్కటిని ఒంటరి యనియునందురు. ఆపేరు సూచించునట్లు యుద్ధమున నోటమి భయము తలసూపగా వారిని రణరంగమునకు రావించి శత్రువులతో బాహాబాహి తలపడపంచెడివారు. విజయమెట్లును రాదన్నప్పుడే ఒంటర్ల పోరు మొదలు. ఎక్కటీండ్రు పార్ష్ణిత్ర (Reserve) సైన్యముగ తీర్చిన వారు కానుందురు. వారల ప్రతి యొక్కరును మల్ల విద్యా ప్రవీణులై గదాదులగు బారపు ఆయుధముల పోరాడువారు. రాజ్యమున ప్రతి గ్రామమున పట్టణమున నెక్కటీండ్రు ఉండిరి. రెడ్డి రాజుల శాసనములలో[21] వెలంటూరు (వెల్లటూరు), తండేడు, పోలేపల్లి ఎక్కట్ల ప్రసక్తి గలదు. ఈఎక్కట్లు స్థానిక దేవాలయముకిచ్చిన దానముల జాడగ సేవలకై వారికి భూములు లభించునట్లగడపడును. ఈకాలమున రచితమగు "పల్నాటి వీర చరిత్రము"న[22] యాపదాతి దళ విభాగములన్నియు వర్ణింపబడినవి. ఇంటు ఎక్కట్లు ఒంటర్లని నుడివియున్నది. (సెలకోల ప్రజలను హెచ్చువంటర్లు : ఒంటరి అపభ్రంశ రూపము "వంటిరి"). వీరిని "ఏకాంగవీరు" లనియు వర్ణించిరి. రెడ్డకాలమున క్రమముగ నీ ఎక్కట్లు ఒక సైనిక కులముగ లేక శాఖగ నేర్పడి, వంటర్లిపుడు చతుర్థ కులజులగు

తెలగల మూడు శాఖలలో నొకరు తెలగ[23] కాపు వంటరి.

## ఆయుధములు

హిందువులలో చిరకాలముగ 32 విధములగు ఆయుధములుండినవి. వానిలోనివి - కరవాలము, చంద్రహాసము, బాకు, గద, తోమరము, బల్లెము, పరశువు, చక్రము, యిత్యాదులు, ఇవిగాక ఆగ్నేయ శిలాక్షేపణ (గోఫణ లేక పాషాణ) యంత్రములును గలవు. ఫాదరీ బోర్డనుర్స్ యిట్లు వ్రాయుచున్నాడు. ఆయుధములలో ఆగరానివి రెండు - పిడుగు, శిలాయంత్రము[24]. "ఈకాలమున హిందువులు బందూకులను గూడ ప్రయోగించుచున్నారు. ఆదోని యుద్ధమున సుల్తాన్ మహమ్మద్‌షా కొల్ల గొట్టిన వానిలో తొహ్‌పుత్ సలాతీన్ చెప్పినట్లు, యితరములు గాక మూడు వందల శతఘ్నులు (gun carriages) చూర్ణకార యంత్రములు (batteringrams) ఉండినవి". అని ఫెరిస్తా వ్రాసినాడు[25]. విజయనగర రాజులు తుపాకులుపయోగించిరన్న, వారి సమకాలికులగు రెడ్లును సమరములే వానిని ప్రయోగించియుండుటలో ప్రతిపత్తి లేదు. ప్రతియోధానికి మోపెడన్ని ఆయుధములు - శిరస్త్రాణము ; తనుత్రాణము ధనుస్తూణీరములు, ఖడ్గ ఖేటకములు, పొడుచుటకు నాగుటకగు వివిధ శస్త్రాస్త్ర సంచయములు, ఖేటకమును తెనుగున "అరిగె"[26] "కేడెము" లేక "దాలువాఱు". సాధారణముగ దానిని చర్మముతో చేయుచుండిరి. అవి వివిధ ప్రమాణములవి, ఆకారములవి. "అరిగెబిళ్ళలు[27] తాబేటి చిప్పలకు పోలిక - అవి గుండ్రము అన్నమాట. అమరావతి చెక్కడములలో నీడాలు చతురస్రముగ గూడ చూపినారు.

## సైన్యయోజనము : (Recruitment)

అన్ని వర్ణముల వారును సైన్యముల చేర్చుకొనుటకర్హులే. వర్త వ్యాపారముల దవిలిన వారినుండియు ఎన్నియో దళములు అవసరమును బట్టి మార్చుచుండిరి.

సైన్య నియోజనమునకై ప్రత్యేకముగ ఉద్యోగులుండిరి. వారిని "కాల" రు[28] లనిరి. పరుని దేశముపై దండెత్త రాజు నిశ్చయించినపుడు ఈయుద్యోగులు సైన్య సమీకరణమున తత్పరులౌదురు. సైన్యమున జేరనెంచు వారి యర్హతలేవియో యెఱుగము కాని

యీ ప్రయత్నమున కొండవీడు వారు విజయనగరము వారి పద్ధతులనే అవలంభించిరనవచ్చును. బార్బోసా యిట్లు వ్రాసెను "సైనికుడుగ నెన్ను వానిని యుద్ధోద్యోగులు వాని వస్త్రముల నూడ్చి పరీక్షింతురు - వాని పొడవు, పేరు, పట్టిన యూరు, తల్లిదం4 డుల పేర్లు, అన్నియును దెలిసికొని వానిని నియమింతురు. వాడు తన యూరికి పోరాదు. ఒకవేళ అనుమతి లేక వెళ్లి మరల దొరకెనా వాని పొట్లు ఇంతింతనరాదు"[29].

## దండయాత్ర

సేనల సమీకరించి ప్రయాణ సూచకముగ భేరులు మ్రోగింతురు. జోతిష్కులను శాకునికులను ప్రతర్కించి, కులదైవ స్థానిక దేవతల కర్చలిచ్చిన పిదప, శుభ దినమున శుభ ముహూర్తమున రాజు తన వాహినులతో పురము వెడలును. సాధారణముగ దండయాత్రలకు శరద్రుతువు అనుకూలము. యాత్ర కాలముననుు, యుద్ధ సమయముననుు, కాహళ బూర, దమాయి, కనక తప్పెటలు, శంఖములు అది వివిధ వాదిత్రముల మ్రోగించుచుందురు. "వేగరులు"[30] లేక గూఢచారులు అదిసైన్య విన్యాసములను ముందు పరికించి తెలుపుటకును, దాదికాండ్రు[31] తమ సేనలకు మునుపడ నడచి దారి సుగమము చేయుచు వలయు విశ్రామ స్థానముల నాహారాదుల నెల్ల సరిపడ జూతురు.

సామాగ్రి సంభారములెల్ల సేనల నడచును. డేరాలు వానికి వలయు నుపకరణములు వెడల్పు నవారు పట్టెలు నేసిన వివిధములగు మంచములు, మందములును వెడలుపులు నగు ఫలకాసనములు, తమ్మ పడిగములు, ద్రవ్య సంచయముల నిండిన మందసములు, ఛత్రములు, చందన కర్పూర కస్తూరికాదుల నిండు పెట్టియలు, ఎద్దుబండ్లపై ఒంటెలు మొదలగు భారవాహక జంతువుల పైననో దృఢముగ బంధించికొని పోవుదురు. జోడు పల్లకీలు, వాగెలు కళ్ళెముల సుసజ్జితాశ్వములు పంజరముల పక్షులు మ్రోయు సేవకులు, యానములపై ఆహారధాన్యములు ఇతర జీవితాసరముల విపణులనడపు వర్తకులు, బొక్కసంబుల కావళ్ళ మోయువారు, అష్టభాగ్యంబుల అంగళ్లవారు దండువెనుక సందడి

పడినడతురు[32]. పెద్దపెద్ద ప్రభువుల, యోద్ధలవెంట వారివారి వంది మాగధులు వైతాళికులు ఆయా వారి బిరుదు పద్యముల గద్యల పాడుచు పయనింతురు. రణరంగ స్థలములకు కొందఱు రాజుల వెంట నాట్యకత్తెలును పోవు వారని నీజాముద్దీన్ అహమ్మద్ వ్రాసినాడు[33] తమ రాజ్యపు టెల్లలు దాటగనే ఎత్తిపోవు సైన్యము లరి భూముల పాడువడ జేసి యందలి పశుగ్రాసముల నెల్ల చూఱలాడెదరు[34] శత్రు గ్రామముల నగరముల తగులబెట్టి బూడిదపాలు చేసెడివారు. ఆతరువాత దుర్గముల ముట్టడింతురు.

## దుర్గములు

దుర్గములు అవియున్న స్థానముల బట్టి నాల్గు తెఱగులు – స్థల దుర్గములు, జల దుర్గములు, వన దుర్గములు, గరి దుర్గములు. రాజ-మహేంద్రవర, నిరద్యపుర మందలివి స్థల దుర్గములు. అవి సమ ప్రదేశమున నిర్మితములు. వాని చుట్టును ఎత్తైన ప్రాకారములును[35] లో తగు పరిఖలు నుండును. మిగత మూడు తెగల దుర్గములకు రక్షణము ప్రకృతి సిద్ధము. వానిని పట్టుట చాల కష్టము. కుమారగిరి రెడ్డి ప్రధాని వేమారెడ్డి తండ్రి, కాటమ రెడ్డి II జలదుర్గముల సాధించుటందు నేర్పరియగుట "జలదుర్గమల్ల" బిరుదము సాధించెను. అనవేమారెడ్డిని శ్రీశైల శాసనము "స్థల దుర్గవిదళన బలరామ" యని "జలదుర్గ సాధన రఘురామ" యని కొనియాడినది. కొండవీటి రాజ్యమున కొండవీడు, కొండపల్లి, బెల్లంకొండ, నాగార్జునకొండలు అరిదుర్భేద్యములగు గిరి దుర్గములు.

ప్రతి దుర్గమున పుష్కలమగు స్వాదు జలము, జీవితావసరములు, ధాన్యాదులు, ముఖ్యముగ లవణము, పశుగ్రాసము, మెఱికలగు జోదులు – చిరమునడచేసి మట్టడుల నాగ గల్గిన పాటవమున నుండును.

యుద్ధము సగారానౌభత్తులతో భేరీ భాంకృమలతో సూర్యోదయమపుడు మొదలై అస్తమయము వరకు సాగును. అప్పుడు మరల తప్పెట్ల మ్రోతతో రణము సాలించి ఎల్లరు వారివారి స్కంధావారముల జేరుకొందురు[36].

## సేనా నాయకులు

సైన్యమున వ్యూహ విభజనము కలదు. ప్రతి వ్యూహమున కొక యధిపతి. ఆనాయకుల పదవీక్రమము వారివారి వ్యూహమున గల బలగము ననుసరించును. ఆనాటి తెలుగు గ్రంథముల నీ నాయకులకు నిర్దిష్టములగు పేర్లు :- పడినాయక పడాలు, పడవాలు, దళవాయి, దండనాయక యనునవి. వెలుగోటి వారి వంశావళి[37] లో పది నాటకులును, బిరుద రాహుత్తులును గలరు. వెంకలు (సేవకులు)ను చెప్పబడినారు.

"పడినాయక"లో "పడి" యన్నది "పడువ" కు రూపాంతరము సంస్కృతమున "పట్టి" శబ్ద సమము[38] వైశంపాయన ప్రోక్తమన్న నీతిశాస్త్రమునకు సంగ్రహ రూపమగు "నీతి ప్రకాశిక" యను సంస్కృత గ్రంథము "పట్టి" సైన్యనము నత్యల్ప సంఖ్యానమునుగ తెల్పును. 1 రథము, 1 ఏనుగు, 3 గుఱ్ఱములు 5 పదాతులు గలదిపట్టి. అదే గ్రంథము రథమున కనుయాయిగ 10 గజములు, గజమున కొక్కటికి నూరు గుఱ్ఱములు, గుఱ్ఱమునకు వేవురు పదాతులు, ప్రతి పదాతికి పదుగురు పరిజనము[39] అని చెప్పినది. ఈనిర్వచనము మనకు ప్రస్తుతముగు కాలమునకు వర్తిల్లునేమో తెలియదు. మనము "పట్టి", సైన్యములలో అత్యల్ప సంఖ్యాక వర్గమనియే గ్రహింతము. పడినాయకుని "పడిరాయ" యనుటయు గలదు. సింహాచల శాసనములందు శ్రీరామ పడి రాయడు, విజయ దేవపడి రాయుడు, కూనాణ్ణిపడిరాయడులు కన్పించుచున్నారు. ఈపడి నాయక, పడిరాయలతోడే పదాలు, పదవాళ్ళు గూడ. తంగేడలో నొక శాసనమున[40] ఒక స్వల్ప పదాతి వర్గమునకు నాయకుడుగ "బంట్లపదాలు" గలడు. ఈరోజుల మాట అటుంచి, ఆరోజులలో పదవాలు, దళవాయి సమర్థములు కావు. "దళ" మనగా ఒక అంశము, శకలము. కావున దళము ఒక సైన్య ఖండమనియు అందు ఒకటి కన్న నెక్కుడు పడి లేక పటీట్టీలుండెడివనియు ఊహింపనుగును. కావున దళవాయి పడినాయకుని కన్న అధికుడు, సర్వ సైన్యాధిపతి యగు దండనాయక లేక దన్నాయకుని యధీనుడగు ఉపనాయకడనదగును.

## సత్కారములు, సన్మానములు :

యుద్ధాదికముల ధైర్యాహసములకు వీరకృత్యముల కలరి ప్రభువులు అట్టివారికి గౌరవ చిహ్నముల నొసగెడివారు. సామయిక (Military) సన్మానమున, బిరుదు, గౌరవ పట్టము, టెక్కెము యిత్యాదులుండెడివి. అట్టి టెక్కెములను "బిరుదుపడగలు" లేక "బిరుదు టెక్కెము"లనిరి. ప్రతి విశిష్ట వీరునికిని ప్రాంతీయము, రాష్ట్రీయములునగు ఉత్సవ తరుణములలో తన భట్టువారిచే తన బిరుదాంకముల పాడించుకొను విశేషాధికారమీబడును. అట్టివీరునికి "డాకాలి గండపెండేరము" ప్రభుత సమ్మానముగ గణింపబడినది. వారికి "బిరుద గొడుగు" లీ బడెడివి. ఈ గొడుగులు విశిష్టములు. ప్రతి సత్కారమునకొక ప్రత్యేక చిహ్నమో, అధికారమో ఉండును. కాని తరువాతి యుద్ధమున తడోడెనేని[41] ఆ బిరుదు పట్టములనెల్లనతడు కోల్పోవును. ప్రాత రోజులలో విజయి, విజితుని గౌరవ చిహ్నముల బిరుదముల తాను దాల్చుట ఆచారము. రాజ సన్మానములతో బాటు ఆవీరునుకి గ్రామమో, భూములో లభించెడివి. ఈసామయిక దానమునకు క జీవిత[42] మని పేరు. జీవితమున యోధుని జాగీరు.

## యుద్ధ విరామము సంధి నిశ్చయము :

"దార" ధర్మదార[43] మ్రోగించుటతో యుద్ధవిరతి ఘోషించబడును. సంధి షరతులపై అంగీకారము కుదరగనే వానికి సంధి విగ్రహి[44] లిఖిత రూపమిచ్చును. సంధి విగ్రహి హిందూ రాజుల కొలువును ముఖ్యోద్యోగులలో నొకడు. మధ్య యుగమున విజితుడు విజయికి నగలేన్గులునశ్వములనే గాక కన్యాగణముల నర్పించుటయు గలదు.

## కొన్ని అసామాన్య ఆచారములు - క్రియలు :

***(1) బొమ్మ పెట్టుట :-*** విజితుల ధర్షణ, దూషణావమానముల పాల్పఱచుటన్న ముఖ్యముగ నాకాలము వారికి అభిమానమెక్కువ. జేతలలోనిట్టి కాంక్ష అతి మాత్రమమై "బొమ్మ పెట్టుట"ను వ్యవహారమునకు కారణమైనది. ఓడినవాడి బొమ్మ చెక్కించి తమ్మపదిగ మీదనో గండపెండెరమందో దానిని స్థగితము చేయుటయే.

"బొమ్మ పెట్టుట"[45]. అపజీత వీరు లెక్కువగు కొలది ఈ బొమ్మల సంఖ్యయు పెరుగును. క్రమముగా బొమ్మ పెట్టుట నాశనము చేయుటకు అవమానించుటకు మారుపేరై అది కవితలకెక్కినది[46]. ఆ నాటి శాసనములు గూడ అప్పటి యీ ఆచారమును ప్రస్తావించినవి. ఒడ్డాది మత్స్యవంశ్యుడు అర్జునదేవుని, శక. 1279 నాటి సింహాచల శాసనము ఆ అర్జున దేవుని ద్వాదశ భూప రూపఖచిత ప్రోద్భాసి భూషాంచిత శ్రీపాదః[47] అని ప్రస్తుతించినది. అతడోడించిన పన్నెండుగురు రాజుల ప్రతికృతుల చెక్కిన భూషణముల మెఱయు పాదము గలవాడట. (భూషణము గండ పెండేరము ధరించినవాడు. ఆబొమ్మలను జేత తను మెచ్చునట్లు చిత్రీకరించెడివాడు. చూచిన చేయితో కొన్ని ఓడినతడు ఓడిచినతడు కొఱికిన తమ్మనర్థించినట్లు[48]; మరికొన్ని ఆరు చేతులెత్తి నమస్కరించునట్లు యీరీతిగ

## రణము కుడుపు :

నాటి విచిత్రపు అలవాటు మరియొకటి, వికృత కరాళమైనది రణము కుడుపు. "హతులగు శత్రు రాజుల యెమ్ముల రక్తములతో అన్నమువండి[49] భూతప్రేత పిశాచాదుల తృప్తిగా నిడుట, యీయాచారము కేవలము "వెలుగోటి వారి వంశావళి" మూలముననే తెలయనైనది[50]. రేచర్ల వంశపు ప్రతియొక్కరును యుద్ధమున జయము గొన్నపుడు శత్రుల నిర్జించినపుడును ఈక్రియ నిర్వర్తించుటందు నిర్బరులే. కావున నీగ్రంథమున దాని గూర్చి పద్యములు చాలునున్నవి. రణనిహతుల శిరములను ప్రొయ్యిగ నమర్చి, చెరగొన్న నృపులను శిలాయంత్రముల చిదిమినెత్తురు లోడ్చి ఆనెత్తురెసరుగ నరికపాలముల నన్నము వండి వార్చెడివారు[51]. వెలుగోటి వారి వంశ చరిత్ర ఈరణము కుడుపును ఆగమన వివిధ పలికినది[52]. దానిని నిర్వర్తించుట శత్రువులు నిహతులైన చోట (రణరంగమున) అర్ధరాత్రమున ఒంటరిగా దిస్సమొలగా బూడితమేనెల్ల పులుముకొని, తలముడి విదిల్చికొని, శత్రు రక్తములతో కలిపిన అన్న కబళములను శత్రులపునుకలనుంచి భూతబలి సంబంధి మంత్రముల నుచ్చరించుచు శాకినీ, ఢాకినీత్యాది భూతములకు నివేదింపవలెను. నైవేద్యముగొనుట కాహూతులు దిగంబరి, కాళి, మహోకాళి, శాకిని, ఢాకిని, బాయిలా, కాయినీ, వీర బేతాళ, భైరవ, వీరభద్ర, రణపోతురాజ, తదితర కలహాది దేవతలు[53] వీరిని మొదట అర్చించి ఆపిమ్మటనే నైవేద్యమర్పించుకొనుటలు.

1. అభిలషితార్థ చింతామణి Vol, I, ప. 1194 P. 136
2. Brigg's Fereshta, Vol, I, PP. 405 - 406
3. పల్నాటి వీర చరిత్రము, PP-29-30.
4. Major ; Nikihim, P.12
5. Varhtema's Travels, PP.126-127
6. E.D. Vol. IV P. 105
7.
8. Major : Center P.12
9. డూ యెర్థి బార్బోసా తను గోవాలో జూచిన ఆశ్వికులనిట్లు వర్ణించెను పొరు ఎత్తైన పల్యాణము (Saddle)లపై నారూఢులై Zojare లను విరివిగ ప్రయోగించి పల్లినముల స్థిరులై సమరము సేయుదురు. వానితో మరములు (Lanees) అతి ద్రుఢములు నతి దీర్ఘములును. వాని మొనలు మూరెడు పొడవున అతి నిశితములగు ఇనుప చతురములు. కొందరు ప్రత్తి దట్టించిన పొట్టి కంచుకములను పెక్కురు యినుప కవచముల తొడువుదురు. వారి నొసళ్ళను గట్టి ఇనుప మాటులతో గుఱ్ఱములు సుసజ్జితముల జేసెదరు. ఆశ్వికులు గదలను, పరశువులను దాల్తురు. ఆశ్వికున కొక్కక్కనికి రెండేసి కరవాలములు అన్నియే బాకులు పల్లనములనుండి వ్రేలాడుచు రెండు మూడు టర్కి విండ్లు - ఒక్కని కిర్వురకు చాలు ఆయుధ సామాగ్రి యుండును (Barbosa, Vol. I.P. 180) దక్షిణ భారత సంస్కృతి, ఆచార వ్యవహారములు అలవాట్లు అందరికినీ సమానములే గనుక పై వర్ణ్య విషయములు ఆంధ్ర దేశమునకు గూడ వర్తించుననుకొనుట తప్పుగాదు. భేదము లేవేని యున్ననవి లెక్కింప తగినవి కావు.
10. కాశీ ఖండము I, V, 53
11. For Chpat. APPI
12. Barbosa, Vol. I, P, 119
13. Barbosa Vol. I.P. 181
14. Major, Nikitin, P. 12
15. చివుపు గఱి తోడ వేమావిపువ్వు శరములు
చేసి మధుమాస కాలంబు చిత్తజునకు
సలికులంబుల పేర నామాక్షరములు
వరుస నిల్పెను గుఱుతింప వానియందు హరవి III : 57
16. మద్రాసు మ్యూజియము పురావస్తు శాఖలో పూర్వము పనిజేసిన సి. శివరామ మూర్తి M.A. ప్రొ.కె.వి. రంగస్వామి అయ్యంగారి స్మారక సంచిక (PP 155ff)లో "Signed

Arrows" (పేరు చెక్కిన శరములు) పై వ్రాసిన వ్యాసమున ఇట్లున్నది : అస్త్రములపై హస్తాక్షరముల చెక్కుట అతి ప్రాచీనాచారము. సంస్కృత వాఙ్మయమున బహుళముగ దాని వర్ణనములున్నవి. "సాహిత్యమును సమర్థించు వాస్తవ విషయములు (actuals Examples) సిరిపెట్టగల్గిననది మిక్కిలి యభిలాషణీయము, ఆదరణీయమును. మద్రాసు మ్యూజియములో అట్టి బాణములు రెండున్నవి. అందులో నొకదాన తంజావూరు మహారాష్ట్ర ప్రభుని పేరున్నది. కావున నవియిటేవలివి".

17. "శపధాయుధ నిషేవి చనును గైజీతయం
చనగను..." II, P. 59, V. 185 (క్షత్రియ వర్గము)

18. Ep. Ind. Vol XVIII, P. 332

19. Colas : Prof. K.A. Nilakana Sastry, Vol. Pt. I, P. 225

20. "ఒంటరి యొక్కటే దొంటరీ దొంట్రింపు
నానేక భటునకు నామమగును". ఆంధ్ర భాషాభూషణము IIP.59, V 185

21. Ep. Coll. Nos. 327 of 1937 : No 367 : 380 of 1926

22. పల్నాటి వీరచరిత్రము P. 20, P. 28

23. "తెలగలు తెలుగు సేద్యగాంఢ్రు వీరు పూర్వము తెలంగాణా రాజ సైన్యముల యోధులుగ నుండెడివారు ... ప్రాతకాలంలో వంటరి ఒక సిపాయి. అతనికి ఈనాము భూములిచ్చేవారు. ఇప్పటికిని అతనికి జిరాయితీ భూముల సేద్యమున్నవైముఖ్యమే".
H.A. Stuirt Casfer & Tribes of Southern India VII PP 13-14

24. Foreignoties P. 206

25. Briggs. Ferisuts. Vol. II, P. 312'

26. "...అశ్వంబులకుఁ
పరభటులును, పరభటులకు
సరిగెల వారలును బన్నిరగ్రేసరులై"
విక్రమార్క చరిత్రము IV ప. 85

27. "అరిగె బిళ్ళలు కమరాకృతి మెఖయంగ
అడిదంబులును మీల ననుకరింప ..." సి.ద్వా I, ప. 56

28. "ఖండేందు ధరుని మీదను
దండెత్తగ వలయు ననుచు దని బలముల బి

ల్వండని కాలరి తుమ్మెది
తండముల్గా మరుడుపంప దద్దయు వేడ్కన్"
వీరభద్ర విజయము. II. ప. 87, 88
"దండయాత్రాకసనాధుండై సాహసాంకమహీనాధుండు, తగిన కాలరులంబంచుటు..."
విక్రమారక చరిత్రము IV, Pr. 40

29. Barbosa, I.P.212

30. "ఘనముగా వేగర్ల కతన నేవింటి" - పల్నాటి వీరచరిత్రము

31. "ఇదెచను దెంచె జైత్రుడని
మేలివార్త గొని బోరన వచ్చిన దాదికాడనది"
నృసింహపురాణము II, ప. 60
వేగరికి దాడికానికి అత్యల్ప భేదము తెనుగున అభిన్నముచే వ్యవహరింతురు

32. పల్నాటి వార చరిత్రము, ప. 29, 4

33. Tabaqat - i - Akbari, Pt. III, P. 16

34. J.H.King's Burham_I_nasir, P.17

35. "దుర్గంబ రాజ్యంబునకు చిరకాల నిర్వాహకం బదియు భూస్థలంబున నిర్మింపబడిన ప్రాకారణబు స్థల దుర్గంబు, జల పర్వతంబులు స్వభావ దుర్గంబులయ్యును. బ్రాకారంబు లేక యున్న బరులకు గోచరంబులగు ..." సకలనీతి సమ్మతము, వ 8; క్రీడాభిరామము, ప. 112 చూ. వరంగల్ దుర్గ వర్ణనము.

36. Tabaqat - i- Akbari, Pt. P. 35

37. P. 19

38. సైన్యమ నర్థమున "పదువ" పదము పంద్రంగని అద్దంకి శాసనమున వాడియున్నది. పండరంగడు తూర్పు చాళుక్య రాజు విజయాదిత్య III కడ సేనాధిపతి (భారతి, Vol. V, Pt. 1, P. 484)

39. Gustar Oppert; "On the weapons, organisation and political making of the Hidus" PP. 4-5.

40. Ep. Coll, No. 367 of 1926

41. "వాడేసింగయ మాదండు వచ్చెవేగ
బాఱు ఱెండని రవుతుల చీర బాఱె
భీతి నన్న వోతారెడ్డి బిరుదులన్ని
వీటి బోవంగ దన్నాల కోట బయల"

వెలుగోటి వారి వంశావళి, ప. 80

జిల్లిపల్లి కడ రాజులు జంపి రణము గుడిపించి చలమర్తి గండ బిరుదను, సోయకుల పరశురామ బిరుదును, నంతెంబరగండ బిరుదును, ధరణీ వరాహ, చౌహత్తమల్ల బిరుదులును వహించి, భీమవరము కడగాపానేని జంపి ఖడ్గ నారాయణ, గాయ గోవాళహిందూ రాయసురత్రాణ బిరుదులను వహించి... వెలుగోటి వారిమశ. ప. 36.

42. సేవకులకు మునుజేసిన

జీవితముల చెఱుప ... భోజరాజీయము, III, ప. 139

"మూర్ఖ! జీవితమంది రాచ పని చేయక పాఱిన పంద..." భోజరాజీయం తరువాత తరువాత "జీతము" జీవనోపాయము బ్రతుకు తెరువును సూచింప జొచ్చినది. ఇప్పటి "జీతము" అను పదము "జీవితము" నకు వాడుకలో వచ్చిన మార్పు.

43. "... రాత్రి పో! రించి ప్రభాత కాలవు పరిస్ఫుటమ్మైనను "ధర్మదార" పట్టించుచునున్నవాడదె..." క్రీభిరామము చూ. ఉపోద్ఘాతముగూడ O. 115 (వే. ప్రభాకర శాస్త్రి)

44. "అవనీపతి నిల్పందగు

బ్రవిమల మతి చతురు నిఖిల భాషాకుశలుౕ

సవినయ శీఘ్ర విలేఖను

వివిధ విధి ప్రౌఢు సంధి విగ్రహ పదవిౕ"

సకల నీతి సమ్మతము II, V. 337, P. 38

45. రాచకొండ, దేవరకొండ వెలమలకును కొండవీటి రెడ్లకునైన సమరముల సీక్షించుచు డాక్టరు ఎన్. వెంకట రమణయ్య యిట్లు వ్రాసెను. "మాచారెడ్డిని హతమార్చి అతని శిరమును విజయ చిహ్నముగ వేదగిరి దేవరకొండకు గొంపోయి, అతడన్న తనకు గల ఏవగింపు చిహ్నముగ దానిని తమ్మ పడిగముగ నుపయోగించెను. (వెలుగోటి వారి వంశావళి ఉపోద్ఘాతము, (P. 27)..". పెదకోమటివేమ పినవేదగిరి నేని చంపి అతని ననుకరించి వాని తలనే కొండవీటి తన తమ్మపడిగ కల్పించెను." (P.28) తమ్మపడిగలు తలలు కావు; తలల ప్రతి కృతులు తమ్మపడిగల ఖచితములు. వేలుగోటి వారి వంశావళి, P. 39లో" ఆకొమారవేద యనవేమారెడ్డి తమ్ముని మాచారెడ్డిని గొట్టి తమ్మపడిగాన బొడిగించిన, నా యనవేమారెడ్డి పినవేదగిరినేని జంపి తమ్మ పడిగాన బొడిగించి... ఈ ప్రకృతినిలోహమున జేసి పడిగమున నోకాలియందియన పాదుగురు. చూ. వెలుగోటి వంశావళి :

"ఎత్తి పుటంబు బెట్టి కుదియించి కళంకము దేర్చి కాకమై
నొత్తిఘటించి లోహగతి నొండొక రీతికి దెచ్చి వన్నెగా
నత్తఱి పదాంబుజము నందియ బెట్టిన రాజులందఱ్జ
మొత్తము గటి సీమగలు మోములు వెల్తురు రావు మాధవా"
ప. 87, 40వ పుటలో 108వ ప. గూడా చూడుడు.

46. "...గరివర చర్మముఱ దొఱగి గ్రక్కున లేమికి బొమ్మగడే" - విక్రమార్క చరిత్ర I.73
"పువ్వు దూపులకును బొమ్మనెట్టు" ...do-VII, V.44
"పేదర్మికిని బొమ్మ నెట్టువారు"... do - V. 124

47. "ఆస్తి ద్వాదశ భూపరూప ఖచిత ప్రోద్భాసి భూషాంచిత
శ్రీ పాదోభువి నిర్జితాఖిల రిపు (:) శ్రీ మత్స్యవంశోద్భవః
శ్రీ మానర్జున భూపతి ర్గుణ నిధి స్తన్యాధిక ప్రేయసీ ..."

48. "తమ్మ తమకెంత ప్రియమో
తమ్మకు చేయి జూచి రిపులు తలక్రిందైన
తమ్మ పడిగాన నుందురు
బొమ్మల క్రియ రావు దాచ భూవరు సింగా !!"
వెలుగోటి వారి వంశావళి P. 16 ప. 58
"బొమ్మల క్రియ" అనుట తమ్మపడిగల రింరాజ
ప్రతికృతులనుట చూ. పద్యములు. 112, 113 P. 41

49. వెలుగోటి వంశ చరిత్ర V 62

50. అదే V. 33 కుంట్లూరిమ్మడిం జంపి భూ!
తత్రా సంబిదె గొల్లపల్లి బయలఁ...
V. 37 : Pr. 49; V. 53; V.53; Pr. 59, 60 etc.,

51. అదే. V. 64

52. Page 26, F.M. 2. With a star

53. వెలుగోటి వారి వంశ చరిత్ర PP. 19-20.